**Madhupam**
*(Short stories by **D. Kameshwari**)*

# మధుపం (కథల సంపుటి)

**డి. కామేశ్వరి**

ప్రథమ ముద్రణ : జూన్, 2014, 500 ప్రతులు


ప్రచురణ :
**డి.కామేశ్వరి** (రచయిత్రి)
407, తిరుమల అపార్ట్‌మెంట్స్, హిమాయత్‌నగర్, హైదరాబాద్.
ఫోన్ : 23224803 సెల్ : 9247331446

ముఖపత్రాలంకరణ :
**సూరజ్ మీడియా**, హైదరాబాద్.

అక్షరముల కూర్పు, ముద్రణ :
**మహతి ప్రింట్ క్రియేషన్స్,** అంబర్‌పేట, హైదరాబాద్.

పుస్తకాలు దొరుకు చోటు :
**నవోదయ, విశాలాంధ్ర పుస్తక కేంద్రాలలో**

**వెల : రూ. 150**

*(తెలుగు యూనివర్సిటీ పాక్షిక ఆర్థిక సహాయంతో)*



# అంకితం

తనువెల్లా అమృతం నింపుకున్నట్టు
పంచితే పెరుగుతుందన్న నిజం ఎరిగినట్టు
స్నేహహస్తం అందిస్తూ, అభిమానం పంచుతూ
పుష్పక విమానంలో ఎందరొచ్చినా చోటిస్తూ
అక్షయపాత్ర దాచినట్టు ఆప్యాయతని కొసరి కొసరి వడ్డిస్తూ
విరామంలేని విధులమధ్య
అలుపెరుగని ఆత్మవిశ్వాసంతో
మహిళాశక్తికి నిలువెత్తు నిదర్శనంగా
వ్యక్తిగాదు, ఆమె ఒక వ్యవస్థ అనిపించే

**అమృతలత కి -**

ఈ అక్షర సుమాలని మించి ఏమివ్వగలను!!

**అభిమానంతో....**

**మీ**

కామేశ్వరి

# కథాక్రమం...

# కథల గడపలో...

**ఆ**రోజుల్లో రచయిత్రులు కథలు తక్కువగానూ, నవలలు ఎక్కువగానూ రాసేవారు. శ్రీమతి డి.కామేశ్వరి కథలే ఎక్కువ రాసారు. కామేశ్వరి కథకి షష్ట్యబ్ది పూర్తి అయిపోయింది. మూడుతరాల పాఠకులను తమ కథాకళితో అలరించారు. ఇంకా వుత్సాహంగా అలరిస్తూనే ఉన్నారు. యాభై ఏళ్లక్రితం సగటు మనిషి సమస్యలు వేరు. సాధారణంగా రచయితలు మధ్యతరగతినే దృష్టిలో పెట్టుకుని సమాజాన్ని గమనిస్తూ వుంటారు. ఆనాడు వరకట్నం, నిరుద్యోగం, కోడింటికం లాంటివి పెద్ద సమస్యలు. వాటిమీదే కథకుల కలాలు సాగేవి. చాలా సందర్భాలలో ఆత్మహత్యను పరిష్కారంగా కథని ముగించేవారు. కొందరు మాత్రం సమస్యకు ఎదురునిలిపి, తెగువగా దారి సూచించేవారు. అలాంటి కొద్దిమంది రచయిత్రులలో శ్రీమతి డి.కామేశ్వరి మంచి పేరున్నవారు.

ఇప్పటికే యీమె పేరు మీద పది కథాసంపుటాలు వెలువడ్డాయి. నాటి ఎమెస్కో పాకెట్ బుక్స్ పరంపరలో "శుభోదయం" లాంటి నవలలూ వచ్చాయి. అర్ధశతాబ్దికి పూర్వమే మంచి రచయిత్రిగా డి.కామేశ్వరి వాసికెక్కారు. ఇప్పుడు పదకొండో కథా సంపుటానికి గుమ్మంలో ఆపి ఆమెగురించి కొత్తగా పాఠకులకు చెప్పడం ఏమాత్రం అవసరం లేదు. అయినా భరతముని నాట్యశాస్త్రంలో నిర్దేశించినట్టు నాంది ప్రస్తావనలు పూర్వరంగంలో వుండడం ఒక లక్షణం. రచనా వ్యాసంగాన్ని ఒక హాబీగా తీసుకున్న గృహిణులలో డ్రాపవుట్స్ అధికంగా వుంటారు. అందుకు రకరకాల కారణాలు. కాని శ్రీమతి కామేశ్వరి పేరు అర్ధశతాబ్దికి పైబడి కనిపిస్తూనే వుంది, వినిపిస్తూనే వుంది. ఆమె నిత్యోత్సాహి. కలం పట్టినవారికి వుండాల్సిన మొట్టమొదటి లక్షణం యిదే. తాము జీవిస్తున్న పరిసరాలను, తమ చుట్టూ వున్న సమాజాన్ని నిశితంగా చూడగలగాలి. ఫోటో తీసినపుడు మొదట నెగెటివ్ వస్తుంది. తర్వాత దానిని పెద్దదిగా కావల్సిన ప్రింట్లు తీసి, ఫోటోని సమగ్రంగా అర్థం చేసుకుని ఆస్వాదించి ఆనందిస్తాం. డి.కామేశ్వరి లాంటి రచయిత్రులు పరిసరాలను

పరిస్థితులను నెగెటివ్‌లో బంధించుకుని, వాటికి రంగులద్ది పాఠకులకు ప్రదర్శిస్తారు. అందుకే డి.కామేశ్వరి కథాప్రపంచంలో షష్ట్యబ్దిపూర్తిని పాఠకామోదంతో చేసుకున్నారు. 1960లలో డి.కామేశ్వరి చాలా పత్రికలకు యిష్ట రచయిత్రి. పురాణం సుబ్రహ్మణ్య శర్మలాంటి అభిరుచిగల పత్రికా సంపాదకులు కామేశ్వరి కథలను మెచ్చుకునేవారు. నాడు ఆంధ్రజ్యోతిలాంటి పత్రికా కార్యాలయాల్లో డి.కామేశ్వరి పొడి పేరు డికారి.

ఇక యిందులో నాలుగైదు కథల గురించి ఆవిడే స్వయంగా ముచ్చటించారు. కామేశ్వరి కథాప్రస్థానాన్ని గమనిస్తే – మొదట తను చూసిన అంశాలపై కథలు, మారుతున్న నేపథ్యంలో ఇతివృత్తాలు, మారిన సాంఘిక ఆర్థిక స్థితిగతులపై కథలు ఒక క్రమంలో కనిపిస్తాయి. ఈ సంపుటిలో 'మధుపం' కథలో సమస్యలో కొత్తరికంతో పాటు నవ్యాధునిక సాంకేతిక పరిజ్ఞానం కూడా కనిపిస్తుంది. సూచన ప్రాయంగా ఒక సందేశం కూడా వుంది. "వడ్లగింజలో బియ్యపుగింజ" అనే శీర్షికతోనే కథ నైజం అర్థమవుతుంది. వేగవంతమై, మారిపోతున్న నైతిక విలువలను ఎవరికి వారే గమనించుకుంటూ వాటి పర్యవసానాలను అంచనా వేసుకుంటూ తమకు తామే లక్ష్మణరేఖను గీసుకోవాలంటారు రచయిత్రి. ఇది ఎంతో జీవితానుభవంతో పెద్దరికంగా నేటి తరానికి చెప్పిన పాఠం. వాలెంటైన్‌డే సందర్భాన్ని తీసుకుని రాసిన మరో మంచికథ సశేషం. ఇవి సాగుతూనే కొనసాగుతూనే వుంటాయి.

నాకు చాలా నచ్చిన కథ అనాయాసమరణం. దైన్యంలేని జీవితం, అనాయాస మరణం నిజానికి గొప్పవరాలు. ఇక్కడ మిమ్మల్ని కాసేపు నిలబెట్టి ఒక సంఘటన చెబుతాను. ఇది కేవలం నా సంతృప్తికోసం. దాదాపు ఇరవై ఏళ్లక్రితం ఒకరోజు – నేను ముళ్ళపూడి వెంకటరమణ హైదరాబాదులో వున్నాం. ఆ సాయంత్రం మేము మద్రాసు బయలుదేరి వెళ్లాలి. వున్నట్లుండి ఈమని శంకరశాస్త్రిగారి కచ్చేరి సాయంత్రం రవీంద్రభారతిలో వున్నట్టు పత్రికల్లో వార్త చూసి రమణగారు వెంటనే వుండిపోదాం, రేపు వెళ్దాం లెండి అన్నారు. నేను అంతగా వుత్సాహపడకపోవడం గమనించి పరవాలేదు, రేపటికి టిక్కెట్లు మార్పిద్దాం. పర్వాలేదు సగం డబ్బు పోతుంది.... అంటూ అనేక పర్వాలేదులు చెప్పారు. ఆ సాయంత్రం కచ్చేరికి వెళ్లాం. రమణగారు బాల్యంలో ఈమనివారింట పెరిగినట్టు పెరిగారు. శాస్త్రిగారి మేనల్లుడు ఎమ్మెస్ శ్రీరామ్ బాపు రమణలు బాల్యమిత్రులు. ఆరోజు శంకరశాస్త్రిగారి వీణ కచ్చేరి అద్భుతంగా జరిగింది. ఆ రాత్రి బయలుదేరి గుంటూరు వెళ్లి, ఆ మర్నాడు

తిరిగి మద్రాసు వస్తానని మాటల సందర్భంలో శాస్త్రిగారు చెప్పారు. "చాలా మంచి కచ్చేరి విన్నాం. మళ్లీ ఎప్పటికో ఏమో...." అనుకుంటూ మేము మా గెస్ట్‌హౌస్‌కి చేరాం. మర్నాడు నరసరావుపేటలో ఈమనివారికి ఘనసన్మానం జరిగింది. గుంటూరులో సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు బయలుదేరారు. పొద్దున్నే గురువుగారిని రిసీవ్ చేసుకోడానికి వీణ చిట్టిబాబు స్టేషన్‌కు వెళ్లారు. శాస్త్రిగారు ఒక బర్త్‌మీద, ఎదురుగా బర్త్‌మీద ఆయన వీణ, వీణకు తనువెల్లా పూలమాలలు చూసి చిట్టిబాబు మురిసిపోయారు. సెంట్రల్ స్టేషన్ వచ్చిందని గురువుగారిని లేపబోతే ఆయన లేవలేదు. రాత్రి నిద్రలో ప్రాణం పోయింది. తీగెనుంచి విడిపోయిన దోసపండులా చిలక పంజరాన్ని వీడింది. తలనిండా రాత్రి సన్మానం తాలూకు పూలరేకలు. ఒంటిమీద జలతారు పూలశాలువా. నుదుట సభలో దిద్దిన తిలకం. ఎన్నో సంవత్సరాలు శాస్త్రిగారితో సహజీవనం చేసిన వీణ మౌనంగా వుండిపోయింది. అనాయాస మరణం కథ చదివాక యిలాంటి ఎన్నో వృత్తాంతాలు నా మనసులో మెదిలాయి. నిజంగానే వార్ధక్యంలో దేవుణ్ణి కోరాల్సిన గొప్పవరం యింతకంటె మరొకటి వుండదు. ఇలాంటి పండిన ఆలోచనలు తలపండిన తర్వాతే వస్తాయి.

"పురుషులందు..." కథలోని ఆ పుణ్యపురుషుణ్ణి నేను కూడా ఎరుగుదును. ఒక నిజాన్ని కథగా రాశారు. మొదటే ప్రస్తావించినట్టు యీ తాజా సంపుటిలో ఎస్ఎమ్ఎస్‌లు, ఐప్యాడ్‌లు, ఫేస్‌బుక్‌లూ, యింకా కాల్‌సెంటర్లూ వగైరా ఆధునికతలు విరివిగా కనిపిస్తాయి. సమకాలీన జీవితాన్ని ప్రతిఫలింపచేస్తాయి. అలాంటి కాల్‌సెంటర్ కథ మనసుతో ఆడద్దు. ఆర్థిక స్వేచ్ఛ ఒక్కోసారి ఎలాంటి వెర్రితలలు వేయిస్తుందో మనకు తెలుస్తుంది. నాణానికి రెండోవైపు కూడా వుంటుంది. కాని కొన్ని నిజాలు నిష్ఠూరంగా వుంటాయి. ఆ కోవకు చెందిన కథలు రెండు మూడు మీకు ఎదురవుతాయి. వేదభూమి, భావన మంచి కథలుగా మీ అందరికీ గుర్తుండి పోతాయి. ఈ కథాగుచ్ఛంలో నలభై ఏళ్లనాడు రాసినవి కూడా చేరాయి. అప్పటి రూపాయికి యిప్పటి రూపాయికి సంబంధం లేదు. ఒక రూపాయికి భోజనం దొరికే రోజులవి. ప్రతి కథనీ ప్రత్యేకంగా యిక్కడ ప్రస్తావించడం లేదు. కొందరు ప్రారంభదశలోనే ఆగిపోతారు. కాని డి.కామేశ్వరి కాలంతోపాటు కొత్త కొత్త కథాంశాలను తీసుకుని సమకాలీనత సాధించారు. నేనూ రాయగలను అనిపించు కోడానికి డిటెక్టివ్ కథని హాస్యకథల్ని కూడా జోడించారు. అవి నచ్చేవారికి నచ్చుతాయి.

కొన్నింటికి విరమణలు వుండవు. జిగిలి వున్నన్నాళ్లు సాగించడమే. అందుకు కథారచనలాంటి సృజనాత్మకత వ్యాపకాలు అందరికీ అబ్బవు. ఇప్పటికే యీ రంగంలో లబ్ధప్రతిష్టులైన శ్రీమతి డి.కామేశ్వరి మరో తరానికి కావల్సిన మరిన్ని కొత్త కథలు రాయాలని వారిని మనసా కోరుతున్నాను. ఆమె సీనియారిటీకి నా వయసు సరిపోలదు. అయినా నాకీ సదవకాశం కల్పించారు. అందుకని శ్రీమతి కామేశ్వరి గారికి అభివందనాలు చెబుతూ ఇందుకని అభినందనాలు చెబుతున్నా.

హైదరాబాదు
20.6.2014

**- శ్రీరమణ**

# నా మాట

ఇది నా పదకొండో కథా సంపుటి. 2008లో వేసిన నా పదో కథాసంపుటి ముందుమాటలో అదే నా ఆఖరి కథాసంపుటి అవచ్చు అని రాశాను. ఆ తర్వాత యీ ఆరేళ్లలో మరో 20 కొత్త కథలు వచ్చాక మరో పుస్తకం వేయించకుండా వుండలేక పోతున్నాను. ఇదివరకు చాలాసార్లు చెప్పినట్టు ఓ రచయిత కథలు వివిధ పత్రికలలో వచ్చినవి అందరూ చదవలేరు. అంతేకాక పుస్తకరూపంలో తీసుకురాకపోతే కొన్నాళ్లకి గాలికి కొట్టుకుపోతాయి. పుస్తకరూపంలో వుంటే కనీసం కొన్ని లైబ్రరీలలో అయినా కొన్నాళ్లపాటు వుంటాయి. మేం వున్నా లేకపోయినా మా కథలు ముందుతరాలవారు చదివితే యీనాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ స్థితిగతులెలా వున్నాయన్నది తెల్సుకునే వీలుంటుందని ఓ రచయిత్రిగా నా ఆశ. అది పేరాశేమో! ఓ రచయిత ఏభైవేలు పెట్టి పుస్తకం వేయించుకుని, ఓ 500 కాపీలు అమ్ముకోడానికి నానా అగచాట్లు పడుతున్న తరుణం యిది. పదికోట్లమంది వున్న తెలుగువారిలో చదవగలిగినవారు, కాస్త భాష తెల్సినవారు ఓ 5 కోట్ల మంది వున్నారనుకుంటే, 5 కోట్లమందికి 500 కాపీలు చెల్లని దుస్థితిలో తెలుగు సాహిత్యం వుంది అంటే రానున్న కాలంలో ఏభై ఏళ్లకో, వందేళ్ళకో తెలుగుభాషే అంతరించి పోతుందేమోనన్న భయం కలుగుతూ వుంటుంది. మాతృభాష పరిరక్షణమీద ఉపన్యాసాలు  దంచే నాయకులు సాహిత్యం అంతరిస్తే భాష నశిస్తుంది, భాష నశిస్తే జాతి అంతరిస్తుంది అన్న నిజం  గుర్తెరిగి మాతృభాషను, యీనాటి సాహిత్యాన్ని ముందుతరాలవారికి అందించే చర్యలు చేపట్టాలి అని మనవి.

ఇందులో ఓ 20 కథలు యీమధ్యలో రాసినవి, మూడు నాల్గు 70,75 ప్రాంతంలో రాసినవి. ఈ పాత కథలు ఇదివరకు సంపుటాలలో రానివి, వచ్చినా కాపీలు లేనివి కాబట్టి దీన్లో చేర్చాను.

అందులో 'చదరంగం' అనే కథ చదివితే 40 ఏళ్ల క్రితం రాజకీయాలకి, ఇప్పటికి ఏమాత్రం మార్పు రాలేదని, ఆ కుశ్చిత రాజకీయాలు, కుతంత్రాలు, ఎత్తులు, పై ఎత్తులు – పదవికోసం ఎంతకన్నా దిగజారే అవకాశవాదాలు యీనాడు యింకా ఎక్కువయ్యాయే తప్ప తగ్గలేదు.

అలాగే 'కుక్కబతుకు' అన్న కథలో ఏ విషయంలోనూ పెద్ద చేపలు ఎప్పుడూ దొరకవు – బలయ్యేది చిన్నచేపలే. డబ్బు అన్నది మానవత్వాన్ని, అన్యాయాన్ని సహిస్తూ ఎలా పడివుండమంటుందో (ఎటొచ్చీ ఆనాడు పదులు వందలు, యీనాడు లక్షలు) నిత్యం అన్ని అవినీతి కార్యక్రమాల్లో చూస్తూనే వున్నాము.

అలాగే 'గట్టు తెగింది' కథ నలభై ఏళ్ల నించి రెండు ప్రాంతాల మధ్య విభేధాలు, విద్వేషాలు రావణకాష్టంలా రగులుతూనే వుందనడానికి సాక్ష్యం. ఆ కథ ఏ పరిస్థితిలో, ఎలా ఎందుకు, ఎప్పుడు రాశానో ఏదీ సరిగా గుర్తు లేదు. ఆ రోజుల్లో ఒరిస్సాలో వున్నాను. ఆంధ్ర, తెలంగాణ గొడవల నేపథ్యంలో రాసాననుకుంటాను. ఎప్పుడో శలవలకి వచ్చినపుడు వినో, చూసో రాసివుంటాను బహుశా. పాతకథల మధ్య దొరికిన ఈ కథ చదివితే ఆనాటినుంచి యీ విద్వేషాలు సమసి పోలేదన్న సత్యం తెలుస్తుంది. అందుకే నేనెప్పుడూ చెపుతాను – మన సాహిత్యం ఒక్కటే ముందు తరాలవారికి గతం గురించి తెలియపరచగలదు అని.

ఏది ఏమయినా, యీ కొత్త కథలు యీనాటి సామాజిక స్థితిగతులకు ప్రతిబింబాలయితే, పాతకథలు గడచిన చరిత్రకు సాక్ష్యాలు.

అడగగానే నాకెంతో యిష్టమైన శ్రీరమణగారు ముందుమాట రాసి యిచ్చినందుకు కృతజ్ఞురాలిని.

సాహిత్యంపట్ల ఎంతో అభిమానం, అభిరుచి వున్న శ్రీమతి అమృతలత గారు రచయిత్రులకు, కవయిత్రులకు, యితర కళారంగాలలో స్త్రీలకు ఎంతో గౌరవంతో అవార్డులనిస్తూ ప్రోత్సాహిస్తున్నారు. స్నేహపాత్రురాలిగా అతికొద్ది కాలంలోనే నాకు ఎంతో దగ్గిరయిన అమృతలత గారి అభిమానానికి కృతజ్ఞతగా యీ పుస్తకం అంకితం యిస్తాననగానే అంగీకరించినందుకు ఆమెకు ధన్యవాదాలు.

ముఖచిత్రం నాకు కావలసినది చెప్పగానే దగ్గర కూర్చోపెట్టుకుని, నాకు కావలసిన ముఖచిత్రం తయారు చేసి యిచ్చిన 'సూరజ్ మీడియా' సరస్వతికి, పుస్తకాన్ని చక్కగా ముద్రించి యిచ్చిన 'మహతి ప్రింట్ క్రియేషన్స్' రామ్మూర్తి గారికి, అడగగానే ప్రకటన యిచ్చిన 'విజయ డయాగ్నస్టిక్స్' డాక్టర్ సురేంద్ర రెడ్డి గారికి, పాక్షిక ఆర్థిక సాయం చేసిన తెలుగు యూనివర్సిటీవారికి – అందరికీ కృతజ్ఞతాభివందనాలు

**– డి. కామేశ్వరి**

# మధుపం

“వదినా, మీ ఫ్రెండ్ అఖిల ఎలా వుంటుంది చూడ్డానికి. నీవు చెప్తుంటావు మంచి తెలివైంది, ఏక్టివ్‌గా, స్మార్ట్‌గా వుంటుందంటావు, అందంగా కూడా వుంటుందా?” నిత్య అడిగింది వదినగారిని. మహిమ కళ్లెత్తి ఆడపడుచు వంక కాస్త అనుమానంగా, మరికాస్త ఆశ్చర్యంగా చూస్తూ, ‘ఎందుకు, ఎందుకలా అడిగావూ?’

“ఊరికే, చెప్పు వదినా, నేనెప్పుడూ చూడలేదుగా ఆవిడని. ఆవిడ భర్త మా బాస్ గదా కుతూహలంగా అడిగా అంతే...”

“అఖిలకేం, అందం అంటే, అద్భుత సౌందర్యవతి అనను – కాని నవ్వు మొహం, కళైన మొహం, మంచి వత్తు జుత్తు ... అన్నింటికంటే ఎక్స్‌ప్రెసివ్ కళ్లు – మొహం చూడగానే తెలివైనదని, మంచి ఆకర్షణ వుందన్నది అందరికి తడ్తుంది. నలభై ఏళ్ళు వచ్చినా యింకా చక్కని ఫిగర్ మెయిన్‌టైన్ చేస్తూ స్మార్ట్‌గా వుంటుంది. కాలేజీలో ఉన్నప్పుడు ఎంత లైవ్లీగా వుండేది. మంచి స్నేహితురాలు... అందరితో కలుపుగోలుగా వుండి సెంటర్ పాయింట్‌లా వుండేది...”

“మరి అంత చక్కని, మంచి భార్య వుండగా... యిదేం రోగం...” చటుక్కున ఆగిపోయింది నిత్య. మహిమ చురుగ్గా చూసి...‘ఏమిటి, ఏమటంటున్నావు...’ అంది.

నిత్య చూపు తప్పించి, ‘అబ్బే ఏంలేదు ... వూరికే ...’ అంది.

‘ఊరికే ఏం అడగలేదని నాకు తెలుసు. చెప్పు... ఏమిటి విషయం ఎవరి గురించి మాట్లాడుతున్నావు. చెప్పు ఫరవాలేదు’.

'వదినా, మా ఆఫీసులో మేధ అని రెండు మూడు నెలల క్రితం ఓ అమ్మాయి జాయిన్ అయింది. ప్రస్తుతం కార్తీక్‌గారి పర్సనల్ సెక్రటరీ...'

"అయితే" అనుమానంగా అడిగింది మహిమ. నిత్య కాస్త ఆగి.. 'వదినా కార్తీక్‌గారు మేధ ... ఇద్దరూ చాలా క్లోజ్‌గా వుంటున్నారు....'

'ఛ ... ఛ... అదేంటి కార్తీక్ అలాంటివాడేం కాదు. అఖిల అతను యిద్దరూ చాలా హ్యాపీ కపుల్... అయినా అతడేమన్నా చిన్న కుర్రాడేంటి, నలభై దాటినవాడు. ఇద్దరు కాలేజీ గోయింగ్ పిల్లలు... అలాంటిదేం ఉండదు. పర్సనల్ అసిస్టెంట్ కనుక యిద్దరూ ఒకరితో ఒకరు ఎక్కువ మాట్లాడవలసి వస్తుంది గదా!'

'వదినా, ఏమిటి అవన్నీ నాకు తెలియవంటావా, నేనేంటి అందరూ చెప్పుకుంటు న్నారు. అందరికన్నా ఆఖరికి నాకు తెల్సింది. ఇదివరకు సౌమ్య అనే అమ్మాయి పర్సనల్ అసిస్టెంట్‌గా ఉండేది. ఎంత హుందాగా ఉండేది. ఏమిటో ఈ మేధని చూస్తేనే అదోరకంగా అన్పిస్తుంది.'

"మీకందరికీ యిలాంటి అనుమానం రావడానికి ప్రత్యేక కారణం ఉందా. ఎవరన్నా ప్రత్యక్షంగా ఏదన్నా చూశారా. వూరికే ఊహాగానాలు..."

"మా కొలీగ్ అనంత్ ఆదివారం ఓ రెస్టారెంట్‌కి ఫ్యామిలీతో వెడితే వీళ్లిద్దరూ డిన్నర్ తీసుకుంటున్నారుట. ఇతన్ని చూసి కార్తీక్ కాస్త తడబడ్డాడుట. ఇంకోసారి లలిత అన్న రిసెప్షనిస్టు యిద్దరూ కారులో వెడ్తుంటే చూసిందిట. ఎవరి దాకానో ఎందుకు నేను చూసా ప్రత్యక్షంగా ..." ఆగిపోయింది నిత్య.

"ఏం చూశావు?" కళ్ళు చిట్లించి చూసింది. నిత్య తలదించుకుంది. 'వదినా ఓ రోజు నా ప్రాజెక్టు తాలూకు సి.డి. కార్తిక్‌గారి టేబుల్‌మీద వుందని మా ప్రోగ్రాం ఎనాలసిస్ట్ చెపితే తెచ్చుకోడానికి వెళ్ళాను. కార్తీక్‌గారు యింకా రాలేదనుకుని తలుపు తట్టకుండానే తలుపు తోశాను. కార్తీక్‌గారు కుర్చీలో కూర్చుంటే ఈవిడగారు కుర్చీ వెనకనించుని ఆయన భుజాల మీద చేతులాన్చి తలలు దగ్గర చేసికుని తన్మయత్వంతో మాట్లాడుకుంటున్నారు. నేను, నాతోపాటు వాళ్ళూ షాకయ్యారు. నేను వెనక్కి పారిపోయి వచ్చేశాను గాభరాపడి..."

మహిమ తెల్లపోయింది. "నిజం ... నిజంగా... కార్తీక్..." నమ్మలేనట్టు అడిగింది.

"అవును వదినా, పబ్లిక్‌గా ఆఫీసుటైంలో అంత నిర్భయంగా ఇద్దరూ ... లక్కీగా నేను అఖిల గారి స్నేహితురాలి ఆడపడుచునని కార్తీక్ గార్కి తెలియదులే... ఆరోజు

నామొహం ఆయనకెలా చూపాలో అర్థం కాలేదు... కార్తీక్‌గారు బయటికి వచ్చి చాలా గంభీరంగా నా క్యాబిన్‌వైపు చూపు విసిరి వెళ్ళిపోయారు."

వింటున్న మహిమ మొహం నల్లబడింది. "ఛీ... శుభ్రమైన పెళ్లాం, టీనేజ్ పిల్లల్ని పెట్టుకుని యీ కుర్రవేషాలేమిటి. పెద్ద పొజిషన్‌లో వుండి ఇంతచీప్‌గా ... ఛా.."

"అది సరే... యింత జరుగుతున్నా మీ అఖిలగారేమిటి అలా నిమ్మకు నీరెత్తినట్టు వుంది."

'దానికేం తెలుస్తుంది, ఆఫీసులో జరిగే భాగోతం...'

'సెల్‌ఫోనులో ఎస్సెమ్మెస్‌లు చూసి ఉండకపోవచ్చు...' నిత్య నెమ్మదిగా అంది. మహిమ ఆశ్చర్యంగా చూసింది. "ఎస్సెమ్మెస్‌లా... ఎవరు పంపారు. నీకెలా తెలుసు?"

"నేనే పంపానొదినా... నాకెందుకో పాపం అఖిలగారినిలా మోసం చేయడం బాధనిపించింది. ఆవిడకి సంగతి తెలియాలి కనీసం. తరువాత ఆవిడిష్టం ఏంచేసినా అనిపించి వరుసగా మూడు రోజులు పంపించాను. ఆవిడవి చూసి వుంటే కుతూహలం కోసమన్నా నానెంబరుకు ఫోనుచేసి ఎవరు పంపారన్నది తెల్సు కునేదిగా..."

"దానికి తెలియచేయడం సరి అయినపనా, పాపం అనవసరంగా దాని మనసు బాధపడ్తుంది... నీవు నాకు ముందుగా ఎందుకు చెప్పలేదు. పాపం అఖిలకిదంతా తెలిస్తే ఎలా తట్టుకుంటుంది... నీవు ఎస్సెమ్మెస్‌లు పంపకుండా వుండాల్సిందేమో..."

"అదేమిటొదినా, ఓ భార్యగా భర్త ప్రవర్తన తెల్సుకోవల్సిన అవసరం లేదా!" మహిమ అయోమయంగా, నిస్సహాయంగా చూసి ... "ఆలోచించాలి, దాంతో చెప్పాలో వద్దో ఆలోచిస్తాను..."

* * * * * *

సెల్‌ఫోన్‌లో పేరుకుపోయిన ఎస్సెమ్మెస్‌లు ఒక్కొక్కటి డిలీట్ చేస్తూ పోతూంటే ఓ ఎస్సెమ్మెస్... తెలుగు అక్షరాలని ఇంగ్లీషులో రాసిన ఆ మెసేజ్ చూసి టక్కున ఆగిపోయింది అఖిల..." ఆఫీసులో, సెక్రటరీ మేధతో మీ వారి ప్రేమాయణం గురించి మీకు తెలుసా, కళ్ళు తెరిచి చూడండి. శ్రేయోభిలాషి..." తారీకు చూసింది. ఎప్పుడో నాల్గు రోజుల క్రితం యిచ్చింది. ఫ్రం నంబరు చూసింది. తెల్సిన నంబరులా

అన్పించలేదు. ఒక్క క్షణం ... ఆగి... డిలీట్ చేయకుండా సేవ్‌చేసి యింకా ముందుకి వెడ్తుంటే మరో రెండు మెసేజ్‌లు కన్పించాయి మొన్న, నిన్న తారీఖులతో... అదే నంబరు. అదే మెసేజ్... ఆఖరుదానిలో మరో వాక్యం... "ఇదేదో జోక్ కాదు నిజం" అని వుంది. మిగతావన్నీ డిలీట్‌చేసి ఆ మూడు సేవ్ చేసింది అఖిల. పిచ్చి పిచ్చి ఎస్సెమ్మెస్‌లు రోజుకి ఎన్నో వస్తాయి. ప్రకటనలు, జోక్‌లు, సెల్‌ఫోన్ ఆఫర్లు అవన్నీ చదివే తీరికే వుండదు. ఆఫీసు కారులో వెనకసీటులో, కూర్చుని ఒక్కసారి డిలీట్ చేసిపడేస్తుంది. అలా ఆఫీసుకెళ్లే నలభై నిమిషాల ప్రయాణంలో ఇమెయిల్స్, సెల్‌ఫోన్ మిస్డ్ కాల్స్, మెసేజ్‌లు చదువుతూంటుంది. ఇంట్లో టిఫిను తినే టైము కూడా లేక రెండు శాండ్‌విచ్‌లు టిఫిన్ బాక్స్‌లో తెచ్చుకుని కారులోనే ఓ అరటి పండు తిని బ్రేక్‌ఫాస్ట్ అయిందనిపిస్తుంది అఖిల. ఉదయం ఐదున్నరకి లేచి కాఫీలు, టిఫిన్లు, నల్గురికి లంచ్‌బాక్స్‌లు, టిఫిన్ బాక్సులు కట్టి, స్నానం చేసి ఆదరాబాదరా ముస్తాబై గృహిణి అవతారం చాలించి కార్పొరేట్ ఉద్యోగినిగా కారెక్కి ఆ నలభై నిమిషాల్లో పేపరు కూడా చదవడం ముగించి, తలెత్తకుండా ఐదు వరకు పని పని, ఏ ఆరుకో బయలుదేరితే ఓ గంట గంటన్నర ప్రయాణం చేసి ఇల్లు చేరి మళ్లీ ఇంట్లో గృహిణి అవతారం మధ్య నలిగిపోయే వేలాది మంది గృహిణుల్లో అఖిల ఒకరు. ఇలాంటి ఎస్సెమ్మెస్‌లు చదివి పట్టించుకునే తీరిక లేని బిజీ లైఫ్ ఆమెది.

ఆ మెసేజ్ ఎంత వద్దనుకున్నా ఆమెలో ఇంతో అంతో కలవరం రేపింది.

అందులో ఎంత నిజం అన్నది ఆలోచించే టైము ఓపిక లేవు ఆమెకి. మనసులో ఓ మూల ఆ వార్త స్థానం సంపాదించుకుంది ఆమెకు తెలియకుండానే.

* * * * * *

"హల్లో... నా నెంబరుకు మెసేజ్ వచ్చింది మీ నెంబరు నుంచి. దయచేసి మీరెవరో, అలాంటి మెసేజ్ ఎందుకు ఇచ్చారో చెప్పగలరా...!"

ఒక్క క్షణం అటునించి నిశ్శబ్దం... "హల్లో, ప్లీజ్, మీరెవరు, నాతో గేమ్స్ ఆడుతున్నారా..." అఖిల కాస్త గట్టిగా అడిగింది... 'ధైర్యముంటే చెప్పండి మీరెవరో... అందులో నిజానిజాలెంతో చెప్పండి."

'మేడమ్... మీతో గేమ్స్ ఆడవల్సిన అవసరం నాకేం లేదు. మీ శ్రేయోభిలాషిగా మీకీ విషయం తెలియాలని చెప్పాను. నమ్మేదీ మానేదీ మీ ఇష్టం."

"మీరెవరు. మీకెలా తెలుసు ఈ విషయం..." అట్నించి కాసేపు మౌనం.

"అదంతా అవసరమా. నే చెప్పిందానిలో నిజానిజాలు మీరే తెల్సుకోండి...' ఫోను పెట్టేసిన శబ్దం. అఖిల విసుగ్గా సెల్ పక్కన పడేసింది... ఓ అమ్మాయి మాట్లాడింది అంటే ఇందులో నిజం వుందేమో. అదే మొగ గొంతుకయితే తనని ఏడిపించడానికో, పనిపాటలేకో సరదాగా చేసారేమో అనుకోవచ్చు... అన్పించింది అఖిలకి. రెండు మూడు సార్లు ఆ సెల్‌నెంబరుకి ఫోన్ చేశాక ఈరోజు మాట్లాడ గల్గింది. మాట్లాడాక సమస్య తీరకపోగా మరింత ఆలోచనలో పడేసింది అఖిలని.

* * * * * *

రాత్రి డైనింగ్ టేబిల్ దగ్గిర నల్గురు కూర్చుని భోజనం చేస్తుంటే ఆ మెసేజ్‌లు గుర్తు వచ్చి కార్తీక్ మొహం పట్టిపట్టి చూసింది అఖిల. కార్తీక్ భోంచేస్తూ కొడుకు కూతురుతో సరదాగా మాట్లాడుతున్నాడు. "డాడీ, డాడీ నాకు ఓ స్కూటీ కొనాలి. డాడీ. మా ఫ్రెండ్స్ ఇళ్లకి వెళ్లాలంటే ఆటోలో అంటే బోర్. కొన్నిచోట్ల ఆటోలు దొరకడం లేదు. 'ఇంజనీరింగ్ రెండో సంవత్సరం చదువుతున్న ముగ్ధ తండ్రి దగ్గర ముద్దులు గునుస్తూంది. "హైదరాబాదులో ... యీ ట్రాఫిక్‌లో స్కూటీనా ... నో వే, అది మాత్రం అడక్కు... సేఫ్ కాదు, వద్దు నాన్నా" కార్తీక్ కూతురికి నచ్చజెప్పాడు.

"డాడీ, ఐ.ఐ.టి. ఎంట్రన్స్ డేట్ అనౌన్స్ చేశారు చూశారా. ఇంటర్ పరీక్షలయిన పది రోజులకే... అసలు టైమివ్వలేదు...ఎలా చదవాలి..." టెన్షన్ ఫీలవుతూ అన్నాడు మానవ్. "ఎప్పుడూ అంతే గదా... ఎంట్రన్స్‌లన్నీ ఒకదాని తర్వాత ఒకటి అవుతూనే ఉంటాయి. మరి అందుకేగా ఇంటర్ ఫస్టియర్‌నించి కోచింగ్‌లో జాయిన్ అయింది. ఎలా వుంది ప్రిపరేషన్. కొడుకుతో మాట్లాడుతున్న కార్తీక్‌ని చూస్తే ఎంత బాధ్యతగల తండ్రి... ఓ భర్త, ఇంటియజమాని. పెద్ద ఉద్యోగస్థుడు. నలభైనాలుగు ఏళ్లుండి యిలా చిల్లర మల్లరగా అమ్మాయిలతో అఫైర్ జరుపుతాడా... మౌనంగా తింటూ అన్యమనస్కంగా ఉన్న అఖిలని చూసి "ఏమిటలా నిశబ్దంగా కూర్చున్నావు... డల్‌గా ఉన్నావు వంట్లో బాగులేదా!' కార్తీక్ భార్యని చూస్తూ అడిగాడు. అఖిల తలెత్తి కార్తీక్‌వైపు సూటిగా చూసింది. జవాబివ్వలేదు. ఆ చూపుకి కాస్త తడబడి, "ఏంటి, ఏమయింది," అడిగాడు.

"ఏం లేదు చూస్తున్నాను మిమ్మల్ని. ఏదో కొత్తగా కన్పిస్తూంది మీ మొహం" అంది.

కార్తీక్ ముందు కాస్త తడబడి సర్దుకుని, ఏమిటి... 'ఏమిటి కొత్తగా ఏం కొమ్ములు మొలిచాయా నా మొహంలో' జోక్‌గా అనేశాడు. "అదే, కొమ్ములు ఈ వయసులో

ఎందుకు మొలిచాయా అనే చూస్తున్నాను" సరదాగా అన్నట్టే అంది. 'కమాన్ మమ్మీ... డాడీని ఎందుకలా ఏడిపిస్తున్నావు" ముద్దుల కూతురు తండ్రి పక్షాన మాట్లాడింది.

"ఏమిటో .. ముగ్ధా, మీ నాన్న ఏమిటో ఎంగ్‌గా, ఫ్రెష్‌గా, కనిపించడంలేదూ ఈమధ్య. ఏమిటో మార్పు అని చూస్తే ఇవాళ అర్థమైంది."

కార్తీక్ మొహంలో రంగు మారింది.

"పో, మమ్మీ మా డాడీ ఏం మారారు. నాకేం కనపడలేదు.'

'నీకు తెలీదులే, చిన్న పిల్లవి... మొగుడు కదా, నాకు తెల్సినట్టు నీకెలా తెలుస్తుంది ఆ మార్పు' రెట్టించింది నవ్వుతూ.

'ఏంటి డాడీ. మమ్మీ కొత్తగా మాట్లాడుతుంది?' 'ఏమో మీ మమ్మీనే అడుగు' నవ్వుతూనే అన్నా ఆ కళ్ళలో బెరుకు స్పష్టంగా కనిపించింది అఖిలకి.

* * * * * *

"ఏం తల్లీ! ఇన్నాళ్ళకి గుర్తు వచ్చానా. ఏమయిపోయావు ఇన్నాళ్ళూ. ఓ ఫోనన్నా లేదు. ఏమిటి మహీ, మనం బొత్తిగా మరమనుషుల్లా తయారవుతున్నాం. మానవ సంబంధాలన్నవి లేకుండా పోతున్నాయి. ఒక ఊర్లో వుండి, నెలకోసారన్నా మాట్లాడుకోలేక పోతున్నాం. మూడు నాలుగు నెలలకోసారన్నా కలుసుకోలేక పోతున్నాం.' అఖిల గబగబా అంది. 'ఏయ్, ఆపు, ఏం అనకుండా ముందరి కాళ్ళకి బంధాలు వేయడం, ఏం తెలివే తల్లీ. ఫోను చెయ్యంది, కల్సుకోనిది నేనా నీవా.' మహిమ దబాయింపుగా అంది.

"సారీ... సారీ... నాదే తప్పు. ఏం పాడు ఉద్యోగాలే... మనిషిలో శక్తి పీల్చేసి నిర్జీవంగా తయారుచేస్తున్నాయి. నీకేం తల్లి లెక్చరర్ ఉద్యోగం. బోలెడు తీరిక. కావల్సినన్ని శలవులు. ఈ ఇంజనీరింగులు, ఎమ్మెస్‌లు చేసి మేం ఇలా యిరుక్కుపోయాం."

"సర్లే యీ గోల ఎప్పుడూ వుండేదేగా. నిన్ను చూడాలి. మనం ఎప్పుడు కలుద్దాం. రేపు ఆదివారం రాగలవా... పోనీ ఇద్దరం సరదాగా ఐమాక్స్ సినిమాకి వెడదామా!

"ఆ... ఆ ..." చిన్న పిల్లల్లా సంబరంగా అంది..."ఎన్నాళ్లయిందే సినిమా చూసి పిల్లల్ని కూడా రమ్మందామా..." 'వద్దు వద్దు మనిద్దరమే... మనం మాట్లాడుకోవాలి.'

'పోనీ సినిమాకి వద్దు. లుంబిని పార్కుకు రా... ఫ్రీగా మాట్లాడుకోవచ్చు.'

'ఏమిటి, ఎనీ ప్రాబ్లమ్...!' ఆరాటంగా అంది అఖిల...'అదేం లేదు. రా, ఆరుగంటల కల్లా రావాలి!' ఫోను పెట్టేసింది.

* * * * * *

"అయితే అన్నీ తెలిసి కూడా తెలీనట్లుండి పోతావా!" అప్పటికి అరగంట నించి ఇద్దరి స్నేహితురాళ్ళ మధ్య ఆ విషయమే మాటలు జరుగుతున్నాయి. "అతనికి, నీకీ విషయం తెల్సునన్న విషయమైనా తెలిస్తే కాస్త భయపడి పిచ్చి వేషాలు మానుతాడుగా..."

"అబ్బ మహీ, చూడు నిజం చెప్పాలంటే నాకీ విషయం మాట్లాడాలంటే, తల్చుకోవాలంటే విసుగ్గా అసహ్యంగా వుంది. ఏదో ఏడవనీ అని వదిలేయాలని పిస్తోంది. అవన్నీ అడిగితే అబద్ధాలు, వాదాలు, మాటల యుద్ధాలు, అరుపులు, కేకలు, గొడవలతో మనశ్శాంతి పోగొట్టుకోవాలని లేదు. ఇంట్లో టీనేజ్ పిల్లలు, వాళ్ళ చదువులు, డిస్టర్బ్ అయి వాళ్ళు భయపడి, బాధపడి యిల్లంతా అశాంతి నింపుకోవాలని లేదు. సాక్ష్యాలు చూపి నిలదీస్తే, నా ఇష్టం అంటే నేనేం చెయ్యాలి. తెలిశాక నోరు మూసుకుని నిస్సహాయంగా సహించడం నా ఆత్మాభిమానాన్ని పణంగా పెట్టడం కంటే, తెలీనట్టు ఉండిపోవడం నయం అన్పించింది."

మహిమ ఆశ్చర్యంగా చూసింది. 'నీలాంటి పెద్ద చదువున్న పెద్ద ఉద్యోగస్థురాలూ ఇలా ఆలోచిస్తే మామూలు ఆడదాని సంగతేమిటాని...'

'మహీ, ప్రాక్టికల్‌గా ఆలోచించు. ఈ విషయంలో మొగుడితో దెబ్బలాడి విడిపొమ్మంటావా, విడిపోయి ఈ వయసులో నే సాధించేదేముంది. ఇద్దరు టీనేజ్ పిల్లలు, వాళ్ళ పైచదువులు, ఉద్యోగాలు, పెళ్ళిళ్ళు... ఇవన్నీ ఒక్కచేతిమీద లాక్కు రాగలనా. పిల్లలకి వాళ్ళ నాన్నతో ఎంత ఎటాచ్‌మెంట్. తండ్రిని దూరం చేశానని నామీద కోపం, ద్వేషం పెంచుకోవచ్చు. ఇంట్లో ఈ టెన్షన్, అశాంతి, నా ఉద్యోగం మీద పడవచ్చు. ఇప్పటికే ఆఫీసులో టెన్షన్ భరించలేకపోతున్నాను. ఇంట్లో కూడా శాంతి లేకపోతే... అందుకే ఏదో ఏడవనీ, ఈ మగాళ్ళకీ మోజులన్నీ నాల్గురోజుల ముచ్చటే! మగాళ్ళకి పెళ్ళయ్యాక 'సెవెన్ ఇయర్ ఇచ్' అని మొదలవుతుందట. పెళ్ళాం కాస్త పాతబడి, ఇద్దరు పిల్లలు పుట్టుకొచ్చాక కొత్త రుచుల కోసం ఆరాటపడ్తారుట. మా ఆయనకి ఈ 'ఇచ్' కాస్త ఆలస్యంగా వచ్చిందికాబోలు. నలభై ఏళ్ళు దాటాక వాళ్ళలో ఇంకా అమ్మాయిలని ఆకర్షించే శక్తి వుందా. రొమాంటిక్

ఫీలింగ్స్ మిగిలాయా... టెస్ట్ చేసుకోవడం కోసం కొత్త రుచుల వైపు దృష్టి మళ్ళుతుందిట.

ఎవరో సైకాలజిస్టు రాశాడులే. ఈ పిచ్చి వెర్రిలన్నీ వాటి తాలూకు ప్రభావమే. దానికి తగ్గట్టు మేధ లాంటి అమ్మాయిలు బాస్‌ని ఇంప్రెస్ చేసి స్వార్ధ ప్రయోజనాల కోసం బాస్‌లకు దగ్గరయి లొంగిపోతుంటారు. ఈ 'దురద'లన్నీ నాల్గురోజుల ముచ్చటలే! ఏ మగాడూ భార్య, పిల్లలు, ఇల్లు, సంసారం వదులుకోడు. ఇదో పార్ట్ టైమ్. రొటీన్ నించి ఆట విడుపు. సమాజంలో భార్య స్థానం ఎప్పటికీ పోదు. దానికున్న ప్రాముఖ్యం దానిదే. నా స్థానం పదిలం... తేనెటీగ తేనెను వెతుక్కోవడం సహజ లక్షణం. అలాగే మగవాడూ... ఆ ఆరాటం తీరేది కాదు. ఆ బుద్ధి మారేదీ కాదు. దీనికోసం ప్రశాంతతని భగ్నం చేసుకోవడం అవివేకం గదా!

"పోవే, నీలాంటి ఆడవాళ్ళే ఇంతలా నిర్వీర్యమైపోయి సర్దుకు బతికేద్దామనుకోవడం నిజంగా ఆశ్చర్యంగా... కాదు షాకింగ్‌గా అనిపిస్తూంది నాకు..."

"మహీ, ఇంటికెళ్లి తీరిగ్గా ఆలోచించు.. వాటెవర్ ఇటీజ్. నాకు ఇంట్లో ప్రశాంతత కావాలి. రొటీన్ లైఫ్ నుంచి సమస్యలు, ఆందోళనలు, అపశ్రుతులు సృష్టించుకోవడం వద్దు.... ఏమిటలా చూస్తున్నావు..." అఖిల ప్రశాంతంగా అంది.

"ఏంలేదు, ఓ భర్త మరొాక స్త్రీతో తిరుగుతాడని తెలిసీ పట్టించుకునే కోరిక, తీరిక భార్యకు లేదు అనుకునేటంతగా మానవ సంబంధాలు దిగజారిపోతున్నాయి. చదువు, ఉద్యోగం, సంపాదన తప్ప మనిషికి మరోటి అక్కరలేనంతగా భార్యాభర్తల మధ్య ఉండాల్సిన అనుబంధాలు, ఆప్యాయతలు, అనురాగాలు, భర్త దూరం అయితే పడే బాధ, అవమానం, అసహనం, తన వాడు అనుకునే దగ్గరితనం ఏమీ లేకుండా ఏదో ఏడవనీ అనుకునే నిర్లిప్తత, నిస్తేజం మానవసంబంధాలలో వచ్చేశాయి అని ఆశ్చర్యంగా వుంది. "నిజమే, ఇదే, ఇదివరకటి భార్య అయితే ఏడ్చి రాగాలుపెట్టి, అలిగి, తిండి మాని, పుట్టింటికి పోతానని బెదిరించి, సాధించి, నలుగురితో చెప్పుకుని నిస్సహాయంగా ఏడిచేది. అలా ఉండమంటావా నన్నూ ఇప్పుడు.." నవ్వింది అఖిల.

"అలా కాదు... ఇంత ఈజీగా, పోనీలే.. ఏదో సరదా, మోజు అనుకునే నిర్లిప్తత..."

"ఈజీగా వదలద్దంటావా. సర్లే అయితే... ఓ పనిచెయ్యి... మీ ఆడపడుచుతో చెప్పి కార్తీక్‌కి ఓరెండు మూడు ఎస్సెమ్మెస్‌లు పంపమను." చిలిపిగా అంది. 'మీ శ్రీమతి ఆఫీసులో వాళ్ళ బాస్‌తో... అహ బాస్ వద్దు... ముసలాడు. కొలీగ్ అందంగా

ఎవరున్నారు కాస్త స్మార్ట్‌గా, రొమాంటిక్‌గా వుండేదెవరు... ఆ, ఆదిత్య అగర్వాల్ అనే కొలీగ్‌తో ప్రేమాయణం సాగిస్తూంది కళ్ళు తెరవండి అని మెసేజ్‌లు కొట్టించు. కార్తీక్‌కి ఓ ఝలక్ ఇద్దాం... ఏం...'

మహిమ ఆశ్చర్యంగా నోరు తెరిచి చూస్తూ ఉండిపోయింది. 'ఏయ్ మహీ... ఏమిటంత ఆశ్చర్యపోతున్నావు. నే చెప్పినట్టు చేయించు. మిగతాది నే చూసుకుంటా...' నవ్వుతూ అంది.

"మహీ, నీవన్నది నిజమే, మరి అంతలా పట్టనట్టు వదిలేయకూడదులే. అలా అని ఇంట్లో గొడవలూ ఉండద్దు. భార్య అంటే మరీ అంత నిర్లక్ష్యమూ ఉండకూడదులే..."

మహిమ ఇంకా అలా తెల్లపోయి చూస్తుండగా, అఖిల లేచి చీరదులుపుకుని... పద వెడదాం, టేకిట్ ఈజీ... అంటూ 'నే చెప్పిన ఎస్సెమ్మెస్‌లు మర్చిపోకు...' అంటూ మహిమ చెయ్యి పట్టుకు లేవదీసింది.

✶ ✶ ✶ ✶ ✶ ✶

ఐదు రోజులు గడిచాయి. గత మూడు రోజులుగా కార్తీక్ మొహంలో మారే హావభావాలు స్పష్టంగానే చూడగలుగుతోంది అఖిల. కోపం, అసహనం, సందిగ్ధత, అపనమ్మకం, కలవరం, అడగాలి అనుకున్నా అడగలేని అధైర్యం, అఖిలవైపు దొంగచూపులు... మొహం గంటుపెట్టుకొని అన్యమనస్కంగా వుండటం... ఆ రోజు రాత్రి 'ఏం ఒంట్లో బాగులేదా అలా వున్నారేం...' మొఖానికి చేతులకి క్రీము పట్టించుకుంటూ అడిగింది అఖిల బెడ్‌రూములో.

'ఒంట్లో ఏం రోగం' విసురుగా జవాబు. 'మరేంటి ఆఫీసు ప్రాబ్లమా?' నీవే నా ప్రాబ్లమ్ అనాలనుకున్నా అనలేకపోయాడు. 'సర్లెండి, చెప్పాలని లేకపోతే మానేయండి. తలగడలు సర్దుకుని పడుకుంది. కార్తీక్ కటువుగా "చెప్పాల్సింది నీవు..." అన్నాడు. 'నేనా, ఏం చెప్పాలి?' అమాయకత నటించింది.

'దీనికి జవాబు...' సెల్ ఫోన్ తీసి మెసేజ్ ఓపెన్ చేసి అఖిల కళ్ళముందు ఆడించి

"ఎవడో పనీ పాటా లేనివాళ్ళిచ్చే మెసేజ్‌ల గురించి నేనేం చెప్పాలి!" అంది.

"ఎంత పనిలేని వాడన్నా ఊరికే ఎవరూ ఇవ్వరు. కాస్తో కూస్తో నిజం లేనిదే."

ఉక్రోషంగా జవాబివ్వమన్నట్టు సూటిగా చూశాడు. అంతే సూటిగా అఖిల చూసి "కాస్తో కూస్తో నిజాలుండవచ్చు... ఏ కొలీగ్‌తోనో లంచ్‌కో డిన్నరుకో వెళ్ళచ్చు. కారులో ఎక్కడికన్నా వెళ్ళచ్చు, సరదాగా ఏ పార్కుకో వెళ్ళి ఉండొచ్చు..." నిర్లక్ష్యంగా అంది.

"పరాయి మగాడితో సినిమాలకి, హోటళ్ళకి, షికార్లకి వెళ్లడం... ఇవన్నీ కాస్తో కూస్తో నిజాలన్న మాట..." వ్యంగ్యంగా అన్నాడు.

"అంతే మరి, అలాగే అనుకోండి. ఆడవాళ్ళం, ఉద్యోగాలు చేస్తున్నాం, మీలాగే మాకూ రొటీన్ నించి బోరు కొడితే ఎక్కడికన్నా వెళ్ళాలనిపించవచ్చు. కాస్త థ్రిల్ కోసం ఏ క్లబ్బుకో వెళ్లచ్చు కొలీగ్‌తో... లైఫ్ బోరు కొట్టి కాస్త మార్పు కావాలనిపించడం తప్పా. ఏం మీ మగాళ్లు అమ్మాయిలని వెంటేసుకు వెళ్ళరా ఎప్పుడూ," సూటిగా అడిగింది.

'అంటే మాతో వంతు పోతున్నారన్నమాట. అంటే మగాళ్లు చేస్తే మీరు చేస్తారా? రిలాక్స్ అవడానికో, థ్రిల్ కోసం ఇంకో మగాడితో తిరిగితే తప్పేం ఉంది అనే వరకు వచ్చిందా వ్యవహారం' కోపంతో మాటలు తడబడ్డాయి.

'అవును మరి. ఇన్నాళ్లు పాపం ఆడవాళ్లు ఇంటికే పరిమితమయ్యారు. ఇలాంటి వన్నీ పాపం వాళ్ళకి అందుబాటులో లేక భర్తగారి తిరుగుళ్లు తెలిసీ భరించేవారు. ఇప్పుడు ఆడవాళ్లు చదివి, మగాడితో సరిగా సంపాదిస్తున్నప్పుడు వాళ్ళకుండే అవకాశాలని వాళ్ళూ అందిపుచ్చుకోవాలనుకోవడంలో తప్పుందా?' నిలదీసింది. కార్తీక్ తెల్లబోయాడు. ఏం మీ మగాళ్లకేనా 'సెవెన్ ఇయర్ ఇచ్‌లు' నలభై ఏళ్ల యవ్వనాలుండచ్చు. పెళ్లాం కాస్త పాతపడి, పిల్లలు పుట్టుకురాగానే కొత్త రుచులు, థ్రిల్స్ కోసం ఆరాటపడి రొమాంటిక్ హీరోల్లా కొత్త మోజుల వెంట ఆరాటంగా తిరగొచ్చా. ఏం పాపం ఆడవాళ్ళూ మనుష్యులేగా. రొటీన్ లైఫ్‌నించి మార్పుండాలని కోరుకోకూడదా! ఆడవాళ్ళకి 'ఇచ్'లుండకూడదా... కార్తీక్ మొహం ఎర్రబడింది.

"అంటే, ఈ ఎస్సెమ్మెస్‌లు నిజమేనన్నమాట."

"నిజం అనుకుంటే నిజం. ఇలాంటి మెసేజ్‌లు నాకూ వచ్చాయి. నేను పట్టించుకోలేదు. కావాలంటే చూడండి. సెల్ ఓపెన్ చేసి అతని ముందు పడేసింది. కార్తీక్ మొహం మాడిపోయింది. ఈ 'మేధ' ఎవరు అనైనా అడిగానా – భార్యాభర్తలకి ఒకరిపట్ల ఒకరికి నమ్మకం ఉండాలి. మిమ్మల్ని అడిగి, నిలేసి, గొడవచేసి ఏడ్చి

రాగాలెట్టి సంసారం వీధినపడేసుకోవడానికి నేను పాతకాలం ఆడదాన్ని కాదు. నాకు ఇంట్లో శాంతి కావాలి. టెన్షన్స్ భరించే ఓపిక లేదు. ఎదిగిన పిల్లల ముందు గొడవలు పడి వాళ్ళ మనసులు బాధపడి చదువులు డిస్ట్రబ్ అయి వాళ్ళ భవిష్యత్తుతో ఆటలాడే హక్కు మనకు లేదు.”

“ఈ మెసేజ్‌లు నమ్మావా? నిజమనుకున్నావా?” సంజాయిషీ ఇస్తున్నట్లు అన్నాడు.

“నిజమో అబద్ధమో ఎవరికి వారు ఆత్మ విమర్శ చేసుకోవాలి. నిజమో అబద్ధమో తేల్చుకోడానికి నిమిషం పట్టదు నాకు. నిజమైతే భార్యగా నా హక్కుల్ని వినియోగించుకుని ముక్కుపిండి లక్షలు వసూలు చేసి డైవోర్స్ తీసుకుని నా బతుకు నే బతకగలిగే ధైర్యం వుంది. ఒకరిపట్ల ఒకరు విశ్వాసంతో ఉండాలన్న పెళ్ళి ప్రమాణాలు గుర్తుంటే చాలు” నిబ్బరంగా అంది. అఖిల నించి చూపులు తప్పించి, కాసేపు సందిగ్ధంలో కొట్టుమిట్టాడి ‘అయితే ఈ మెసేజ్‌ల్లో నిజం లేదన్నమాట’. చిన్న సందేహం, చిన్న ఆశ! అఖిల అతని వంక చూసి జవాబిచ్చింది. ‘చెప్పాల్సింది మీరు, నేను కాదు’ అంది. కార్తీక్ మొహంలో కలవరపాటు! కాసేపు ఏదో ఆలోచించి “సరే, లెటజ్ ఫర్‌గెట్ యిట్ నీవన్నట్టు ఈ పిచ్చి మెసేజ్‌లు చూసి మనసు పాడుచేసుకోవద్దు, ‘డిలిట్’ చేసేద్దాం.” అఖిల భుజం మీద చెయ్యేసి రాజీకి వచ్చినట్లున్నాడు.

“సెల్‌ఫోను నించి ‘డిలిట్’ చేసేయచ్చు ఈజీగా. జీవితాల నుంచి ‘డిలేట్’ చేయడం అంత సులభం కాదేమో!” భుజం మీద నించి అతని చెయ్యి తీసి మృదువుగా కిందపెట్టి “ఈరోజు నించి నన్ను తాకే అర్హత మీరు పోగొట్టుకున్నారు. లోకానికి మాత్రం మనం భార్యా భర్తలం. పిల్లలకి తల్లిదండ్రులం. ఆ పాత్రని చక్కగా పోషిద్దాం. ఇంత కూడా నేను మాట్లాడదలచలేదు. కాని తప్పుచేసిన భర్తకు భార్యని అనుమానించి నిలేసే అధికారం ఉంటే భర్త ప్రవర్తనకి శిక్షవేసే అధికారం భార్యకీ ఉంటుందిగా..” చాలా నిదానంగా అని పాలిపోయిన కార్తీక్ మొహం ఓసారి చూసి తలగడలు సర్దుకు పడుకుంది.

* * * * * *

పదిరోజుల తర్వాత మహిమ నించి ఫోను. “మేధని బ్రాంచి ఆఫీసుకు ట్రాన్స్‌ఫర్ చేశారుట. నీకు తెలుసా!” అంది. “ఇప్పుడు తెలిసిందిగా” నవ్వింది అఖిల.

***(నవ్యవారపత్రిక – 30 మార్చి, 2011)***

# వడ్లగింజలో బియ్యం గింజ

**ఆ**దివారం సాయంత్రం ఐదు గంటలవేళ "సినిమా కెడదాం పదండి ఏం తోచడం లేదు" ఓ శ్రీమతి శ్రీవారితో అంది.

ఇంటాయన పేపరులో 'సుడోకు' నించి తలెత్తి "లేడికి లేచిందే పరుగన్నట్టు హఠాత్తుగా ఆదివారం ఐదుగంటలకి సినిమా కెడదాం అంటే సినిమాకి టిక్కెట్టు ఎలా దొరుకుతుంది" ఎత్తిన తల మళ్లీ వంగింది పేపరులోకి.

"మహారాజాలా దొరుకుతుంది. మనసుంటే మార్గం ఉంటుంది. కొత్త రిలీజ్ సినిమా వద్దు. కాస్త పాతబడిన దానికి హాయిగా దొరుకుతాయి టిక్కెట్లు. ముందు లేచి తయారవండి" దబాయించింది యిల్లాలు.

"అబ్బ ఆ చెత్త సినిమాలు డబ్బిచ్చి మరీ చూడాలా – అయినా రోజుకి నాలుగు సినిమాలు తక్కువ కాకుండా చూపిస్తున్నా ఇంకేం మిగిలాయి చూడడానికి."

"అబ్బ ఏంటండి, ఎడ్డెం అంటే తెడ్డెం అంటారు. ఎంతయినా పెద్ద తెరమీద చూసినట్లుంటుందా ఇంట్లో టీవీలో చూస్తే – ఏ ఏడాదికో, ఓసారి బుద్ధిపుట్టి అడిగితే నా ముచ్చట తీర్చడానికన్నా సరే అనరు" బుంగమూతి పెట్టింది ఇల్లాలు.

బుంగమూతి పెట్టిన ఇల్లాలు ఏ కొత్తగా పెళ్లయిన ఇరవై ఏళ్ల ముద్దుగుమ్మో, పదహారేళ్ల బాలాకుమారో గాదు. రిటైరయి యింట్లో కూర్చుని 'సుడోకు'లు పూరించు కుంటున్న అరవైమూడేళ్ల భర్తగారికి ఏభై ఎనిమిదేళ్ల ఇల్లాలు రాజేశ్వరి. "ఏమిటి బాబూ. ఆ దిక్కుమాలిన గుడ్డలిప్పుకు ఆడే తైతక్కలు చూడడానికి ఓ రెండొందలు తగలేసుకు వెళ్ళాలా" చిరాగ్గా అన్నాడు మూర్తి అనబడే కేశవమూర్తి.

"గుడ్డలిప్పుకు లైతక్కలాడే సుందరాంగులే మీ మగాళ్లకి నయనానందకరం గదా!" ఓ విసురు విసిరింది యిల్లాలు.

'అవన్నీ యవ్వన  వికారాల వయసులో. ఆ స్టేజి దాటి పుష్కరం అయిందిలే. అమ్మా తల్లీ, ఏ పక్కింటి పిన్నిగారితోనో వెళ్లి నన్నిలా వదిలేయ్ నీకు పుణ్యం ఉంటుంది" చిరాగ్గా అన్నాడాయన.

"ఆ దిక్కుమాలిన "డోకులు" ప్రతి పేపర్లో తగలెడ్తున్న వాళ్ళకి బుద్ధిలేదు. మాట పలుకు లేకుండా బెల్లం కొట్టిన రాయిలా బిగుసుకుపోయి ఆ అంకెలు నింపడమే పుణ్యం పురుషార్థంలా రోజంతా నాలుగు పేపర్లు పట్టుకు అతుక్కుపోవడం, లేస్తారా లేవరా – వాదులాటమాని తయారవండి లేదంటే నేనొక్కర్తినే పోతాను" బెదిరించింది యిల్లాలు.

"అమ్మా బతికించావు తల్లీ. హాయిగా నీపాటికి నీ ఇష్టం నా పాటికి నా యిష్టం అంటూ నీ స్వాతంత్ర్యం ప్రకటించేశావు చూడు. ఇంక ఆ మాట మీద నిలబడి నీ యిష్టం వచ్చిన చోటికి హాయిగా తిరిగి రావో. కావలిస్తే నీవు వచ్చేవేళకి రైస్ కుక్కరు మీటనొక్కేసి అన్నం వండేస్తాను వేడిగా."

"అబ్బే అంత కష్టం వద్దు. వేలికి ఎందుకు పనిచెప్పడం. హాయిగా సుడోకు చేసుకోండి. పెళ్లాం ముచ్చట తీర్చని మొగుడు, కాపుకాయని చెట్టువున్నా లేకపోయినా ఒకటే..." కోపంగా అంది యిల్లాలు.

"ఓసి నీ అఘాయిత్యం కూల. సినిమాకి తీసికెళ్లనంత మాత్రాన మొగుడున్నా లేకపోయినా ఒకటే అనేటంత దూరానికి వచ్చేసారు మీ ఆడవాళ్లు... అనేవన్నీ అంటూ ఏదో మగాళ్లు రాసిరంపాన పెడ్తున్నట్టు గగ్గోలు... 'మొగుడ్ని కొట్టి మొగసాల ఎక్కడం' అంటే ఇదే కాబోలు..."

"ఆపండిక, సినిమాకి రమ్మంటే ఇంతగోల..." విసురుగా వెళ్లిపోయిందావిడ. మరో పదినిమిషాలలో చీర సింగారించుకుని వెడుతున్న రాజేశ్వరిని చూస్తే .. మనసులో కాస్త ఆశ్చర్యపడ్డారాయన. పెళ్లయ్యాక మొదటిసారి ఆవిడ వంటరిగా వెళ్లిందన్నది తట్టాక, పోనీలే తననిబ్బంది పెట్టకుండా ఆవిడ సరదాలు ఆవిడని తీర్చుకోని... అనుకున్నాడా భర్తగారు.

✶ ✶ ✶ ✶ ✶ ✶

సినిమానించి చాలా హుషారుగా వచ్చింది రాజేశ్వరి. "మంచి సినిమా మిస్ అయిపోయారు" విలాసంగా ఓ చూపువిసిరి లోపలికెళ్లిపోయింది. "ఓ భోంచేశారన్న మాట. అంతేలెండి. మగాళ్ల కోసం ఆడవాళ్లు ఎదురుచూస్తూ ఆగాలి కాని పెళ్లాల కోసం వేచే మొగుళ్ళు ఎవరు?" నిష్ఠూరంగా అంది.

"చక్కగా సినిమా చూసొచ్చి పైగా దెప్పడాలొకటి. నేను ఎనిమిది గంటలకల్లా తింటానని తెలీదా. నీలా ఈ చిరుతిండి ఆ చిరుతిండి తిననని తెలుసుగా... చద్ది కూడు తిన్నమ్మ మొగుడాకలి ఎరగదన్న సామెతుంది గదా..." ఆయన ఉక్రోషంగా అన్నాడు.

"ఏం చక్కగా మిమ్మల్ని సినిమా చూడద్దన్నానా – చిరుతిళ్లు తినద్దన్నానా. సరే లెండి ... యివాళ నేనొక్కర్తినే సినిమాకి వెళ్లడం ఓ మంచి సరదా అనుభవం సుమండీ.." స్టూలు జరుపుకుని ఆయన పడకకుర్చీ దగ్గరగా కూర్చుని చాలా హుషారుగా అంది వయ్యారాలు పోతూ,ఆవిడ కులుకులు ఓరకంటా చూసి చూడనట్టు చూసి ఏం మాట్లాడలేదు – అడగక పోయినా తనే చెప్తుంది అని తెలిసి "ఏమిటి, ఎందుకు" అనడిగితే మీ సొమ్మేం పోతుందా. సినిమా కెళ్ళానని కుళ్లు మీకు" అంది నవ్వి. "నిజంగా, మీరు రాకుండా ఒక్కర్తిని వెళ్లడం బాగుంది సుమండీ, యిన్నాళ్లు మిమ్మల్ని బతిమిలాడ్తూ, రానంటే అలుగుతూ వెర్రి మొగంలా వుండి పోయాను – ఈ తెలివి ముందే వుంటే ఎంత బాగుండేదో – "ఆయన్ని ఊరిస్తున్నట్లుంది.

"పోనీలే ఇప్పటికన్నా గ్రహించావుగా... ఇంకేం నీ ఇష్టం వచ్చినట్లు ఊరేగింక" ఉడుకుమోత్తనం ధ్వనించిందా గొంతులో.

"దీనికే ఉడుక్కోకండి. ఇంకా నేచెప్పడం మొదలుపెట్టలేదు – అవునుగాని ఓ మాట చెప్పండి ... నన్ను చూసిన వాళ్లేం అనుకుంటారు చెప్పండి."

అర్థం కానట్లు చూశాడాయన – మళ్లీ రాజేశ్వరి చిలిపిగా "నేనెన్నేళ్ల దానిలా కనిపిస్తాను చెప్పండి" వయ్యారాలు పోయింది. ఆవిడ కులుకులు చూసి చిరాగ్గా "ఏమిటీ గోల, కులికింది చాలు చెప్పు..." అన్నారాయన విసుగ్గా.

"అబ్బ చెప్పండీ... అందరూ నీవు జుత్తుకు రంగేసుకుంటే నలభై ఏళ్లదానిలా ఉన్నావంటారు. మా వాళ్ళంతా... నీ మొహంలో వయసే కనపడదు... అంటున్నారు గదా."

"ఎవరా అన్నది ... రంగేసుకున్నంత మాత్రాన వయసేం దాగదు..."

"అబ్బ మీరు రంగేసుకోరుగా అందుకే మీకు నన్ను చూస్తే అసూయ. ముసలి మొగుడి పడుచుపెళ్లాం అనుకుంటారని నేను వేసుకున్నప్పుడల్లా ఈ వయసులో సింగారాలెందుకు, అని దెప్పేవారు."

"ఏమిటీగోల, సందర్భంలేని ఈ వాగుడేమిటి – సినిమాకి వెళ్లి ఏదో ఊడబొడ్చిన ఘనకార్యం చేసిన దానిలా ఈ ఉపోద్ఘాతాలు ఏమిటి..."

"అబ్బ వినండి. సినిమాకెళ్లానా... మీ గోలతో ఆలస్యంగా బయలుదేరాను. సినిమా మొదలెట్టేశారు. నా సీటు పక్కన యిటు అటు మగాళ్లు... ఆ ఉంటే నాకేం. అమ్మమ్మ అయిన నేనేం చిన్నదాన్నా మగాళ్లుంటే. నాకేం, నా కొడుకో తమ్ముడో అనుకుంటూ హాయిగా కూర్చున్నా..." కుతూహలంగా వింటున్న ఆయన మొహంలో రంగులు మారాయి. యింకేం చెప్తుందోనన్నట్లుగా ఆరాటంగా ఎదురుచూశారాయన.

"ఇటు పక్కనున్న ఆయన పాపం పెద్దమనిషే... కాస్త వదిగి కూర్చున్నాడు. ఎడమవైపున్నాడు చూడండి, కాస్త కుర్రకారు – అంటే ఏ ముప్ఫై ముప్ఫై ఐదో ఉండచ్చు... నే కూర్చున్న దగ్గిర నుంచి నా వైపు దొంగచూపులు మొదలు పెట్టాడు. మొదట ఏమిటి కాలేజీ కుర్రపిల్లని చూసినట్లు చూస్తున్నాడని చిరాకనిపించినా తరువాత... ఏదో గమ్మత్తుగా బాగానే వుందనిపించింది. కించిత్తు గర్వమూ అనిపించింది సుమండీ... నేను అమ్మమ్మలా కాక ఆంటీలా వున్నాను గాబోలు, పురుష పుంగవుడిని ఆకర్షించే అందం యింకా ఉందన్న మాట అనుకోగానే గర్వంగా అనిపించింది. 'పెరటిచెట్టు వైద్యానికి పనికి రాదన్నట్టు' యింటి మొగుళ్లు పెళ్లాలని ముసలమ్మలా తీసిపారేస్తారుగదా... అలాంటప్పుడు పరాయి మగాడు దొంగచూపులు చూడడం ఓ ఆడదానికి కించిత్తు ఆనందమే కలిగిస్తుందిగా..."

నవ్వుతూ అంది ఆ యిల్లాలు. వింటున్న భర్తగారి మొహంలో హావభావాలు సెకనుకోసారి మారుతున్నాయి. "సిగ్గులేకుండా, మనవల నెత్తిన దానివి, ఓ కుర్రవెధవ నిన్ను దొంగ చూపులు చూసాడని, చాలా సంబరంగా చెప్పడం కూడానా" నాకెందుకు సిగ్గు... నేనేం తప్పుడు పనిచేశానా... ఎవడో చూస్తే నా తప్పా... అందంగా ఉన్నానని చూసుంటాడు. నేనో అమ్మమ్మనని అతనికెలా తెలుస్తుంది...." విలాసంగా అంది.

"ఇంతే అనుకుంటున్నారా... తరువాత ఏం జరిగిందో చెప్పనా... చెపితే ఉడుక్కుంటారు."

భర్తగారి మొహంలో కొత్తరంగులు వచ్చి చేరాయి. అడగడానికి అహం అడ్డువచ్చి ఆవిడ చెప్పబోయే మాట కోసం అసహనంగా ఎదురు చూశాడాయన.

"ఇంటర్వెల్లో లైట్లు వెలిగాక నా వైపుచూశాడు. ఫరవాలేదు అంటే బాగానే ఉందనుకున్నాడు గాబోలు... బైటికెళ్లి రెండు కూల్ డ్రింకులు తెచ్చాడు. ఒకటి నాకిచ్చి 'తీసుకోండి ఆంటీ' అన్నాడు. వద్దన్నాను. బలవంతపెడితే తీసుకున్నాను." లైటారాక వెనుకనుంచి చెయ్యి వేశాడు. అహా నా భుజం మీద కాదు కుర్చీ మీదే లెండి... ఆ తరువాత కాలు తగిలింది. పాపం కావాలని తగిల్చి ఉండడులెండి. మనిషన్నాక కదలక మెదలక ఎలా కూర్చుంటాడు. సినిమా అయిపోయిందా...

ఆంటీ మీరెక్కడికి వెళ్లాలి రండి. ఈ రాత్రి వంటరిగా వెడతారా, నా బైక్ మీద దింపేస్తాను అన్నాడు నవ్వుతూ.

"అమ్మో అలా అనగానే భయం వేసింది సుమా..."

"ఏం పళ్లికిలించుకుంటూ మురిసిపోయావుగా... భయమెందుకు స్కూటరెక్కి చక్కగా రావల్సింది." పళ్ల బిగువున అన్నాడాయన.

"నిజంగానే కాసేపు స్కూటరు ముచ్చట తీర్చుకుంటే బాగుండు అనిపించినా బాబోయ్ ఎవరన్నా చూస్తే అనిపించింది..."

"అంటే ఎవరు చూడకపోతే ఎక్కేద్దువన్న మాట...." ఉక్రోషం ధ్వనించింది ఆ గొంతులో.

"ఊరికే అన్నా... ఎక్కుతానేమిటి పరాయి మగాడి స్కూటరు మీద –" కులుకులు పోతూ అంది.

"ఏమో బాబూ యిదే చెప్తున్నా – మీరొచ్చినా రాకపోయినా నాకు ఏదన్నా సినిమా చూడాలనిపిస్తే వంటరిగా వెళ్లే ధైర్యం వచ్చేసింది. ఇక మీదట మిమ్మల్ని అడగనే అడగను..." నిష్ఠూరంగా అంటూ లోపలికి వెళ్లిపోయింది.

* * * * * *

"ఏమిటొదినా, రెండు సినిమాలకెళ్లేసరికి నాతోడు అవసరం లేకుండా పోయిందా. అన్నయ్యగారు వచ్చేసరికి నన్ను పక్కకి తోసేసారు–" పక్కింటి సావిత్రి హాస్యం ఆడింది. రాజేశ్వరి కొత్తపెళ్లి కూతురిలా సిగ్గుపడింది. తరువాత కొంటెగా చూస్తూ "మా ఇద్దరిమధ్య నీవెందుకమ్మ తల్లీ పానకంలో పుడకలాగా.."

"బాగానే వుంది ముది వయసులో మీ ముచ్చట్లు ..." సావిత్రి నవ్వింది.

"ముదివయసేమిటి. అరవైలు, ఏభయిలు ముదివయసేంగాదు. మధ్య వయసు ఈ రోజుల్లో. అయినా మరీ చోద్యం గాకపోతే మొగుడితో సినిమాకెళ్లడానికి ఏ వయసయితేనేం..."

"అవును మరి. అందుకే గాబోలు అన్నయ్యగారు, ఈ అందాల పడుచుపెళ్లాన్ని ఎవడేం చేస్తాడోనని భయపడి వెంటపడ్డారు" ఇద్దరూ మనసారా నవ్వుకున్నారు.

***(నవ్య, సెప్టెంబరు 9, 2009)***

# లక్ష్మణ రేఖ

చెంప ఛెళ్లుమంది కార్తీకది. 'కొట్టావా, కొడతావా నన్ను' అన్నట్టు మింగేసేట్టు చూసింది కార్తీక.

"నీకెన్నాళ్లు? ఏం చదివావు? ఏం ఉద్యోగం చేస్తున్నావు?" సావిత్రి అరిచింది. కార్తీక కళ్లు పెద్దవి చేసి తెలీక అడుగుతున్నావా అన్నట్టు కోపంగా చూసింది.

"పాతిక దాటాయి, అమెరికాలో ఎమ్మెస్ చేసి వచ్చావు. పెద్ద కార్పోరేట్ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నావు. అయినా ప్రపంచ జ్ఞానం లేదు. చిలక్కి చెప్పినట్టు చెప్పాను. అడ్డమైన వాళ్లతో తిరగద్దని, మేం చూసిన వాడు నచ్చకపోతే నీకు నచ్చినవాడిని వెతుక్కుని చూసుకో అన్నదీ చెప్పాను. స్నేహమంటూ ప్రతీవాడితో క్లబ్బులు, పబ్బులు, డిన్నర్లు, షికార్లు తిరిగితే, రోజుకో మగాడితో తిరిగే ఆడదాన్ని మగాడెవరూ నమ్మడు. తనూ నీతో తిరుగుతాడు కానీ పెళ్లికి పనికిరావనుకుంటాడు అని చెప్పాను. విన్నావా... పర్యవసానం తెల్సిందిగా. పిచ్చి డ్రెస్సులేసుకుని బాయ్ ఫ్రెండ్స్‌తో మోటారు సైకిళ్లమీద తిరగడం ఫ్యాషన్ అనుకున్నావు. ఇప్పుడొచ్చి ఏం చెయ్యను అని నన్నడగడం ఏమిటి? సెల్‌ఫోన్లు, కంప్యూటర్లు, ఐపాడ్‌ల మధ్య అనుక్షణం గడిపేదానివి. సెల్‌ఫోను ఉపయోగాలు, దురుపయోగాలు తెలియవా? సరదాగా కౌగలించుకున్నట్టు, మొహాలు దగ్గర చేర్చుకుని, భుజాల చుట్టూ చేతులేసుకుని సెల్‌ఫోన్లలో సరదాగా ఫోటోలు చూసుకుని మురిసిపోయిన ఆ ఫోటోలే నీ మెడలో పాముల్లా చుట్టుకుని నిన్ను కాటేయడానికి వాడుకునే ఆయుధాలని తెలిసిందిగా ఇప్పుడు? ఏం చేయను నన్నడిగితే యూ స్టుపిడ్, ఇడియట్ మదర్ ఏం చెబుతుంది? నా లైఫ్, నా ఇష్టం. నాకు తెలుసు అన్నావుగా, నీ ప్రాబ్లమ్ నీవే సాల్వ్‌చేసుకో" ఆవేశంలో ఆగుకుండా ఆయాసం వచ్చే వరకు దులిపి పారేసింది సావిత్రి.

"ఛా... ఛా... ఈ ఆడపిల్లలకి ఎన్ని యుగాలైనా బుద్ధిరాదు. కాలేజీల్లో చదవడం డిగ్రీల కోసం తప్ప ప్రపంచజ్ఞానం కోసం కాదు. పుస్తకాలు, ఇంటర్‌నెట్‌లు, టీవీలు, సినిమాలు అన్నీ చూస్తారు. ఏం నేర్చుకుంటున్నారు" ఆవేశంలో ఆమె మాటలు తడబడ్డాయి.

కార్తీక తల్లి వంక చురచుర చూస్తూ మొహం మాడ్చుకుని లోపలికి వెళ్లిపోయింది. ఏదో ఇన్నాళ్లకి దానికి నచ్చినవాడు దొరికాడు, పెళ్లి చేసుకుంటాం అని చెప్పినప్పుడు – మంచి చదువు, ఉద్యోగం, కుటుంబం అన్నీ బాగున్నాయి. కులాలు వేరయినా సర్దుకున్నారు. పెళ్లి ఇంకో పదిహేనురోజులుండగా ఈ ఉపద్రవం వచ్చిపడిందేమిటి? కూతురు గతంతో ఆడుకోడానికి సిద్ధపడిన వాడిని ఏం చేయాలి? ఈ అమ్మాయిలెప్పుడు బుద్ధి తెచ్చుకుంటారు. ఆ వయసలాంటిదా? ఆ ఆకర్షణ అలాంటిదా? అందులోంచి తప్పించుకోలేని బలహీనతతో తప్పటడుగులు వేసి ఊబిలో దిగబడతారా? అందరమ్మాయిల్లా కాకపోయినా తెలివితక్కువగా కొందరు, అహంకారంతో కార్తీక లాంటి అమ్మాయిలు తమ అందం డబ్బు చూసి మగపిల్లలని ఆకర్షించాలని, తమ వెంట తిరిగేట్టు చేసుకోవాలని వళ్లుపై తెలీకుండా ప్రవర్తించి, ఉచ్చులోపడి జీవితాలని నాశనం చేసుకుంటున్నారు. కూతురునయితే కసిరేసింది కానీ మనసులో భయాన్ని తీసేయలేకపోయింది సావిత్రి. దిక్కుతోచని దానిలో కూర్చుండిపోయింది.

* * * * * *

"ఏమిటి మళ్లీ తల్లీకూతుళ్లు దెబ్బలాడుకున్నారా? మాటల తూటాలు విసురుకున్నారా" డైనింగ్ టేబుల్ దగ్గర గంభీర వాతావరణం చూసి "ఆ సీన్లకి తెరపడిందనుకున్నాను. మళ్లీ ఏం వచ్చింది గొడవ" తేలిగ్గా నవ్వి అన్నాడు అశోక్. కూతురు పెళ్లి కుదిరాక ఇంట్లో ప్రశాంతత ఏర్పడింది. తల్లీ కూతుళ్ల పోట్లాటలు, అరచుకోడాలు వాద ప్రతివాదాలు తగ్గాయి. మళ్లీ ఈ రోజేం వచ్చిందో ఇద్దరూ మొహాలు మాడ్చుకు కూర్చున్నారు. అర్థంకాలేదు అశోక్‌కి.

ఇద్దరూ జవాబివ్వలేదు.

"ఏమిటి, ఎనీ థింగ్ సీరియస్?"

కొంపతీసి రెండు నెలలు తిరిగేసరికి గౌతమ్ అనుకున్నట్టు లేడు. నే చేసుకోను అనిగానీ కూతురు అనలేదు గదా. "సావిత్రీ ఏం జరిగింది?" అసహనం ధ్వనించింది ఆ స్వరంలో.

"మీ ముద్దుల కూతుర్ని అడగండి. నన్ను అడగడమెందుకు?"

"కార్తీ ఏమయిందిరా నాన్నా" లాలనగా అడిగాడు.

"అదిగో... ఈ ముద్దే దాన్నలా తయారుచేసింది" కయ్‌మంది సావిత్రి. కార్తీక చేతిలో అన్నం పళ్లెం విసిరికొట్టి విసవిస వెళ్లిపోయింది లోపలికి.

"ఏం జరిగిందో చెప్తావా?" అసహనంగా అడిగాడు.

"ఆ దినేష్ అనే అబ్బాయి... ఇదివరకు ఇద్దరూ చాలా క్లోజ్‌గా తిరిగారు కదా..."

"ఆ... ఆ... పెళ్లి చేసుకుంటారనుకున్నాం. మళ్లీ చేసుకోం అని అదే అందిగదా."

"ఆ వాడే, ఇప్పుడు దీన్ని బ్లాక్‌మెయిల్ చేస్తున్నాడుట. నాతో తిరిగావు. ఎంజాయ్ చేశాం. ఇప్పుడు ఇంకెవరినో ఎలా చేసుకుంటావో చూస్తా అని బెదిరించి, సెల్‌లో మన ఇంటిమేట్ ఫోటోలు నీ కాబోయే మొగుడికి చూపిస్తాను అంటున్నాడుట."

"ఎందుకలా... ఇద్దరూ వాళ్లంతట వాళ్లే వద్దనుకున్నారు గదా" తెల్లబడ్డ మొహంతో అన్నాడు అశోక్.

"ఇద్దరూ వద్దనుకోలేదు. ఇది వద్దనుకుంది. పెళ్లికాకముందే అథార్టీ చెలాయించి వాళ్లతో ఎందుకు మాట్లాడావు వీళ్లతో ఎందుకు మాట్లాడావు అంటూ అదుపులో పెట్టాలని చూస్తే ఈవిడ సహిస్తుందా... నీకు నాకు పడదు అంటూ చెప్పేసింది. ఇన్నాళ్లు ఊరుకున్నాడు. ఇప్పుడు పెళ్లి అనగానే వాడిలో అహం తలెత్తింది. తన అసలు రూపం చూపాడు."

"మైగాడ్ ఇప్పుడెలా. ఏం చెయ్యాలి... పెళ్లి శుభలేఖలు కూడా వెళ్లిపోయాయి. గౌతమ్‌కి తెలిస్తే."

"ఇందాకటినించి ఆలోచిస్తున్నాను. ఈ సమస్యకి పరిష్కారం."

"వాడు చెప్పేలోగా దాన్నే గౌతమ్‌తో జరిగింది చెప్పేయమంటే."

"నేనూ అదే అనుకుంటున్నాను. వాడు చెప్పేక సంజాయిషీ చెప్పుకునేకంటే నిజాయితీగా జరిగింది చెపితే గౌతమ్ ఎలా రియాక్ట్ అయినా ఇదే నయం పెళ్లయ్యాక. ఏ క్షణం గౌతమ్‌కి చెపుతాడో అని టెన్షన్‌లో బతికేకంటే ముందే చెప్పేస్తే ఫలితం ఎలా ఉన్నా ఎదుర్కొందాం. ఈ విషయం మీరే దానికి చెప్పండి. నేచెపితే వినదు" సావిత్రి భర్తకి సలహా ఇచ్చింది.

✶ ✶ ✶ ✶ ✶ ✶

"హరితా, ఐయామ్ ఇన్ ట్రబుల్... నీ సలహా కావాలే."

"ఏమిటి ఏమయింది?" గొంతులో ఆదుర్దా.

"ఆ రాస్కెల్ దినేష్ లేడూ... నన్ను బ్లాక్‌మెయిల్ చేస్తున్నాడు."

"ఎందుకూ ఏమని, మీ ఇద్దరూ విడిపోయి నాలుగు నెలలయింది. నీవు గౌతమ్‌ని చేసుకుంటున్నావు. ఇపుడేమిటి ప్రాబ్లమ్?"

"ఆ, ఏం లేదు. వాడ్ని కాదని గౌతమ్‌ని చేసుకుంటున్నానని కుళ్లు. ఇన్నాళ్లు ఊరుకున్నాడు. పెళ్లనగానే అసలు కలర్స్ బయటపెట్టాడు. సెల్‌లో ఫోటోలున్నాయి వాడి దగ్గర."

"అసలు నిన్ననాలి. ఆ దినేష్‌గాడు ఓ రోమియో. అలాంటి వాడిని నమ్మావు. వాడితో క్లోజ్‌గా ఉండద్దని ఎంత చెప్పాను."

"ప్లీజ్, నువ్వూ తిట్టకే. వాడి మాటలకి బోర్లా పడ్డాను. కింద కాదు, వాడి వళ్లో. అదే నే చేసిన తప్పు."

"మీ పేరెంట్స్‌కి చెప్పావా... చెప్పడం మంచిది" హరిత సలహా ఇచ్చింది.

"చెప్పా.."

"చెంప పగలకొట్టింది అమ్మ" చిన్నపిల్లలా అంది.

"నిజం...? అంటే, ఆవిడకి ఎంత కోపం వచ్చిందో అర్థం అవుతుంది. మీ డాడి ఏమన్నారు?"

"అమ్మా నాన్న ఇద్దరూ మాట్లాడుకుని దినేష్ గౌతమ్‌కి చెప్పి ఫోటోలు చూపించక ముందే నన్నే చెప్పమంటున్నారు. లేకపోతే పెళ్లయినా ఎప్పుడు చెప్పాస్తాడోనని అనుక్షణం వాడికి భయపడుతూ టెన్షన్‌తో బతకాల్సి ఉంటుంది. నీవే చెపితే నీ నిజాయితీని గౌతమ్ హర్షించవచ్చు. చెప్పాక అతని ఏ నిర్ణయానికైనా తలవగ్గడం మంచిది అంటున్నారు. నీ అభిప్రాయం చెప్పు."

"గౌతమ్‌తో చెప్పడం సరే ఆ రాస్కెల్‌ని అంత ఈజీగా వదిలేయడమేనా? ఆడపిల్లలతో ఎంజాయ్ చేసి తరువాత బ్లాక్‌మెయిల్ చేసేవాడిని ఊరికే వదిలేయ డమా?" హరిత సాలోచనగా అంది.

"నీవు నాకేదన్నా సలహా చెప్పవే తల్లీ. ఐ డోంట్ వాంట్ టు లూజ్ గౌతమ్."

"సరే, ఈ రోజు ఆదివారమేగా మా ఇంటికి రా. ఇద్దరం ఆలోచిద్దాం. ఊరికే టెన్షన్ పడకు."

* * * * * *

"ఏయ్ దినేష్ ఎందుకలా ఎస్సెమ్మెస్‌లు పంపిస్తున్నావు. నీకేం కావాలి?"

"నీవే కావాలి" కొంటెగా అన్నాడు దినేష్.

"షటప్. మనిద్దరం గుడ్‌బై చెప్పుకుని ఐదునెలలయింది. ఇప్పుడు మళ్లీ నా వెంట ఎందుకు పడ్డావు?" కోపంగా అరిచింది.

"దూరం అయ్యాక నీ మీద ప్రేమ ఎక్కువయింది డార్లింగ్. నిన్ను వదులుకోలేననిపిస్తుంది."

"చూడు, నీ పిచ్చివేషాలు నాదగ్గర కాదు, నీవేమిటో నాకు బాగా తెలుసు. ఈ బ్లాక్‌మెయిలింగులు ఆపు. నీకేం కావాలో చెప్పు. నేను దీనికి భయపడేదాన్ని కానని నీకు తెలుసు."

"అలాగా... సరే, నాకేం కావాలి, నీవు కావాలి. అప్పుడు పెళ్లయ్యాక అంటూ ఊరించి దూరం పెట్టావు. పెళ్లవుతుందిగా, ఇప్పుడు..." విలాసంగా నవ్వాడు.

"ఛా... నోర్ముయ్. పెళ్లి అవుతూంది నాకు. ఇప్పుడిలాంటి వెధవ వేషాలా..." అరిచింది.

"ఏయ్ .. నీ పొగరు మాటలు ఆపు. నీకు రెండే ఛాయిస్‌లున్నాయి. ఒకటి నా కోరిక తీర్చు. లేదంటే ఆ ఫోటోలు ఎవరికి వెళ్లాలో వాళ్లదగ్గరకి వెడతాయి" వికటంగా నవ్వి అన్నాడు.

"చూడు, నేను ముందు నీతో ఓసారి మాట్లాడాలి. ఇంటికిరా."

"ఇళ్లకి రాను. ఏదన్నా హోటలయితే రెడీ."

"నేను హోటల్‌కి రాను. చూడు హరిత ఆఫీసుకి వెళ్లాక దాని అపార్ట్‌మెంట్ తాళం తీసుకుంటాను. అక్కడికి రా, రేపు పదకొండుకి?" ఫోన్ పెట్టేసింది.

"ఓకే... చూడు, ఏదన్నా పిచ్చివేషాలు వేస్తే నష్టం నీకే అన్నది మర్చిపోకు" ఫోన్ కట్ చేశాడు.

చాలాసేపు హరిత, కార్తీక మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

* * * * * *

"ఫర్వాలేదే అన్నమాట ప్రకారం వచ్చావు. థాంక్స్ నన్నింకా నీ మనసులోంచి తొలగించనందుకు. మనిద్దరం తప్పు చేశామా దూరం అయి..." దినేష్ కులాసాగా అన్నాడు హరిత ఫ్లాట్‌లోకి రాగానే.

"చూడు దినేష్. నీతో గతించిన ముచ్చట్లు మాట్లాడడానికి రాలేదు. నీకేం కావాలి సూటిగా చెప్పు."

"చెప్పాగా, నీవే కావాలి. పర్మినెంట్‌గా వద్దులే. పాపం పెళ్లి కుదుర్చుకున్నావుగా. ఒక్కసారికి నాదానివి కా. వెరీ సింపుల్ కోరిక నాది" విలాసంగా సోఫాలో కూర్చుని కాళ్లు సెంటర్ టేబుల్‌మీద పెట్టాడు.

"అది కుదరదని నేనంటే..." సూటిగా చూసి అంది కార్తీక.

"ఓకే, రేపీపాటికి మీ శ్రీవారితోపాటు దేశ విదేశాల్లో అందరూ మనిద్దరి ఇంటిమేటు ఫోటోలు ఫేస్‌బుక్‌లో చూస్తారు" తలెగరేసి పొగరుగా అన్నాడు.

"ఇంకా ఫేస్‌బుక్‌లో పెట్టలేదా. నీకంటే నేనే ఫాస్టు అన్నమాట. అప్పుడే నే పెట్టేశా చూస్తావా" హాండ్‌బ్యాగులోంచి "ఐపాడ్" తీసి ఓపెన్ చేసి దినేష్ కళ్ల ముందు ఆడించింది. "ఇంగ్లీషు వచ్చుగా. చదువుకుంటావా తెలుగులో చెప్పాలా... నీకెందుకులే కష్టం. చదువుతా విను" పాలిపోయిన మొహంతో కలవరంగా చూస్తున్న దినేష్ వంక విలాసంగా చూస్తూ "ఈ ఫోటోలో ఉన్న దినేష్ అనే వాడు ఉత్తి దొంగరాస్కెల్. వీడ్ని ఆడపిల్లలెవరూ నమ్మద్దు. ప్రేమ కబుర్లు చెప్పి అమ్మాయిలతో తిరిగి మొహం మొత్తగానే ఇంకొకరిని చూసుకుని, పాతవాళ్ల ఫోటోలతో బ్లాక్‌మెయిల్ చేసి ఏడిపించడం వీడికి వినోదం. పెద్ద శాడిస్ట్. ఆడపిల్లలెవరూ వీడి ట్రాప్‌లో పడద్దని, ప్రేమ కబుర్లకి లొంగవద్దని బ్లాక్‌మెయిల్ చేసి బెదిరించిన ఓ అమ్మాయి చెబుతున్న మాటలు ఇవి"... "ఇది ఇంకో క్షణంలో దేశ విదేశాల వాళ్లంతా చూస్తారు. ఫేస్‌బుక్ అంటే తెలుసుగా నీకు."

"ఏయ్ కార్తీకా..." ఒక్క ఉదుటున కార్తీక మీదకి దుమికాడు దినేష్.

"ఏయ్ అక్కడే ఆగు" చటుక్కున బెడ్‌రూమ్‌లోంచి వచ్చిన హరిత అరిచింది.

"నోరు మూసుకు కూర్చో. ఒక్క అడుగు ముందుకు వేశావంటే పోలీసుల్ని పిలుస్తా" హరిత దినేష్‌ని సోఫాలో తోసింది. దినేష్ మొహంలో రక్తం ఇంకిపోయింది.

"దినేష్ నీవే పెద్ద తెలివైన వాడివనుకుంటున్నావా? సెల్‌ఫోన్లు, కంప్యూటర్లు, ఐపాడ్‌లు మాకూ ఉన్నాయి. ఇంటర్నెట్లు, ఫేస్‌బుక్‌లు మాకూ తెలుసు. అవి ఎలా వాడాలో కూడా తెలుసు. నీవు నన్ను బ్లాక్‌మెయిల్ చేసి భయపెడితే ఏడుస్తూ కూర్చోడానికి నేను పాతకాలం అమ్మాయిని కాను. ఫ్రెండ్లీగా తిరిగాం. పెళ్లి ఇద్దరం వద్దనుకుని విడిపోయాం. ఇన్నాళ్ల తరువాత నా పెళ్లనగానే నీలో అహం తలెత్తిందా. నీవు నా వుడ్‌బీకి చూపిస్తే, నేనెవరికీ చెప్పుకోలేననుకున్నావు. నీ ఎస్సెమ్మెస్‌లు

సెల్‌లో ఉన్నాయి. ఇందాకటి నుంచి మనం మాట్లాడింది, నిన్న మాట్లాడింది సెల్‌లో రికార్డు అయి ఉంది. ఇవి చాలు పోలీసు కంప్లైంట్ ఇవ్వడానికి. రేపీపాటికి నీ బాస్‌కి చెప్పి నీ ఉద్యోగం ఊడగొట్టిస్తా. గౌతమ్‌కి నీవు చెప్పేదేమిటి నేనే చెపుతాను జరిగిందేమిటో. నోరుమూసుకుని పడిఉండి, చేసిన వెధవ పనికి క్షమాపణ చెప్పి కదులు... ఇంకా కక్ష సాధించాలనుకుంటే నాశనం అయ్యేది నీ బతుకే" కఠినంగా అంది కార్తీక.

"దినేష్ నీకు సిగ్గు వేయడం లేదా. పెద్ద చదువులు చదివావు. కార్పోరేట్ ఆఫీసులో మంచి ఉద్యోగం, సంఘంలో పరపతి అన్నీ ఉండి ఇంత చీప్‌గా, ఇంత సంస్కార హీనంగా ఓ అమ్మాయిని బ్లాక్‌మెయిల్ చేస్తావా?" హరిత అసహ్యంగా చూస్తూ దులపడం మొదలుపెట్టింది. "ఏమిటి పాతకాలం అబ్బాయిల్లా అమ్మాయి రాసిన ఏ ఉత్తరమో పట్టుకుని బ్లాక్‌మెయిల్ చేసినట్టు చేస్తే, ఈ కాలం అమ్మాయిలని అంత తక్కువ అంచనా వేయకండి. నౌ గెట్‌లాస్ట్. నీ మొహం చూస్తేనే అసహ్యంగా ఉంది" అతన్ని తలుపువైపు తోస్తూ అతని చేతిలో సెల్ లాక్కుని ఆ ఫోటోలు అన్నీ డిలిట్ చేసి సెల్ విసిరేసి తలుపు ధడాలున మూసింది హరిత.

"ఇంక ఆలస్యం చెయ్యకుండా వెళ్లు. గౌతమ్‌కి ఈ విషయం నీ ద్వారానే తెలియాలి. వెళ్లు అంతా చెప్పు" హరిత అంది.

"ఇప్పుడు చెపితే... గౌతమ్ రియాక్షన్..." నసిగింది కార్తీక.

"ఎలా రియాక్ట్ అయినా ఫేస్ చెయ్యి. జీవితాంతం భయంతో, టెన్షన్‌తో బతకడం కంటే ఇది నయం. వెళ్లు. పెళ్లి తప్పినా పర్వాలేదు. జీవితం అంతా టెన్షన్‌లో బతకడం కంటే..."

* * * * * *

"కార్తీకా, నిన్న ఆంటీ వచ్చి చెప్పిందగ్గర నించి, నీవు నిజాయితీగా నాతో చెపుతావా లేదా అని ఆలోచిస్తున్నాను. చెప్పావు. థాంక్స్" కార్తీక చెప్పిందంతా విని తేలిగ్గా అన్నాడు గౌతమ్.

"అమ్మ వచ్చి చెప్పిందా?" ఆశ్చర్యంగా అంది కార్తీక.

"ఆ... ఆవిడ వచ్చి, నీ ప్రాబ్లమ్ చెప్పి తెలివి తక్కువగా కొంత, అనుభవ రాహిత్యంతో కొంత, అన్నీ నాకు తెలుసు అనే నీ అహం గురించి చెప్పి, నాతో

అంతా చెప్పమని సలహా ఇచ్చానని, కూతురు చెపుతుందో లేదోనని తనే వచ్చి చెప్పానని, అంతా విని ఏ నిర్ణయం తీసుకున్నా తమకి ఆమోదమేనని, నిజం దాచి, అనుక్షణం వాడి బెదిరింపులకి భయపడి జీవితాంతం కూతురు టెన్షన్‌లో బతకడం ఇష్టం లేదని ఆవిడ చెప్పారు. నిజంగా ఆవిడ సంస్కారం ముందు నేను ఇంకేవిధంగా నిర్ణయం తీసుకోగలను. కేవలం నీవు పెళ్లికి ముందే ఈ నిజం చెప్పాలని మాత్రం ఆశించాను. నా నమ్మకాన్ని నిలబెట్టావు. థాంక్స్" అన్నాడు గౌతమ్.

"లేదు గౌతమ్, నిన్నే వద్దామనుకున్నాను. ముందు వాడికి బుద్ధి చెప్పాలని నేను, హరిత మాట్లాడుకుని ఆ రాస్కెల్ ఆట కట్టించాం" అని జరిగిందంతా చెప్పి "ఇంక మళ్లీ ఏ ఆడపిల్ల జోలికి వెళ్లడులే. ఇప్పుడు నీతో చెప్పాక ఎంత రిలీఫ్‌గా ఉందో..." రిలాక్స్‌గా కూర్చుంటూ అంది.

"కార్తీకా, ఓ మాట చెప్పనా... మీ అమ్మగారు చెప్పింది నిజం. ఈ కాలం అమ్మాయిలు చదువుకున్నా ప్రపంచజ్ఞానం తక్కువ. తెలివి తక్కువగా ఈనాటికీ అబ్బాయిల మాయమాటలకి లొంగిపోతున్నారు. ఇప్పుడు ఈ సెల్‌ఫోన్లు, ఫేస్‌బుక్‌ల విజ్ఞానం అందుబాటులోకి వచ్చాక ఇదివరకటి కంటే జాగ్రత్తగా ఉండాలి కాని, ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్న అహంకారంతో తప్పటడుగులు వేస్తున్నారు."

"ఏయ్ ప్రవచనాలు చెప్పకు. ఇంట్లో అమ్మ ఇక్కడ నువ్వా... అమ్మాయిలని అంత తక్కువ అంచనా వేయద్దు. మాకూ తెలుసు ఎలా ఎదుర్కోవాలో" గర్వంగా అంది.

"ప్రవచనాలలో చెప్పేవి ఆనాటికే కాదు ఈనాటికీ ఆచరించతగ్గవే. అమ్మాయిలని వంటింట్లో కూచోమని ఎవరూ చెప్పడం లేదు. అతిగాపోయి గీత దాటితే నష్టం వారికే. అమ్మాయిలే ఎవరికి వారే లక్ష్మణరేఖలు గీసుకోవాలి."

"అవును గౌతమ్, అన్నీ తెలుసునన్న పొగరుతో ప్రవర్తించాను. నువ్వు అర్థం చేసుకోకపోతే నా పరిస్థితి ఎలా ఉండేదో" కార్తీక గొంతులో నిజమైన పశ్చాత్తాపం పలికింది.

*(ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక, 23.2.2012)*

# సునాయాస మరణం

**రా**త్రి మంచి నిద్రలో ఉండగా ఎవరో తట్టి  లేపినట్లయి కళ్లు తెరిచాను. ఎదురుగా కళ్లు చెదిరే వెలుగు! ఆ వెలుగులోంచి ఓ దివ్యమంగళ రూపం క్రమంగా దగ్గిరగా వచ్చింది. ఆ రూపం దేముడా! దేముడిలాగే వున్నాడు మరి. పీతాంబరాలు, మెడలో మెరిసే వజ్రాల హారాలు – చేతులకి కంకణాలు నెత్తిన కిరీటం, వెనకాతల వెలుగుచక్రం, నిజంగా దేముడే – అమ్మో, నాకు దేముడు ప్రత్యక్షమయ్యాడు. 'దేముడూ.. నువ్వేనా, దేముడివేనా, నమ్మకం కుదరక అడిగాను. చిరునవ్వు నవ్వి అవును' అన్నాడు దేముడు.

"ఏ దేముడివి స్వామి, మెడలో పాము, నెత్తిన గంగ, త్రినేత్రం అవి లేవు కనక శివుడివి కావు – మురళి, ఫించం అవి లేవు కనుక కృష్ణుడివి కావు. నామాలు లేవు కనుక వెంకన్నవి కావు. సుదర్శన చక్రం లేదు విష్ణువ్వి కావు. మరే దేముడివి స్వామి"

"నువ్వెవరు అనుకుంటే ఆ దేముడినే – భక్తులు ఏ రూపం తల్చుకుంటే ఆ రూపం కనిపిస్తుంది" చిరునవ్వు నవ్వి అన్నాడు ఉబ్బితబ్బిబ్బు అయిపోతూ "నేనేం పుణ్యం చేశానని నాకు ప్రత్యక్షమయ్యావు దేముడూ" ఆనందం పట్టలేక అడిగా. "నీకు వరం ఇద్దామని వచ్చాను. ఓ వరం కోరుకో ప్రసాదిస్తాను" నవ్వుతూ అన్నాడు.

అమ్మో వరమే! వరాలిచ్చేటంత పుణ్యం ఏం చేశాను దేముడూ, నేనేం తీర్థయాత్రలు చెయ్యలేదు. గుళ్ళూ గోపురాల చుట్టూ తిరగలేదు. నోములు, వ్రతాలు, యాగాలు, యజ్ఞాలు, ఉపవాసాలు ఏమీ చెయ్యలేదు. మొక్కులు మొక్కి నోట్లకట్టలు హుండీలో వేయలేదు. దీపం పెట్టి రెండు నిమిషాలు దేముడికి దండం పెట్టుకోవడం తప్ప

నేనేం పూజలు చెయ్యలేదే స్వామీ" ఆశ్చర్యంగా అన్నా. "పూజలు వ్రతాలు చెయ్యనక్కర లేదు. ఈ మధ్య మంచి మనసుతో కాస్త దానాలు ధర్మాలు చేశావుగా అందుకని... 'తెల్లపోతూ చూశాను.' ఏమిటి ఆ కాస్తకే మీ దేముళ్లు వరాలిచ్చేస్తారా? తిరగేసి బోర్లేసి లెక్కేసినా ఓ ముప్ఫై వేలన్నాలేవు. అంతకే వరాలిచ్చేయడానికి వచ్చావా? ఆశ్చర్యానందాలతో అన్నాను.

"అంతేగా మరి. నీవే ఓ కవితలో రాశావుగా. 'చేసింది, యిచ్చింది ఊరికే పోదు, తిరిగి నీకే చెందుతుందని, మరి నీవిచ్చింది మళ్లీ నీకే దక్కాలిగదా' యిద్దామని వచ్చా.." అన్నాడు నవ్వుతూ.

"అంటే, ఓ ముప్ఫై వేల వరం యివ్వడానికి ప్రత్యేకం పనిగట్టుకి వచ్చావా ఆ మాత్రం నే సంపాదించుకోలేనా" కినుకగా అన్నాను. దేముడు చిరునవ్వు నవ్వి "ఆహా, అలాగా సంపాదించుకోగలవా?' అన్నారు. చటుక్కున నా పొరపాటు అర్థం అయింది". "సారీ, సారీ దేముడూ, శివుడాజ్ఞలేనిదే చీమైనా కుట్టదు గదా, నీదయ లేకపోతే ఓ రూపాయన్న సంపాదించలేం. ఏదో పత్రిక వాళ్లిచ్చే వందో రెండొందలో కూడా రాకుండా చెయ్యకు. కాగితం, పోస్టు ఖర్చుకైనా వస్తుంది. అది సరేగాని, నేచేసిన యీ కాస్తదానం, ధర్మంకే వరం యిస్తానంటూ వచ్చావు. మరి లక్షలు లక్షలు కట్టలు కట్టి హుండీల్లో వేస్తుంటారు. కిలోలకొద్ది బంగారాలు, నగలు, హారాలు, కిరీటాలు యిచ్చేస్తుంటారు. యాగాలు, అన్నదానాలు చేసేస్తుంటారు. మరి వాళ్లందరికి ఎన్ని వరాలిస్తుంటావు స్వామీ..." సందేహంగా అన్నాను. 'కట్టలు కట్టలు డబ్బులిచ్చే వాళ్లకెందుకు ఇస్తాను. నిజాయితీగా, న్యాయంగా కష్టపడి సంపాదించిన దానిలో కాస్త యితరులకిస్తే అది దానం. ఎన్నికట్టలయినా నల్ల డబ్బు నే ముట్టుకోను...' దర్పంగా అన్నాడు.

"కబుర్లు చెప్పకు దేముడూ, ఆ డబ్బుతో చక్కగా పైనించి కిందవరకు వజ్రాల కిరీటాలు, రత్నాల హారాలు, బంగారు తొడుగులు... నిలువంతా బంగారం రత్నాలే కదా – ఆ డబ్బు నే ముట్టనని గొప్పలు చెప్తున్నావు – నిలేశాను.

"పెట్టుకోక ఏం చెయ్యమంటావు. రాతి విగ్రహాన్ని కదా, చేత్తో తీసి పారేయలేను గదా, భరించాలి. అక్కడకీ అప్పుడప్పుడు ఏదో వంకతో, కొన్ని అరిష్టాలని, ఇది అది వంకలు పూజారుల చేత చెప్పించి పెట్టుకోను. – మొన్న 'గాలి' గారిచ్చిన నలభైకోట్ల కిరీటం ముట్టుకున్నానా, అలాగే కొన్ని నగలు.. ఏదో భక్తుల సరదా.

రాతి విగ్రహాన్ని నగలతో అలంకరించి భక్తి చూపించి ముక్తి పొందాలనుకునే వారిని వారించి ప్రయోజనం లేదు. ఆ డబ్బు అన్నదానాలు, భక్తుల అవసరాలు తీరడానికి ఉపయోగపడ్తోంది కదా. నేనెందుకు కలిపించుకోడం – నిజాయితీగా భక్తిగా ఫలం, పుష్పం, తోయం చాలు మాకు. వారి వారి పాపాలు కడుగుకోడానికి ఏదో చేస్తుంటారు. అలాంటి వారి జోలికి నేను వెళ్లను. వివరణ యిచ్చాడు. ఆనందంతో తబ్బిబ్బు అయిపోయాను" అయితే నిజంగా నాకు వరం యిస్తావా" ఇంకా నమ్మకం కలగలేదు నాకు.

"మరి అందుకే గదా వచ్చాను. వరం కోరుకో... ఒక్కటే సుమా"

'ఏం వరం యిస్తావు. ఏం కోరుకోను...' సందేహంగా అడిగాను.

"నీ ఇష్టం వచ్చింది అడుగు, కాని ఒక చిన్న షరతు, ఏం కోరుకున్నా అది కేవలం నీకే ఉపయోగపడ్తుంది. నీకే వర్తిస్తుంది. మరెవరికి దక్కదు."

"మళ్లీ అదేం మెలిక 'పతి ప్రాణంబు దక్క' అని సావిత్రికి యముడు వరం యిచ్చినట్టు – మళ్లీ ఈ షరతేమిటి – '

"మరంతే – ఎవరెవరి ఖర్మ ఫలాలని బట్టి మంచైనా చెడైనా వారే అనుభవించాలి. ఏదన్నా వాళ్లు పొందగలిగిందే దక్కుతుంది. అప్పనంగా వచ్చేది కాదు.'

"ఏం వరం కోరుకోను?" అర్థం కాక ఆలోచించసాగాను.

"డబ్బు, బంగారం, యిల్లు... నీ యిష్టం..."

"సరే, అయితే ... ఓ పదికోట్లు... ఛా... ఛా... కోరుకునే దాకా వస్తే పది కోట్లేంటి ఓ వందకోట్లు ఇచ్చేయి. పిల్లలకి, మనవలకి అందరికి తలో పదికోట్లు యిచ్చి మిగతావి నాక్కావలసినవి కొనుక్కుని – కాస్త దానం ధర్మం...."

"ఇదిగో అమ్మా నీకేం చెప్పాను. ఈ వరంలో కోరుకున్నది నీకు మాత్రమే ఉపయోగపడ్తుంది అని."

"అంటే, నా తదనంతరమైనా పిల్లలకి దక్కదా – 'నిరాశగా అన్నా' మరి అలాంటప్పుడు ఇంత డబ్బు ఈ వయసులో ఏం చేసుకోను?'

"చూడు తల్లీ, పిల్లలకి కోట్లు కూడబెట్టి యిచ్చిన వాళ్ల గతి ఏమవుతుందో చూస్తున్నావుగా. పెన్షన్‌మీద బతుకుతున్న నీకు వందకోట్లెక్కడివి? దొంగ నోట్ల వ్యాపారమా అని నిన్ను నీ పిల్లలని పోలీసు స్టేషన్లు, కోర్టులు పేరు చెప్పి లాకప్‌లో

చిప్పకూడు తినిపిస్తే అది నీకు ఇష్టమా? అక్రమ సంపాదనల వాళ్లు పడుతున్న అవస్థలు చూసి కూడా అడుగుతున్నావా అంత డబ్బు."

"అదీ నిజమే. ఏదో ఉద్యోగాలు చేసుకు సంపాదించుకుంటూ సుఖంగా బతికే వాళ్లకి అనవసరమైన ఆశలు కల్పించి అవస్థలపాలు చేయడం ఎందుకు..."

"మరి ఇంత డబ్బు ఒక్కర్తివి ఏం చేస్తావు చెప్పు మరి..."

"ఆలోచనలో పడ్డాను. ఇంతంత బంగారం ముద్దలు కొని పడేస్తే! బోలెడు నగలు చేయించుకోవచ్చుగా.. నా మొహం, ఉన్న చంద్రహారాలు, పలకసర్లే ఎప్పుడూ వేసుకోలేదు. ఈ ముసలి వయసులో వంటినిండా నగలేం దిగేసుకుని ఏడుస్తాను. పిల్లలకివ్వడానికి లేదన్న షరతు లేకపోతే బాగుండు."

"పోనీ దేశదేశాలన్నీ చుట్టి రానా.. పాతిక ముప్పై ఏళ్ల క్రితం యూరప్, అమెరికా వెళ్లినప్పుడే ఆ ఏర్‌పోర్టులో గంటల వెయిటింగు, ఇరవై గంటల ప్రయాణం, ఏది చూడాలన్నా గంటలు గంటలు క్యూలో నిలబడలేక కాళ్లు పీక్కుపోయి, మైళ్ల కొద్ది నడిచి చూడాల్సిన ప్రదేశాలు... అమ్మో ఇవన్నీ చేసే ఓపిక యిప్పుడెక్కడిది నాకు వద్దుబాబూ..." నా ఆలోచన తెమలలేదు.

"ఏమిటి వరం కోరుకోడానికింతసేపా – తొందరగా చెప్పు. నీలాంటి వాళ్లు చాలా ముందున్నారు మరి."

"ఏం కోరుకుందామన్నా నాకొక్కర్తికే అన్నీ అని మెలిక పెట్టావు మరి – పోనీ ఏదో బతికినన్నాళ్లు హాయిగా వుండడానికి పెద్ద భవంతి, ఓ అందమైన తోట ఓ లోటస్ ప్యాలస్సో, మైసూర్ పేలస్సు లాంటిదో పెద్ద ఇల్లు ఇచ్చేయి. ఈ రెండు గదుల ఫ్లాట్ పిల్లలు వస్తే సరిపోవడం లేదు..." దేముడు నా మొహం చూసి నవ్వాడు.

"సరే ఇస్తాననుకో, మరి మెయిన్‌టైన్ చెయ్యగలవా, నీకొచ్చే పెన్షన్ డబ్బులతో కొంటెగా అన్నాడు. తెల్ల మొహం వేశాను" అదేమిటి ఇల్లు తోటలు ఇచ్చావంటే అన్నీ మెయిన్‌టైన్ నువ్వే చెయ్యాలి."

'అమ్మా ఆశ! ... అసలు ఒక్కటే వరం – కొసర్లుండవు – ' అల్లరిగా అన్నాడు.

'అయ్యబాబోయ్ అంత పెద్ద భవంతులు చూసుకోవాలంటే ఎంత మంది నౌకర్లు, చాకర్లు మాలీలుండాలి – నా బోడిపెన్షన్ తిండానికే సరిపోతుందిగా ఈ ఖర్చులు నా వల్ల అవుతాయా – పని మనిషి రాకపోతే రెండు గదుల కొంప తుడవడమే నా వల్ల కావడం లేదు. ఈ వయసులో, నావల్ల ఏం అవుతుంది. వద్దు బాబూ..."

“అబ్బ ఏమిటయ్యా నాయనా వరం యిస్తానని వచ్చి అన్నింటికీ నీవే అడ్డుపుల్లలు వేస్తున్నావు.”

“అవును మరి. వరాలు యిచ్చేటప్పుడు మేమూ కాస్త జాగ్రత్తగా ఆలోచించాలని సావిత్రి కథ, భస్మాసురుడి కథల వల్ల తెలుసుకుని కాస్త జాగ్రత్త పడుతున్నాం. సావిత్రి మాటలతో యముడిని బోల్తా కొట్టించి మొగుడ్ని పట్టుకుపోయింది గదా. బోళాశంకరుడు వరమిచ్చి తనే చిక్కుల్లోపడ్డాడు గదా. నీకు ఓ వెయ్యి కోట్లిచ్చి, పెద్ద భవంతులు యిచ్చేస్తే ఇన్‌కంటాక్సు వాళ్లూ, సిఐడి వాళ్లు ఈ డబ్బు నేనిచ్చానని తెలిసి తిన్నగా నా దగ్గరికే వస్తే... నే చిక్కుల్లో పడను మరీ. అందుకే మరీ అంతంత గొప్ప వరాలు వద్దు కాస్త మామూలివి అడుగు.

“పోనీ కారు లేదు. ఓ పెద్ద కారిచ్చేయి. కాస్త మీటింగులకు వాటికి వెళ్లాలంటే ఈ ఆటోవాళ్లతో ఇబ్బందిగా ఉంది. పెద్ద పడవలాంటి కారు...” ఆశగా అడిగా – అంతలోనే అసలు తప్ప కొసర్లు లేవు అన్న దేముడి మాట గుర్తువచ్చి – ‘అమ్మో – ఆ కారు పెట్రోలు, డ్రైవరు ఇవన్నీ భరించగలనా – ఈ హైదరాబాద్ రోడ్డు, ట్రాఫిక్కులో పడవలాంటి పెద్ద కారు – బాబోయ్ భరించే శక్తి నాకు లేదు.

“ఏమిటి ఆలోచన, కారడిగావు ఇవ్వనా...” “వద్దులే, నాకంత సీను లేదు” నిరాశగా అన్నా.

“మరయితే ఇంకేంకావాలి – ఒక వరం అడగడానికింత సేపా.

“ఏమిటయ్యా బాబూ. ఏం అడగాలో తెలిసి చావడం లేదు” తల పట్టుకున్నాను.

“అయితే సరే, నీకన్నీ ఉన్నాయి. ఉన్నదాంతో సుఖంగానే ఉన్నావు. మరి నే వెళ్ళిరానా...” దేముడు బయలుదేరబోయాడు.

“అయ్యయ్యో వెళ్లిపోకు దేముడూ.. ఉండు ఉండు ఆలోచించనీ... అయ్యో నా మతిమండా, మర్చేపోయాను, నేనో రచయిత్రిని కదా... ‘కేంద్ర సాహిత్య అకాడమీ ‘అవార్డు’ ఛా... ఛా... కాదు కాదు అడిగే వరకు వస్తే జ్ఞానపీఠ అవార్డు అడిగేస్తే పోతుంది గదా...” దేముడూ గత ఏభై ఏళ్ల నుంచి సాహిత్య సేవ చేస్తున్నాను. కాని రావల్సినంత గుర్తింపు రాలేదని కాస్తంత బాధగా వుంది. నగలు, డబ్బు, మేడలు, కార్లు ఏం వద్దు గాని సాహిత్యంలో పెద్ద అవార్డు ‘జ్ఞానపీఠ్’ అవార్డు ప్రసాదించు. రచయిత్రిగా మంచి గుర్తింపు వస్తుంది.”

దేముడు సూటిగా నా వంక చూసి చిరునవ్వు నవ్వి... ‘సరే అలాగే, కాని

ఒక్కసారి నిజాయితీగా ఆలోచించు.. ఆ అవార్డు పుచ్చుకునేంత అర్హత నీకు ఉందనిపిస్తుందా' అవమానం ఫీలయిపోయాను. కోపంగా, పౌరుషంగా "ఏం ఎందుకు లేదు. ఏభై ఏళ్లుగా ఆపకుండా రాస్తున్నాను. మరీ చెత్త కాకుండా కాస్త ప్రయోజనకర సాహిత్యమే రాశాను. ఏం వచ్చినా వాళ్లందరూ ఏం ఊడబొడిచేశారు'' సమర్థించుకున్నాను.

"చూడమ్మా – అవార్డులు నిన్ను వెతుక్కుంటూ రావాలి గాని నీవు వాటి వెంట పడకూడదు. నీ ప్రతిభ గుర్తించితే అవార్డులు అవే వస్తాయి."

"అవన్నీ పాతమాటలు, ఇప్పుడు అడగందే అమ్మన్నా పెట్టదు. పైరవీలు చెయ్యాలి. 'మన' అనే వాళ్లున్న వారికే వస్తాయి. నిజంగా ప్రతిభ గుర్తించి ఇచ్చే రోజులు కావు.

"అవుననుకో – 'ఈవిడకింకా ఈ అవార్డు ఎందుకివ్వలేదు' అని జనం అనుకోవాలి గాని 'ఈవిడకెందుకీ అవార్డు ఇచ్చారు' అనిపించుకోకూడదు. ఇప్పుడు అవార్డు నీకు ఇచ్చాననుకో – అబ్బో, ఈవిడ దేముడినే మస్కాకొట్టి పైరవీచేసి అవార్డు సంపాదించుకుంది అనుకుంటే అది నీకు గౌరవమా ఆలోచించుకో."

"బాబూ, నీకో దండం, నాకీ వరాలు వద్దులే, వెళ్లు స్వామి... ఆ .. సరే.. ఎలాగో వచ్చావు. ఏదో బతికినన్నాళ్లు ఆరోగ్యంగా, మంచాన పడకుండా సునాయాస మరణం అన్నా ప్రసాదించు –" అన్నా విసుగ్గా.

దేముడు నవ్వాడు "అమ్మయ్య. ఇప్పటికి సరి అయిన దారికి వచ్చావు – చూడమ్మా ఈ వయసులో నీకు కోట్ల డబ్బు, బంగారాలు భవంతులు సుఖాన్నివ్వకపోగా ఉన్న మనశ్శాంతిని హరిస్తాయి. హాయిగా మనశ్శాంతిగా, ఆరోగ్యంగా బతకడం ముఖ్యం. నీవు కోరుకున్న సునాయాస మరణం కంటే నీకింకేం కావాలి ఈ వయసులో. నీకీ వరం ఇస్తున్నాను – తథాస్తు... 'చెయ్యెత్తి దీవించి వెనుదిరిగాడు. హఠాత్తుగా గుర్తొచ్చింది –' అయ్యో దేముడూ – ఆగు ఆగు సునాయాస మరణం ఎప్పుడో చెప్పకుండా వెళ్లిపోతున్నావేమిటి – 'గాభరాగా అడిగాను.' దేముడు తలతిప్పి నవ్వాడు.

"చూడు తల్లీ, చావు పుట్టుకల రహస్యం మీకు ముందే తెలిస్తే దేముడి ఉనికే మాయం అవుతుంది గదా, అయినా ఆ చిట్టావర్జలు యమధర్మరాజు దగ్గరుంటాయి."

"అలా కాదు స్వామి, ఆ సునాయాస మరణం నేననుకున్నప్పుడు రావాలి. అలా వరం ఇవ్వు."

"చెప్పొగా చావు పుట్టుకల నియంత్రణ మనిషి చేతికి వచ్చిననాడు మా మనుగడకే ముప్పు. అది మాత్రం అడక్కు..." అంటూ చెయ్యి ఊపి వెళ్లిపోయాడు.

"దేముడూ ... దేముడూ... అంటూ అరుస్తూ వెంటపడ్డాను... అయ్యో సునాయాస మరణం ఎప్పుడు? రేపా, నెల్లాళ్లకా, ఏడాదికా, పదేళ్లకా అయ్యో దేవుడూ ... చెప్పకుండా వెళ్లిపోతే ఎలా...?"

* * * * * *

"అమ్మా, అమ్మా..'పక్క గదిలో శలవుమీద వచ్చిన అబ్బాయి యోగా చేసుకుంటున్న నా కొడుకు వచ్చి నన్ను లేపుతూ – ' 'ఏమిటీ దేవుడూ అంటూ అరుస్తున్నావు. వాడెందుకు వస్తాడు ఇంత పొద్దుటే' అన్నాడు – మెలకువ వచ్చి లేచి కూర్చున్నాను.

"తప్పు తప్పు దేముడ్ని వాడంటావేమిటి! 'మా వాడు తెల్లపోతూ' ఏ దేవుడు సంగతి నీవంటున్నది' అన్నాడు. దేవుడు అని ఓ పాత వాచ్‌మన్ అప్పుడప్పుడు వచ్చి మా ఇంట్లో మొక్కలపని, ఇంకేమన్నా పన్లుంటే వచ్చి చేసి పెడ్తుంటాడు. వాడనుకున్నా గాబోలు –

"అసలు దేముడురా – దేవుడు నాకు వరం యిస్తానని వచ్చాడు తెలుసా!"

"హో... హో... దేముడొచ్చి వరం ఇస్తానన్నాడా... ఏం వరం ఇచ్చేడేమిటి' హాస్యంగా అడిగాడు నవ్వుతూ.

"అలా నవ్వకు.. నిజంగానే వరం ఇచ్చాడు తెలుసా!... గర్వంగా అన్నా.

"ఇంతకీ ఏ వరం అడిగావు... ఓ లక్ష కోట్లు అడగక పోయారా, పది తరాలు కూర్చుని తినే వారం గదా – "పోనీ ఓ పెద్ద ఇల్లు ... వగైరాలడిగావా – ఏది డబ్బు గిబ్బు ఏం కనపడదేం. తరువాత పంపిస్తాడా..." సంభాషణ హాస్యంలోకి దించాడు.

"అబ్బ ఆగరా, దేముడు డబ్బు అవి ఇస్తే కేవలం నాకే ఉపయోగపడ్తుంది. ఏమిచ్చినా నా వరకే అన్న షరతు పెట్టాడు. మీకెవరకి ఉపయోగపడనప్పుడు అవన్నీ నేనేం చేసుకోను లేని పోని తలనొప్పి – అందుకని..."

"అందుకని మరి ఏం వరం అడిగావు" కుతూహలంగా అడిగాడు.

"సునాయాస మరణం అడిగా – మంచాన పడి ఎవరిచేత చేయించుకోకుండా, ఎవర్ని ఇబ్బంది పెట్టకుండా, నేను బాధపడకుండా వచ్చే మరణం కోరుకున్నా..."

"అబ్బ, ఎంత గొప్ప వరం కోరావు. పోనీ ఆ సునాయాస మరణం నీ చేతిలో వుంటుందటనా."

"అదేరా, అది సరిగా చెప్పకుండా వెళ్లిపోయాడు – ' దిగులుగా అన్నా.

"అడిగి అడిగి ఓ స్టుపిడ్ వరం అడిగావు" అన్నాడు. "ఏమిటి అలా అంటున్నావు.."

"ఆలోచించు నీకే అర్థం అవుతుంది" నవ్వుకుంటూ వెళ్లిపోయాడు.

అంటే ఆ సునాయాస మరణం ఏ క్షణాన వస్తుందోనని ప్రతిరోజూ ప్రతి గంట ప్రతి నిమిషం ఎదురుచూస్తూ బతకాలా! 'నీవున్నావా ఊడావా అని మేం రోజుకి పదిసార్లు ఫోనుచేసి అడుగుతుండాలా' అని వాడి ఉద్దేశం గాబోలు. రేపు 'నా కూతురు పైకి కిందికీ ఎన్నిసార్లు దిగి చూస్తుండాలి' అని విసుక్కుంటుందేమో! 'ఈవిడ పాలప్యాకట్టు, పేపరు తీసుకుందా అని పొద్దుటే చూస్తుండాలి కాబోలు అని పక్కింటి వాళ్లనుకుంటారేమో! ఆ సునాయాస మరణం నేను కోరుకున్నప్పుడు రావాలి అని అడగనందుకు తిట్టుకున్నాను. ముందు తెలిస్తే చక్కగా నా బంధువులని, స్నేహితులని, రచయితలని అందరిని పిలిచి హోటల్లో ఓ పెద్ద పార్టీ ఇచ్చి 'టా,టా, బై..బై.. వీడికోలూ' అని అందరి దగ్గిర శలవు తీసుకుని ... మంచి ముహూర్తం చూసుకుని పిల్లలని, మనవలని అందరిని పిలిచి అందరి సమక్షంలో సునాయాస మరణం పొందితే ఎంత బాగుంటుంది. వరం ఇస్తానని వచ్చి ఆదేముడు మరింత టెన్షన్‌లో పడేశాడు. మరి కాస్త దానాలు, ధర్మాలు చేస్తే మళ్లీ ఆ దేముడు ప్రత్యక్షం అయితే వరం నాకు కావల్సినట్టు మార్చమనాలి ఎలాగైనా!

ఏమిటో ఏ క్షణాన వుంటానో, ఊడుతానో – కాస్త టీవిలో స్క్రోలింగ్స్, న్యూస్‌పేపరు చూస్తుండండి (ఓ రచయిత్రిని కదా పేరు వేయరంటారా. మీరంతా ఎందుకైనా మంచిది టా.. టా... బై... బై... చెప్పేస్తున్నాను ఇప్పుడే.

(నీతి వాక్యం : వరాలు అడిగి లేనిపోని తలనొప్పులు వద్దు. ఏం ఇవ్వాలో, ఎప్పుడు ఇవ్వాలో దేముడికే తెలుసు అనుకోండి.)

*(నవ్య, సెప్టెంబరు 5, 2012)*

# ఆపాత మధురం

**ఓ** ఆదివారం నాలుగు గంటల వేళ తోచలేదని బయటికి తీసికెళ్లమని మారాం చేస్తున్న కూతురికి ఇదిగో నీకు మంచి సినిమా కన్నా బాగుండేది చూపిస్తాను అంటూ లాప్‌టాప్ ఆన్ చేసింది కీర్తన. బోర్లా పడుకుని గడ్డానికి చేతులాన్చి చూస్తున్న శృతి కళ్లు ఆనందంగా, విభ్రమంగా చూస్తూ 'మమ్మీ మమ్మీ చూడుచూడు ఆ పిట్ట పిల్లలు నోళ్లు ఎలా తెరిచాయో. పిట్ట చూడు నోట్లో ఎలా పెడుతుందో అన్నం'. కొమ్మకి వేలాడుతున్న గిజిగాడి గూడులో బంగారుపిట్ట పిల్లలు నోళ్లు తెరచుకు నుంటే, రెక్కలు టపటపలాడిస్తూ ఎగురుతూ నోట్లో ఆహారం పెడ్తున్న ఆదృశ్యం వింతగా చూస్తు అరిచింది.

"పిట్ట పిల్ల ఏమిటే, బలే పేరు పెట్టావు' కీర్తన నవ్వింది.

"మరేం అనాలి. పిట్ట కదా, దాని పిల్ల కదా... 'పెద్ద కళ్లని తిప్పుతూ ఆ కళ్లమీద పడిన జుత్తుని తోసుకుంటూ ప్రశ్నార్థకంగా చూసింది."

'పిచ్చుక పిల్ల అంటాం. పక్షి పిల్ల అనాలా, పక్షి కూన అనాలా...' తల్లే సందేహంలో పడింది.

'అమ్మా చూడు... చూడు... ఆ నెస్ట్.. కాకి పిల్లలు ... ఎంత క్యూట్‌గా ఉన్నాయో.' మరో దృశ్యం - మరో కేక - ఆనందం ఆశ్చర్యం.

"మమ్మీ చూడు చూడు... ఏంటివి?" ఉడతలు చూపిస్తూ అడిగింది.

"స్క్విరల్స్.. ఉడతలు అంటారు." సపోటా చెట్టుమీద చెంగుచెంగున కొమ్మల మీంచి దుముకుతూ పక్కానికి వచ్చిన కాయలు ముందు కాళ్లతో పట్టుకు కొరుకుతూ,

'మమ్మీ... మనం తిన్నట్టే తింటుంది చూడు....' సంబరంగా అంది. కూతురు ఆశ్చర్యానందాలు చూస్తుంటే చిన్నప్పుడు సపోటా చెట్టు కొమ్మల మధ్య ఎలుకలబోను పెట్టి ఉడతలని పట్టుకుని కాసేపు ఆనందించి, ఆడి, విడిచిపెట్టేస్తే తుర్రుమని పారిపోవడం ... ఇప్పటి పిల్లలు ఈ దృశ్యాలు ఎలా చూస్తారు...?"

"మమ్మీ ... నాకో ఉడతనివ్వవు... అడుకుంటాను..." ఆశగా అడిగింది.

"వద్దమ్మా వాటిని పట్టుకుని బోనులో పెట్టకూడదు. పాపం వస్తుంది..." అంటూ రామదాసు చిలకలని పట్టుకుని బంధించిన కథ చెప్పింది... శృతి కళ్లల్లో కాస్త నిరాశ....

"మమ్మీ ... చూడు ఆ పారట్ జామకాయని ఎర్రముక్కుతో ఎలా కొరుకుతూందో మరో దృశ్యం! మరో ఆశ్చర్యం. చిలక కొరికిన పండ్లు తెల్లారి కింద పడితే ఏరుకుని గౌనుతో తుడుచుకు తినడం ... చిన్నతనంలో ఎన్ని ముచ్చట్లో...

"అమ్మా.. ఆవు పిల్ల చూడు అమ్మదగ్గిర ఎలా పాలు తాగుతుందో.. అమ్మా అలా పొడుస్తుందేమిటి, ఆవు అమ్మకి నొప్పెట్టదూ...?" ఆవు దూడ పొదుగు కుమ్మి కుమ్మి పాలు తాగుతున్న దృశ్యం చూసి శృతి అంది.

"అమ్మలకి నొప్పెట్టదమ్మా... నీవు నా కడుపులో వుండగా ఎలా తన్నే దానివో తెలుసా" నవ్వింది కీర్తన... 'బాగా నొప్పెట్టేదా అమ్మా... సారీ అమ్మా...' శృతి బాధపడ్తూ అంది. "ఛా... అదేం లేదు... అందరూ కడుపులో ఉండగా అలాగా తిరుగుతూ తంతారు. అది నొప్పెట్టదు. అమ్మలు అసలు బాధపడరు. సంతోషిస్తారు' అంది. శృతి దృష్టి మళ్లీ లాప్‌టాప్ మీదకి మళ్లింది. ఆవుదూడ పాలు తాగి పెరడంతా చెంగుచెంగున గెంతుతూ ఉంది. మరో దృశ్యం. పిల్లి వసారాలో పడుకుంటే నాలుగు పిల్లలు తల్లిమీద నించి గెంతుతూ, వాళ్లలో అవి పోట్లాడుకుంటూ ఆడుకుంటున్నాయి.

"మమ్మీ... పిల్లి పిల్లలు ఎంత క్యూట్‌గా ఉన్నాయో చూడు..." వాటిని పట్టుకోడానికన్నట్టు చేయి చాపింది... లాప్‌టాప్ వైపు.

పెరటినిండా విరబూసిన బంతిపూలు... రంగురంగుల్లో వాటిమీద సీతాకోక చిలకలు ... మరోచోట ... రంగు రంగుల చామంతులు...

"ఇంత మంచి గార్డెనుండేదా అమ్మా మీ ఇంట్లో..." పూలని స్క్రీన్‌మీద తాకుతూ అడిగింది. వీధి వైపంతా పూల మొక్కలు – పెరట్లో మామిడి, పనస, సపోటా,

జామ ఎన్ని చెట్లుండేవో మా అమ్మమ్మ గారింట్లో... పిల్లలం అందరూ శలవులకి వెళ్లినప్పుడు చెట్లమీదే వుండేవారం. ఎన్ని రకాల ఆటలో..." అంది కీర్తన పాతరోజులు తల్చుకుంటూ పారవశ్యంగా... శృతి తల్లివంక చూస్తూ... "మరి మన అమ్మమ్మ గారింటికి శలవులకి ఎవరూ రారు. ఎందుకు ఇప్పుడు?"

"ఎవరున్నారు. మా అక్క, అన్నయ్య ఇద్దరూ అమెరికాలో ఉంటారు. అంతదూరం నించి ప్రతి శలవులకి రాలేరుగా... వచ్చినా ఇప్పుడు అమ్మమ్మగారింట్లో పెరడుతోట ఎక్కడున్నాయి. ఇల్లు, అమ్మేసి అపార్ట్‌మెంట్స్‌కి వెళ్లిపోయారు చేసుకోలేక. ఇద్దరూ ముసలివాళ్లయిపోయారు గదా. అప్పుడు మా అమ్మమ్మకి ఆరుగురు పిల్లలు. దొడ్డమ్మలు, పిన్నులు, మామయ్యలు... అందరూ శలవలకి పిల్లలతో వచ్చేవారు. ఆ రోజుల్లోలా ఇప్పుడెలా ఉంటాయి."

శృతి కళ్లలో అసూయ... 'ఎంత బాగుండేదో కదా. అందరూ వచ్చి సరదాగా పిల్లలు ఆడుకోడం ... మీరంతా ఎంత లక్కీ... నాకే ఎవరూ లేరు ఆడుకోడానికి' కినుకుగా అంది. 'అమ్మమ్మగారిల్లు ఎందుకమ్మేశారు. మేం పిల్లలం ఆడుకోడానికి లేకుండా' నిలేసింది. అసలు... చెట్లు లేకుండా మన అపార్ట్‌మెంట్స్ ఎందుకు కట్టారు.'

"ఏం చేస్తారు తల్లీ! ... జనం ఎక్కువయితే ఉండడానికి చోటేలేక ఇల్లు కూల్చేసి ఆ చోటులో ఏభై ఇళ్లు కడ్తున్నారు. ఇంక చెట్లకి చోటేది."

"మరి ఆ ఉడతలు, చిలకలు, పిట్టలు అవి ఎక్కడున్నాయి. అవెక్కడికి పోయాయి?"

"చెట్లున్నచోటు వెతుక్కుంటూ పల్లెటూళ్లకి, లేకపోతే అడవులకి పోయి ఉంటాయి. పిచికలు లాంటివి ఇంటి చూరులో గూడు కట్టేవి... ఇప్పుడసలు అవన్నీ కనపడడమే లేదు. అంతరించిపోయాయి గాబోలు."

"అమ్మ మనం కూడా ఏదన్నా పల్లెటూరు వెళ్లిపోదామా?' ఆశగా అడిగింది.

"ఎలా వెడతాం. నీకు మంచి స్కూలు – నాకు ఆఫీసు అన్నీ చిన్న ఊర్లలో వుండవు. ఈసారి ఏదన్నా శలవులకి ఎక్కడికన్నా తీసికెడతాలే.' ఊరడింపుగా అంది. 'ప్రామిస్' అంది. కూతురుచేయి ప్రేమగా నొక్కి 'ప్రామిస్' అంది కీర్తన.

నిజంగా ఎంత మంచిదయింది. పాపనెత్తుకుని అమ్మమ్మగారింటికి వెళ్లినప్పుడు వీడియో కెమెరాతో షూట్‌చేసింది. పాప పెద్దయితే తన తాతగారిల్లు పల్లెటూర్లు ఎలా ఉంటాయో చూపాలని, ఇప్పుడింక ఈతరం పిల్లలు ఆవు దూడలని,

ఉడతలని, పక్షులని, పొలాలని, చెట్లు చేనులను అన్నీ సీడీల్లో చూసి ఆనందించాల్సిందే మరి.

"ఏమిటే రోజంతా పిచ్చెక్కినట్లు చెట్లు, పుట్టలు, పక్షులు, పిల్లులు, ఆవులు, గేదెలు ఫోటోలు తీస్తున్నావు. మాటమంతి లేదు కెమెరా పట్టుకు తిరుగుతున్నావు" అమ్మమ్మ కేకలేసింది. "ఉండు అమ్మమ్మా, పాప పడుకుంది. ఇవన్నీ ఎందుకు తీస్తున్నానో తెలుసా, పాప పెద్దయ్యాక అమ్మమ్మగారి ఊరు ఈ ఇల్లు, తోటలు అవి చూపించద్దా."

"అంటే, ఫోటోలే చూపిస్తావా, మళ్లీ రానే రావేమిటి, లేకపోతే మళ్లీ నీవు వచ్చేసరికి మేం ఉండమనా..." అమ్మమ్మ అలక.

"ఏమో మళ్లీ ఎప్పుడవుతుందో, ఇండియా వచ్చినా, ఈ ఊరు వచ్చే వీలుంటుందో లేదో..."

"ఏమో తల్లీ ఈ అమెరికాలు ఉద్యోగాలు, మొహాలు చూసుకోడమే అపురూపం అయిపోతుంది. ఏదో కూతురును చూపించాలనేనా ఈ ముసలి వాళ్ల దగ్గరికి వచ్చావు. అంతేచాలు." అప్పుడే నిద్రలేచిన మునిమనువరాలిని ఆప్యాయంగా లేపి ఎత్తుకుంది. "పాప చూశావా, ఎంత సేపు నిద్రపోయిందో... పిల్లలకి నీళ్లు, పాలేనే బలం. చక్కగా నూనెమర్దనా చేసి, నలుగుపెట్టి, వేడివేడి నీళ్లుపోస్తే వాళ్లకి వళ్లునొప్పులు అని లేకుండా, తేలికగా ఉండి వళ్లరగకుండా పడుకునేవారు. ఇదివరకు పిల్లలు – మీరేదో బేసిన్‌లో నీళ్లలో గిన్నె కడిగినట్టు సబ్బు పామి తొలిచేస్తున్నారు."

నిజమే ఆ మాట! అమ్మమ్మ స్టూలు వేసుకుకూర్చుని, వెంకటమ్మ కాళ్లమీద పాపని పడుకోబెట్టి నూనెతో పామి పామి మాలిష్‌చేసి, నలుగు పిండితో నలుగుపెట్టి, వేడివేడి నీళ్లు పొట్టమీద ఒక బాల్చీడు, వీపుమీద ఒక బాల్చీడు రుద్దిరుద్ది పోయించింది. అలవాటులేక పాప గోలు గోలున ఏడుస్తుంటే "అమ్మమ్మ ప్లీజ్ పాప ఏడుస్తుంది. అలా గట్టిగా రుద్దద్దు. బాబోయ్ అంత వేడి నీళ్లు వద్దు" అని గోలపెడ్తుంటే" – "ఉండవే తల్లీ. నీ కూతురికేం కాదు. ఆ పూచి నాది" అంటూ స్నానం చేయించి, సాంబ్రాణి పొగవేసి, పౌడరద్ది, పల్చటి గౌనువేస్తే చేతుల్లోనే సొమ్మసిల్లినట్టు నిద్రపోయింది. ఆ పడుకోవడం, పడుకోవడం మూడు గంటలు పడుకుంది. లేచాక నవ్వుతూ చేతిలో వ్రాలిపోయింది. ఎంత ఫ్రెష్‌గా ఉందో, ఎంత కమ్మని వాసనేస్తుందీ – ఆకలిమీద సీసాడు పాలు గటగట తాగేసింది. సీసాడు పాలు మూడుసార్లు

బలవంతంగా తాగేది రోజు. పాపని ఎత్తుకున్న అమ్మమ్మ తాతగారిని ఫోటోలు తీసింది.

"నిజమే అమ్మమ్మ పాప ఆవురావురుమని పాలన్నీ తాగేసింది. ఎప్పుడూ లేదిలా." కమ్మని వాసనొస్తున్న కూతురిని ముద్దు పెట్టుకుంటూ అంది.

"ఒక్క వారం రోజులుండు. నీ కూతురిని బంతిలా చేసి పంపిస్తాను." రెండు రోజులనుకున్నది ఐదురోజులుండిపోయింది. వచ్చిన చుట్టాలందరి ఫోటోలు తీసింది. ఈరోజు పాపకి అవన్నీ చూపిస్తుంటే పాతస్మృతులు పైకి వచ్చాయి. అమ్మమ్మ అన్నట్లే మళ్లీ ఇంకా ఆ ఊరే వెళ్లలేదు. తరువాత ఏణ్ణర్దానికే తాతగారు కూర్చున్న వారు కూర్చున్నట్లే పోయారు. మరో ఏడాదికి అమ్మమ్మ. మామయ్యలు అమెరికా నించి వచ్చి పొలం, ఇల్లు అమ్మి అంతా డబ్బులు పంచుకు వెళ్లిపోయారు. ఫోటోలే మిగిలాయి.

✶ ✶ ✶ ✶ ✶ ✶

తరువాత శృతి తీరికున్నప్పుడల్లా లాప్‌టాప్ పెట్టుకుని ఆ సిడి చూస్తూ మురిసి పోయేది. చూసినప్పుడల్లా ఒకో ప్రశ్న – ఒకో సందేహం.

"మమ్మీ. మీ చిన్నప్పుడులా ఇప్పుడెందుకు మీరంతా కలవడం లేదు. శలవులకి రావచ్చు గదా. అందరం అమ్మమ్మగారింటికి వెళ్ళచ్చుగదా!"

"ఎలా కుదురుతుంది. మా అక్క, అన్న అమెరికానించి రావాలంటే బోలెడు ఖర్చు. వాళ్ల పిల్లలకి శలవులు, వీళ్ల ఉద్యోగాలకి శలవులు దొరకాలి గదా. అంత దూరం నుంచి రావాలంటే ఎంత ఖర్చు."

"అమెరికాలో ఎందుకు ఉండడం. మనలా ఇండియా వచ్చేయచ్చు గదా."

"మంచి ఉద్యోగాలు, మంచి జీతాలు. ఇండియాలో అంత డబ్బులివ్వరని రారు ఎవరూ..."

"మరి మనం ఎందుకు వచ్చేశాం?"

"మన సంగతి వేరు. నేనొక్కర్తిని నిన్ను చూసుకోలేక వచ్చేసాను. అక్కడ పనివాళ్లు దొరకరు గదా. ఇక్కడ మంచి ఉద్యోగం దొరికింది. అందుకు వచ్చేశాను."

"మరి డాడి వుండేవారుగదా, డాడిని నీవు వదిలి వచ్చేశావు – మరి డాడి మనతో ఎందుకు రాలేదు?"... ఇదివరకు రెండు మూడు సార్లు అడిగిన ప్రశ్న మళ్లీ అడిగింది.

"ఆయనక్కడ ఉద్యోగం వదలడానికి ఇష్టంలేక రాలేదు" ముభావంగా అని, లాప్‌టాప్ ఇంకో దృశ్యం వైపు చూపిస్తూ "చూశారా ఇది మీ మామయ్య పెళ్లి ఫోటో. హోస్టన్‌లో ఉంటాడు గదా మురళి అన్నయ్య... రెండేళ్ల క్రితం ఇండియా వచ్చాడు గదా. వాడి పెళ్లి. వనజ ఆంటీ చూశావా. పెళ్లి కూతురు గదా ఎన్ని నగలు పెట్టుకుందో. ఇదిగో ఇది వడ్డాణం. వంకీలు.. యివన్నీ నాకు మా అమ్మ చేయించింది. నీకిచ్చేస్తాను నీ పెళ్లికి..." మాట మార్చి చెపుతూంటే ఏడేళ్ల శృతి మొహంలో సంతోషం – సిగ్గు.

ఇండియా వచ్చిన ఈ రెండేళ్లలో శృతి చాలా తెల్సుకుంది. శృతి పెద్దదవుతుంది. స్కూల్ పిల్లలు, టీవీ సీరియల్స్... ఇంట్లో వంటామె నర్సమ్మ, పనిమనిషి సీతాలుతో మాట్లాడి తెలుగు బాగా నేర్చింది. "మా ఫ్రెండ్సందరికి డాడిలు, మమ్మీలు కల్సి ఉన్నారు. నాకే డాడీ లేరు... డాడిని వచ్చేయమను మమ్మీ" ఓరోజు స్కూలునించి వచ్చి అలిగి కూర్చుంది. 'ఆయన రారమ్మా – ఎన్నోసార్లు చెప్పా నీకు' కీర్తన విసుగ్గా అంది. "అయితే మనమే వెడదాం."

'అదీ కుదరదు... శృతీ నీవు చిన్నపిల్లవు. నీకిప్పుడు నేను చెప్పినా అర్థం కాదు.'

"నాకన్నీ తెలుసు. నీవు అబద్ధాలు చెప్తున్నావు. డాడీ నీవు డైవోర్సు తీసుకున్నారు గదూ."

మా ఫ్రెండ్స్ అన్నారు. మీ మమ్మీ నీవు వంటరిగా ఉన్నారంటే మమ్మీ డాడీ విడిపోయారన్నమాట. లేకపోతే ఈ రెండేళ్లలో మీ డాడి ఒక్కసారన్నా వచ్చారా – నీతో మాట్లాడారా అనడిగారు. ... నీవు నాదగ్గర ఎందుకు దాస్తావు ఇదంతా" నిలదీసింది.

ఈకాలం పిల్లలకి చాలా తెలివితేటలున్నాయి. మంచి ఎక్స్‌పోజర్ వుంది. అన్ని విషయాలు చూసి నేర్చుకుంటున్నారు. ఇలాంటి పిల్లలకి నిజం చెప్పడం నయం అనుకుంది కీర్తన. "సరే – నీవిప్పుడు కాస్త పెద్దయ్యావు. నీకన్నీ తెల్సు అన్నావు గదా. అవును డాడీ నేను డైవోర్సు తీసుకున్నాం. ఆయన ఇంక మన దగ్గరికి రారు."

"ఎందుకు? డైవోర్స్ ఎందుకు తీసుకున్నారు?"

"మా ఇద్దరికి పడలేదు. రోజూ కొట్టుకుంటూ తిట్టుకుంటూ మనశ్శాంతి లేకుండా ఎందుకు కల్సి బతకడం?"

"అంటే డాడి నిన్ను తిట్టారా? కొట్టారా?" ... మరో ప్రశ్న.

"కొట్టడం, తిట్టడం కాదు. మనసులు కలవకపోతే ఒకరినొకరు సాధించుకుంటూ ఎడమొహంగా బతకడం కుదరదు" కాస్త కఠినంగా అంది.

"సాధించడం అంటే .. నీవు.. నన్ను పాలు తాగు అని కేకలేస్తావు. ఈ షూస్ అక్కడ ఎందుకు పడేశావు అని తిడ్తావు. టి.వి. అస్తమాను చూడద్దని కేకలు పెడ్తావు. షాంపు చేసుకో, పళ్లు బాగా బ్రష్ చేసుకో అంటూ ప్రతి దానికి వెంటపడి సాధిస్తూనే ఉంటావు గదా. మరినన్ను వదిలేసి వెళ్లిపోతావా ఓ రోజు..." సూటిగా కళ్లలోకి చూసి అంది. కీర్తన తెల్లపోయి చూసింది. "అయితే నేనూ ఇంట్లోంచి వెళ్లిపోవాలా.. నీ చిన్నప్పుడు అమ్మమ్మ తాతగారు కోపం వచ్చి కేకలువేస్తే ఇల్లు వదిలి వెళ్లి పోయావా..." నిలేసినట్టు అడిగింది. ఆ ధోరణికి విస్తుపోయింది కీర్తన. ఏడేళ్ల పిల్ల ఎలా అడుగుతుంది. కోపంతో మొహం ఎర్రబడింది. 'శృతీ... ఏమిటా పెద్దమాటలు. పిల్లలు పిల్లల్లా ఉండాలి. నేను చెప్పినా నీకర్థం కాదు.'

"చెప్పు... అర్థం అయ్యేట్టు చెపితే వింటాను" శృతి రెట్టించింది.

"చూడు తల్లి పిల్లలు, తండ్రి... ఈ సంబంధాలు వేరు. భార్యాభర్తల సంబంధం వేరు."

"ఎందుకు వేరు. నేను ఏంచేసినా ఊరుకుంటావు. మీ అమ్మా నాన్న కేకలేసినా సహిస్తావు. మరి డాడి దగ్గర అలా ఉండవచ్చు గదా. డైవర్స్ ఎందుకు తీసుకోడం". కీర్తన నిస్సహాయంగా చూసింది. ఎలా చెప్పి కూతుర్ని నమ్మించాలో అర్థం కాలేదు.

"డాడీకి సారీ చెప్పి పిలు. వస్తారు" పంతంగా అంది.

"శృతీ నీకు చెపితే అర్థం చేసుకోవు. ఆయన మళ్లీ పెళ్లి చేసుకున్నారు. ఇంక ఆయనకి నాకు ఏ సంబంధం లేదు" నిష్కర్షగా అంది.

శృతి హతాశురాలైనట్టు చూసింది. తల్లి వంక కోపంగా చూసి విసురుగా లోపలికి వెళ్లిపోయింది.

మరో రోజు రాఖిపౌర్ణమి – టీ.వి.లో అన్నలకి అక్క చెల్లెళ్లు రాఖి కట్టడం చూసింది. 'పోనీ సరే డాడి రారు. నేనొక్కర్తినే ఉన్నాను. నాకు ఓ తమ్ముడు కావాలి. తెచ్చి ఇవ్వు. ఆడుకుంటాను. రాఖి కడ్తాను. నా బొమ్మలన్నీ ఇస్తాను. మేం ఇద్దరం కలిసి గేములాడుకుంటాం. నాకు ఎవరూ లేరు. బోరు కొడ్తుంది. చిన్నప్పుడు నీకు

నీ బ్రదర్స్ ఉన్నారు. మీరంతా సరదాగా ఆడుకునే వారు. నాకొద్దామరి...' సూటిగా అడిగింది.

"తమ్ముడు ఎలా వస్తాడే. యిదేం బొమ్మా కొనివ్వడానికి..." నవ్వింది కీర్తన.

"ఏం నీ పొట్టలోంచే గదా వస్తారు పాపాయిలు. టీవిలో చూశాగా. ఓ  పాప వాళ్ళమ్మ పొట్ట చేత్తో పట్టుకుచూసింది. తరువాత పాపాయిని అమ్మ వళ్లో పడుకోబెట్టింది. తరువాత పాపాయిని అమ్మ వళ్లో పడుకోబెట్టింది వాళ్ళమ్మ." కీర్తన నిస్సహాయంగా చూసింది.

'పాపాయిలు వుత్తినే అలా పొట్టలోంచి వచ్చేయరు. డాడీలు లేకుండా పాపాయిలు రారు' శృతి ఆశ్చర్యంగా అర్థం కానట్టు చూసింది. 'సరే, అయితే ఇంకో డాడిని తీసుకురా...' అంది.

'బాగుంది. చాలా బాగుందీ నీ వరస. తల్లీ ఇంకో డాడి నాకు మొగుడవ్వచ్చు గాని నీకు డాడి కాలేరే. ఎలా చెప్పాలే నీకు.' కీర్తన మనసులో విసుక్కుంది.

"శృతీ అదంతా జరిగే పని కాదు. ఊరికే పిచ్చిమాటలు మాట్లాడకు."

"అప్పుడే.. డాడీ ఉన్నప్పుడే ఇంకో పాపాయిని తేవల్సింది. ఈ పాటికి చక్కగా నాతో అడుకునేదిగా... అప్పుడెందుకు ఊరుకున్నావు.. అందరికీ ఇద్దరు ముగ్గురు పిల్లలు."

"సరే, ఈ ఉద్యోగాలతో ఒంటరిగా ఒక పాపను పెంచేసరికి తాతలు దిగి వచ్చారు. ఇంకో పిల్ల కూడానా... ఇదివరకు ఆడవాళ్లకి ఉద్యోగాలవి ఉండేవి కావు. పిల్లల్నికని సావకాశంగా పెంచేవారు. ఇప్పుడాడవాళ్లకి ఉద్యోగాలు చేస్తూ పిల్లలని పెంచడం కష్టం అవుతుంది..." కీర్తన సంజాయిషీ ఇచ్చింది.

"ఉద్యోగం మానేయాల్సింది" తప్పు నీదే అన్నట్టు అంది.

అవును ఉద్యోగం మానేసి తిక్కమొగుడితో కాపురం చేసి ఇంకో పిల్లను కనుంటే తన పాట్లు, తన గతి ఏమయ్యేది. స్వాభిమానం చంపుకుని ఆరేళ్లు గడిపింది. మారతాడన్న భ్రమతో, ఓ రెండేళ్లు పిల్లలు కనే సౌలభ్యమే కుదరలేదు. జీవితంలో స్థిరపడడానికే టైము పట్టింది. కావాలనుకున్నా ఓ ఏడాది పట్టింది గర్భం రావడానికి. పురుడు, చంటిపిల్ల, చాకిరి, భర్త సహకారంలేక ఎంత నరకం చవిచూసింది. ఉద్యోగంలో చేరాల్సిన సమయం. పిల్లని క్రెస్ట్‌లో ఉంచడం, తీసుకురావడం, పని... పని... ఎంత చేసినా తృప్తిలేని భర్త... ఆ సాధింపు ... ఆ కోపాలు... ప్రాణం

విసిగెత్తి ఓర్పు ఆఖరి మెట్టుకు చేరాక నాలుగేళ్ల పాపతో ఇండియా వచ్చేసింది. భర్తకు విడాకులు ఇచ్చి కొత్త జీవితాన్ని ఓ కొలిక్కి తీసుకు వచ్చేవరకు అమ్మా, నాన్న సహాయం ఉండబట్టి నిలదొక్కుకుంది. మళ్లీ కొత్త ఉద్యోగం, కొత్తచోటు, పల్లెటూరి నించి తెచ్చుకున్న పనమ్మాయి సీతాలు సాయంతో పాపని పెంచుకుంటూ వంటరి అయినా కనీసం ప్రశాంతంగా బతకగల్గింది గత రెండేళ్ల నించి. ఇప్పుడు పాపకి కాస్త జ్ఞానం వచ్చి చుట్టూ ఉన్న పిల్లలని చూసి తెలుసుకుని వేసే ప్రశ్నలకి జవాబివ్వడం ఎంత కష్టం అయింది. పాప పెద్దయ్యాక ఎలాగో తండ్రి ప్రస్తావన వచ్చి అడుగు తుందని తెలుసుగానీ, ఇంత చిన్నప్పుడే ఇలా నిలేస్తుందని ఎదురుచూడలేదు. నీకెలా చెప్పాలే ఎలా చెపితే అర్థం అవుతుంది... కీర్తన విలవిల్లాడింది.

శృతి ఈ మధ్యన చాలా మూడీగా తయారయింది. మాటలు తగ్గించేసింది. బొమ్మలతో ఆడుకోడం మానేసింది. స్కూలు, హోంవర్కు చేసుకుని టి.వి. ముందు కూర్చుంటుంది. పలకరిస్తే పది మాటలకి ఓ మాట జవాబు చెప్తుంది. టీవి చూడకపోతే లాప్‌టాప్‌లో చూసిన దృశ్యాలే చూస్తూంటుంది తల్లి మీద అలిగినట్టు. ఇదివరకులా స్కూలు సంగతులు, టీవీలో చూసిన దృశ్యాలు ఏ విషయం మాట్లాడడం లేదు. “శృతీ ఏమిటలా వున్నావు?” ఎన్నిసార్లడిగినా జవాబివ్వకుండా పెద్ద కళ్లని మరింత పెద్దవిచేసి తల్లిని మింగేసేట్టు చూస్తుంది. మరీ గట్టిగా ఓ రోజు అడిగితే “ఎలా వుండాలి మరి. నాకెవరున్నారు ఆడుకోడానికి. మాట్లాడటానికి. నీవు ఆఫీసు నుంచి రాత్రి అయ్యాక వస్తావు. అప్పుడు నాకు నిద్ర వస్తూంటుంది. ఇంట్లో సీతాలు, వంట అవ్వతో ఏం మాట్లాడాలి. ఏ గేమ్స్ ఆడుకోవాలన్నా ఎవరూ లేరు” అరిచింది.

నిజమే ఆ అపార్ట్‌మెంట్స్‌లో శృతి యీడు పిల్లలు ఎవరూ లేరు. కాలేజీ పిల్లలు, లేకపోతే మరీ చిన్నపిల్లలు, ఉద్యోగం చేసే అమ్మాయిలు, మూడొంతులు రిటైరైన ముసలివారు.

“పక్కింటి స్వీటీ అక్కదగ్గరికి కాసేపు వెళ్లొచ్చుగదా” స్వీటి ఇంజనీరింగ్ చదువుతున్నా అప్పుడప్పుడు స్వీటీతో మాట్లాడుతూంటుంది.

“తనెప్పుడూ కంప్యూటర్ ముందు కూర్చుంటుంది. లేకపోతే సెల్‌ఫోన్ పట్టుకుంటుంది. వెళ్లి ఏం చేయాలి.”

“బాగుంది వరస. నన్నేం చెయ్యమంటావు. ఇప్పుడందరూ ఎవరి లైఫ్‌లో వాళ్లు బిజీ

మనకి మనమే కాలక్షేపం వెతుక్కోవాలి. కీర్తనకి శృతి వంటరితనం అర్థం అవుతున్నా ఏం చెయ్యగలదు?" ఆ సి.డి. చూపించి తప్పుచేశానా అనిపించింది.

*　*　*　*　*　*

"శృతీ, నీకు ఆడుకోవడానికి తమ్ముడు కావాలా, చెల్లెలు కావాలా?" ఓరోజు ఆఫీసునుంచి వచ్చి, తనతో మాట్లాడకుండా అలక సాగిస్తున్న శృతిని పక్కన కూర్చోపెట్టుకుని అడిగింది.

శృతి కళ్లల్లో మెరుపు. తల్లి కడుపు వైపు చూసి 'నిజంగా పాపాయి వస్తుందా' ఆశగా తల్లి పొట్టమీద చెయ్యి వేసింది. కీర్తన నవ్వి 'చెప్పు మరి తమ్ముడా, చెల్లెలా?'

శృతి ఓ క్షణం ఆలోచించి 'చెల్లివద్దు – తమ్ముడయితే రాఖీ కట్టవచ్చు. ఆడపిల్లని నేను ఉన్నానుగా. తమ్ముడే కావాలి. ఎప్పుడొస్తాడు తమ్ముడు' ఆరాటంగా అడిగింది.

"వస్తాడు. అడిగిన వెంటనే రారు పాపాయిలు, టైము పడ్తుంది."

"నిజంగా అంటున్నావా. ప్రామిస్" అంది. కూతురి చేతిలో చెయ్యివేసి "ప్రామిస్, మరింక నీవు సంతోషంగా వుండాలి మరి. తమ్ముడొచ్చాక నీవు బాగా చూసుకోవాలి. ఆడించాలి. నేను ఇంట్లో లేనప్పుడు సీతాలు సాయంతో నీవే చూసుకోవాలి."

"ఓ. ఎస్. అన్నీ నేనే చేస్తా. పాలు పడ్తా. బొమ్మలన్నీ యిచ్చేసి ఆడిస్తా. రాఖీ కడ్తాను" సంబరంగా అంది. కూతురి ముఖంలో ఆనందం చూశాక తన నిర్ణయం సరి అయిందే ననిపించింది కీర్తనకి.

*　*　*　*　*　*

ఆర్నెల్ల తరువాత ... ఓ ఆదివారం ఉదయం కారులో వెళ్లి ఓ మూడేళ్ల బాబుని వెంట పెట్టుకువచ్చింది కీర్తన. శృతి సంభ్రమంగా చూసి ... "చిన్న పాపాయి కదా. ఇంత పెద్ద బాబా! నీవు ఒళ్లో పడుకోపెట్టుకుని వస్తావనుకున్నాను" అంది ఆశ్చర్యంగా.

"నీతో వెంటనే ఆడుకుంటాడని పెద్దబాబుని తెచ్చాను. నిన్ను ఇప్పుడే అక్క అంటాడు. నీతో ఇప్పుడే ఆడుకుంటాడు చక్కగా... రా.. ఇలారా..." అంటూ శృతిని పక్కన కూర్చోపెట్టుకుని బాబు చెయ్యి చేతిలో పెట్టింది. బితుకుబితుకుమని, కొత్తచోటుని వింతగా చూస్తూ పెద్దకళ్లని అమాయకంగా యిటు అటు తిప్పుతున్న బాబుని చూసి "అమ్మా ముద్దుగా ఉన్నాడు కాదమ్మా – బాగున్నాడు కాని సన్నగా ఉన్నాడు. అమ్మో ఎంత పెద్ద జుత్తో..." అంది సంబరంగా.

“మనింటికి వచ్చాడుగా. మనం బాగా చూసుకుంటే చక్కగా బొద్దుగా ముద్దుగా తయారవుతాడు సరే మరి మంచి పేరు పెట్టు మరి...”

“చిన్ని కృష్ణుడిలా ఉన్నాడు. వంశీ... అందామా” అంది శృతి. “ఆ.. మంచిపేరు. అలాగే పిలుద్దాం.” రా మరి ఒళ్లో కూర్చోపెట్టుకుని బాబుతో మాట్లాడు..” శృతి అపురూపంగా బాబుని ఒళ్లో పెట్టుకుని ‘వంశీ, నీ పేరు బాగుందా. నన్ను అక్కా.. అను’ అంటూ బాబుతో మాటల్లో పడిపోయింది. ఆకళ్లలో మెరుపు, ఆనందం చూసి కీర్తన నిశ్చింతగా నిట్టూర్చింది.

“శృతీ, సారీ రా, నీకు ఆ చెట్లు చామలు, పూలు పళ్లతోటలు, ఆవు దూడలు, ఉడతలు, చిలకల పక్షి గూళ్లు, చిలక కొరికిన జామ పండ్ల రుచి ... కజిన్స్‌తో ఆడుకునేందుకు ఎవరిని తెచ్చి ఇవ్వలేను. మేం గడిపిన మా బాల్యాన్ని మీకివ్వలేని మమ్మల్ని క్షమించమ్మా” అనుకుంది. నీకీయగల్గింది ఇంతే తల్లీ.!

***(నవ్య, ఏప్రిల్ 28, 2010)***

# మనసే శిక్ష

"అన్నయ్యా! అమ్మ.... అమ్మ దాటిపోయిందన్నయ్యా" రాధిక గొంతులో దుఃఖం. అట్నించి ఒక్కక్షణం మౌనం...! "ఎప్పుడూ?" అన్నాడు వేణు. హఠాత్తుగా విన్న వార్తతో గుండె బరువెక్కింది.

"తెలీదన్నయ్యా. రాత్రి నిద్దర్లో ఎప్పుడు ప్రాణం పోయిందో, తెల్లారి లేచి చూస్తే తెల్సింది. అసలు నిన్నటి నించి అన్నం ముట్టలేదు. రాత్రి పాలైనా తాగలేదు."

"పోనీలే! సునాయాస మరణం... ఎనభై రెండేళ్లు సుఖంగా, హాయిగా బతికింది. మంచాన పడకుండా దాటిపోయింది. అమ్మ అదృష్టవంతురాలు" అన్నాడు వేణు.

"అన్నయ్యా! నువ్వు వెంటనే బయలుదేరి రా అన్నయ్యా..."

"చూడు రాధికా! నేను వెంటనే బయలుదేరి వచ్చినా ఎల్లుండికిగానీ రాలేను. పెద్దావిడని ఆ ఫ్రీజరు బాక్సులో పెట్టడం ఎందుకు? మాధవ్ అక్కడే ఉన్నాడుగా... కానిచ్చేయండి. నాన్న పోయినపుడు ఆ బాక్సులో పెట్టడం ఆవిడకు నచ్చలేదు. నీకు తెలుసుగా!"

"అమ్మ కూడా పదే పదే చెప్పిందన్నయ్యా.. నన్ను మాత్రం ఆ మంచు పెట్టెలో పెట్టొద్దు. మీ నాన్నగారపుడు చూశాను. కట్టెపేడులా అయిపోయారు. వేణు రెండు నెలల క్రితమే వచ్చి వెళ్లాడు. వాడు వెంటనే రాలేడు. మాధవ్ చేత తలకొరివి పెట్టించు అని.

నేనూ, మాధవ్ దెబ్బలాడాం. ఏంటమ్మా ఆ మాటలు! అని. 'మీకు తెలీదు, నాకు రోజులు దగ్గిరపడ్డాయి. నా సంగతి నాకు తెలుస్తోంది' అంటూ ఏదేదో

మాట్లాడింది. నెలరోజుల నించి అమ్మలో మార్పు వచ్చిందన్నయ్యా. అన్నహితవు పోయిందంటూ పెట్టిన అన్నం సగం వదిలేసేదట! కాంతమ్మగారు అన్నారు. మనిషి చాలా డీలాపడింది.”

“మరి అమ్మ ఆరోగ్యం బాగా లేదని నాకెవరూ చెప్పనేలేదే?”

“నాకేం రోగం! నిక్షేపంలా వున్నా, వాడు మొన్నే వచ్చి వెళ్లాడు. అనవసరంగా వాడినెందుకు గాభరా పెట్టడం అంది అమ్మ.”

“మరి నువ్వు, మాధవ్ ఎలా వచ్చారు? మీకు ఎవరు చెప్పారు?”

“గోపాలం మామయ్య వారం క్రితం ఫోను చేశాడు. ఏమిటో మీ అమ్మ సంగతి బాగా లేదే. మనిషి డీలాపడిపోయింది. తిండి తగ్గిపోయింది. డాక్టరు దగ్గరికి వెడదాం అంటే రాదు అంటూ ఫోను చేస్తే వచ్చాం” అంది రాధిక.

“మరి డాక్టరుకి చూపించలేదా అమ్మని?”

“బలవంతంగా తీసికెళ్లాం. రక్తపోటు సాధారణంగానే ఉంది. మధుమేహం లేదన్నారు. కానీ ఇంత తొందరగా దాటిపోతుందని మేం ఎవరం అనుకోలేదు. సరే మాధవ్ చేత కార్యక్రమం జరిపిస్తాం. నువ్వు వీలయినంత తొందరగా రా అన్నయ్యా.”

“ఇప్పుడే టిక్కెట్టుకి ప్రయత్నిస్తాను. చూడు.. చిన్నమామయ్య.. పిన్ని, అత్తయా అందరికీ, ఆవిడ బంధువులందరికీ కబురు పెట్టండి. మాధవ్‌కి చెప్పి బ్యాంక్ నుంచి డబ్బు తీయించు.. నేను వచ్చాక మిగతా ఏర్పాట్లు చేద్దాం.”

“అన్నయ్యా... వదిన, పిల్లలు రారా...”

“కష్టమమ్మా రావడం. పిల్లలకి కాలేజీ, స్కూలు. వదిన మొన్నేగా వచ్చింది. చూస్తా...! వస్తే మేం యిద్దరం వస్తాం... జాగ్రత్త! గోపాలం మామయ్యతో మాట్లాడి అన్ని ఏర్పాట్లు చూడమను” అంటూ ఫోను పెట్టేశాడు వేణు.

* * * * * *

పెద్దవాళ్ల చావు పెళ్లితో సమానం అంటారు. ఆ పల్లెటూరి మండువా లోగిలి పన్నెండు రోజులూ బంధువులతో నిండింది. ఎనభై రెండేళ్ల యశోదమ్మ పోయిందంటే ఊరికి పెద్దదిక్కు పోయినట్లనిపించింది అందరికీ. ఆవిడ తమ్ముళ్లిద్దరు, చెల్లెలు, ఆడపడుచు, మరిది... వాళ్ల పిల్లలు, పెద్దత్త, దొడ్డమ్మా అనుకుంటూ వరసలుకలిపి పిలిచే పిల్లలు, మనవలు... తిలోదకాలు, దానాలు, ధర్మాలు, సంతర్పణకి ఊరంతా

తరలివచ్చింది. పన్నెండు రోజుల కర్మ శాస్త్రోక్తంగా జరిపించారు కొడుకులిద్దరూ. బంధుజనం, వంటలు, వడ్డనలు, పెళ్లిల్లులాగే సందడిగా జరిగి పోయింది.

"అక్కయ్యకి ముప్ఫై ఏళ్లు వచ్చేవరకు పిల్లలు పుట్టలేదు. చేయని పూజలు, తిరగని పుణ్యక్షేత్రాలు లేవు. ద్వారక, మధుర అవీ తిరిగి వచ్చాక వేణు కడుపున పడ్డాడు. వెంటనే ఐదేళ్లలో ముగ్గురూ పుట్టారు. ఆ కృష్ణుడి దయవల్ల పిల్లలు పుట్టారని అందరికీ కృష్ణుడి పేరే పెట్టుకుంది అక్కయ్య. ఈరోజు పిల్లలు ముగ్గురూ అక్కయ్యని ఇంత గొప్పగా సాగనంపారు" రాజ్యం పిన్ని అంది సంతృప్తిగా.

"అక్కయ్య ఊర్లో ఉందంటే ఎంత అండగా ఉండేది నాకు. అక్కయ్యా! అంటూ సలహాకి, సాయానికి వచ్చేవాడిని. ఒక్క రోజు రాకపోతే 'ఏరా గోపాలం రాలేదేం' అంటూ ఫోను చేసేది. అక్కయ్య పోవడం నాచేయి విరిగినట్లయింది. ఒరే వేణూ! నెల రోజుల నుంచీ ఆవిడలో ఏదో తేడా వచ్చిందిరా. మనిషి ఒక్కసారిగా నీరసపడింది. మాటతగ్గింది. ఉత్సాహం తగ్గింది. దిగులుగా ఉండేది."

"అవును బాబూ! నెలరోజుల నుంచి అమ్మగారి తిండి తగ్గిపోయింది. ఏంటమ్మా అంటే అన్న హితవు పోయింది కాంతమ్మగారూ! రోజులు దగ్గిరపడ్తున్నాయి కాబోలు అన్నారు" అంది వంటావిడ కాంతమ్మగారు.

"అమ్మ తెల్లారి లేచింది మొదలు మొక్కల మధ్యే తిరిగేవారు. ఈపూలు ఆ పూలు కోస్తూ, పందిరి ఎక్కించిన దొండకాయలు, నాలుగు వంకాయలు, ఇలా.. ఏవో కూరలుకోస్తూ ఎండు ఆకులు ఏరిపారేస్తూ తిరిగేవారు. అలాంటివారు ఏమిటో ఓపికలేనట్టు వరండాలో కుర్చీలో కూర్చునేవారు. సాయంత్రం పూలు కోసి మాలలు కట్టే మనిషి. నువ్వే కట్టవే సీతాలు అనడం మొదలుపెట్టారు. ఏమయిందో అమ్మకి" సీతాలు దిగులుగా అంది.

"అక్కయ్యా! డాక్టరు దగ్గరకి వెడదాం పద అని బలవంతపెట్టాను ఒకరోజు. 'నాకేం రోగం రా. నిక్షేపంలా ఉన్నాను. నన్ను అస్పత్రుల చుట్టూ తిప్పకు' అని మొండికేసింది. ముందే ఓసారి డాక్టరుకి చూపిస్తే బాగుండేదేమో!" గోపాలం కళ్లు తుడుచుకున్నాడు.

"మేం తీసికెళ్లాంగా, డాక్టరు ఏం లేదన్నారుగా మామయ్యా!" అంది రాధిక.

"ఇంత జరుగుతున్నా నాకెవరూ ఏం చెప్పలేదు. చెపితే కాస్త ముందే వచ్చే వాడినిగదా!" నొచ్చుకున్నాడు వేణు.

"వాడు మొన్నే వచ్చి వెళ్లాడు. వాడ్ని అనవసరంగా గాభరా పెట్టొద్దు అంది

అక్కయ్య. అందుకే పోనీ ఓసారి రాధిక అన్నా, వచ్చి చూసి వెడుతుందని దానికి చెప్పాను" గోపాలం అన్నాడు.

"నేవచ్చి అమ్మ విషయం మాధవతో అంటే వాడూ వచ్చాడు" అంది రాధిక.

"వంటరిగా ఇంత పెద్దింట్లో ఎందుకమ్మా? మాదగ్గరికి రా అని ఎన్నిసార్లు పిలిచాను. ఆ పట్టణంలో ఆ చిన్న ఇళ్లల్లో నే ఉండలేనురా! నా ఇల్లు, నా మొక్కలు, నా ఊరు ఇవన్నీ వదిలి నే రాలేను. నాకేం భయం? ఊరంతా పిలిస్తే పలుకుతారు. కాంతమ్మగారు వండి పెడ్తున్నారు. సీతాలు, రాజయ్య ఇంట్లో ఉంటారు. నా బతుకు ఈ ఇంట్లోనే తెల్లారిపోవాలి అనేది అమ్మ. ఎంతో ధైర్యంగా నాన్న పోయాక అన్నీ చక్కపెట్టుకునేది" మాధవ అన్నాడు.

"ఏమిటో ఆవిడ వెళ్లిపోయింది. తల్లి పోతే తరం పోతుందంటారు. మీ అమ్మ లేకపోతే ఇంక ఈ పల్లెటూరుకు మీరెందుకు వస్తారు? ఇల్లు, పొలం, డబ్బూ అన్ని విషయాలూ చూసుకోండి. మీ నాన్న విల్లు రాసే ఉంటారు. చూసుకోండి" చిన్న మామయ్య రామారావు అన్నాడు.

"నాన్నగారు రాయలేదు. అమ్మ ఇష్టానికే వదిలేశారు. అమ్మ రాసిపెట్టింది. మాతో చెప్పింది. ఇల్లు నా పేర, పొలం మాధవ్‌కి, డబ్బు, నగలు రాధికకి అని చెప్పింది. మావయ్యా! సంవత్సరీకాల లోపల ఇల్లు, పొలం బేరం చూసి పెట్టు, అప్పుడు అన్నీ సెటిల్ చేసుకుంటాం" గోపాలానికి భారం అప్పచెప్పారు అన్నదమ్ములు.

* * * * * *

"రాధీ.. అన్ని పేమెంట్స్ అయిపోయాయిగా. వంటవాళ్లు, బ్రాహ్మలు, షామియానా వాళ్లు, పనివాళ్లు... అన్నీ సెటిల్ చేశావా?" ముగ్గురూ కూర్చుని లెక్కజమా చూసుకుంటుండగా వేణు అన్నాడు.

"అన్నీ అయ్యాయి అన్నయ్యా... ఇదిగో అన్నీ రాసిపెట్టాను."

"సీతాలు తన తోడుకి ఎవరినో తెచ్చుకుంది ఆమెకిచ్చారా? అలాగే కాంతమ్మగారికి సాయానికి వచ్చినావిడకిచ్చావా?"

"కాంతమ్మగారెవరినీ తేలేదే..." ఆశ్చర్యంగా అంది రాధిక.

"అదేమిటీ ఈ పన్నెండు రోజులు ఇంట్లో అందరికీ కాఫీలు, టిఫిన్లు వడ్డనలు అన్నీ చక్కపెడ్తూ తిరిగేది ఒకావిడ...!" వేణు ఆశ్చర్యంగా అన్నాడు.

రాధిక తెల్లబోతూ వేణు వైపు చూసి "అన్నయ్యా! అదేమిటి పూ.. మన పూర్ణని గుర్తుపట్టలేదా నువ్వు? తను పూర్ణ కదా అన్నయ్యా..." అంది.

దిమ్మెరపోయాడు వేణు. నమ్మలేనట్టు "ఏమిటీ తను పూర్ణా. అదేమిటే అలా అయిపోయింది. అసలు నేను గుర్తుపట్టలేదు. ఎవరినో కాంతమ్మగారు సాయానికి తెచ్చుకుందనుకున్నాను. అందుకే సరిగా కూడా చూడలేదు... అయ్యో! నేను పలకరించనే లేదు. మీరన్నా చెప్పలేదు. బొద్దుగా, చలాకీగా ఇల్లంతా తనే అయి తిరిగే పూర్ణ ఇలా నలభై ఐదేళ్లకే ముసలిదానిలా" దిగ్భ్రాంతి నించి తేరులోలేక అన్నాడు కలవరంగా.

"ఏంటన్నయ్యా? నువ్వు పాతికేళ్ల క్రితం నాటి పూర్ణ గురించి మాట్లాడుతున్నావు."

"అవును, పాతికేళ్లయింది తనని చూసి. అయినా ఇలా .. తన భర్త, పిల్లలు.. అమ్మపోయిందని చూడడానికి వచ్చిందా" విచలితుడై ఆరాటంగా అన్నాడు.

"అన్నయ్యా పాపం దాన్ని దెబ్బమీద దెబ్బ కొడ్తున్నాడు దేవుడు. ఓ మనిషి ఎంతకని తట్టుకోగలదు? దాని బతుకులో అన్నీ కష్టాలే..." విచారంగా అంది రాధిక.

"ఏమిటి? ఏమయింది? అసలు నాకేం తెలీదే. నేను అమెరికా వెళ్లిన కొత్తలో పూర్ణ పెళ్లయిందని ఓసారి చెప్పింది అమ్మ. మరోసారెప్పుడో తండ్రి పోతే పూర్ణ వచ్చిందనీ దానికిద్దరు పిల్లలనీ మరోసారి అంది. అంతకంటే నాకేం తెలీదు."

తరువాత రాధిక చెప్పింది విచలితుడై తెల్లపడిన మొహంతో విన్నాడు వేణు. "పూర్ణమొగుడు ఈ ఊరి హెడ్మాస్టర్ బావమరిదిట. ఈ ఊరికి శెలవులకి వచ్చి పూర్ణని గుళ్లో చూసి తనంతట తాను తన అక్కయ్య చేత పూర్ణ తండ్రికి కబురుపెట్టి పెళ్లి చేసుకుంటానన్నాడట. గవర్నమెంటు ఉద్యోగం. అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో గుమాస్తా. తల్లీ, తండ్రి లేరు. ఉన్నది ఒక అక్క. కట్నం వద్దని, గుళ్లో పెళ్లి సింపుల్‌గా చేయమన్నాడట. పూర్ణ తండ్రి రిటైరయ్యాడు. భార్యలేదు. తల్లిలేని పిల్ల, మంచి సంబంధం అన్ని ఒప్పుకున్నాడుట. పూర్ణ బి.ఎ. అవ్వాలి ఇప్పుడప్పుడే చేసుకోను అని గోల పెట్టింది. అమ్మచేత పూర్ణకి చెప్పించి, ఒప్పించి, మళ్లీ రెండు నెలలకి కానీ ముహూర్తాలు లేవని ఇరవై రోజులలో సింపుల్‌గా పెళ్లి చేశారట. అతను మంచివాడు. మంచి ఉద్యోగం, ఇద్దరుపిల్లలు పుట్టి సుఖంగానే కాపురం చేసుకుంటూంటే ఐదేళ్ల క్రితం అతను స్కూటరు యాక్సిడెంట్‌లో తలకి దెబ్బతగిలి

ఏణ్ణర్థం కోమాలో ఉండి పోయాడుట. ప్రావిడెంటు ఫండులోని డబ్బంతా అతని వైద్యానికే ఖర్చయింది. ఉండడానికి ఇల్లులేదు. భర్త పోయాక వచ్చే పెన్షన్ ఏడెనిమిది వేలే ఆధారం. కొడుకు బి.కాం. కూతురు ఇంటర్ చదువుతున్నారు. అప్పుడు దాని కష్టాలు పగవాళ్ళకీ వద్దనిపించింది. వంటలుచేసి కారియర్లు సప్లై చేసి, యిడ్లెన్లు చేసి ఇచ్చి, ఊరగాయలు, పొడులు, సాయంత్రాలు చిన్నపిల్లలకి ట్యూషన్ చెప్పి సంసారం లాక్కొచ్చిందిట. తండ్రి పోయాక మళ్లీ ఈ ఊరు రాలేదుట. కొడుకు బి.కాం. అయ్యాక బ్యాంకి పరీక్ష రాశాడు కానీ రాలేదు. ఆఖరికి ఏదో కాల్ సెంటర్లో ఉద్యోగం వచ్చి కాస్త ఊపిరి పీల్చుకునేసరికి కొడుకు ఓసారి కదులుతున్న బస్సులోంచి దిగుతూ బస్సు చక్రాల కింద బోర్లా పడ్డంతో వెన్నెముక నుజ్జు నుజ్జు అయి శాశ్వతంగా జీవచ్ఛవం అయి మంచమీద ఉన్నాడు. జీవితంలో ఇంక కిందభాగం పనిచేయదని మంచంలోనే ఉండాలని డాక్టర్లు చెప్పేశారు. అప్పుడు దాని దుఃఖం ఊహించు. చేతికందిన కొడుకు జీవితాంతం మంచంమీద... ఇక పెళ్లి కావాల్సిన కూతురు, ఏడెనిమిది వేల రూపాయల పెన్షను. అదే ఆధారం. కూతురు బి.ఇడి. పాసయ్యింది. ఆఖరికి ఈ ఊర్లో హైస్కూల్లో ఉద్యోగం దొరికిందట. అందుకే ఈ ఊరు వచ్చారు. ఏదో చిన్న ఇంట్లో అద్దెకి ఉంది. అమ్మపోయాక ఈ పదిరోజులు ఎంత చాకిరి చేసిందో అది."

"ఘోరం... ఇంత జరిగినా, మనకెవరికీ తెలీదు. అమ్మైనా చెపితే ఏదన్నా సాయం చేసేవారంగదా.." బాధగా అన్నాడు వేణు.

"అమ్మ అదే గోలపెట్టింది. నెలక్రితం ఊరు వచ్చినపుడు అమ్మ దగ్గరికి వచ్చి ఎంత ఏడ్చిందోనట... అమ్మ వెంటనే పదివేలిచ్చింది. మీరంతా పూర్ణకి ఏదన్నా సాయం చెయ్యండి అంది అమ్మ... దాని బతుకు ఇలా అయిపోయిందని బాధపడింది అమ్మ. మనింట్లో పెరిగిన పిల్ల... ఎలాంటి పిల్ల... ఎలా అయింది? దానికేదన్నా చెయ్యాలి నేను అంది అమ్మ బాధపడ్తూ."

"తప్పకుండా చేస్తాను. కొడుకు వైద్యానికి డబ్బు కావాలంటే ఇస్తాను. దాంతో మాట్లాడతాను. రేపు వెళ్లి చూస్తాను" వ్యాకులపాటుతో అన్నాడు వేణు.

* * * * * *

ఆ రాత్రి నిద్ర కరువైంది వేణుకి. కళ్లముందు పాత పూర్ణ, ఈనాటి పూర్ణ పక్క పక్కన కనపించి మనసంతా వేదనతో నిండింది. పూర్ణతో ఇరవై ఏళ్ల అనుబంధం. పక్క పక్క ఇళ్లు. ఒక్క మాటలో చెప్పాలంటే శరత్‌బాబు, దేవదాసు, పార్వతి, పరిణీత,

లలిత, శేకర్లలాంటిది. గొప్పింటి హీరో, లేనింటి హీరోయిన్ అయిన రెండు కుటుంబాల సాన్నిహిత్యం. తను, మాధవ్, రాధిక, పూర్ణ నలుగురూ కల్సి ఓ ఇంటి పిల్లల్లాగా పెరిగారు.

పూర్ణ పుట్టింది మొదలు గౌన్లు, పరికిణి, ఓణి, చీర ఇలా తన కళ్లముందే పెరిగింది. అందరి కంటే చిన్నది. బుజ్జి కుక్క పిల్లలా వెంట వెంట తిరిగేది. చిన్నప్పుడు దానిమీద అథారిటీ చేసి పనులు చేయించుకునేవాడు. ఏడిపించేవాడు. 'అత్తయ్యా! బావ చూడు' అంటూ ఏడుస్తూ ఫిర్యాదులు చేసేది. అమ్మవాళ్ల అమ్మమ్మా, పూర్ణ ముత్తాత అన్నా చెళ్ళెల్లట. ఆ చుట్టరికంతో ఆయన అమ్మని 'అక్కయ్యా!' అనేవాడు. అలాగే పూర్ణ కూడా 'బావా' అంటూ వరస కలిపి పిలిచేది. కాస్త పెద్దయిన దగ్గరనించి అమ్మ వెనక వెనక తిరిగి పనులు చేసేది. దానికి పదేళ్ల వయసు ఉన్నప్పుడు తల్లిపోతే అమ్మే తల్లి అయ్యింది. దువ్వెన పట్టుకు వచ్చి 'అత్తయ్యా జడ వెయ్యి' అనేది. రాధికతో పాటు దాన్ని మరో ఆడపిల్ల అనుకుంది అమ్మ. పూర్ణకి తనంటే పిచ్చి అభిమానం. హీరో వర్షిప్. 'బావా' అంటూ సంబరంగా ఇది అది చెప్తుంటే కసురుకునేవాడు. చిన్నబుచ్చుకు వెళ్లిపోయేది.

ఆ ఊర్లో హైస్కూలు చదువు అయ్యాక విజయవాడ కాలేజీలో చదవడానికి ఒకరి తర్వాత ఒకరుగా ముగ్గురూ వెళ్లిపోయారు తనూ, తమ్ముడూ, చెల్లెలు. పూర్ణని పై ఊరు పంపి చదివించనన్నారు వాళ్ల నాన్న. తండ్రిని ఒంటరిగా వదిలి పూర్ణ రానంది. ప్రైవేటుగా ఇంటరు, బి.ఏ. చ దువుతానంది. 'దానికి చదువుమీద లేదమ్మా. ఎంతసేపూ నవలలు, పత్రికలు చదువుతూ నీవెంటే కూరలు తరుగుతూ, పచ్చళ్లు రుబ్బుతూ, పూలుకోసి మాలలు కడుతూ తిరగమంటే తిరుగుతుంది' అని వెక్కిరిస్తే పౌరుషంగా 'చూడు నీ ఇంజనీరింగ్ అయ్యేలోగా బి.ఏ. పాసవకపోతే' అంది. 'పోవే శరత్‌బాబు నవలలు, ప్రేమకథలు చదువుకుంటూ కలలు కను. అమ్మా, ఇది పల్లెటూరి అమ్మాయి, ఓ పొలం ఉన్న ఆసామికి ఇచ్చి చేస్తే సరిపోతుంది' అంటూ ఇంటర్ పూర్తయ్యి శెలవలకి వచ్చినప్పుడు తెగ ఏడిపించాడు తను. 'ఇలాగే ఏడిపించు, లలిత, శేఖర్ మెడలో దండ వేసేసింది చూడు ఓ రోజు నేనూ అలా చేస్తాను. అప్పుడు చచ్చినట్లు నన్ను పెళ్లాడుతావు' కోపంగా అంది. 'అమ్మ బాబోయ్ మనసులో పెద్ద కోరికలే ఉన్నట్లున్నాయి. అలాంటి పప్పులు నా దగ్గిర కావు. ఆ కాలం సెంటిమెంట్లు ఇప్పుడు పనిచేయవు. అలాంటి ఆశలు ఏం పెట్టుకోకు. నేను అమెరికా వెళ్లి, చదువయ్యాక ఉద్యోగం చేసే అమ్మాయిని పెళ్లాడుతా. నీలాంటి పల్లెటూరి బైతుని పెళ్లాడతానా' కాలరెగరేసి గర్వంగా అంటూ ఏడిపించాడు తను.

'వద్దన్నవాడి వెంట పడే ఖర్మ నీకేమిటే? బంగారం లాంటి సంబంధం తెచ్చి నీ పెళ్లి నే చేస్తాను' అమ్మ నవ్వుతూ ఓదార్చింది. అలా చిన్నప్పుడు చిలిపి తగాదాలతో ఓచోట పెరిగిన వాళ్లు తామిద్దరూ. రాధిక లాగానే ఇంట్లో పెరిగిన పిల్ల పూర్ణ!

చెల్లెలులా పెరిగిన పిల్ల అంటూనే చెయ్యరాని పనిచేసిన ఆరోజు ఏ భూతం ఆవహించిందో తనను! ఇంజనీరింగు అయి, పరీక్షలు రాసి అమెరికా వెళ్లే ప్రయత్నంలో మర్నాడు వీసాకి మద్రాసు వెళ్లవలసి ఉండడంతో తనను వదిలి అంతా పిన్ని కూతురి పెళ్లికి వైజాగు వెళ్లారు. తన భోజనం సంగతి పూర్ణకి అప్పచెప్పి వెళ్లింది అమ్మ. మనసులో ఏ కోశానా అలాంటి భావం లేదు. ఏ పాడు ఆలోచనా లేదు. ఇప్పటికీ ఆరోజు ఎందుకలా జరిగిందో తనకే అర్థం కాదు. పూర్ణ వంటింట్లో స్టౌ దగ్గిర నిలబడి ఏదో చేస్తోంది. ఊరికే వెనక నించి హఠాత్తుగా వెళ్లి దాన్ని పట్టుకుని భయ పెట్టాలని వెళ్లి దాని నడుం చుట్టూ చేయివేసి బిగించాడు తను. 'ఆ' కెవ్వున అరవబోయి వెనక్కి తిరిగిన పూర్ణ తనను ఆశ్చర్యంగా చూసింది తప్ప వదిలించుకనే ప్రయత్నం చెయ్యలేదు. ఏకాంతం, ఇరవై రెండేళ్ల యువరక్తం. మనసులో చెడు ఆలోచనలేకపోయినా శరీరం దానిపని అది చేసుకుపోయింది. పూర్ణ తలంటు పోసుకున్న జడలోని జాజుల వాసన ఏదో మత్తు కలిగించి తన చేతులు మరింత బిగిసాయి. పూర్ణ గువ్వలా వదిగిపోయింది. ఇద్దరికీ ఏమయిందో పరిసరాలు మరిచిపోయారు. జరగరానిది జరిగాక తెలివి తెచ్చుకుని పడక గదిలోంచి పారిపోయింది పూర్ణ. భయంతో చెమటలు పట్టాయి తనకి. పూర్ణ అమ్మకి, వాళ్ల నాన్నకి చెపుతుందేమో... ఇంట్లో వాళ్లకి మొహం ఎలా చూపాలి? ఆ రాత్రి గదిలోంచి బయటకి రాలేదు. సీతాలు వచ్చి భోజనం చెయ్యమన్నా చెయ్యలేదు. తెల్లారి బస్సుకి వెళ్లే ముందు రాత్రి చేసిన వెధవ పని చాలక ఎందుకు చేశాడో తెలియకుండా ఓ వెయ్యి రూపాయలు పూర్ణకిమ్మని పనిమనిషితో పంపాడు. అంతే ఐదు నిమిషాలలో పూర్ణ విసవిసా వచ్చి కోపంగా చూసి ఆ డబ్బు తన మీద విసిరి వెళ్లిపోయింది.

అంతే అదే ఆఖరిసారి పూర్ణని చూడ్డం. వీసా వచ్చాక, వారంరోజుల్లోనే అమెరికా ప్రయాణం ఉండడంతో మళ్లీ వెనక్కి రాకుండా, అమ్మానాన్నా సామానుతో వచ్చి వీడ్కోలు చెప్పారు. ఆ తరువాత నెలరోజులకి అమ్మ ఫోను చేసి పూర్ణ పెళ్లయిందని చెప్తే నిశ్చింతగా నిట్టూర్చాడు. తను భయపడ్డట్టు ఎవరితో పూర్ణ చెప్పనందుకు నిశ్చింత అనిపించింది.

✶ ✶ ✶ ✶ ✶ ✶

రాత్రంతా ఆలోచించి తను తీసుకున్న నిర్ణయం, ఉదయం ముగ్గురూ కూర్చుని కాఫీ తాగుతుండగా చెప్పాడు వేణు. కాస్త ఆశ్చర్యంగా చూశారు మాధవ్, రాధిక. "మొత్తం ఇల్లు, నీ వాటా అంతా ఇచ్చేయడం ఎందుకు, కావలిస్తే డబ్బు సాయం చెయ్యి" అన్నారు.

"ఈ పల్లెటూర్లో, ఈ పాత ఇల్లు నేనేం చేసుకోను. అమ్మితే మహా అయితే ఏ రెండు మూడు లక్షలొస్తుందో, డబ్బుకంటే దానికో నీడ దొరికితే మేలు. ఉండడానికి ఇల్లు ఉంటే ఆ పెన్షన్ డబ్బుల ఆసరాతో కాస్త బతకడానికి వీలుంటుంది. ఇంకా కూతురు పెళ్లి, కొడుకు రోగం ఖర్చు.. ఇల్లన్నా ఉంటే ఆధారం ఉంటుంది గదా. ఈ రెండుమూడు లక్షలు నాకు పెద్ద అవసరం లేదు" అన్నాడు వేణు.

"తర్వాత తనే రాధికా! ఓసారి అమ్మ వీలునామా కాగితాలు తీసుకురా, గోపాలం మావయ్యకిచ్చి ఇల్లు పూర్ణపేర రిజిష్టరు చేయించమంటాను" అన్నాడు.

రాధిక లోపల్నించి కాగితాలు తీసుకొచ్చి చదువుతూ... "ఇదేంటన్నయ్యా, అమ్మ మళ్లీ కొత్త వీలునామా రాసినట్లుంది. అదే ఇది. చూడు అమ్మ ఈ ఇల్లు పూర్ణకొడుకు మురళి పేర రాసి, పూర్ణ కస్టడిలో పెట్టినట్టు రాసిందే."

వాటిని చూసి తెల్లబోయారు ముగ్గురూ. 'పొలం మాధవ్‌కీ, డబ్బు, నగలు రాధికకీ ఆ విషయంలో మార్పు లేదు. నా పెద్దకొడుకు అమెరికాలో బాగా సంపాదించు కుంటున్నాడు. వాడికి ఈ ఇల్లు అమ్మిన డబ్బు పెద్ద మొత్తం కాదు. కష్టాల్లో ఉన్న ఈ ఇంట్లో పెరిగిన పూర్ణకి ఆసరాగా ఉంటుందని ఇలా రాశా అని కూడా చేర్చింది. ఇది అమలు జరిగేట్టు చూడవలసిన బాధ్యత వేణుది."

మనసులో ఆశ్చర్యపడుతూనే "పోనీలే నేను చెయ్యాలనుకున్నపని అమ్మే చేసింది. అమ్మ ఆలోచన సరి అయిందే" వేణు మనస్ఫూర్తిగానే అన్నాడు.

"అన్నయ్యా! బొత్తిగా నీకేం లేకుండా.. పోనీ సగం పొలం తీసుకో ..." మాధవ్ ఇబ్బందిగా అన్నాడు.

"ఫరవాలేదు మాధవ్ నీది ఇండియా సంపాదన. నాది డాలర్ల సంపాదన. అమ్మ అలా రాయకముందే నేనే ఇస్తానన్నాగా. రాధీ ఓసారి వెళ్లి పూర్ణని, కొడుకుని చూసొద్దాం. విల్లు కాగితాలు ఇచ్చివద్దాం. స్నానం అయ్యాక వెడదామా?"

"నేను మాధవన్నయ్యా వెళ్లి చూసొచ్చాం. నువ్వు వెళ్లు. ఇంట్లో సామాన్లవీ అన్నీ సర్దించాలి గదా. బోలెడు పని ఉంది నువ్వెళ్లిరా" అంది రాధిక.



తలుపుతీసిన పూర్ణ కళ్లలో వెలుగు. "సారీ పూర్ణా! క్షమించు, నిన్నసలు గుర్తుపట్టలేదు. ఎవరో అనుకుని పలకరించలేదు. నీకు క్షమాపణ చెప్పాలని వచ్చాను."

పూర్ణ జీవంలేని నవ్వు నవ్వింది.

'గుర్తుపట్టలేకపోవడం నీ తప్పుకాదులే, రా లోపలికి' అంది.

చిన్న పెంకుటింట్లో ఓవైపు భాగం. రెండు చిన్న గదులు, పంచదించిన వంటిల్లు. రెండో గదిలో మంచం మీద జీవచ్ఛవంలా పడి ఉన్న చిక్కి శల్యమైన ఆకారం. రెండు నిమిషాలు అటుచూసి "పూర్ణా, ఇంత జరిగినా మాకెవరికి చెప్పాలనిపించలేదా? ఇంతమందున్నాం. మేం ఎవరం సాయం చెయ్యమనుకున్నావా? ఇన్ని బాధలు పడ్డావు. నీ భర్త, నీ కొడుకు సంగతి విన్నా. నిన్న రాధిక చెప్పేవరకు నాకే సంగతులు తెలియవు పూర్ణా! నీ కష్టం తీర్చలేకపోయినా కనీసం కాస్త డబ్బు సాయమన్నా చేసేవాళ్లం గదా" ఆవేదనగా అన్నాడు వేణు.

"ఎవరైనా ఎన్నిసార్లు సాయం చేస్తారు? దినదిన గండమైన బతుకు బతుకుతున్నాను వాడిని చూస్తూ. వాడు నడవలేని జీవచ్ఛవం, నేను నడిచే జీవచ్ఛవాన్ని బావా?" అంది. గొంతు రుద్ధమయి బొట బొట కన్నీరు కారుస్తూ. "చూడు బావా! ఆ మంచంలో పడి ఈగ వాలినా తోలుకోలేని స్థితిలో వాడూ, వాడ్ని చూస్తూ నేనూ! 'అమ్మా! నాకింత విషం ఇచ్చి పుణ్యం కట్టుకో, ఇన్ని స్లీపింగ్ పిల్స్ ఇయ్యమ్మా నీకు దండం పెడతాను' అని ఏడుస్తాడు. వాడి బాధ చూడలేక ఒక్కోసారి వాడ్ని ఈ నరకం నించి విముక్తిడిని చెయ్యాలనుకుంటాను. చూస్తూ చెయ్యలేకపోతున్నాను. ఈ నరకం పగవాళ్లకీ వద్దు" నోటికి కొంగు అడ్డు పెట్టుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్న పూర్ణని నిస్సహాయంగా చూసి, కళ్లు నీళ్లతో నిండగా -

"పూర్ణా ప్లీజ్ ఏడవకు. నేను ఎంత ఖర్చయినా భరిస్తాను. హైదరాబాద్ తీసికెళ్లి వైద్యం చేయించు. ఆపరేషన్ చేస్తే బాగవుతుందేమో!"

"లాభం లేదు బావా, వెన్నెముక నుజ్జునుజ్జు అయ్యింది. ఆపరేషన్ చేసినా ప్రయోజనం ఉండదన్నారు డాక్టర్లు... సర్లే నా గోల ఎప్పుడూ ఉండేదే... పద ఆ గదిలో కూర్చో" అంది.

"మీ అమ్మాయి స్కూలుకెళ్లిందా?"

"ఊ... ఏది తప్పినా బతుకీడ్చాలిగదా! నాపెన్షన్, దాని జీతంతో బతుకీడుస్తున్నాం! సారీ వచ్చిన దగ్గిర నించీ నా కష్టాల కథే చెప్తున్నాను..." అంది నిర్జీవమైన నవ్వు నవ్వి కళ్లు తుడుచుకుంటూ.

"చూడు పూర్ణా! నీ దుఃఖం ఏవిధంగా తీర్చలేనుగానీ కాస్త నీకు ఆధారంగా, బతకడానికి ఆసరాగా ఉంటుందని మన ఇల్లు నీ కొడుకు పేర రాసింది అమ్మ. గోపాలం మామయ్యకి చెప్పి రిజిస్ట్రేషన్ చేయిస్తా. మేం వెళ్లాక మన ఇంట్లో ఉండు, కనీసం అద్దెన్నా తగ్గుతుంది. ఇవిగో కాగితాలు, కాదనకుండా తీసుకో, ఆ రోజులా నా మొహాన విసరకు ఇది అమ్మయిచ్చింది" అన్నాడు.

పూర్ణ సూటిగా వేణు కళ్లలోకి చూసి కాగితాలు అందుకుంటూ "ఆరోజు నా 'అభిమానానికి' వెలకట్టావన్న కోపం. బాధతో తీసుకోలేదు. ఈరోజు అమ్మే కాదు నువ్విచ్చినా తీసుకుంటాను. వాడి హక్కుని కాదనడానికి నేనెవరిని" అంది.

వేణు తెల్లబోతూ చూశాడు అర్థంకానట్టు.

"వాడి వారసత్వపు హక్కుని వద్దనడానికి నేనెవరిని బావా?" వేణూ వైపు చూస్తూ మళ్లీ అంది.

దిమ్మెరపోయాడు వేణు. నిర్ఘాంతపోతూ మంచం వైపు చూశాడు. నిరుత్తరుడై పాలిపోయిన ముఖంతో చూస్తున్న వేణుని చూసి చిన్నగా తల ఊపింది పూర్ణ.

"బావా, పాతికేళ్లు ఈ రహస్యం నాలో దాచుకున్నాను. కానీ అత్తయ్య అరనిమిషంలో పట్టేసింది. మురళిని చూడడానికి వచ్చి, చూస్తూనే 'వేణు' అంది నిర్ఘాంతపోయి. అపరాధిలా తలదించుకుని కన్నీరు కారుస్తున్న నన్ను చూసి నేనేం చెప్పకపోయినా గ్రహించింది. నిలేసింది. ఒట్టేసి నిజం చెప్పించింది. ఇంత పెద్ద విషయం దాచినందుకు నిందించింది. చెల్లెలులాంటిదన్న నన్ను ఇంతపని చేసినందుకు నిన్ను ఆవిడ క్షమించలేక తనే ఆ తప్పు చేసినట్టు విలవిల్లాడిపోయింది. పెళ్లి చేసుకోనని నేనెందుకు ఏడ్చానో ఆవిడకర్థమయింది. బావా! మురళి అంతా నీపోలికే – ఒక్కొక్క ఏడూ పెరుగుతూంటే చిన్నప్పటి నించీ నిన్ను చూసిన రూపే కనపడింది. పెద్దయ్యాక మరీ స్పష్టంగా, నాన్న పోయాక ఈ ఊరు రావడం మానేశాను. ఎవరన్నా గుర్తుపడతారని" తన తప్పులేనట్టు సంజాయిషీ ఇస్తున్న పూర్ణని నోటమాట రానట్టు చూస్తుండిపోయాడు వేణు. తలదించుకున్నాడు.

"పాతికేళ్ల తరువాత ఈరోజు నేను చెప్పే క్షమాపణకి అర్థంలేదు. అయినా చెప్తున్నాను. క్షమించగలిగితే క్షమించు" చేతులు జోడించి అన్నాడు.

"పూర్తిగా నీ తప్పేకాదు బావా! నీమీద ఇష్టం, ప్రేమ, అలా జరిగితే నీవు పెళ్లాడుతావేమోనన్న మనసులో చిన్న ఆశ. అన్నీ కలిసి నిన్ను కాదనలేదు. ఆ

"లాడ్జిలో ఎప్పటి వరకు ఉన్నారు. మెడికల్ షాపులకెప్పుడు వెళ్లారు? ఆ తర్వాత ఇంకేం చేశారు?"

"ఉదయం దిగి లాడ్జి కెళ్లి స్నానం చేసి, టిఫిన్ చేసి కాసేపు రెస్టు తీసుకుని పది గంటలకి మెడికల్ షాపుల వారిని కలిశాను. డాక్టరుని కలవాలని ఫోను చేస్తే సాయంత్రానికి గాని రారనడంతో చేసేదేం లేక వంటిగంటకి భోంచేసి మాట్నీ సినిమా కెళ్ళాను. సాయంత్రానికి కూడా డాక్టరుగారు రాలేదు. అంచేత సినిమా చూసి కాసేపు యిటు అటు తిరిగి స్టేషను కెళ్లి అక్కడ భోంచేసి రాత్రి నర్సాపూర్ ఎక్స్‌ప్రెస్ పట్టుకున్నాను. డాక్టరు సాయంత్రం కూడా రారని ముందే తెలిస్తే వెంటనే ఏదో ట్రైనో బస్సో పట్టుకు వచ్చేసేవాడిని. అలా వచ్చేసి ఉంటే ఈ ఘోరం జరిగేది కాదేమో" – మళ్లీ కళ్ళు నిండాయి అతనికి.

"సారీ సర్, మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలని కాదు – మాకివి రొటీన్ ప్రశ్నలు. సాయంత్రం వరకు మీరక్కడే వున్నారనడానికి రుజువు తెలిసినవారు, చూసిన వారు..." ప్రశ్నార్థకంగా చూస్తూ అన్నాడు.

"సాయంత్రం సినిమా నించి వచ్చాక నేనింక ఎవరిని కలవలేదండి..." అంటూ ఆగిపోయి ఏదో గుర్తు వచ్చినట్టు పేంటు జేబులు వెతికి సినిమా టిక్కెట్లు పైకి తీశాడు సంతోషంగా. "ఓగాడ్, లక్కీగా ఇది జేబులో ఉండిపోయింది" అంటూ ఇచ్చాడు.

"యిదేమిటి, టిక్కెట్టు మొత్తం ఉంది?" ఇన్‌స్పెక్టరన్నాడు.

"అదా నేను వెళ్ళేసరికి సినిమా మొదలై పదినిమిషాలు అయింది. తలుపు దగ్గర ఎవరూ లేరు. సీటు వెతుక్కుని నేనే వెళ్లి కూర్చున్నాను. అడిగితే చూపిద్దాం అని జేబులో పెట్టుకున్నాను. ఎవరూ వచ్చి అడగనే లేదు."

"ఐసీ! ఏం సినిమా అన్నారు?" అంటూ పేరు చూసి, టిక్కెట్టు తన జేబులో పెట్టుకుంటూ, "ఇది నా దగ్గర వుండనీయండి. అన్నట్టు రైలు టిక్కెట్టు కూడా వుందా?"

"వుందండి. టిక్కెట్టు ఎప్పుడూ నేను గేటు దగ్గర చూపించి ఉంచుకుంటాను. నేను టి.ఏ. బిల్లు సబ్‌మిట్ చేయాలి గదా."

"సరే మరో ప్రశ్న. ఈ కత్తి మీ ఇంట్లోదా... చెప్పగలరా?"

"ఉండండి" అంటూ వంటింట్లోకి వెళ్లి వచ్చి, "మాదానిలాగే ఉందండి. మా

దగ్గిర ఈ కత్తుల సెట్ వుందండి. ఐదు రక రకాలు – తరగడానికి సైజుల వారిగా సెట్ వుంది. మా ఆవిడెవరో సేల్స్‌మెన్ ఇంటి కొస్తే కొంది. అదే ఇది అనుకుంటు న్నాను" అన్నాడు.

ఇన్‌స్పెక్టర్, "సర్, స్టేషన్‌కి రండి రిపోర్టు రాసిద్దురుగాని..." అన్నాడు.

"బాడీ... ఎప్పుడిస్తారండి" పక్కింటి సుబ్రహ్మణ్యం అడిగాడు.

"పోస్టుమార్టం అవాలిగదా. ఈలోగా మీ బంధువులందరికీ తెలుపుకోండి. కనీసం పన్నెండు వంటి గంట అవచ్చు. పోస్టుమార్టం చేసే డాక్టరు, స్టాఫ్ రావాలి కదా"

సుధాకరమూర్తి, ప్రదీప్ పోలీస్‌స్టేషన్‌కెళ్లి రిపోర్టు ఇచ్చి వచ్చారు. శవాన్ని పోస్టుమార్టమ్‌కి ప్రభుత్వాసుపత్రికి తీసికెళ్ళారు. ఊర్లో ఉన్న సుధాకర్‌మూర్తి అక్క, బావ, వచ్చారు కబురు తెలిసి. స్నేహితులు, సరోజ ఆఫీస్ స్టాఫ్ కబురు తెలిసి ఒక్కొక్కరే వచ్చారు. బాడి వంటి గంటకి ఇంటికి తీసుకొచ్చారు. సరోజ తల్లిదండ్రులు మర్నాడు పది గంటలకి గాని రాలేరు. అంచేత బాడీ అంతసేపు ఉంచడమా సాయంత్రం లోగా దహన సంస్కారం జరపడమా అన్న తర్జన భర్జనల తరువాత రాత్రి ఎప్పుడో పోయిన శవాన్ని ఇంకా ఉంచడం అనవసరం అని అంతా తీర్మానం చేసి ఐదుగంటలకల్లా శవాన్ని తీసికెళ్లి దహన సంస్కారాలు జరిపించారు.

* * * * * *

సరోజ పోయి అప్పటికి వారం అయింది. హత్య జరగడానికి కేవలం డబ్బు, నగలు దోచుకోవడానికి అంటే నమ్మబుద్ధి కావడంలేదు ఇన్‌స్పెక్టర్‌కి. ఎంచేత అంటే సుధాకర్ ఊరికి వెళ్లాడని, సరోజ వక్కర్తే ఉందని దొంగలకి తెలుసా? ఎవరన్నా తెలిసినవారు చేసారా? చేయడానికి కారణాలు, మోటివ్ ఏమిటి? అసలు హత్య చేసిన వారు ఎవరు? ఎలా లోపలకు వచ్చారు? ఏ మామూలు దొంగలో అయితే ఇరవై నాలుగు ఫ్లాట్స్ వుంటే, ఈ ఇంట్లోకే దూరి కాస్తపాటి నగలు, డబ్బు కోసం హత్యచేశారా? లోపలికి ఎలా రాగలిగారు? – సరోజ తలుపు తీసిందా? – అర్ధరాత్రి ఎవరో తెలియకుండా అంత సులువుగా తలుపెందుకు తీసింది? పోస్టుమార్టమ్ ప్రకారం హత్య పన్నెండు తరువాత వంటి గంటన్నర లోపల జరిగి ఉండవచ్చని వచ్చింది. సరోజకి ఎవరో తెలిసిన వారా? రెండు తాళాలలో సుధాకర్ దగ్గిర ఒక తాళం ఉంది. భార్యని హత్యచేసే కారణం ఏమిటి అతనికి? ముందురోజు సాయంత్రం 6 గంటల వరకు విజయవాడలో ఉన్నట్టు మ్నాట్నికి వెళ్ళినట్లు, నర్సాపూర్ ఎక్స్‌ప్రెస్

రాత్రి తొమ్మిదిన్నరకి ఎక్కినట్టు టిక్కెట్టు చూపిస్తుంది. అసలు అతను చేసాడనడానికి మోటివ్ ఏమిటి? భార్య మీద ఏదన్నా అనుమానమా? భార్యకి ఇంకొకరితో ఎవరితో నన్నా అక్రమ సంబంధం ఉందని ఇతనికి తెలిసిందా? లేక, ఇతనికేమన్నా వివాహేతర సంబంధాలుండి భార్యని వదిలించుకోవడానికి ప్లాన్ వేశాడా? అతని మొహం, మాటలు చూస్తే అలా అనుమానించదగ్గ ఆధారాలు కనపడలేదే? రకరకాల ఆలోచనలు వచ్చాయి. ఏ ఒక్కదానికి సరి అయిన ఆధారాలు, లింకు అతనికి దొరకడం లేదు.

సరోజ హత్య జరిగిన మర్నాడు ఇన్‌స్పెక్టరు సునీల్‌వర్మ అపార్ట్‌మెంట్ వాచ్‌మెన్‌ని రకరకాలుగా ప్రశ్నించాడు. అతని మాటలవల్ల తెలిసిన విషయాల బట్టి అపార్ట్‌మెంట్‌లో నీళ్ళ ప్రాబ్లమ్ వుండడం వల్ల రోజూ రాత్రి పన్నెండు వంటిగంట మధ్య తప్పకుండా వాటర్ టాంకర్ వస్తుంది. అవసరమైతే రెండు వస్తాయి. అర్థరాత్రి – ఆ టైములో వాచ్‌మెన్ వెనుక పక్క గేటు తెరిచి టాంకరుని లోపలికి రానిచ్చి నీళ్లు సంప్‌లోకి పోయిస్తాడు. అపుడు మెయిన్ గేట్‌కి తాళం ఉంటుంది. పన్నెండు పన్నెండున్నరకి సినిమాల నించి, క్లబ్బుల నించి వచ్చేవాళ్లు వచ్చాక కార్లు వచ్చే గేటు తాళం పెట్టి, మనుషులు నడిచే చిన్న గేటు తీసి వుంచుతాడు, ఎవరన్నా రావడానికి వీలుగా, టాంకరు వచ్చి వెళ్ళాక రెండు గంటల ప్రాంతంలో చిన్న గేటూ తాళం పెట్టి గేటు ముందే పక్క పరుచుకుని నడుం వాలుస్తాడు. తర్వాత ఎవరన్నా వస్తే అడిగి, చూసి తాళం తీస్తాడు. అదీ అక్కడ రొటీన్. అంటే వాచ్‌మెన్ తాళాలు ఎప్పుడు వేసేది, టాంకరు ఎప్పుడు వచ్చేది తెలిసిన వారే, టాంకరు వచ్చిన సమయంలో చిన్నగేటు లోంచి వచ్చారా? వచ్చి హత్యచేసి అలాగే వెళ్ళారా? నీళ్లు సంప్‌లోకి వదిలి తాళం వేసి, ఓవర్‌హెడ్ ట్యాంక్‌లో ఎక్కించడానికి మోటార్ వేసి రావడానికి ఎంత లేదన్నా అరగంట పడుతుంది కనుక ఆ అరగంటలో హత్య జరిగి వుండచ్చు. అంటే ఈ రొటీనంతా తెలిసిన వాళ్ళు చేసిన పనా? ఆ తెలిసినవారెవరు? వాచ్‌మెన్‌ని అతని అక్క, బావల్ని అపార్ట్‌మెంట్ యిరుగుపొరుగుల్ని సుధాకర్, సరోజల దాంపత్య జీవితం గురించి, వారి ప్రవర్తన, రాకపోకలు గురించి, రకరకాలుగా ప్రశ్నించినా పెద్దగా ఏ విషయమూ రాబట్టలేకపోయాడు ఇన్‌స్పెక్టర్. ఇద్దరు ఉద్యోగస్థులవడం వల్ల ఏ ఆదివారమో తప్ప, రాత్రిళ్ళు తప్ప ఇంట్లో వుండేది తక్కువ కనుక పెద్దగా వారి విషయాలు తెలియవన్నట్టే అంతా చెప్పారు. ఎప్పుడో ఊర్లో ఉండే అతని అక్క బావ, ఎప్పుడైనా అతని స్నేహితులు ఫామిలీతో వచ్చేవారు

ఎక్కువ రాకపోకలు లేవన్నారు. ఇద్దరి మధ్య మామూలుగా భార్యాభర్తలు ఎప్పుడన్నా తగవులు పడడం సహజంగా జరిగేదే. అలా మాట అనుకున్నా తాము వినలేదన్నారు. ఇద్దరూ పెళ్ళయిన కొత్తలో ఎప్పుడన్నా సినిమాకి, షికారుకి, హోటళ్లకి స్కూటర్ మీద వెళ్ళడం చూసేవారని, ఈ మధ్య అలా వెళ్ళడం చూడలేదని చెప్పారు. సుధాకర్ ఇల్లు సోదా చేసినా ఏ క్లూలు దొరకలేదు. పరిశోధన అరంగుళం ముందుకు జరగలేదు. అసలు సుధాకర్ విజయవాడ వెళ్లినట్లు – చెపుతున్నది నిజమేనా? తను వెళ్లకుండా ఇక్కడే వుండి ఈ నాటకం ఆడాడా? – అలా అయితే అతని దగ్గర మాట్నీ టిక్కెట్టు వుందే! రైలు టిక్కెట్టు పోనీ రిటర్న్ జర్నీ టిక్కెట్టు అనుకుంటే సినిమా టిక్కెట్టు సంగతేంటి. ఆ లాడ్జి, మెడికల్ షాపువారిని వాకబు చేస్తే ఏమన్నా సంగతులు తెలుస్తాయా – ఓసారి విజయవాడ వెళ్లివస్తే – ఇన్‌స్పెక్టరు సునిల్‌వర్మకి విజయవాడ వెళ్ళివస్తే కేసులో ఏదన్నా పురోగతి లభిస్తుందేమోనన్న ఆశ వుంది.

✶ ✶ ✶ ✶ ✶ ✶

విజయవాడలో అతను దిగిన లాడ్జికి ముందు వెళ్లాడు. సుధాకర్ శుక్రవారం ఉదయం వచ్చి వంటి గంటకి లాడ్జి ఖాళీ చేసినట్టు చెప్పారు. అతను రాత్రి 10 గంటలకి కదా ట్రైను వంటిగంటకి ఎందుకు ఖాళీ చేశాడు? ఇన్‌స్పెక్టరు ఆశ్చర్యంగా అడిగాడు.

"మా చెకింగ్ టైము ఒంటిగంట సార్. రాత్రి వరకు ఉంటే మరో రోజు ఛార్జీలు ఇవ్వాలని ఒకరోజు పని వుండి వచ్చినప్పుడు ఆయనలా లంచ్ తిని చేతిలో చిన్న బ్రీఫ్‌కేస్ గనక చెకవుట్ చేసి సాయంత్రం పని చూసుకు దొరికిన ట్రైనుకి వెళ్ళిపోతుంటారు సార్. అతని అలవాటు పాతదే" అని చెప్పారు.

మెడికల్ షాపు వారిని కలిస్తే వాళ్ళూ సుధాకర్ పదకొండు గంటలకి వచ్చినట్టు కన్‌ఫర్మ్ చేశారు. సుధాకర్ కలుసుకోవాలనుకున్న డాక్టరు ఊళ్ళో లేకపోవడం, సాయంత్రానికి రాకపోవడమూ నిజమే అయింది. ఇంక మిగిలింది సినిమా హాలుకెళ్లి ఆరా తీయడం – మేనేజర్ని కలుసుకుని తన దగ్గిరున్న మాట్నీ టిక్కెట్లు చూపించి ఎవరన్నా సినిమా మధ్యలో వెళ్ళిపోయారా శుక్రవారం మ్యాట్నీలో, మీ గేట్‌కీపర్లని అడగగలరా అంటూ చెప్పబోతూంటే మేనేజర్ చేతిలో టిక్కెట్టు చూసి, "ఇది గురువారం మాట్నా టిక్కెట్ సార్, శుక్రవారంది కాదు" అన్నాడు.

ఇన్‌స్పెక్టరు తెల్లబోయాడు. అంతవరకు టిక్కెట్టు సరిగా చూడనందుకు తిట్టుకున్నాడు.

"ఐసీ, ఇది గురువారందా, శుక్రవారం కూడా ఇదే సినిమా ఆడిందా..." ఆరా తీశాడు.

"లేదు సార్. మా థియేటర్లో ప్రతి శుక్రవారం మారిపోతుంది. ఈ సినిమా గురువారంతో అయిపోయింది" అన్నాడు.

సునిల్‌వర్మ కళ్ళు మెరిశాయి. చిన్ని క్లూ దొరికినందుకు సంతోషించాడు. ఆలోచనలో పడి సంఘటనలు మనసులో పేర్చసాగాడు.

✶ ✶ ✶ ✶ ✶ ✶

"మిస్టర్ సుధాకర్ చిన్న ప్రశ్న. శుక్రవారం విజయవాడలో మీరేం సినిమా చూసామన్నారు మాట్నీకి వెళ్ళి" సునీల్‌వర్మ క్యాజువల్‌గా అడిగినట్టు అన్నాడు.

ఇన్‌స్పెక్టరు హైదరాబాదు తిరిగి వచ్చిన మూడు నాలుగు రోజులు సరోజ పనిచేసే ఆఫీసులో ప్యూను మొదలు, మేనేజరు వరకు అందరిని రకరకాల ప్రశ్నలు అడిగాడు. ఆఫీసులో, ఆమె డెస్క్ డ్రాయరు కీ తెప్పించి క్షుణ్ణంగా పరిశీలించాడు. అందులో దొరికిన ఒక డైరీ స్వాధీనం చేసుకుని ఇంటికెళ్ళి రాత్రంతా చదివి చాలా విషయాలు అర్థం చేసుకున్నాడు. అందులో దొరికిన రెండు మూడు ఫోటోలలో వ్యక్తిని గూర్చి ఆఫీసువారిని వాకబు చేసుకుని రూఢి చేసుకున్నాక అతన్ని కలుసుకు మాట్లాడాక చాలా వరకు అతనికి కథ అర్థం అయింది. సుధాకర్ ఇంటికెళ్ళి యింటరాగేషన్ మొదలుపెడుతూ మొదటి ప్రశ్న వేశాడు.

సుధాకర్ కాస్త బెరుకుగా చూసి, "అల్లరి రాముడు" అన్నాడు. ఎందుకడిగాడా అనుకుంటూ.

"ఐసీ, ఆ సినిమాలో రెండు మూడు సీన్లు చెప్పగలరా?"

"మరింత తెల్లపోతూ, "ఎందుకుసార్, అలా అడుగుతున్నారు" అన్నాడు భయంగా.

"ఊరికే. మీరు సినిమా చూసినట్టు రుజువుకోసం, రొటీన్ ప్రశ్న" – అన్నాడు తేలిగ్గా.

సుధాకర్ గుర్తు తెచ్చుకుని రెండు మూడు సీన్లు చెప్పాడు.

"టి.వి.లో అడ్వర్టైజ్‌మెంట్‌లో పదేపదే దంచుతున్నారు ఈ సీన్లు. అవి గుర్తు పెట్టుకున్నారా, లేక ఇంతకుముందే చూశారా" – కాస్త వ్యంగ్యంగా అడిగాడు ఇన్‌స్పెక్టరు.

సుధాకర్ కలవరపడి, "సార్ అదేమిటి?" అన్నాడు.

"ఎందుకడిగానంటే శుక్రవారం ఆ థియేటర్లో ఆ సినిమా లేదు గదా – ఎలా చూసారోనని సందేహం వచ్చి అడిగాను" – కూల్‌గా అన్నాడు.

సుధాకర్ తెల్లపోయాడు.

"ఇంతకీ మీరు ఈ టిక్కెట్టు కౌంటర్లోనే కొన్నారా?"

సుధాకర్ నుదుటి చెమట తుడుచుకుంటూ, "కాదు సార్, నేను రెండు గంటల కెళ్ళేసరికి టిక్కెట్లు అయిపోయాయని కౌంటరు మూసేసారు. గేటుదగ్గర ఎవరో బ్లాక్‌లో అమ్ముతుంటే..."

"అదీ సంగతి, అక్కడే పప్పులో కాలేశారు మీరు. ఆ బ్లాక్‌లో అమ్మేవాడు మీకు టోపి పెట్టి క్రితం రోజు మిగిలిన టిక్కెట్టు అమ్మాడు."

"నిజమా సార్, అందుకే ఆ వెధవ దొంగచూపులు చూస్తూ డబ్బివ్వగానే గబగబ మాయం అయిపోయాడు" – ఏదో ఇంకా చెప్పబోతూ ఇన్‌స్పెక్టరు మొహం చూసి ఆగిపోయాడు.

"అంతే, గురువారం టిక్కెట్టుతో థియేటర్లోని సినిమా శుక్రవారం చూసారన్న మాట' . మిస్టర్ సుధాకర్ ఈ చిన్న స్లిప్ ఇచ్చి దొరికిపోయావు నీవు. హడావుడిలో టిక్కెట్టు సాక్ష్యానికి వుండాలనుకున్నావు కాని కౌంటరు మూసేయగానే దిగాలుపడి, బ్లాక్ టిక్కెట్టు అమ్మేవాడు కనపడగానే ప్రాణం లేచివచ్చినట్టు వాడేం టిక్కెట్టు ఇచ్చాడో చూసుకోకుండా జేబులో పెట్టేసుకున్నావు. సినిమా చూసే ఉద్దేశం లేదు కనుక థియేటర్‌లోకి వెళ్ళకుండా రైలుస్టేషన్‌కి వెళ్ళిపోయి హైదరాబాద్ వెళ్ళే మొదటి ట్రైను కనపడగానే 3.30కి ఫలక్‌నుమా ఎక్స్‌ప్రెస్ ఎక్కేశావు. ఏమ్ ఐ కరెక్ట్?" వ్యంగ్యంగా అన్నాడు.

సుధాకర్ మొహంలో కత్తివేటుకి నెత్తురు చుక్క లేనట్టు తెల్లపడిపోయింది. గాభరాపడి ఏదో చెప్పబోయాడు.

ఇన్‌స్పెక్టరు చేత్తో వారిస్తూ, "ఇంకేం బుకాయింపు వద్దు... ఈ చిన్న ఆధారంతో నేను అంతా ఊహించాను. ఉత్త ఊహే కాదు మీ ఆవిడ ఆఫీసు కెళ్లి అందరితో మాట్లాడి, ఆవిడ డైరీ స్వాధీనం చేసుకున్నాను. అందులో దొరికిన ఫోటోలు, డైరీ సాక్ష్యం చాలు కథంతా తెలియడానికి. నీ భార్యని నీవు చాలా తెలివిగా ప్లాన్ చేసి

హత్య చేశావు. ఆ కథంతా నిజం వప్పుకుంటూ నీవే చెప్తావా, నన్ను చెప్పమన్నావా" ఇన్‌స్పెక్టర్ కఠినంగా అన్నాడు.

సుధాకర్ కుర్చీలో కూలబడి మొహం చేతులతో కప్పుకున్నాడు. మనిషి నిలువెల్ల వణికిపోతున్నాడు.

"కమాన్ టెల్‌మి - ఎందుకు చేశావు ఇలా? ఇష్టం లేకపోతే నీ భార్య మోసం చేసిందనుకుంటే డైవోర్స్ ఇవ్వాల్సింది. హత్యచేస్తే నీకు శిక్ష పడ్తుందని తెలీదా? లేక చాలా తెలివిగా చేసి తప్పించుకోగలననుకున్నావా? - జరిగిందంతా చెప్పి నేరం ఒప్పుకో" కఠినంగా అన్నాడు.

సుధాకర్ మొహం ఎర్రబడింది. కోపంతో ఊగిపోతూ, "అవును, చంపాను. నేనే చంపాను, నన్ను మోసం చేసి ఇంకొకడితో కులుకుతుంటే తట్టుకోలేక నేనే కసికొద్దీ చంపాను. నన్ను పెళ్ళాడి నా జీవితం నాశనం చేసిందాన్ని."

"నీకు నీ భార్యమీద అనుమానం ఎందుకు వచ్చిందసలు? ఎప్పుడు కనిపెట్టావు ఇంకొకరితో సంబంధం ఉందని? చెప్పు - ఇంక దాచి లాభం లేదు. ముందునుంచి నాకెందుకో ఈ హత్య కేవలం నగలు డబ్బు కోసం అంటే నమ్మలేకపోయాను. కానీ నీవు చాలా పకడ్బందీగా ప్లాన్ చేశావు. ఈ ఊరిలో లేనట్టు, విజయవాడలో ఉన్నట్లు నమ్మించడంతో బోల్తా పడ్డాను. కానీ ఎక్కడో లింకు అందలేదన్నది తడ్తూనే ఉంది నాకు. ఈ అపార్టుమెంట్ వ్యవహారం, నీళ్ళ టాంకరు వచ్చే సమయం, వాచ్‌మెన్ గేట్ వేసే టైము ఇవన్నీ క్షుణ్ణంగా తెలిసిన ఎవరో టైము చూసుకుని చేశారు. ఆ ఎవరు? బయటివాళ్ళా, కాంప్లెక్స్ వాళ్ళా - అసలు హత్యకు మోటివ్ ఏమిటి అన్నది అంతుబట్టలేదు. ఎప్పుడూ నేరస్థుడు చిన్న పొరపాటు ఎక్కడో చేసి తప్పటడుగు వేస్తాడన్నది నిజం. ఆ నిజం ఇప్పుడూ నిజమయింది. నీ ఖర్మకాలి ఆ టిక్కెట్టు తారీఖు చూసుకోకుండా కొనడం, థియేటర్లో ఏ సినిమా ఆడుతున్నది సరిగా చూడకుండా హడావిడిలో పొరపాటు చేసి దొరికిపోయావు. చెప్పు నీ భార్యమీద నీకు అనుమానం ఎప్పుడొచ్చింది? ఎలా తెలిసింది - ఆమెకు ఇంకొకరితో సంబంధం ఉందని?"

"ఇన్‌స్పెక్టర్ ఓభర్తకి తన భార్య ఇంకోరితో సంబంధం పెట్టుకుందని తెలిస్తే ఎవరూ భరించలేరు సార్. మొదటిసారి, అంటే పెళ్ళయిన ఏడెనిమిది నెలలకి ఓసారి ఇలాగే పనిమీద ఏదో ఊరు వెళ్ళి పొరపాటున ఇంటి తాళాలు తీసికెళ్ళడం

మర్చిపోయి తాళాల కోసం ఆఫీసుకెళ్ళాను – అక్కడావిడ లేదు. ఆఫీసు లీవు పెట్టి పన్నెండుగంటలకే వెళ్ళిందన్నారు. రెండయినా ఇంటికి రాలేదంటే ఎక్కడికి వెళ్ళింది? ప్యూన్‌ని అడిగితే 'ఎవరో సార్ వచ్చారు. ఇద్దరూ కలిసి వెళ్ళా'రన్నాడు. నేను ఊరినుంచి మర్నాడు కాని రానని తెలుసు కనుక ఇంటికి ఎప్పుడు వస్తుందో చూద్దాం, ఆ వ్యక్తి ఎవరో చూడాలని అపార్ట్‌మెంట్‌కి కాస్త దూరంలో కాపు వేశాను. సాయంత్రం అయిదవుతుండగా ఎవరో అతనితో స్కూటర్ మీద వచ్చి సందు మొదట్లో దిగి ఇంటికి వెళ్ళింది. ఆవిడ వెళ్ళిన వెంటనే నేను వెళ్ళేను. నన్ను చూసి బిత్తరపోయింది. తను ఎవరితోనో రావడం, నేను ఆఫీసుకి వెళ్ళడం అంతా చెప్పి నిలేశాను. ముందు ఎవరో స్నేహితుడని బుకాయించింది. క్లాస్‌మేట్ కనిపిస్తే బయటికి వెళ్లానని... నమ్మినట్టు నటించాను. ఆ తరువాత మూడు నాలుగు నెలలు ఆమెని గమనించడమే పని అయింది. రెండు మూడుసార్లు స్పష్టంగా అతనితో సినిమాలకి, హోటలుకి వెళ్ళడం రూఢి అయ్యాక నిలేస్తే ఇంక లాభం లేదని నిజం వప్పుకుంది. అతను పెళ్ళికి ముందు తన క్లాస్‌మేట్ అని, స్నేహితుడని ఇద్దరి మధ్యా ఇదివరకే పరిచయం, ప్రేమ ఉన్నా అప్పటికి అతని చదువు పూర్తి అవ్వక, ఉద్యోగం దొరక్క అతన్ని చేసుకునే వీలు దొరకలేదని, అతనిపట్ల ఇంకా ప్రేమ వుందని, అతను కనిపించగానే ఇద్దరి మధ్య సన్నిహిత్యం పెరిగిందని, తమది నిజమైన ప్రేమని, నన్నెప్పుడూ ప్రేమించలేదని, కేవలం భర్తగా చూడడం తప్ప నా మీద తనకేం లేదని, విడాకులు ఇచ్చేయమని కోరింది నిజం వప్పుకుని. భరించలేకపోయాను. నా పరువు, గౌరవం ఏమవ్వాలి? నాతప్పు లేకుండా నన్ను విదిల్చి పారేయాలనుకోవడం నాలో విచక్షణా జ్ఞానాన్ని చంపేసింది. ఆమెపట్ల కసి, ద్వేషం పెరిగి నన్ను ఇంత మోసం చేసింది చాలక నిర్భయంగా నన్ను వదుల్చుకోవాలనుకోవడం భరించలేక నన్నుకాదని ఆమె సుఖపడకూడదని, పడనీయకూడదన్న కక్ష పెరిగి ఆమెని ఎలాగైనా శిక్షించి నాకు చేసిన ద్రోహానికి ప్రతీకారం తీర్చుకోవాలని, నెలా పదిహేనురోజులు రకరకాలుగా ప్లాన్లు వేసి ఆఖరికి ఈప్లాను నిర్ణయించాను. విజయవాడలో ఉన్నట్టు ఎలిబి చూపి, అక్కడ నించి మధ్యాహ్నం రైలులో రాత్రి తొమ్మిదిన్నరకి హైద్రాబాద్ వచ్చాను. పదకొండున్నర ప్రాంతంలో ఆటో ఎక్కి చలికాలం కనక నన్నెవరూ గుర్తుపట్టకుండా మంకీ క్యాప్, నల్ల స్వెట్టర్ తొడుక్కుని మా అపార్ట్‌మెంట్‌కి రెండు ఫర్లాంగుల దూరంలో ఆటో దిగాను. ఎవరన్నా ఆటోవాడిని పోలీసులు అడిగినా నా అపార్ట్‌మెంట్ దగ్గర దిగినట్టు ఎవరూ చెప్పకుండా అక్కడ దిగి, పన్నెండు గంటలకి నీళ్ళ టాంకరు

రావడం చూసాక నడుచుకుంటూ మా అపార్ట్‌మెంట్ దగ్గరకు వెళ్ళి చిన్న గేటులోంచి వాచ్‌మెన్ వెనకపక్క నుండగా లిఫ్టు ఉపయోగించకుండా, ఎవరి కంటా పడకుండా, నా దగ్గిరున్న తాళంతో తలుపు తీసి లోపలికి వెళ్ళాను. సరోజ అపార్ట్‌మెంట్‌లో ఎవరికన్నా తెలుస్తుందనో, తెలిస్తే నాకు చెపుతారనో ఎప్పుడూ అతన్ని ఇంటికి తీసుకురాలేదు. తనే అతనితో వెళ్ళేది. నిద్రపోతున్న సరోజని చంపడానికి ముందే ఇంట్లో ఉన్న కత్తి పట్టుకుని వేలిముద్రలు పడకుండా గ్లౌస్ వేసుకుని పక్కకి తిరిగి పడుకున్న ఆమెని వెల్లకిలా తిప్పి కసిగా కడుపులో పొడిచాను. మేల్కొన్న సరోజ భయంతో కేకలు పెట్టబోతుంటే నోరు నొక్కాను. గింజుకుంటూ కిందపడితే అక్కడ గుండెల్లో మరో పోటు పొడిచేసరికి గిలగిల కొట్టుకుని కాసేపట్లో చనిపోయింది. అపుడు గబ గబ ఆమె వంటిని ఉన్న నగలు, బీరువా తెరిచి మిగతా డబ్బు, క్యాష్ వగైరాలు జేబులో వేసుకున్నాను. నగల కోసం దొంగతనం జరిగిందనుకుంటారు అందరూ అనుకున్నాను. తలుపు దగ్గరగా లాగి అరగంటలో చడీ చప్పుడు లేకుండా వచ్చిన దారినే దిగి వాచ్‌మెన్ మోటారు రూములో ఉండగా అపార్ట్‌మెంట్ నించి నడుస్తూ అరకిలోమీటరు నడిచి అక్కడ ఆటో ఎక్కి రైల్వే స్టేషన్‌కి వెళ్ళి, తెల్లారి నర్సాపూర్ ఎక్స్‌ప్రెస్ రాగానే ఆటోలో ఇంటికి వచ్చాను.”

“కరెక్ట్, నీవు హత్య ఎలా చెశావో నేనూహించినట్టే చేశావు.”

“సార్, మీకెందుకు నామీద అనుమానం వచ్చింది? ఎలా వచ్చింది? నిండా మునిగాను ఇంకా చలేమిటి, చెప్పండి సార్. ఇప్పుడు నాకేం ఇంక భయం వేయడం లేదు.”

“హత్య జరిగి నెలరోజులైనా చిన్న క్లూ దొరకలేదా అని పై అధికారులు దబాయిస్తుంటే ఎన్నిరకాలుగా ఆలోచించినా మోటివ్ అర్థం కాకపోవడంతో ఓసారి విజయవాడ వెళ్ళి వద్దాం అని వెళ్లాను. మిగతాదంతా నీవు చెప్పినట్టే – మెడికల్ షాపు, డాక్టరు ఇంట్లో చెప్పారు. చిన్న పొరపాటు చేశావు. నిన్నటి టిక్కెట్టు మిగిలి పోయింది. నీకు బ్లాక్‌లో టిక్కెట్లమ్మేవాడు అంటగట్టడం వల్ల, అది నీవు గమనించక పోవడంవల్ల తీగ దొరికింది. డొంక లాగాను. మీ ఆవిడ నీకు తన సంగతి తెలిసిందని ఎలాగో తెలిసింది కనుక భయపడకుండా నిజం ఒప్పుకున్నదని, మీ ఇద్దరి మధ్య జరిగిన దెబ్బలాటలు, ఆమె నిన్ను డైవోర్సు అడిగిన వైనం రాసుకుంది. అప్పుడు కథ అర్థం అయింది. ఆ అపార్టుమెంటు గేటు వేసే టైమింగు, టాంకర్ టైము

తెలిసిన నీవు తప్ప ఇంకెవరూ చెయ్యలేదని పట్టించింది నేరం. క్షణికోద్రేకంలో చేసిన నేరం కాదిది. ఆలోచించి, ప్లాన్ వేసి చేసిన మర్డర్ ఇది. సుధాకర్ నీవు నేరం అంగీకరించినా, కోర్టు నీకు తక్కువ శిక్ష విధించదు. బి మెంటల్లీ ప్రిపేర్డ్ ఫర్ ఇట్" – సుధాకర్‌ని కాస్త జాలిగా చూసాడు ఇన్‌స్పెక్టర్.

సుధాకర్ తల దించుకున్నాడు.

"నెల రోజులయినా కేసులో మీరు, పురోగతి సాధించలేకపోయేసరికి విజయం సాధించాననుకున్నాను. కానీ చట్టం దృష్టి నించి ఏ నేరస్థుడూ తప్పించుకోలేదని మరో సారి నా కథ రుజువు చేసింది. ఇప్పుడు నేను అన్నింటికి అతీతుడ్ని. చావంటే నాకు భయం లేదు" అంటూ చేతులు చాపాడు సుధాకర్.

**(రచన, ఇంటింటి పత్రిక, జనవరి 2006)**

# వేదభూమి

**భో**జనం బల్ల ముందు కూర్చుని ఇంత గంధం బొట్టు, దానిమీద ఇంత కుంకం బొట్టు దిద్దుకొని, కంచం ముందుకు లాక్కుని కూర్చున్నారు కృష్ణశర్మగారు. ఐదు నిమిషాలైనా భార్య వచ్చి వడ్డించక పోవడంతో ఆవిడ మీద ఆయనకి తిక్కకోపం వచ్చింది.

"వర్ధనం, కంచం ముందు కూర్చుని ఐదు నిమిషాలైంది. ఇంత పిండాకూడు తగలేస్తావా" – అరిచారాయన.

వర్ధనమ్మ పెరట్లోంచి పచ్చడి గిన్నెతెస్తూ "అయ్యో ఏమిటా కేకలు, మీరేగా నోరు చచ్చిపోయింది, యింత కరివేపాకు పచ్చడి నూరమన్నారు. కాస్త లేత కరివేపాకు కోసి, రెండు ఎండుమిరపకాయలు, చింతపండు, జీలకర్ర, ఇంగువవేసి నూరుకొస్తున్నాను గ్రైండరులో చేస్తే తినరని.. ఈలోగా పిండాకూడు అంటూ అరుస్తారా, అవ్వ, శుక్రవారంపూట ఏమిటామాటలు" – వంటింట్లోంచి వంటగిన్నెలు టేబుల్ మీద పెడ్తూ అంది.

"వడ్డించి, తగలడు – " నీరసంగా అరిచారాయన.

పోపులో వేసిన బీరకాయ కూర, పెసరకట్టు పచ్చడి వేసి వేడన్నం వడ్డించి నెయ్యి వేసింది. ఔపోసనపట్టి ఆబగా కూరతో నాలుగు ముద్దలు తిని పచ్చడి కలుపుకున్నారు. వేడన్నంలో నేయి వేసి పచ్చడి కలిపి నోట్లో పెట్టుకోగానే జిహ్వ లేచివచ్చింది. కడుపులో నాలుగు ముద్దలు పడగానే ఆత్మారాముడు శాంతించాడు.

"పచ్చడి పుల్లపుల్లగా బాగుందే. ఎలాగైనా నీ చేతిలో వుందే రుచి" గబ గబ ముద్దలు తింటూ అన్నారాయన.

వర్ధనమ్మ మూతి తిప్పింది.

"అదిగో పసుపు ఇదిగో ముసుగు మీ వ్యవహారం అంతా. కోపం వచ్చినా, సంతోషం వచ్చినా పట్టలేం - పిండాకూడు అని తిట్టారుగా" - అలక గొంతుతో అని తన కంచంలో వడ్డించుకుని కూర్చుంది.

"నీరసమే - నాలుగు రోజుల జ్వరం - ఆ దిక్కుమాలిన మాత్రలు కలిసి శక్తి లాగేసింది. ఆకలికి పిచ్చ కోపం వచ్చింది" సంజాయిషీ యిస్తూ చారన్నం కలుపు కున్నారు.

"బాగుందే ఇంగువచారు, పుల్లగా తియ్యగా కమ్మగా వుంది" "అమెరికా ప్రయాణం వుంది. జ్వరపడ్డారు. తగ్గుతుందా అని భయపడ్డాను."

"ఇంకా పదిరోజుల టైముందిగా. పోయిన శక్తి వచ్చేస్తుంది - ఇంకనీ పచ్చళ్లు పొడులు సర్దుడు మొదలుపెట్టు, ఆఖరివరకు పెట్టావంటే హడావిడి అయిపోతుంది" - మజ్జిగ కలుపుకుంటూ అన్నారాయన.

"ఆ తెలుసులెండి. కందిపొడుంకి పప్పులు వేయించి పెట్టి - కరివేపాకు పొడి నువ్వులపొడి, అన్నీ ఎంతసేపు గ్రైండరులో వేస్తే నిమిషం పని. చింతకాయ, పండుమిరపకాయల పచ్చడీ, గోంగూర, కాకరకాయ, నిమ్మకాయ, టమోటా పచ్చడి చేస్తాను. వాడికి అమెరికా వెళ్ళినా మన తెలుగు వంటంటే ప్రాణం. కాస్త గుమ్మడి వడియాలు, పేలాల వడియాలు కావాలన్నారు."

"ఏం చేస్తావో, ఏమేమి పట్టుకెళతావో లిస్టు తయారుచెయ్యి మనవి నాల్గు పెట్టెలు, రెండు షోల్డర్ బ్యాగులు... ఒక్క కేజి బరువెక్కువైనా బోలెడు డబ్బులు కట్టాలి. అది గుర్తుపెట్టుకుని పెట్టెలు సర్దు. పిల్లలకి బట్టలన్నావు. సునీత సి.డిలడిగింది. పుస్తకాలు తీపి, కారం, టిఫిన్లు అన్నీ కలిపి తడిసి మోపెడు అవుతాయేమో!"

"అబ్బ, మీరూరుకోండి, అన్నీ సరిగా సర్దితే సరిపోతాయి. ఎప్పుడో ఓసారి వెళ్ళేవాళ్ళం పిల్లల కోసం అన్నీ పట్టుకెళ్ళకపోతే ఎలా - అప్పుడంటే వేణుకి పెళ్ళి, పిల్లలు లేరు గనగ కొద్దిగా పట్టుకెళ్లాం. వాడి పెళ్లి, పిల్లలు పుట్టాక మొదటిసారి వెడ్తున్నాం.." - వర్ధనమ్మ అంది.

"ఈ ఏడాది బోస్టన్‌లో చలి ఇంకా బాగా ఎక్కువగానే ఉందంటూ జూన్ వచ్చినా.. కొద్దిగా ఉలెన్స్ తెచ్చుకోమన్నాడు వేణు - కెట్స్ కూడా కొనాలి - నీకు."

వెళ్ళబోయే అమెరికా ప్రయాణం ముచ్చట్లు ఆడుకుంటూ భోజనం ముగించారు ఆ దంపతులు.

* * * * * *

న్యూయార్క్‌లో విమానం దిగి యిమిగ్రేషన్ చెకప్ ముగించుకుని బయటపడేసరికి గంటన్నర పట్టింది – సామాను ట్రాలి తోసుకుంటూ బయటికి వచ్చేసరికి వేణు ఆరాటంగా ఎదురు చూస్తున్నాడు.

"అబ్బ, ప్లేను లాండ్ అయి గంటన్నర అయింది. ఇంత ఆలస్యం అయిందేం నాన్నగారు."

"క్యూలురా బాబూ, యిమిగ్రేషన్ దగ్గిర, సామాను రావడం గంటలు గంటలు, మూడు విమానాలు ఒకేసారి లాండ్ అయ్యేసరికి ఒకటే జనం ఒకటే క్యూలు – "

సామాను కారులో సర్ది బయలుదేరేసరికి మరో గంట.

"అమ్మయ్య ఏం ప్రయాణంరా నాయనా, కాళ్లు పచ్చడయ్యాయి. పద్దెనిమిది గంటలు విమానంలో. ఎయిర్‌పోర్టులో గంటలు గంటలు క్యూలో..."

"అదేనమ్మా అమెరికా ప్రయాణం అంటే – మమ్మల్ని రాలేదు రాలేదు అంటావు ప్రతీ ఏడాది. ఎంత కష్టం, ఎంత డబ్బు ఖర్చు పెట్టి రావాలీ చూశావుగా" – కొడుకన్నాడు – "ఇక్కడ నుంచి ఇంక మూడు గంటలుపైన ప్రయాణం వుంది బోస్టన్‌కి" – కారు నడుపుతూ అన్నాడు. తోవ పొడుగునా విశేషాలు, ఊరుపేర్లు, బిల్డింగులు, రోడ్లు గురించి డ్రైవ్ చేస్తూ చెప్తున్నాడు వేణు.

బ్యాచిలర్‌గా ఉండగా న్యూజెర్సిలో ఉన్నప్పుడు వచ్చాక పదేళ్ళకి మళ్ళీ రావడం ఇదే. పెళ్ళయ్యాక ఉద్యోగం మారి బోస్టన్‌లో ఉంటున్నాడు వేణు. మొదటిసారి మనవడు పుట్టాక వచ్చారు. మనవరాలు పుట్టాక వాళ్ళే వచ్చారు. పురుళ్ళకి వియ్యపురాలు వెళ్ళేది. కృష్ణశర్మగారు ప్రతీసారి ఏదోవంక పెట్టి వెళ్ళకుండా నెట్టుకొచ్చేవారు. మీరే రండి మావల్లకాదు అనేవారు. ఇపుడు పిల్లల చదువులు వచ్చాక ఇంక మేం తరచు రాలేం. నాల్గు టిక్కెట్లు. మీరే రావాలి అంటూ టిక్కట్లు పంపి బలవంతం చేస్తే బోస్టన్ ప్రయాణం పెట్టుకున్నారు ఈసారి తప్పక.

"ఏం రోడ్లురా వేణు... ఈ రోడ్లు చూస్తేనే కడుపు నిండిపోతుంది. ఎంత శుభ్రంగా ఉన్నాయో" సంబరంగా చూస్తూ అంది – మొదటిసారి వచ్చినపుడయితే తల్లి చిన్న

పిల్లలా ఆ ఎయిర్‌పోర్టులు, రోడ్లు, ఆహైవే బ్రిడ్జిలు, ఫ్లై ఓవర్లు, ఆ కార్లు చూస్తూ సంబరపడిపోవడం, ఆశ్చర్యపడిపోవడం వేణుకింకా గుర్తుంది.

"ఇప్పుడు ఇండియాలోనూ హైవేలు ఆరులైన్లు, నాల్గు లైన్లు వేస్తున్నారు. ఫ్లై ఓవర్లు కడ్తున్నారు. కాని ఈ నాణ్యత ఎక్కడుంది... అక్కడ విపరీతంగా కార్లు పెరిగాయి. ట్రాఫిక్ జామ్‌లు వచ్చాయి. ఇలా పకడ్బందీగా ట్రాఫిక్ ఎక్కడుంది" – కృష్ణశర్మగారన్నారు.

"నాన్నగారు – మనవాళ్ళు రోడ్లు వేస్తారు గాని మెయిన్‌టెనెన్స్ ఏది – వేసిన నాల్గు రోజులకే ఓ వర్షం కురవగానే కంకర తేలుతుంది. ఇక్కడ ప్రతీ ఏడాది వింటర్ పూర్తికాగానే రోడ్ల మరమ్మత్తులు క్రమం తప్పక చేస్తారు."

"చెప్పకురా మన దేశం గురించి – రోడ్లమీద పెట్టే డబ్బులో పాతిక వంతు రోడ్డుకి చేరుతుంది. మిగతాది కాంట్రాక్టర్లు, ఆఫీసర్లు, రాజకీయనాయకుల జేబుల్లోకి. ఎక్కడ చూసినా అవినీతి. డబ్బు తినడం తప్ప ఎవరికి ఏం పట్టదు. అందుకే ప్రతి డిపార్ట్‌మెంటు అలా ఏడుస్తుంది" – విరక్తిగా అన్నాడు కృష్ణశర్మ.

కబుర్లు చెప్పుకుంటుండగానే ప్రయాణం చేసినట్టే అనిపించకుండా మూడు గంటల్లో బోస్టన్ చేరింది కారు.

పిల్లలు, సునీత కారు దగ్గిర కొచ్చారు.

"నమస్కారం అత్తయ్యగారు మామయ్యగారు" కన్నడ అమ్మాయి సునీత తెలుగు పట్టి పట్టి మాట్లాడుతుంటే తమాషాగా అనిపిస్తుంది. పిల్లలిద్దరూ కాస్త దూరంగా నిలబడి చూస్తుంటే వర్ధనమ్మ ముందుకు వెళ్ళి పిల్లలిద్దర్ని చెరో చేత్తో దగ్గరికి లాక్కుంది. "శరత్, శ్రావణీ మామ్మని గుర్తున్నానా" అంటూ పలకరించి, "సునీతా బాగున్నావా, ఈరోజు ఆఫీసు కెళ్ళవా" పలకరించింది.

"ఇప్పుడే వచ్చానత్తయ్యా.. రండి లోపలికి"

అందరూ తలో సామాను మోసుకు లోపలి కెళ్లారు.

నాల్గు పడకగదుల ఇల్లు. ఆ ఫర్నీచర్, పరదాలు, తివాచీలు అలంకరణ సామాగ్రి అన్నీ అబ్బురంగా చూస్తూ గదులన్నీ ఓసారి తిరిగి వచ్చింది. "ఇల్లు బాగుందిరా కిందటి మాటు ఫ్లాట్ కంటే ..." అంది.

"బాగుంది అది అద్దె అపార్ట్‌మెంటు – ఇది స్వంత ఇల్లు..." – భార్య అమాయకత్వానికి నవ్వి అన్నారు కృష్ణశర్మ.

"పదండి నాన్నా, మీ గది చూపిస్తా... ఫ్రెష్ అయి వస్తే భోంచేద్దాం ..." అన్నాడు వేణు.

కోడలు ఫ్రిజ్ తెరచి ఏవేవో జిప్ బ్యాగులు తీసి టేబుల్‌మీద పెడ్తోంది.

"ఏమిటమ్మా ఇప్పుడు వండాలా – పొద్దుట కొన్ని చేసి పెట్టుకోకపోయావా –" అంది వర్ధనమ్మ.

"అబ్బే అక్కరలేదత్తయ్యా ... అన్నీ ఉన్నాయి. సాంబారు గడ్డ బయటపెట్టా, దొండకాయ కూర తింటారా, వంకాయ కొత్తిమీర కారం కూర తింటారా!" – ఐసు కట్టిన జిప్‌లాన్ బ్యాగులు చూపిస్తూ అడిగింది. "రాత్రి వంకాయ వద్దులే, దొండకాయ చెయ్..." అంది. రెండు బ్యాగులు ఫ్రిజ్‌లోంచి తీసి, రైస్ కుక్కర్ ఆన్‌చేసి, "మీరెళ్ళి స్నానం చేసిరండి. ఈలోగా అన్నీ వేడి చేస్తా" అంది కోడలు.

కొడుకు వెంట వెడ్తున్న కృష్ణశర్మ "సాంబారుగడ్డ" అన్నమాట విని వెనక్కి తిరిగి టేబిల్ మీద గడ్డకట్టిన బ్యాగులు చూసి భార్య వంక ఆశ్చర్యంగా చూశారు... కొడుకు తండ్రికి గది చూపి వేడి, చన్నీళ్ళ ట్యాపులు తువ్వాళ్లు అవి చూపించి క్రిందికి వెళ్ళాడు.

"ఏమిటే సాంబారు గడ్డేమిటి, కొంపదీసి ఆ సాంబారు పెడ్తుందా కరిగించి – "

"ఊరుకోండి, అబ్బాయి వింటాడు. సాంబారు ఫ్రీజరులో ప్లాస్టిక్ బ్యాగుల్లో పెట్టినట్లుంది. గడ్డకట్టింది – ఆ అమ్మాయికి తెలుగు సరిగా రాదు కదా సాంబారు గడ్డ అంది... వీళ్లు వారం పదిరోజులకి ఓసారి వండిపెట్టుకుంటారుగా..." – వర్ధనమ్మ వివరించింది.

"ఖర్మ, రేపు ఇడ్లీ గడ్డలో, ఉప్మాగడ్డలో టిఫినుకి పెడ్తుంది కాబోలు. ఇదిగో ఆ ఐసు గడ్డల కూరలు నేను తినలేనుగాని రేపటి నుంచి నీవు వంటచెయ్యి మనం ఉన్నన్ని రోజులు..." – నసుగుతూ అన్నారు.

"ఎక్కడ కొచ్చినా – సర్దుకోరు. మీ పెళ్ళాంలా ప్రతి పూట వేడిగా వండి వార్చడానికి వీళ్ళకి తీరిక ఎక్కడ. మీ సణుగుడు కాస్త మాని సర్దుకోండి..." – లోగొంతుతో అంది.

"అందుకే నేనీ అమెరికా రాను మొర్రో అంటాను..." – గొణుక్కున్నారాయన.

డైనింగ్ టేబిల్ దగ్గర కూర్చోగానే ఆయన మొహం అప్రసన్నమైంది. మైక్రో

ఓవెన్ నించి వేడిచేసి కోడలు ఒక్కొక్క డిష్ పైన పెడ్తుంటే భార్య వంక మిర్రి మిర్రి చూశారు. ఇటు అటు కెలికి ఆఖరికి పెరుగు వేసుకుని భోజనం అయిందనిపించి లేచారాయన. కోడలు వంటింట్లో గిన్నెలు కడుగుతూంటే వర్ధనమ్మ, "వేణూ, నేను వచ్చాగా, రేపటి నుంచి నేను వండుతాను. మీ నాన్న సంగతి తెలుసుగా – మడిగా ఏ పూట వండింది ఆ పూటే తింటారు. వంటపని నేను చూసుకుంటానని సునీతకి నీవే చెప్పు. తను ఏమి అనుకోకుండా" – లోగొంతులో కొడుకుతో అంది వర్ధనమ్మ.

వేణు అర్థమైనట్లు తల ఊపాడు – పడక గదిలోకి వెళ్లాక, "నీకింక వంటకి ఓ నెల సెలవు. రేపటి నించి మా అమ్మ వండుతుంది. మా నాన్నకి మడి అది వుంది. ఆవిడకి రేపు వంటింట్లో అన్నీ చూపించి ఆవిడకి కూరలు తెచ్చి యియ్యి" అని భార్య నొొచ్చుకోకుండా చెప్పాడు.

మర్నాడు ఆదివారం. అందరూ లంచ్‌కి కూర్చుంటే వర్ధనమ్మ వేడివేడిగా అందరికి వడ్డించింది. బీరకాయ పప్పుకూర ఇంగువ నూనెవేసి, వంకాయ పులుసు పచ్చడి, కొత్తిమీర పచ్చడి, చారు పెడితే చాలా రోజుల తర్వాత తల్లి చేతి వంట ఫ్రెష్‌గా, వేడివేడిగా తింటుంటే అమృతంలా అనిపించింది వేణుకి. కోడలు కూడా మనస్ఫూర్తిగా మెచ్చుకుంటూ తింది. మనవలు కాస్త కారం అంటూ పప్పుకూరతో, చారుతో తిన్నారు.

"మీలా నాకు అన్నిరకాల వంటలు రావత్తయ్యా" – నిజాయితీగా అంది సునీత.

"అమ్మా, పెద్ద చదువులు చదివి పెద్ద ఉద్యోగం చేస్తున్నావు. అది గొప్ప – వంటదేం ఉంది. నాలాంటి వాళ్ళు చెయ్యాల్సిన పని యిది" – వర్ధనమ్మ కోడలుతో ఆప్యాయంగా అంది.

తాతగారు అన్నం తినేముందు కంచం చుట్టూ నీళ్ళు తిప్పి ఔపోసన పట్టడం చూసి శరత్ తండ్రి చెవులో గుసగుసలాడాడు.

"ఏమిట్రా మనవడా నామీద ఏం చెప్తున్నావు మీ నాన్నకి ..." తాతగారు హాస్యం ఆడారు.

"మీరు అలా కంచం చుట్టూ నీళ్లెందుకు తిప్పారని సందేహం వచ్చింది వాడికి."

"అదా! అవును మరి మన ఆచార వ్యవహారాలు చెప్పందే పిల్లలకి ఎలా తెలుస్తాయి? దూరంగా విదేశాల్లో ఉన్న పిల్లలకి ఇవన్నీ ఎలా తెలుస్తాయి? ఇవన్నీ ఎలా చూస్తారు?"

"విదేశాలెందుకు నాన్న, మనదేశంలో ఉన్నవాళ్లెందరు ఈ ఆచార వ్యవహారాలు పాటిస్తున్నారా ఇప్పుడు, ఏదో మీలాంటి పాతతరం ఒకరిద్దరు తప్ప."

"నిజమేలే నీ వన్నది. చూడు బాబూ శరత్ – ఈ ఆచార వ్యవహారాలు నీకిప్పుడు చెప్పినా సరిగా అర్థం కావు కానీ, ఇలా చేయడం వెనక పెద్దలు ఈ ఆచారం ఎందుకు పెట్టారో నీకర్థమయేట్టు చెప్పనా – ఇదివరకు రోజుల్లో మేం కింద కూర్చుని, అరిటాకు వేసుకుని భోంచేసేవాళ్లం. నేలమీద చీమలు, చిన్న కీటకాలు, సూక్ష్మజీవులు విస్తర్లకి పాకి రాకుండా విస్తరి చుట్టూ నీళ్ళు తిప్పితే ఆ నీళ్లు దాటి చీమలు లాంటివి రాలేవు గదా – తరువాత ఉద్ధరిణితో చేతిలో నీళ్లు పోసి వదలడం అంటే చేయి కడుక్కోవడం, నోట్లో నీరు పోసుకోవడం అంటే ఔపోసన – అంటే ఎండిన గొంతుని తడిపితే అన్నం ముద్ద సుళువుగా జారుతుందని ఇలా ఆచారం అంటూ పెట్టారేమో! మనవాళ్ళు అలా పెట్టిన ప్రతి ఆచారం వెనక ఓ సైంటిఫిక్ రీజను వుండేది కాని అలా ఎందుకు చెయ్యాలో చెప్పేవారు కాదు సరిగా. దాంతో ఈ ఆచారాలన్నీ కొట్టిపారేసారు మనవారు. రోడ్లన్నీ తిరిగి వచ్చిన కాళ్ళతో ఇంట్లోకి రాకుండా గుమ్మం ముందు నీళ్ళు పెట్టి కడుక్కుని రమ్మనేవారు. మా చిన్నతనాన చెప్పులుండేవి కావు. అలాగే గుమ్మం ముందు పేడనీళ్లు జల్లడం, ముగ్గు, గడపలకి పసుపు రాయడం అన్నింటి వెనక ఆరోగ్య రహస్యాలుండేవి."

శరత్ తాతగారి మాటలు శ్రద్ధగా విన్నాడు.

"డాడీ ఎప్పుడూ చెప్పలేదు నాకు –"

"నాకు తెలిస్తే కదా నీకు చెప్పడానికి మాన్న నాకెప్పుడూ చెప్పలేదు మరి" – వేణు నవ్వుతూ అన్నాడు.

"కృష్ణశర్మ నవ్వి, నీకంటే నీ కొడుకు నయం. తెల్సుకోవాలన్న జిజ్ఞాస ఉంది వాడికి..."

"నాన్నగారు... మీరున్నన్ని రోజులు పిల్లలకి కాస్త తెలుగుపదాలు, శతకాలు చెప్పి అర్థం చెప్పండి. ఇలాంటి ఆచార వ్యవహారాలు, వాటివెనుక ఉన్న విజ్ఞానం చెప్పండి వాళ్ళకి" అన్నాడు వేణు.

* * * * * *

"నాన్నగారూ ఇతను మైఖేల్... నా కొలీగ్. మిమ్మల్ని కలవాలని, మీతో కొన్ని

విషయాలు చర్చించాలని వచ్చాడు" – వేణు తండ్రితో అన్నాడు. మూడు రోజుల తర్వాత ఆఫీసు నించి స్నేహితుడిని వెంటబెట్టుకుని వచ్చి తండ్రికి పరిచయం చేశాడు.

కృష్ణశర్మ అతను చాపిన చేయి అందుకుని కరచాలనం చేసి, "నాతోనా" అన్నారు ఆశ్చర్యంగా.

"ఆ, ఇతనికి మన హిందూ సాంప్రదాయాలు, భారతీయ సంస్కృతి, మన వేదాలు, పురాణాలు బాగా తెలుసు. ఆధ్యాత్మిక పుస్తకాలెన్నో చదివాడు. ఇండియా రెండుసార్లు వెళ్లి హరిద్వార్, బదరీనాథ్‌లలో పదిహేను రోజులుండి, యోగా, మెడిటేషన్ అవి నేర్చుకుని వచ్చాడు – మన రామాయణ భారతాలు చదివాడు. మీకు ఇంగ్లీషు, సంస్కృతం, తెలుగు అన్నీ బాగా వచ్చు. పురాణేతిహాసాలు చదివారు. అతనడిగిన సందేహాలని మీరు ఇంగ్లీషులో విడమర్చి చెప్పగలరు – మీరిద్దరూ మాట్లాడుతూ ఉండండి. నేను ఫ్రెష్ అయి వస్తాను – " అని వేణు లోపలికి వెళ్లాడు.

మైఖేల్ నవ్వుతూ తనని తాను పరిచయం చేసుకుని తనకి భారత దేశం ఎందుకు నచ్చిందో, వేదాలలో సారం, హిందువుల ఆచార వ్యవహారాలు, తాను చూసిన ప్రదేశాలు, తాను చదివిన పుస్తకాలు, తాను చూసిన స్వాములు, మఠాలూ... తనకి నచ్చిన యోగా, మెడిటేషన్ అన్నీ చెప్పాడు.

"సంతోషం బాబూ, మావాళ్ళకంటే నీవు ఎక్కువ చదివావు. మా గురించి మా కంటె గొప్పగా అర్థం చేసుకున్నాడు – నేనేం పెద్ద పండితుడిని కాను. నీకు చెప్పతగ్గ అర్హత నాకుందని నేననుకోవడం లేదు... ఇన్ని తెలిసిన నీవు ఇంకా నాతో చర్చించేదేం ఉంది" – ఆశ్చర్యంగా అన్నాడు కృష్ణశర్మ.

"అలా అనకండి సార్ – మీరు పెద్దలు. నాది పుస్తకానుభవం. మీది స్వానుభవం. నాకు కొన్ని సందేహాలు నివృత్తి చెయ్యాలి. పాపపుణ్యానికి మీరిచ్చే నిర్వచనం, జనన మరణాలు, మీ హిందువుల విశ్వాసాలు, భారత, భాగవత, రామాయణాల్లో సందేహాలు కొన్ని తీర్చాలి..."

"తప్పకుండా అడుగు, నాకు తెలిసినవి నిరభ్యంతరంగా చెపుతాను. చిన్నప్పుడు మా నాన్నగారు క్రమశిక్షణతో దగ్గరుండి సంస్కృతం నేర్పించారు. పురాణాలు చదివించారు. వాటివల్ల కాస్త జ్ఞానం అబ్బింది. నాకు తెలిసింది ఇంకొకరితో పంచుకోవడం నాకు ఆనందమే!"

వేణు బట్టలు మార్చుకురాంగానే మైఖేల్ ప్రశంశాపూర్వకంగా, "వేణూ మీ నాన్నగారు ఎంత మంచి ఇంగ్లీషు మాట్లాడుతున్నారు –" అన్నాడు.

"ఆయన ఇంగ్లీషు రీడరుగా యూనివర్సిటీలో పనిచేసి రిటైరయ్యారు తెలుసా. ఆయన బ్రిటిష్ వారి టైములో  చదివిన చదువు మరి – "

మైఖేల్ వినయంగా, "సార్, నాలాగే నా స్నేహితులిద్దరికి ఈ విషయాల మీద చాలా ఇంటరెస్ట్ – రేపు వారిని తీసుకువస్తే మీకేమన్న అభ్యంతరమా" అనడిగాడు.

"తప్పకుండా, అభ్యంతరానికి ఏముంది" తండ్రి తరపున వేణు అన్నాడు.

"ఎన్ని గంటలకి రమ్మంటారు. మీ సమయం చెపితే..."

"నాన్నగారు ఎనిమిది గంటలకి డిన్నరు తీసుకుంటారు. మీరు ఆరు గంటలకి వస్తే ఓ రెండు గంటలు మాట్లాడుకోవచ్చు..." వేణు అన్నాడు.

మైఖేల్ శలవు తీసుకు వెళ్లాక, "ఏమిటి నేను ఏం చెప్పాలి – ప్రవచనాలు చెప్పాలా షణ్ముఖశర్మలా" నవ్వుతూ అన్నారు.

"అలాగే అనుకోండి – ఏదో ఒక సబ్జెక్ట్ మీద మాట్లాడండి. లెక్చర్లు ఇవ్వడం మీ కలవాటేగా – వాళ్ళడిగిన ప్రశ్నలకి జవాబిచ్చింది – సాయంత్రాలు మీకు మంచి కాలక్షేపం వుంటుంది" – వేణు నవ్వుతూ అన్నాడు.

* * * * * *

ఏ ముహూర్తాన మొదలుపెట్టారోగాని కృష్ణశర్మ ముందు రోజే పెద్ద సక్సెస్ అయిపోయారు. ఆయన భాష, భావం, ఆశువుగా అలా ఒకదాన్లోంచి ఓదాన్లోకి, అసలు కథల్లోంచి పిట్టకథల్లోకి, పురాణాల గురించి, వేదాలు, ఆచారాలు, శతకాలు, పూజ పునస్కారాలు, పండగలు, జనన మరణాలు – ఇలా ఆయన సృజించని వస్తువే లేదన్నట్టు పురాణ కాలక్షేపంలా నెల రోజులు ఏకధాటిగా రామాయణ, భారత, భాగవతాల ముఖ్య ఘట్టాలు, యోగ, మెడిటేషన్, మన ఆయుర్వేద విశిష్టత – అడిగినవి అడగనివి అలా ఆసువులా ప్రవాహంలా సాగిపోయింది నెల రోజులు.

మొదటిరోజే ఆయన వాగ్ధాటికి, చెప్పిన తీరుకు ముగ్ధులయిన ముగ్గురు అమెరికన్ స్నేహితులు, "మాతోపాటు మరికొంతమంది వస్తాం అంటున్నారు. తీసుకురావచ్చా" అన్నారు.

"మా డ్రాయింగ్‌రూంలో పట్టినంతమంది రావచ్చు" – వేణు జవాబిచ్చాడు. వేణు కూడా తండ్రి అంత అద్భుతంగా అందరికి అర్థమయ్యే రీతిలో అన్ని విషయాల గురించి మాట్లాడగలరని అనుకోలేదు. మర్యాదకి కాసేపు కూర్చుని లేచి పోదాం

అనుకున్న వేణు మొదటి రోజు మొదలు నెల రోజులు ముఖ్యశ్రోత అయిపోయాడు. పిల్లలిద్దరూ తాతగారేం చెబుతారోనని కూర్చుని కథలు చెప్పినంతసేపు ఆకర్షితులై, అర్థంకాని విషయాలొస్తే ఆడుకుందుకు వెళ్ళిపోయేవారు.

ఆ మర్నాడు పది పన్నెండు మంది ఆడ మగ అమెరికన్లు, ఈ పురాణ కాలక్షేపం విషయం విని ముగ్గురు నలుగురు తెలుగు, తమిళ, కన్నడ దంపతులు వచ్చి చేరారు.

మైఖేల్, జాన్, జాఫ్రీ రాంగానే వాళ్ళే సోఫాలని జరిపేసి, తివాచీల మీద అందరూ కూర్చునే ఏర్పాటు చేసి, వెళ్ళేముందు అన్నీ సర్దేసి వెళ్ళేవారు. పదిరోజులలో వారందరి దృష్టిలో కృష్ణశర్మ హీరో అయిపోయారు.

"ఏమిటో నేనిలా చెప్పగలుగుతానని ఎప్పుడూ అనుకోలేదు. మొదలుపెట్టగానే ఓదాన్లోంచి ఓ దాన్లోకిలా ఆసువుగా మాటలు దొర్లిపోతున్నాయి" అన్నారు ఆయన ఆశ్చర్యపోతూ.

"యూనివర్సిటీలో లెక్చర్ల అనుభవం వుందిగా నాన్నగారూ – లోకల్ షణ్ముఖశర్మ అయిపోయారు అమ్మా..." హాస్యం ఆడాడు వేణు.

"అవునురా వేణూ, మీనాన్నకిన్ని తెలుసని ఇంత బాగా చెపుతారని నేను అనుకోలేదు. ఏదో ఎంతసేపు నన్ను తిట్టడం, సాధించడం, కమ్మగా ఏపూటకాపూట వేడివేడిగా వండించుకుని సుష్టుగా భోంచేయడం తప్ప ఇన్ని వచ్చని తెలీదురా" – సగం ఆశ్చర్యం, సగం హాస్యం మేళవించి అంది వర్ధనమ్మ.

"అంతేమరి – పెరటి చెట్టు మందుకి పనికిరాదంటారు. మొగుడి విలువ ఇప్పటికన్నా తెలుసుకో" – కృష్ణశర్మ హాస్యం ఆడారు.

"పోనీలే నాన్నగారికింక తోచలేదన్న బెంగలేదీసారి – మన ఇండియాలో మన వేదాలు, పురాణాల గురించి పట్టించుకునేవారు లేరు. ఈ అమెరికన్లు మాత్రం శ్రద్ధగా మన వేదాలు, పురాణాల గురించి క్షుణ్ణంగా చదువుతున్నారు. వాళ్ళేం చేసినా క్షుణ్ణంగా శ్రద్ధగా చేస్తారు – మన యోగా, మెడిటేషన్, ఆయుర్వేదం ఇప్పుడింత పాప్యులర్ ఇక్కడ. వీళ్ళకిపుడు ఇదో క్రేజ్..."

"ఇప్పుడు మన ఇండియాలోనూ పూజలు, పునస్కారాలు ఎక్కువయ్యాయి మా చిన్నప్పటికంటె. ఇదివరకు గుళ్ళు, గోపురాలు, యాత్రలలో అంతా వయసుమీరిన వారే కనపడేవారు. ఇప్పుడు ఎక్కడ చూసినా యువతే – జీన్ పాంట్లేసుకుని అమ్మాయిలు, అబ్బాయిలు ప్రదక్షిణాలు చేస్తున్నారు –" – వర్ధనమ్మ అంది నవ్వుతూ.

"అవును మరి. ప్రతివాడికి కోరికలెక్కువయిపోయాయి. పాపపు పనులు ఎక్కువయ్యాయి. చేసిన పాపాలు కడుక్కోడానికి గుళ్ళచుట్టూ ప్రదక్షిణ చేస్తే చాలనుకుంటున్నారు. మర్డర్లు చేసేవారు పొద్దుటే బొట్టుపెట్టుకుని, అగరొత్తులు దేముడి పటానికి తిప్పేసి, బొడ్లో కత్తులు, కటార్లు, పిస్తోళ్లు దిగేసుకు బయలుదేరుతున్నారు" – కృష్ణశర్మ విరక్తిగా అన్నారు.

"బాగుంది – అది వాడి "దంధా' అన్నమాట" – హాస్యంగా అన్నాడు వేణు.

✶ ✶ ✶ ✶ ✶ ✶

"వేదభూమి అన్నపేరు ఎలా వచ్చింది? ఇండియాలోనే వేదాలు ఎందుకు పుట్టాయి?" – మైఖేల్ సందేహం బైటపెట్టారు.

"ఓసారి త్రిమూర్తులు ఈ వేదాలు ఎక్కడ పరిరక్షింపబడతాయి, ఎక్కడ ప్రచారం జరగాలి, మునులు, ఋషులు వేదాలు పఠించడానికి అనువైన ప్రదేశం కోసం అన్వేషించి అన్వేషించి ఆఖరుకి ఒక జంతువుని భూమ్మీదకి పంపి అది ఎక్కడ నడయాడుతుందో అదే తగిన చోటు అన్న నిర్ణయానికి వచ్చారు. ఆ జంతువు భూ ప్రపంచం అంతా తిరిగి ఇక్కడ ఆగింది. ఇదే అనువైన ప్రదేశం, ఋషులు, మునులు వేదపఠనాలు చేస్తూ, యజ్ఞ యాగాదులు చేసే భూమి యిదే వేదభూమి అనుకున్నారట."

ఆ వివరణకి అందరూ సంతృప్తిగా తలలాడించారు.

"కర్మ సిద్ధాంతం నమ్మాలా! చావు పుట్టుకల మర్మం అంతా భగవంతుని చేతిలో వుందని నమ్మాలా? భగవనిర్ణ ప్రకారమే జరుగుతాయా?" – జాన్ అడిగాడు ఓరోజు.

కృష్ణశర్మ నవ్వారు – "బాబూ అంత లోతుగా ఆలోచించి ఖచ్చితంగా చెప్పగలిగే జ్ఞానం లేదు నాకు. సైన్సు ఇంత వృద్ధిచెందినా చావు పుట్టుకల మర్మం ఇంకా మనిషి చేతిలోకి రాలేదు గదా. అంచేత సృష్టికర్త రహస్యం భగవంతుని చేతిలో వుందనే నమ్మాలి. దీనికి ఓ చిన్న కథ చెపుతా. ఓరోజు యమధర్మరాజు ఇంద్రుడితో పనిపడి ఇంద్రలోకం వచ్చాడట. లోపలికి వెళ్లబోతుంటే అతని దృష్టి అక్కడ చిన్న పురుగులో నూకలో ఏరుకుతినే చిన్న పక్షి మీద పడింది. యముడు కాస్త ఆశ్చర్యపడి, సాలోచనగా చూసి లోపలికి వెళ్లాడు. ఆ పక్కనే చెట్టుమీద వాలివున్న పెద్ద గద్ద అది చూసి యమధర్మరాజు పాపపు దృష్టి ఈ చిన్న ప్రాణిమీద పడింది. ఈ చిన్న పక్షిని కాపాడాలి అనుకుని, ఆ పిట్టని తన భుజాల మీద ఎక్కించుకుని వాయువేగంతో

కొన్ని యోజనాల దూరంలో ఓ పెద్ద అడవిలో ఓ చెట్టు తొర్రలో ఆ పక్షిని ఎవరికి కనపడకుండా దాచిపెట్టి వెళ్ళిపోయింది. యముడు పని ముగించుకుని బయటికి వచ్చి ఆచిన్న పక్షి కోసం అటు యిటు వెతికి చూసాడు. ఇంద్రుడు ఏం చూస్తున్నావని అడిగితే – 'ఇంద్రా, ఇందాక లోపలికి వస్తుంటే చిన్నపక్షి కనిపించింది. కొన్ని క్షణాలలో ఎక్కడో యోజనాల అవతల దానికి మరణం రాసిపెట్టి వుంటే ఈ సమయంలో ఇక్కడెందుకు వుందా అని ఆశ్చర్యపడ్డాను' అన్నాడు. అక్కడ ఆ చెట్టుతొర్రలో ఉన్న పాము పక్షిని చంపి తింది. అంటే అర్థం అయిందా మీకు – ఎక్కడో అది చావాల్సి వుంటే దానిని రక్షించి సాయం చేసానని అనుకొని దేగ దాని చావుకు కారణభూతురాలైంది. అంటే మృత్యువు ఎప్పుడు, ఎలా, ఎందుకు వస్తుందో తెలియదుకదా."

ఈ కథ విని అంతా ఆశ్చర్యానందాలతో చప్పట్లు కొట్టారు.

"గుడ్ గుడ్ ఎంత అద్భుతమైన సంఘటన. ఇంత చిన్నకథలో ఎంతటి భావం ఇమిడి ఉంది" – జెఫ్రీ అన్నాడు.

"గ్రహాల ప్రభావం మానవుల మీద ఎంత వుంటుంది? రోజులు బాగాలేవు, గ్రహాలు బాగాలేవు అంటారు. నిజంగా ఆ ప్రభావం వుంటుందా?" మరోరోజు మరొకరి సందేహం.

"సైన్సు ప్రకారం చూసినా నమ్మాలి కదా బాబూ! పౌర్ణమి, అమావాస్యలనాడు చంద్రగ్రహ ప్రభావం సముద్రంలో ఆటుపోట్లు ఎక్కువ అవుతున్నదని సైన్సు చెబుతుంది. సముద్రం మీదే ప్రభావం ఉన్నప్పుడు మనిషి మీద ఎందుకుండకూడదు – గ్రహస్థితిని బట్టి మంచి చెడులు జరుగుతున్నాయన్నది కొంతవరకు నమ్మాలేమో – ఇవన్నీ ఇంకా నిరూపింపబడలేదు. కాని దీనికి ఓ కథ చెపుతాను వినండి. అన్ని గ్రహాలలో శనిగ్రహానికి అందరూ భయపడతారు. శని పట్టిందంటే ఆ ప్రభావం చెడుగా ఎక్కువ, అపుడపుడు మంచి జరుగుతూందంటారు. ఓరోజు శనీశ్వరుడు తన ప్రభావం నించి మానవులే కాదు దేవతలూ తప్పించుకోలేరని సవాలు విసిరాడు. అది విని ఈశ్వరుడు నవ్వి... "నీ ప్రభావం నామీద చూపిస్తావా, నన్నేం చెయ్యలేవు" అని ఈశ్వరుడు ప్రతి సవాల్ విసిరాడట. 'సరే రేపు సూర్యోదయం నించి సూర్యాస్తమయంలోగా నా ప్రతాపం చూపిస్తాను –' అని శని నవ్వుతూ చెప్పి వెళ్ళిపోయాడు. శని నుంచి తప్పించుకోడానికి ఏం చెయ్యాలా అని ఆలోచించి

శివుడు అతనికి కనపడకుండా ఎక్కడో కొన్ని యోజనాల దూరంలో ఉన్న అడవిలో, ఓ చెట్టు తొర్రలోదాగి కూర్చున్నాడు రోజంతా. సూర్యాస్తమయం అయ్యాక తిరిగి కైలాసం చేరుకుని అప్పటికే అక్కడ వున్న శనిని చూసి నవ్వి, 'ఏది నన్నేం చెయ్యగలిగావు – ' అని సవాల్ విసిరాడు.

శని నవ్వి, 'పరమేశ్వరా మందిమాగధులతో సుఖంగా కైలాసంలో పార్వతీదేవితో ఉండాల్సిన నీవు ఎక్కడో అడవి చెట్టుతొర్రలో ఆకలి దప్పులతో రోజంతా గడపవలసి రావడం నా ప్రభావం కాదంటావా?' అని ఎదురు ప్రశ్నించేసరికి ఈశ్వరుడు తెల్లబోయి తలదించుకున్నాడు."

వింటున్న అందరూ చప్పట్లు కొట్టారు. పిల్లలిద్దరూ "తాతయ్యా, భలే కథ చెప్పావు" అన్నారు.

"నిజంగా ఈ కథలన్నీ మనకిన్ని విషయాలు చెపుతున్నాయి" – ప్రశంసగా అన్నాడు మైఖేల్.

"అదే బాబూ, మన పురాణ పురుషులు, మునులు, ఋషులు, పామరులకి సయితం అర్థం కావడానికి ఇలాంటి జీవిత రహస్యాలను కాచి వడబోసి కథలుగా తయారుచేసి మనకిచ్చారు. మా వేమన, సుమతి శతకాలు చిన్న పదాలలో ఎంత అనుభవం, ఎంత నీతి, ఎన్ని మానవతా విలువలు పొందుపరిచాయి. మా చిన్నతనంలో రోజుకో పద్యం కంఠతా పట్టించేవారు."

సుమతీశతకం, వేమనశతకాల పద్యాలు రోజుకి మూడు నాలుగు చదివి తాత్పర్యం చెపుతూంటే స్కూలు పిల్లల్లా విని అవి వారి భాషలో రాసుకుని మర్నాడు కంఠతాపట్టి వినిపించేవారి శ్రద్ధాసక్తులకు పొంగిపోయేరు కృష్ణశర్మ.

"మాకు గాయత్రి మంత్రం నేర్పరూ..." – మైఖేల్, జాఫ్రీ, ఇంకా నలుగురయిదుగురు అడిగారు.

"గాయత్రి మంత్రం పరమ పవిత్రమైంది. ఉపనయనం చేశాక నాన్నగారు దగ్గరుండి విధిగా ఉదయం గాయత్రి జపం చేయించేవారు. ఇందులో ఆధ్యాత్మికతపాటు ఆరోగ్య రహస్యమూ వుంది. ఉదయ సూర్యుడి లేత కిరణాలు శరీరానికి కావల్సిన 'డి' విటమిన్ అందిస్తుంది. దినం ప్రారంభానికి మనసు లగ్నంచేసి చేసే గాయత్రి జపం, మనసు నిర్మలంగా వుంచడంలో సాయపడ్తుంది. అంతేకాక 'ఓంకార' శబ్దంలో వచ్చే శబ్దతరంగాలు మెదడుని ప్రభావితం చేస్తాయి. మాట

ఉచ్ఛారణ మెరుగుపడ్తుంది. ఇపుడు గాయత్రితోపాటు, ప్రాణాయామమూ కలిపి ఒకేసారి చేస్తే సమయం కలిసి వస్తుంది. ఉచ్ఛ్వాస నిశ్వాసాల పట్ల నియంత్రణ ఏర్పడుతుంది" అంటూ ముందు కాగితం మీద గాయత్రి రాయించి, తరువాత ఊపిరి బిగబట్టి గాయత్రి మంత్రం జపించడం, ఊపిరి వదిలి, మళ్ళీ ఊపిరి బిగబట్టి గాయత్రి చేయడం పద్ధతి – ముక్కు మూసుకుని ఎలా చెయ్యాలో వివరించారు.

అందరూ ఆయన్ని అనుకరించి నాలుగైదుసార్లు చేశారు.

"రోజుకి ఐదారుసార్లతో ప్రాణాయామం ఆరంభించి గాయత్రి 108 సార్లు జపించాలి. కనక రోజు రోజుకి పెంచుకుంటూపోతే ఉచ్ఛ్వాసనిశ్వాసాల మీద మీకు ఎంతో నియంత్రణ వచ్చి ఆరోగ్యం బాగుపడ్తుంది."

"సార్ మీరు ఇంత గొప్పగా విడమర్చి, మాకు అర్థమయ్యే భాషలో, చెప్పబట్టి మాకు అన్ని వివరంగా తెలుస్తున్నాయి. మీ పురాణాలలో గొప్పతనం, నీతి చదివిన దానికంటె సహేతుకంగా, విమర్శనాపూర్వకంగా మా సందేహాలు తీర్చారు... మీ నోట నీతినియమాలు, ఆచారవ్యవహారాల వెనుక ఉన్న నిగూఢార్థాలు తెలిసేయి" – అందరూ ముక్తకంఠంతో అన్నారు.

"దాందేముందిలే బాబూ, నాకు తెలిసినది నలుగురితో పంచుకున్నాను. నేను చెప్పిన వాటిల్లో నా నిర్వచనం చెప్పాను. అది సరి అయిందో కాదో తెలియదు. ఈనాడు పిల్లలకి మంచి చెడ్డ, నీతి అవినీతి, పాపం పుణ్యం గురించి కథలుగా చెప్పి వారి మానసిక వికాసానికి తోడ్పడడం మీలాంటి యువత చెయ్యాలి. సమాజంలో పెరిగిపోతున్న హింస, దౌర్జన్యం, విధ్వంసాలు పెరిగిపోతున్న తరుణంలో పసి మనసులలో చిన్నప్పటినించి పాపభీతి కలిగించాలి. మన శతకాలు, నీతి కథలు విరివిగా చెప్పి దయ, క్షమాగుణాలు పెంచాలి. మన సంస్కృతి మనకిచ్చిన వరాలు భావితరాలకి చెప్పవలసింది మీరే. ఈ కంప్యూటర్ యుగంలో సమయం తీసుకుని మీ పిల్లలని సన్మార్గంవైపు నడిపిస్తే అదే నాకు మీరిచ్చే నిజమైన గురుదక్షిణ –" అన్నారు ఆవేశంగా. అందరూ ఆయనతో ఏకభవిస్తూ తలలూపారు.

* * * * * *

మర్నాడు ఉదయం ఆరుగంటలకి కృష్ణశర్మ స్నానంచేసి గాయత్రికి కూర్చోగానే వేణు స్నానం చేసి పట్టుపంచె కట్టుకుని తండ్రి దగ్గరికి వచ్చి కూర్చున్నాడు.

"నాన్నగారూ ఇవాళ నించి నేను గాయత్రి చేస్తాను. ఒకసారి అంతా సరిగా చెప్పి, ప్రాణాయామం చూపించండి –" అన్నాడు.

కృష్ణశర్మ మొహంలో వెలుగు.

శరత్ పరుగెత్తుకుని వచ్చి, "నేనూ స్నానం చేశాను. నాకూ గాయత్రి చెప్పండి తాతగారూ" అన్నాడు.

"ముందు ఉపనయనం అవాలి నాన్నా, ఆతరువాత మీ నాన్న నీకు చెపుతాడు లేరా!"

"అలా అయితే ఇప్పుడే ఉపనయనం చేసేయండి."

వేణు నవ్వి, "నాన్నగారూ జనవరి తరువాత మంచి ముహూర్తం చూసి చెప్పండి, వీడికి వడుగు చేద్దాం."

కృష్ణశర్మ ఆనందంగా తల ఊపారు.

* * * * * *

ఆరాత్రి కూతురింటికి హ్యూస్టన్ ప్రయాణం. అక్కడ నెల రోజులుండి ఇండియా ప్రయాణం. ఆ రోజు ఆదివారం.

ఉదయం శిష్యులందరూ వచ్చి అందరూ గురువుగారికి పాదాభివందనం చేసి, పూలమాలలు వేసి, శాలువ కప్పి పేరు పేరునా కృతజ్ఞతలు చెప్పి ఆఖరున అందరూ కలిసి ఆయన చేతికి ఓ కవరు అందించారు.

"ఏమిటిది?" – కృష్ణశర్మ కవరు తెరుస్తూ అడిగారు.

డాలర్లు... నోట్లు!

మైఖేల్ ముందుకు వచ్చి వినయంగా, "చాలా చిన్న గురుదక్షిణ. అందరం కలిసి మా సంతోషం కోసం ఇస్తున్నదాన్ని మీరు కాదనకండి" అన్నాడు.

కృష్ణశాస్త్రి నవ్వి నోట్లు లెక్కపెట్టారు. ఐదువేల డాలర్లు. మళ్ళీ నోట్లు కవరులో పెట్టి మైఖేల్‌కి అందించి, "వద్దు బాబూ, ఏదన్నా డబ్బుతో విలువకడితే దాని ప్రభావం పోతుంది – విలువ తగ్గుతుంది. నాకు కృతజ్ఞతలు చూపాలంటే నేను చెప్పినవి మీ పిల్లలకు నేర్పండి – మన సంస్కృతి, మన విలువలు ఆచరించినపుడు దొరికే ఆనందం ముందు ఈ డబ్బు విలువ ఏపాటి" అంటూ నమస్కారం చేశారందరికి.

"కాని మా సంతోషం..." – ఏదో చెప్పబోయారు కొందరు.

ఆయన చేత్తో వారిస్తూ, అంతలోనే ఏదో గుర్తువచ్చినట్టు మైఖేల్ చేతిలో కవరందు కున్నారు.

వేణు తెల్లబోయాడు.

కృష్ణశర్మ అందరి వంక తిరిగి, "ఈడబ్బు నేను తీసుకుంటాను. మీరందరూ అంగీకరిస్తే ఓ మంచి పనికి వినియోగిద్దామన్న ఆలోచన వచ్చింది నాకు. ఇండియాలో సంస్కృత పాఠశాలల్లో చదవడానికి ముందుకొచ్చే బీదవిద్యార్థులకి స్కాలర్‌షిప్‌లు ఇచ్చి చదివిస్తాను. మన సంస్కృతం బతికించుకుందాం. అందువల్ల వేదాన్ని రక్షించుకుందాం. మన వేదభూమిని ముందు తరాలవారికి మిగిల్చి అప్పగిద్దాం. ముందు తరాల వారికి వేదాల పాఠాలని చెప్పే సంస్కృత పండితులని తయారు చేయడానికీ డబ్బు ఉపయోగిద్దాం! ఏమంటారు?"

అందరూ సంతోషంగా చప్పట్లు కొట్టారు.

"మీరాపని చెయ్యడానికి ముందుకువస్తే మేము చందాలు పోగు చేసి ప్రతి సంవత్సరం పంపిస్తాం" – మైఖేల్, జాన్, జాఫ్రి... ముందుకు వచ్చి వినయంగా నమస్కారం చేసి అన్నారు.

"తప్పకుండా నేను ఉన్నన్ని రోజులు ఆ బాధ్యత నేను తీసుకుంటాను" – మనస్ఫూర్తిగా అన్నారు కృష్ణశర్మ.

***(రచన, డిసెంబరు, 2011)***

# తప్పెవరిది?

"అమ్మా! డబ్బులీయె, ఇయాల పరీక్ష ఫీజు కట్టడానికి ఆఖరిరోజే, ఇయాల యిస్తానన్నావుగా, బేగి యియ్యి" స్కూలు యూనిఫాం వేసుకుని చిన్న అద్దం ముందు నిలబడి తలదువ్వుకుంటూ అన్నాడు సురేష్.

వీధి గుమ్మం తుడిచి కల్లాపిజల్లి రెండు ముగ్గు గీతలు వేసి, అంట్ల గిన్నెలు తోముకుంటున్న వరమ్మ "రెండు నిమిషాలు ఆగరా నాయనా, ఈ గిన్నెలు రెండు కడిగేసి యిస్తాను". తోమిన గిన్నెలు లోపలికి తీసికెళ్లి పోయి దగ్గిర పెట్టి కొంగుతో చేతులు తుడుచుకుని ట్రంకుపెట్టె దగ్గరికెళ్లి మూత తీసింది. బట్టల కింద దాచిన చిన్నపర్సు చేతికి అందలేదు. గబగబ బట్టలు లాగి కిందామీదా వెతికి 'సురేషూ' కేకపెడ్తూ పెట్టె బోర్లించి వెతుకుతూ, 'అరేయ్ డబ్బులేవిరా, పెట్టిలో పెట్టా గదరా నిన్న సాయంత్రం, ఏవిరా అగపడవు' ఏడుపు గొంతుతో అంటూ కొడుకు వంక వెర్రిమొకమేసుకు చూస్తూ అంది. సురేషు తెల్లపోయాడు. 'ఈ పెట్టెలోనే పెట్టావా?' తనూ వెతుకుతూ అన్నాడు. 'నిన్న సునీతమ్మని బతిమిలాడి అడ్వాన్స్ అట్టుకొచ్చి ఇదిగోరా ఈ చిన్న పర్సులో ఎట్టి బట్టల అడుగున దాచి పెట్టారా...' ఏడుస్తున్నదల్లా చటుక్కున ఆగిపోయి శివంగిలా ఒక్క ఒదుటున గుడిసె బయట అరుగుమీద నులకమంచంలో పడుకున్న మొగుడి దగ్గరకెళ్లి కుదిపి కుదిపి లేపి, లాగి పడేసింది కింద. 'దొంగ సచ్చినోడా! ఆడదాన్ని కట్టబడి పాచిపన్లు చేసి నాలుగు డబ్బులు తెచ్చి పిల్లాడిని సదివించుకుంటున్నారా... నీ జిమ్మడ, పరీచ్చకని దాచిన డబ్బులట్టికెళ్లి తాగడానికి సేతులు ఎట్టా వచ్చాయిరా... ' మొగుడ్ని దబదబ బాది, తన తల బాదుకుని 'సావనైనా సావవు... పాపిష్టోడా...' వరమ్మ కింద కూలబడి మొగుడి

జుట్టు పట్టుకొని గుంజి తిట్లకి లంకించుకుంది. మత్తులో పడున్న నర్సయ్య కళ్లిప్పాడు. 'ఏటే, పొద్దుగాల ఏందే నీ గోల, ఏటే శివాలెత్తిందా, నన్నే కొడతావా?' తూలిపోతూ లేచి నిలబడి వరమ్మ జుత్తు పట్టుకుని వంచి వీపు మీద దభిదభి గుద్దాడు. 'నన్నే కొడతావే' హూంకరించాడు. వరమ్మ భద్రకాళిలా లేచి జుత్తు విడిపించుకుని 'ఏవిరా, డబ్బు లేయిరా, పిల్లాడి పరీచ్చ కోసం తెచ్చి పెట్టా దొంగనాయాలా, పెట్టెలో డబ్బేమయింది... నా డబ్బు నాకీయి' నర్సయ్య చేయి గుంజుతూ అరిచింది. నర్సయ్య విసురుగా వరమ్మ చేయితీసేసి 'ఏ డబ్బులు... నాకేటి తెల్వదు... నే తీయలేదు' కోపంగా అన్నాడు. 'తీయకపోతే పీకలదాకా తాగడానికి డబ్బులేడనించి వచ్చాయిరా. నిన్న సాయంకాలం డబ్బుతెచ్చి కూరల దుకాణానికి ఎల్లగా సూచి కాజేసి పీకల దాకా తాగొచ్చినావు, పిల్లగాడి పరీచ్చకి ఎలా కట్టాలి...' ఏడుస్తూ అంది. సురేషు బిక్కమొగం పెట్టుకొని 'అమ్మా, మరెట్టాగే, యియాల ఆఖరిరోజు డబ్బు కట్టడానికి. లేకపోతే పరీచ్చకి కూర్చోనీయరే... ఏడుపు గొంతుతో అన్నాడు. 'ఏం సెయ్యనురా నాయనా, మాష్టరుగారికి సెప్పరా... రేపు కడ్తానని.. ఎలాగైనా పట్టుకొచ్చి యిస్తారా...'

'మాస్టారేం సేస్తారు, ఆఫీసులో కట్టాలి, ఆఫీసులో వప్పుకోరే... ఫైనుతో కట్టే ఆఖరి రోజు ఇయాల' అంటూ నర్సయ్య వంక కోపంగా చూసి 'నీవీయవు డబ్బులు, అమ్మ కష్టపడి పనిచేసి తెచ్చింది కాజేస్తావా? తూ.. నే పరీక్ష ఎలా రాయాలి..' అన్నాడు చీదరింపుగా. 'పోరా, ఎదవా, నీవీ పరీచ్చరాసి కలక్టేరువయిపోతావా ఏందిరా, పదో క్లాసు చదివితే ఏం ఉద్యోగాలు రావు. సుబ్రంగా మేస్త్రి పని నేర్చుకో అని సెపితే ఇన్నావా, మీ అమ్మకి కొడుకును కలక్టేరు చెయ్యాలని ఆశ. దాని మాట యినుకున్నావంటే రెంటికి చెడ్డ రేవడిరా నీ బతుకు, రేపటి కాడనుండి నా ఎంటరా పని నేర్చుకుందుగాని...'

'నోరుముయ్యరా తాగుబోతు నాయాలా... సుబ్రంగా సదుకునే పిల్లాడిని, ఆడకూతురు కట్టపడి సదివిస్తుందనే గానంలేకుండా పిల్లాడి పరీచ్చ డబ్బులట్టుకుపోయి తాగినోడివి, నీవసలు మడిసివట్రా, ఏం జన్మరా, ఎందులో నన్నా పడిసస్తే బతికిపోతాను' మెటికలు విరిచి శాపనార్థాలు పెడ్తూ తలబాదుకుంది. 'అమ్మా, మరెట్టాగే, పరీక్ష రాయనీయరే...' ఏడుపు గొంతుతో అన్నాడు. 'ఈ పూటకి ఏదో చెప్పరా నాయనా, రేపు తెచ్చిస్తాగా, మా నాయన ఎల్లరా' బతిమిలాడి కొడుకుని పంపింది వరమ్మ.

✶ ✶ ✶ ✶ ✶ ✶

'సురేష్... ఆగరా... ఏట్రా పిలుస్తుంటే పలకవేమిట్రా...' వగరుస్తూ వచ్చాడు కిట్టప్ప. 'ఏట్రా ఏటయింది... ఎందుకురా ఏడుస్తున్నావు' తనని చూసి చొక్కా చేత్తో కల్లు తుడుచుకుంటున్న సురేష్‌ని చూసి అన్నాడు. ఏం లేదన్నట్లు తల అడ్డంగా తిప్పాడు. అయినా కళ్ళనీళ్ళు మళ్లీ నిండాయి. ఏవయింది. మీ అయ్య తిట్టాడా, కొట్టాడా...' ఆరాటంగా అడిగాడు. 'నా పరీక్ష ఫీజు దొంగతనంగా తీసుకుపోయి తాగేశాడురా మా నాన్న, పాపం మా అమ్మ ఎవరినో బతిమిలాడి తెచ్చి పెట్టెలో దాచి పెట్టింది. పట్టుకుపోయాడు. ఇయాల ఆఖరిరోజు ఫీజు కట్టడానికి, నేను పరీక్షరాయడానికి లేదురా. మా అమ్మ ఎలాగన్నా రేపు తెచ్చిస్తానంది. సార్ ఒప్పుకుంటారో లేదో' దిగులుగా చెప్పుకొచ్చాడు.

'అరెయ్.. ఏడవకురా... నాదగ్గర డబ్బుంది, నేనిస్తా... యియాల కట్టేయ్, రేపు మీ అమ్మ తెచ్చిచ్చాక ఇద్దూగానీలే...' బుజం మీద చెయ్యేసాడు. 'నీకాడ ఎక్కడిదిరా అంత డబ్బు' ఆశ్చర్యంగా చూశాడు సురేష్... 'మీ అయ్య మా అయ్య కథ ఒకటే గదరా ... ఇద్దరూ తాగి తందనాలు ఆడతారు డబ్బు లట్టుకుపోయి...' అనుమానంగా చూశాడు. 'పదరా, అయన్నీ తరువాత. స్కూలు టైమయింది. ముందు ఫీజు కట్టేయ్' సురేష్ చేయి పట్టి లాక్కెళ్ళాడు కిట్టప్ప.

* * * * * *

'కిట్టప్పా, థ్యాంక్స్‌రా, నీవిచ్చావు గనక టైముకి ఫీజు కట్టేసాను, లేకపోతే ఈ ఏడాది పోయేది – అమ్మ యిచ్చాక రేపు ఇచ్చేస్తారా డబ్బు' 'పర్లేదు లేరా, యిద్దూగాని' నిర్లక్ష్యంగా అన్నాడు.

'కిట్టప్పా, నీదగ్గిర అంత డబ్బెక్కడిదిరా... మీ అయ్య కూడా ఇంట్లో డబ్బీయడు. తాగి తగలేస్తాడు గదరా' అమాయకంగా అడిగాడు సురేష్.

'డబ్బుదేం ఉందిరా అదే వస్తది. తెలివి వుండాలి కాస్త సంపాదించడానికి' తలెగరేసి గర్వంగా అన్నాడు.

'సంపాయించావా... ఎలారా ... ప్లీజ్ నాకూ చెప్పరా... మా అమ్మ చాలా కష్ట పడుతుంది డబ్బుకి, చెప్పరా' ఆశగా అడిగాడు.

'పోరా, నీవుత్త పిరికి గొడ్డువి, ధైర్యం వుండాలిరా, హుషారుండాలి సంపాదించ డానికి' కాలరెగరేస్తూ ఫోజు కొట్టాడు.

'ప్లీజ్, నేనూ చేస్తారా. ఏంపనో చెబితే నేనూ బాగా చేస్తా... నాకాడ బట్టలన్నీ

చిరిగిపోయి, జోళ్లు తెగిపోయాయి. అమ్మదగ్గర డబ్బు తినడానికే చాలదు. అయ్య రూపాయివ్వడు సరిగదా అమ్మని తన్ని పట్టుకుపోతాడు. నీకు తెలుసుగదరా ఇంటి సంగతి... మీ అయ్యా అంతే గదా...'

'అందుకే గదరా నేను సంపాదిస్తున్నా... అమ్మకి సాయం చేస్తున్నా.'

'మరి నాకు చెప్పరా...' ఆశగా అడిగాడు.

'అరేయ్ ఇది అందరూ చేసేది కాదు, రగస్యంగా సెయ్యాలి, ఎవరికీ చెప్పేది కాదు. నీవల్ల కాదులే...'

భయంగా చూశాడు సురేష్ – 'మరి నీవెలా సేస్తన్నావు – మీ అమ్మ నిన్ను అడగదా డబ్బెక్కడదని' అనుమానంగా చూశాడు.

'ఏంటిరా అడిగేది... అడిగితే ఏదో సెపుతా, తిండికి లేనోళ్లకి డబ్బు కళ్లబడగానే నోరు మూత పడ్తది' నిర్లక్ష్యంగా అన్నాడు.

'అరేయ్, ఈ బూట్లూ, వాచి, మంచి బట్టలు అన్నీ చూసి అడగరా ఎవరూ –'

'అమ్మ మొదట్లో నిలేసింది – నే గట్టిగా చెప్పా ఏదన్నా అంటే ఇంట్లోంచి పోతాననగానే ఇంకేటంటది? అయ్య అయితే ఓ నూరు రూపాయలు చేతిలో పడగానే నోరు మూసుకు సల్లగా జారుకుంటాడు...'

'అరే, ఆ పనేటి సెప్పరా, సేయగలనో లేదో సూస్తా... వరేయ్ ఈ పరీక్షలయిపోతే కాలేజీలో సదవాలనుంది. డబ్బు కావాలి గదరా... నేకపోతే ఏదన్నా ఉద్యోగం సూసుకోవాలిరా...'

'ఏట్రా నీ పదోక్లాసు సదూకి ఏం ఉద్యోగం సేస్తావురా' హేళనగా అన్నాడు.

'మా అమ్మ పనిచేసే బ్యాంకు మేనేజరు గారిని అమ్మ బతిమిలాడితే అటెండరు ఉద్యోగం యిప్పిస్తాలే అన్నాడట.'

'పోరా అటెండరు అంటే ఏంట్రా, బంట్రోతు ఉద్యోగంగా... ఏటొస్తుందిరా...' హేళనగా నవ్వాడు.

'మరందుకే చెప్పరా... నీవు చేసే పని నాకూ యిప్పించరా'.

'సరేలే, రేపు ఓ చోటికి తీసికెడతాలే, వరేయ్, ఈ సంగతి ఎక్కడా నోరిప్పావంటే అంతే, అసలు మీ అమ్మకే కాదు ఎవరి దగ్గర మాట్లాడవద్దు. అలా అయితేనే నే తీసుకుపోతా' బెదిరిస్తూ అన్నాడు. సురేష్ తలూపాడు.



వారం పదిరోజుల తరువాత, ఆరోజు వంట్లో బాగుండక జ్వరం మాత్ర వేసుకుని వరమ్మ పడుకుంది. పదకొండు గంటలవేళ పక్కింటి అవ్వ వచ్చి లేపి గాభరాగా 'వరాలు... వరాలు... పోలీసులు మీ సురేష్‌ని పట్టుకుని లాక్కొచ్చారే... నిన్నడుగుతుండరు. బయటికి రాయే బేగె...' ఒగరుస్తూ భయంగా అంది. వరమ్మ కళ్లిప్పి... అవ్వ అన్నది అర్థం కాక అయోమయంగా చూసింది. 'పోలీసులే సురేష్‌ని పట్టుకుని వచ్చారు...' మళ్లీ అంది. వరమ్మ దిగ్గున లేచి, బయటికి ఒక్క ఉదుటున వచ్చింది. ఒక పోలీసు సురేష్ చేతికి బేడీలు వేసి పట్టుకుంటే ఇనస్పెక్టరు లాఠీ ఊపుతూ వరమ్మ బయటికి రాగానే 'వీడు నీకొడుకేనా?' అడిగాడు అధికారికంగా – వరమ్మ బిక్కచచ్చిపోయి తలూపుతూ 'ఏటిబాబు ఏటయింది... యీడేం సేసినాడు... మీరెందుకు అట్టుకొచ్చారు, సురేషూ ఏటయిందిరా... ఏం చేశావురా...' తల దించుకుని ఏడుస్తున్న కొడుకు దగ్గరికి వెళ్లి గాభరాగా అడిగింది. "బాబూ ఇన్‌స్పెక్టరు బాబూ, ఈడేం సేసాడు బాబూ ఎందుకు పట్టుకున్నారు... ఏటిరా సురేషూ చెప్పవేందిరా...' కొడుకు భుజాలు పట్టుకు గుంజుతూ అడిగింది. 'నాకేటి తెలియదే అమ్మా... నేనేం చెయ్యనేదే' అన్నాడు సురేష్.

'నోరు మూయరా రాస్కెల్, ఏం చెయ్యలేదట... ఏం చెయ్యకపోతే నిన్ను బేడీలేసి తీసుకురావడం సరదాకి అనుకున్నావా' లాఠీతో సురేష్ గడ్డం ఎత్తి కఠినంగా అన్నాడు.

'ఏటి బాబూ దొంగతనం సేసాడా, స్కూల్లో ఏదన్నా దొంగిలించాడా సెప్పండి బాబూ' దండం పెడుతూ ఏడుపు గొంతుతో అంది. 'చిన్న దొంగతనం అయితే రెండు తగిలించి భయపెట్టి వదిలేసేవారం... నీ కొడుకు పెద్ద కేడీ అయిపోయాడు. డ్రగ్గులు సప్లయ్ చేసే బ్రోకరు అయిపోయాడు...' హేళనగా అన్నాడు. వరమ్మకి ఏం అర్థం కాక తెల్లపోయి చూసింది. 'ఏటలా చూస్తావు... అర్థం కాలేదా? నీ కొడుకు మత్తుమందులు సప్లయ్ చేస్తున్నాడు, డబ్బు లార్జిస్తున్నాడు.... నీకు తెలవకుండానే వుందా? నీ కొడుకు నీకు డబ్బులు పట్టుకొచ్చి ఇవ్వడం లేదా... చెప్పరా వెధవా.. పట్టుమని పదహారేళ్ళు లేవు, డ్రగ్గు రాకెట్‌లో చేరిపోయి పనిచేస్తున్నావా? ఎప్పటినుంచి చేస్తున్నావు చెప్పరా రాస్కెల్... నోరిప్పు... లేదంటే మక్కెలిరగదంతా, ఏవమ్మా... కొడుకు స్కూలుకెడుతున్నాడో... మత్తుమందులు సప్లయ్ చేస్తూ తిరుగుతున్నాడో చూసుకోవద్దా... కొడుకు డబ్బులార్జించి తెస్తున్నాడని సంబరపడి గమ్మునూరుకున్నావా... పిల్లాడి దగ్గర డబ్బు లెక్కడినించి వస్తున్నాయని అడగద్దా... ఇద్దరూ పదండి పోలీస్ స్టేషన్‌కి.. అక్కడ చెబుదురుగాని కథలు – పద

జీపెక్కండి. "బాబూ, ఇన్‌స్పెక్టరు బాబూ మీరేటంటున్నారు. నా కొడుకు మత్తు మందులు ఇవ్వడమేంటి, ఆడు స్కూల్లో సదూతాడు. మేష్టర్లందరూ చెపుతారు అడగండి కావలిస్తే, గాని నీతిలేని పనులు సేసేవోళ్లంగాదు, సురేష్ మంచి కుర్రాడు, ఆడికి ఆ తాగుబోతు తండ్రి బుద్ధులు రాలేదు, కష్టపడి సదూకుంటున్నాడు. మీరెవరనుకుని యీడ్ని పట్టుకున్నారో' గట్టిగా అంది.

'అలాగ... ఇన్నాళ్ళు సక్కా సదివేడేమో.. డబ్బు రుచి మరిగి దందాలోకి దిగాడు. స్కూలు బ్యాగులో పెట్టుకుని మత్తుమందు పేకట్లు ఇచ్చిరమ్మన్నచోటికి చేర్చి డబ్బు తీసుకుంటున్నాడు. రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకున్నాం. చెప్పరా.. ఎంత డబ్బిస్తారురా పేకట్టు యిచ్చినందుకు.. ప్యాంట్ జేబులో చెయ్యిపెట్టి రెండొందల రూపాయల నోట్లు తీసి వరమ్మ కళ్లముందు ఆడించాడు. వరమ్మ అయోమయంగా చూసింది. తరువాత సురేష్ వంక అపనమ్మకంగా చూసింది. 'ఏటిరా... ఈ బాబు సెప్పింది నిజమా...' అపనమ్మకంగా, అయోమయంగా అడిగింది.

సురేష్ భోరున ఏడవడం మొదలుపెట్టాడు. 'నాకు తెలవదే అమ్మా – ఒక పేకట్టు ఆళ్ళు చెప్పిన చోట యిస్తే వంద, రెండొందలు ఇస్తామన్నారు. ఆ పేకట్లో ఏటుందో నాకు తెలవదు...' అమాయకంగా అన్నాడు. వరమ్మ తెల్లబోతూ చూసింది. 'ఎవరొచ్చి ఇచ్చారు పేకట్టు, ఎక్కడిమ్మన్నారు..' ఆరాటంగా అడిగాడు ఇన్‌స్పెక్టరు. 'అసలు నిన్ను వాళ్లెలా తీసుకున్నారు. నిన్ను వాళ్లదగ్గర కెవరు తీసుకెళ్లారు'. సురేష్ బెదురుగా చూశాడు. 'ఆళ్లెవరో నాకు తెలవదు – నాకాడికొచ్చి ఒక పేకట్టు యిచ్చి – ఆ కిళ్లికొట్టుకాడ ఇవ్వాలి – యిచ్చే ముందు 'స్వీట్ సిక్స్‌టీన్' అనాలి – అపుడా కొట్టువాడు పేకట్టు తీసుకుని డబ్బిస్తాడు. నీకు పేకట్టు యిచ్చే వాడొచ్చి నీ వయసెంత అంటే 'స్వీట్ సిక్స్‌టీన్' అనాలి. అది నీ కోడ్ వర్డ్. అది సెపితేనే పేకట్టు యిస్తారు. డబ్బిస్తారు. ఈ కోడ్ వర్డ్ ఎవరికీ చెప్పకూడదు. చెపితే తల తెగుతుంది. పోలీసులు పట్టుకెళ్లి జైల్ల పెడతారు. నీ దగ్గరికొచ్చి నీ వయసెంత అంటే ఆ మాట గుర్తు చెప్పాలి.."

'పేకట్లో ఏటుంది అని నీవడగనేదా?' ఇన్‌స్పెక్టర్ అడిగాడు.

'అడిగా... అది నీకనవసరం. తెల్సుకోనక్కరలేదు' అన్నారు. బ్రౌన్ పేపరు నాలుగు పుస్తకాలు కలిపిన ప్యాకెట్టు సైజు యిచ్చి రావడం తప్ప నోరు విప్పకూడదు. ఎవరితోనయినా చెపితే చస్తావు అని బెదిరించారు. ఆ పాకెట్టులో ఏటుందో నాకు తెలీదు. చిన్న పని చేస్తే రెండొందలిస్తామన్నారు అని వప్పుకున్నా. వెళ్లి కొట్టుకాడ

ఎవరూ లేనపుడు, ఎవరూ చూడనపుడు గబుక్కున ఇవ్వాలి... ఎవరన్నా వస్తే చాక్లెట్టు ఒకటి కొనాలి. ఎవరూ ఏం అనుమాన పడకుండా... కిళ్ళీ కొట్టువాడు అడిగిన కోడ్ వర్డ్ తప్ప మరేం మాట్లాడకుండా వెళ్ళాలి. డబ్బులు తీసుకోడం కూడా ఎవరూ చూడనపుడు చటుక్కున తీసి జేబులో పెట్టుకోవాలి అని చెప్పారు' వెక్కుతూ అన్నాడు.

'ఇదంతా ఎవరు చెప్పారు – అసలు వాళ్లదగ్గరికి నిన్నెవరు తీసుకెళ్లారు...'

సురేష్ ఇబ్బందిగా చూశాడు... మాట్లాడలేదు. 'చెప్పు' గద్దించాడు ఇన్‌స్పెక్టర్.

'చెబితే సంపుతాం అన్నారు' బెదురుగా చూశాడు. 'మరేం ఫరవాలేదు. నిన్నెవరూ ఏం చేయలేరు. పోలీసులు దగ్గరుండగా ఎవరేం చేయలేరు...' వరమ్మ ఏడుస్తూ 'సెప్పరా ఇదంతా ఎప్పుడు జరిగిందిరా... ఎవరు సెప్పారు యిదంతా నీకు.'

'కిట్టప్ప .. ఆడు సెప్పాడు. డబ్బు సంపాయించేందుకు ఉపాయం. స్కూలు ఫీజు కట్టడానికి ఆ రోజు డబ్బిచ్చినప్పుడు అడిగితే సెప్పాడు. ఇంట్లో డబ్బు నేదు. అయ్య డబ్బీయడు. నీవు తెచ్చేది మనకు సాలడం లేదు – నేనూ సంపాదిద్దామని ఆశపడ్డా.'

'కిట్టప్పా.. వాడెవడు, నీ దోస్తా... ఎక్కడుంటాడు'

'మా ఇంటిదగ్గరే సాబ్... ఆడు ఈ మధ్య సెడిపోయాడు. డబ్బు లట్టుకొచ్చి యిట్టం వచ్చినట్టు ఖర్చుపెడ్తున్నడు. ఆడి అమ్మ అడిగితే కథలు సెపుతున్నడు. బూట్లు, వాచి, మంచి బట్టలేసు దర్జాగా తిరగతన్నడు. ఆడితో స్నేహం వద్దని సెప్పా యీడికి. ఆ ఎదవ ఈడ్నీ ముంచాడు. నా కొంపదీశాడు' ఏడుస్తూ అంది వరమ్మ.

'యీడీ మధ్య ఓ నూరు రూపాయలట్టకొచ్చి యిస్తే ఎంటనే అడిగితే ఎవడో డబ్బున్న యీడితో సదివేవాడు నోట్సు రాసిపెడితే యిచ్చాడన్నాడు. ఇంకోరోజు యింటికి సామాను పట్టుకొచ్చాడు... దుకానంలో సాయంత్రం పద్దులు రాస్తే యిచ్చారన్నారు. ఏదీ నా బాబు నా కట్టం సూడలేక కట్టబడి సంపాయించి తెచ్చాడనుకున్నాను. అంతేబాబు అంతకంటే యింకేం డబ్బులు నాకీయలేదు.'

'ఏరా, ఎన్నాళ్ళుగా చేస్తున్నావు... ఎన్నిసార్లు యిచ్చావు పేకట్లు?' 'రెండేసార్లు సార్.... మూడోసారి 'మీ పోలీసులొచ్చి పట్టుకున్నారు...' గిల్టీగా చూశాడు.

'ఈడు కొత్తగా మొదలెట్టాడు... అనుభవంలేక దొరికిపోయాడు, ఈడియట్.' 'బాబూ... మీకెలా దొరికాడు యీడు' వరమ్మ భయంగా అడిగింది.

'ఈమధ్య ఈ మందుల దందా జోరుగా సాగుతోంది అని పోలీసులు నిఘా ఎక్కువ చేశారు. ఈడు కిల్లీ కొట్టుకాడ బెదురు చూపులు చూస్తూ తచ్చాడుతుంటే మఫ్టీలో ఉన్న పోలీసు కంటపడ్డాడు. ఆడికి అనుమానం వచ్చి దూరంవెళ్లి చాటుగా నిలబడి చూస్తుంటే వీడు ఎవరూ లేకుండా చూసి, పేకట్టు అందించి చటుక్కున డబ్బులు జేబులో కుక్కుకోవడం చూసి అనుమానం వచ్చి గబగబ వెళ్ళి పట్టుకున్నాడు... ఆ కిల్లీ కొట్టువాడు ఎవరో వచ్చి పేకట్టు తీసికెడతారని బుకాయించాడు. వాడ్ని తన్ని స్టేషన్‌కి ఇద్దరినీ లాక్కొచ్చాడు... ఈ దందాలో నీ వాటా ఉందా అని తేల్చుకోడానికి యీడ్ని ఇంటికి తీసుకొచ్చా... పద, నీవూ జీపెక్కు. పోలీసు స్టేషనులో జరిగిందంతా చెప్పాలి... ఆ కిట్టుగాడిని పట్టుకుంటాం.. వీళ్ళ ద్వారా అసలు వాళ్లెవరో కనిపెట్టాలి. పదండి జీపెక్కండి' ఇన్‌స్పెక్టర్ కదిలాడు.

గుమ్మంలో పోలీసులని చూసి దొంగచూపులు చూస్తూ భయంగా నక్కాడు నర్సయ్య ఇంట్లోకి రాకుండా. మొగుడు కంట ప డగానే వరమ్మ శివాలెత్తిందానిలా ముందుకు ఉరికి మొగుడు జుత్తు లంకించుకుని "సూడరా, సూడు నీవల్ల నీ తాగుడు వల్ల నీ కొడుకు జైలుకి ఎలతన్నాడు... బిడ్డ మొగం సూడరా... ఆడి బతుకులో నిప్పులు పోశావురా... థూ... ఏం జన్మరా... సావరా ఎందులోనన్నాపడి...' అలుపువచ్చేవరకు తిట్టింది వగురుస్తూ... 'బాబూ! ఇన్‌స్పెక్టరు బాబూ, ఈ పాలికి దయసూడు బాబు. ఇదిగో ఇలాంటి తాగుబోతు ఎదవలు మొగుళ్లయితే నాలాంటి ఆడోళ్లు ఏం చేస్తారు. ఈడిలాంటి బిడ్డలు ఏమవుతారు. డబ్బులొస్తాయని ఆశపడి పాడు పనులకి దిగితే అన్నెంపున్నెం ఎరగని యీడిదా తప్పు. ఈ తాగుబోతు సచ్చినోడిని జైల్లో ఏయండి బాబూ బతికిపోతాను' – తలబాదుకుంటూ ఏడ్చింది. ఇన్‌స్పెక్టరు సానుభూతిగా చూశాడు. నాలుగు డబ్బులొస్తాయని ఆశగా తెలిసీ తెలియకుండా ఇలాంటి వాటిలో ఇరుక్కుని, ఈ దంధాలో పీకలదాకా కూరుకుపోయిన వాళ్లెందరినో పట్టుకుంటారు. కాని ఏం లాభం.. అసలు వాళ్లు బయటపడరు. చిన్న చేపలే వలలో పడతాయి అన్నదీ పోలీసులకీ తెలుసు. కాని న్యాయం, చట్టం... వీటికి అతీతంగా తనలాంటి వాళ్ళేం చేయగలరు. 'పదమ్మా, సెప్పేదేదో పోలీసు స్టేషను దగ్గర పెద్దసారుకు జెప్పు, అయ్యా మొదటిసారని చెప్పి వేడుకో... ఏం జరుగుతుందో చూద్దాం. పద జీపెక్కి...పదరా...' ఈసారి ఇన్‌స్పెక్టర్ గొంతులో కాఠిన్యత స్థానే సానుభూతి కనపించింది. ఇలాంటి పిల్లలు ఎందరో బలి అయిపోతున్నారన్న బాధా వుంది ఆ గొంతులో.

***(జయంతి, ఏప్రిల్ – జూన్ 2010)***

# భావన

'డాడీ, నేను మళ్ళీ పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను. ఉదయం కాఫీ తాగుతూ పేపరు పట్టుకు బాల్కనీలో కూర్చున్న తండ్రి దగ్గరికి వచ్చి అంది భావన. ఆయన పేపరులోంచి తలెత్తకుండానే 'ఆహా, అలాగా!' అని నిర్లిప్తంగా అన్నారు. భావన మొహం ఎర్రబడింది. తండ్రి అంత పట్టించుకోకుండా తన విషయం కాదన్నట్టు మాట్లాడడంతో ఉక్రోషం వచ్చింది. 'పెళ్ళి చేసుకోవాలనుకున్నది మీ కూతురు. ఎవరిని చేసుకుంటుందో కూడా తెలుసుకోవాలనుకోవడంలేదా' రెట్టించింది. 'తెలుసుకుని ఏం చెయ్యాలి...? నువ్వన్నీ నిర్ణయించుకునే చెప్తున్నావనుకుంటున్నాను. ఇప్పుడు ఇంక నేనదేం ఉంది? నేనేమన్నా వద్దంటే మానేస్తావా? పేపరు కాస్త పక్కకు తప్పించి కూతురి మొహంలోకి చూస్తూ అన్నారు ప్రసాదరావు. భావన మొహం మరికాస్త ఎర్రబడింది. కోపంగా చూసి "అంటే, నేనెవరిని చేసుకున్నా ఆ విషయం మీకనవసరమా!' అంది. 'మరి అంతకంటే అనటానికి ఏం ఉంది? మా అభిప్రాయాలు, మా ఇష్టాయిష్టాలు, మా సలహా సంప్రదింపులు, మేం చెప్పడం నువ్వు వినడంలాంటివేమన్నా ఉన్నాయా?' ఆయన ప్రతి మాటా నొక్కి మాట్లాడుతూ కూతురి పట్ల ఉన్న అసంతృప్తిని వ్యక్తం చేశారు.

ఏదీ అనబోయి, కాస్త నిలదొక్కుకుని – "అంటే కశ్యప్‌కి డైవర్స్ ఇచ్చానని మీ కోపం... నాకిష్టం లేనివాడితో సర్దుకు బతుకుతూ బయటికి రాకుండా మీ ఆనందం కోసం ఆ కాపురం చేసుకుంటూ ఉంటే నేను చాలా మంచిదాన్నయ్యేదాన్ని. నాసుఖం, ఆనందం వెతుక్కుంటే అది మీకు నచ్చదు అవునా? అంత సర్దుకు బతకాల్సిన అవసరం నాకేం లేదు" పొగరుగా అంది. ప్రసాదరావు అదోలా నవ్వారు – "నీకు

మొదలు వంచి మేం ఆ పెళ్ళి చేసినట్టు గుర్తు లేదు నాకు. నీ కొలీగే అని ఏణ్ణర్ధం స్నేహాలు, ప్రేమలు, షికార్లు చేసి అతన్ని ఎన్నుకుని, పెళ్లి చేసుకుంటానని నీవే మాకు చెప్పినట్టు గుర్తు."

ఆ మాటల్లో వ్యంగ్యం అర్థం చేసుకున్నాక, "నా భావాలకి, ఎక్స్‌పెక్టేషన్స్‌కి అతను సరితూగలేదు. పెళ్ళికి ముందున్న అతనికి పెళ్ళి తరువాత కశ్యప్‌కి అసలు పోలికే కనపడలేదు. ఏదో ఒక మొగుడు, కట్టుకున్నానని సర్దుకు బతకాల్సిన అవసరం నాకు లేదు. నా అంచనాలు తలకిందులయ్యాయి. చేసిన పొరపాటు సర్దుకుని ఇంకో ఛాన్స్ తీసుకోవాలనుకోవడంలో తప్పు కనిపించిందా మీకు?" అంటూ ఆయన్ని దులిపేసింది.

ఆవేశంగా ఉన్న కూతురి వంక చిరునవ్వుతో చూశాడు ప్రసాదరావు. "నేను ఇదివరకు చెప్పినట్టు గుర్తు – జీవితంలో ఆశించినవి, కోరుకున్నవి మనం అనుకున్నట్టు జరగాలని ఆశపడ్డవి మనకు ఎవరూ ఓపళ్ళెంలో పెట్టి అందించరు. అవి అందుకోవడానికి మన వంతు ప్రయత్నం మనం చేస్తే కొంతవరకు అందుతాయి. ఎదుటివాళ్ళే మనకు కావలసినవన్నీ అందించాలని అనుకోవడం అవివేకం. అలా ఆశించినవారు తెలివి తక్కువవారు – అలాంటివారిలో నీవు ఒకర్తివి. జీవితంలో – అన్నిటికంటే సంసారంలో అవతలి మనిషి నించి మనం ఏదో ఆశించే ముందు మనం ఏం చేశాం, ఏం అందించాం అవతలివారికి అని తరిచి చూసుకోవాలి. ఎప్పుడూ ఒకే వైపు నించే ఆశించడం అవివేకం అని నీకానాడే చెప్పాను. అదే ఇప్పుడూ చెప్తున్నాను. రెండోసారన్నా నే చెప్పింది ఆలోచిస్తే మంచిది" తండ్రి మాట్లాడుతున్నంత సేపూ మొహం గంటుపెట్టుకు కూర్చుంది.

'కార్తీక్ అలాంటివాడు కాదు' చాలా నమ్మకంగా అంది. "ఓ కార్తీక్ అంటే ఆ కుర్రాడా... ఇంటికి వస్తుంటాడు. నువ్వు అతనితో బయటికి వెళ్తుంటావు గదా" అన్నాడాయన. "ఆ.. అతనే" ఉత్సాహంగా అంది భావన. 'మా ఆఫీసులోనే జాయిన్ అయ్యాడు. చాలా సరదాగా, చలాకీగా, స్మార్ట్‌గా ఉంటాడు' అందామె. 'ఆహా... ఈ మాటలు కశ్యప్ అప్పుడు కూడా చెప్పినట్టున్నావు' నవ్వుతూ అన్నారాయన. భావన మొహం మాడ్చుకుంది. "దెప్పనక్కరలేదు. అప్పుడు పొరపడ్డాను. తొందరపడ్డాను. అర్థం చేసుకోలేకపోయాను" కటువుగా అంది.

"ఈసారి తొందరపడలేదనుకుంటాను. మళ్ళీ అదే మాట చెప్తున్నాను. ఆడయినా, మగయినా ప్రేమికులుగా ఉన్నట్టు భార్యాభర్తలయ్యాక ఉండరన్న సత్యం గ్రహించాలి.

ప్రేయసిగా చూపించే ప్రేమ, అభిమానం, ఆరాటం, ఉత్సాహం అన్నీ పెళ్ళయ్యాక బాధ్యతాయుత జీవితంలో మరుగుపడ్తాయన్నది అమ్మాయిలు, అబ్బాయిలు గుర్తించండి. ఇంతకంటే చెప్పేదేమీ లేదు.” పేపరులో ముఖం దించుకున్నారాయన. ఆమె తండ్రి వంక కోపంగా చూసి విసవిసా వెళ్ళిపోయింది.

“ఏంటి, ఏం జరిగింది? అది చాలా రుసరుసలాడుతూ వెడుతోంది?” వంటింట్లోంచి వస్తూ సునంద అడిగింది. “నీకూతురు మళ్ళీ పెళ్ళి చేసుకుంటుందిట..” అన్నారాయన. “మీ పర్మిషన్ కావాలటాదానికి? మీరేం అన్నారు? ఇంతకీ, ఎవరా అదృష్టవంతుడు” నవ్వింది సునంద.

“అదృష్టవంతుడనాలా... దురదృష్టవంతుడనాలా...” ప్రసాదరావు నవ్వాడు. “కార్తీక్... ” గుంభనంగా అన్నారు.

“అనుకున్నాను. దాని తిరుగుడు, దాని రాకపోకలు చూసి అనుమానం వచ్చింది. సరే, అదే చెప్తుంది కదా అని ఊరుకున్నాను. దీనికంటే చిన్నవాడు, ఆఫీసులో జూనియర్. దీనికెలా నచ్చాడో మరి.”

“కశ్యప్‌లా కాదట. చాలా సరదాగా, లైవ్లీగా ఉంటాడట” కాస్త వ్యంగ్యంగా అన్నారు. “దీని మొహం. అసలు దానికేం కావాలో దానికే తెలుసా, మనుషులని అంచనా వేయడం తెలిస్తే కశ్యప్‌లాంటి మంచివాడిని దూరం చేసుకునేదా! ఈ కుర్రాడు చిన్నవాడు గదా – పార్టీలు, పబ్బులు, క్లబ్బులు అంటూ దీని వెనుక తిరుగుతున్నాడుగా, అందుకు చాలా సరదా అయిన వాడిలా కనిపిస్తున్నాడు. ముప్ఫై ఏళ్ళు వస్తున్నా దీనికింక మెచ్యూరిటీ రాలేదు. టీనేజ్ అమ్మాయిలా ప్రవర్తిస్తుంది” విరక్తిగా అంది సునంద. మరి మీరేం అన్నారు. “ఒప్పుకున్నారా? ఆ అబ్బాయి దీనికంటే బాగా చిన్నవాడిలా ఉన్నాడే.. ఆ కార్తీక్ తమ్ముడిలా ఉన్నాడు. పెళ్ళి, డైవర్సు... అప్పుడే మళ్ళీ రెండో పెళ్ళి. ఈసారన్నా కాస్త నిదానించి ఆలోచిస్తే బాగుండు” సునంద వ్యాకులపాటుతో అంది.

“నా ‘ఎస్’లు ‘నో’లు దానికేం లెక్క. ఏదో మన ఇంట్లో ఉంది కాబట్టి చెప్పాలని చెప్పింది. నీకేం చెప్పలేదా మరి” అడిగారాయన. “ఆ... ఇలాగే, చేసుకోవాలను కుంటున్నాను అంది. నేను మాత్రం ఏమంటాను. అంటే వింటుందా, దానికి నచ్చిందే చేస్తుంది. మన పెంపకంలో ఏం లోపం ఉందో మరి. ఒక్కతే .. పిల్లని దాని ఇష్టాన్ని ఏదీ కాదనకపోవడం మనదే తప్పు అనిపిస్తోంది. ఇచ్చిన స్వేచ్ఛని, స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగం చేస్తున్నారీ అమ్మాయిలు. సంపాదనుండే సరికి

ఇంకెవరినీ లెక్క చెయ్యక్కరలేదనుకుంటున్నారు. మనదే తప్పు...” విరక్తిగా అంది. “సునందా, పిల్లల్ని గిరి గీసి కూర్చోపెట్టే రోజులు పోయాయి. మనం ప్రేక్షక పాత్ర వహించడం కంటే చెయ్యగలిగిందేమీ లేదు. మంచీ చెడూ చెపుతాం. వినకపోతే వాళ్ళ ఖర్మ అనుకోవాలి” అన్నారాయన.

“అలా అని ఊరుకోలేం కదా. డైవర్స్ ఇచ్చి మన ఇంట్లో కూర్చుంటే నీ దారి నువ్వు చూసుకో అని వదిలేయగలిగామా? ఉద్యోగం ఉంది. నీ బతుకు నీది అనగలిగామా? తల్లిదండ్రులుగా పిల్లల కష్టసుఖాలు మనవి కావనుకునే మనోనిబ్బరం మనకెలా ఉంటుంది? కానీండి, మరోసారి చెప్పి చూస్తా... వినకపోతే ఏం చేస్తాం?” అంటూ కప్పులు పట్టుకు లోపలికి వెళ్లింది సునంద.

✶ ✶ ✶ ✶ ✶ ✶

“కార్తీక్, మన పెళ్ళికి మావాళ్లు అంతగా ఇష్టపడడంలేదు. ఏదీ తేల్చి చెప్పడంలేదు” అంది భావన. “మీవాళ్ళు సరే, మావాళ్ళు అసలు ఒప్పుకోవడంలేదు. నీకంటే పెద్దదాన్ని, డైవర్సీని చేసుకునే ఖర్మ నీకేంటి? మాకు ఇష్టంలేదు. కాదు కూడదు అని చేసుకోవాలంటే నీ ఇష్టం వచ్చినట్టు చేసుకో అంటున్నారు కోపంగా” అన్నాడతను.

‘అయితే ఏం చేద్దాం... కార్తీక్? చేసుకున్న తరువాత వాళ్ళే సర్దుకుంటారు. మహా అయితే నాలుగు రోజులు మాట్లాడరు. తరువాత వాళ్ళే మెత్తపడతారు. రిజిష్టర్ ఆఫీసులో అప్లై చెద్దాం’ అందామె. ‘భావనా, ఉండు తొందరపడకు. మరోసారి పెద్దవాళ్లని ఒప్పించడానికి ప్రయత్నిద్దాం. ఈపెళ్లితో అందరినీ దూరంచేసుకుంటే మనం ఏమాత్రం సంతోషంగా ఉండలేం... మరి కొన్నాళ్లు టైమియ్యి”అన్నాడతను.

“నీ ఇష్టం...” అప్రసన్నంగా అంది భావన.

✶ ✶ ✶ ✶ ✶ ✶

రెండురోజులు కాదు... ఆ తర్వాత వారం పది రోజులయినా కార్తీక్ పెళ్ళి మాటే ఎత్తలేదు. అతను పెళ్లి గురించి పట్టించుకుంటున్న సూచనలు ఎక్కడా కనిపించలేదు. భావన రెండు మూడుసార్లు అడిగితే “ఇంకా మాట్లాడలేదు, సందర్భం దొరకలేదు...’ అంటూ దాటవేశాడు. మాటలతో తప్పించుకొన్నాడు. అంతేకాక, తనని అవాయిడ్ చేస్తున్నట్టు కూడా అనిపించింది. “పనుంది, ప్రాజెక్ట్ పనిమీద తిరుగుతున్నాను. ఇవాళ రాలేను” అంటూ రెండు మూడుసార్లు తప్పించుకున్నాడు. ఇక ఆగదలచుకోక పదిహేను రోజుల తర్వాత భావన అతన్నిగట్టిగా నిలేసింది ఆఫీసులో. “ఏమిటి కార్తీక్, నన్నెందుకు తప్పించుకు తిరుగుతున్నావు?” ఆవేశంగా

అరిచింది. “రెండు రోజుల్లో మా వాళ్లతో మాట్లాడి చెప్తానన్నావు. ఏం వాళ్ళు ఒప్పుకోలేదా?” అని అడిగింది.

కార్తీక్ తల అడ్డంగా తిప్పాడు. “అసలు ఒప్పుకోవడం లేదు...” అంటూ నసిగాడు. “ఎవరికీ ఇష్టంలేకుండా చేసుకుని మనం ఏం సుఖపడ్తాం...?” చూపులు తప్పించి అన్నాడు. “ఏం ఎవరూ ఇష్టపడకపోతే మనం ఆనందంగా ఉండలేమా? నీ మొహం చూస్తే నీకే ఇష్టం లేనట్టు కనిపిస్తోంది” సూటిగా నిలేసింది.

కార్తీక్ తలదించుకున్నాడు. ‘తరువాత ఏదో నిర్ణయించుకున్నవాడిలా తలెత్తి, “అది కాదు భావనా, వాళ్ళన్నారని కాదు. నాకే... భావనా, నా మనసులో మాట సరిగ్గా వ్యక్తం చేయలేకపోతున్నాను. చూడు.. నీ ముందు ... నేనో స్టూడెంటు కుర్రాడిలా... నువ్వో బాస్‌లా... ఎంతసేపూ నువ్వు ఏమంటావో, నిన్నెలా ఇంప్రెస్ చేయాలో అనుకుంటూ, ఇప్పుడు బాయ్ ఫ్రెండ్‌లా నిన్ను ఇంప్రెస్ చేయగలిగినట్టు, పెళ్లయ్యాక చెయ్యగలనా... భావనా నీ స్వభావం నాకెందుకో భయం కలిగిస్తోంది. నీతో పరిచయం పెరిగిన కొద్దీ... నీ మాటే చెల్లాలనుకునే నీ మనస్తత్వం, నువ్వన్నదే రైటనే నీ అహం, నీ కనుసన్నల్లో మెలుగుతూ, నిన్ను సంతృప్తి పరచడానికి తాపత్రయ పడుతూ... బాయ్ ఫ్రెండ్‌గా సరదాగా స్పోర్టివ్‌గా తీసుకున్నట్టు రేపు నీ భర్తగా మారాక అస్తమానం నీ అహాన్ని చల్లారుస్తూ భరించగలనా అన్న అనుమానం నాలో తలెత్తుతోంది. భర్తగా నాలోనూ అహం తలెత్తితే మనిద్దరి మధ్య సామరస్యం ఉంటుందా? మాటల మధ్య కశ్యప్ గురించి నీ ఎక్స్‌పెక్టేషన్స్ నెరవేరలేదన్న అసంతృప్తి తెలిసిన నేను అంతకన్నా ఎక్కువగా నిన్ను సంతృప్తి పరుస్తూ, నా స్వభావానికి విరుద్ధంగా నీ ఆనందం కోసం నన్ను నేను ప్రతి క్షణం హెచ్చరించుకుంటూ, నా వ్యక్తిత్వాన్ని పణంగా పెట్టగలిగే ఔదార్యం నాకుందా అన్న అనుమానం వస్తోంది. నిన్నుచూసిన తరువాత అమ్మ నాతో ఒక మాట అంది. ‘ఆ అమ్మాయిని చూస్తే ఎంత అందంగా ఉంది అనిపించింది కానీ, ఎంత మంచి అమ్మాయి, కార్తీక్ సుఖపడతాడు తప్పకుండా అనిపించలేదురా. ఆ అమ్మాయి మాటల్లో సౌమ్యత, నడతలో నమ్రత కనపడలేదురా. ఆ అందమైన మొహంలో, కళ్ళలో అభిమానం, అనురాగం కనపడలేదు. ఆ మొహంలో అహంకారం మాత్రమే కనిపించింది నాకు. పెద్ద చదువులు చదివింది. పెద్ద ఉద్యోగం. హోదా ఉంది. అందం ఉంది. కానీ ఓ భార్య, ఇల్లాలికి ఉండాల్సిన సహనం, ఓర్పు కనపడలేదు. చూస్తేనే అర్థం అయిందా అని అడుగుతావేమో – కొందరి మొహంలో కొన్ని భావాలు స్పష్టంగా కనపిస్తాయి’ అంది అమ్మ. అమ్మ అన్న తరువాత ప్రతి అక్షరం తరిచి చూస్తే నా మనసులోంచి

భావాలు అమ్మ నోట్లోంచి వచ్చాయి అనిపించింది. ముఖ్యంగా వారం రోజుల నుంచి నీ మాటలు, నీ డిమాండ్లు...” అంటూ కార్తీక్ తలదించుకున్నాడు.

భావన మొహం నల్లబడింది. షాక్ తిన్నదానిలా అతన్ని కళ్లప్పగించి చూసింది. “సారీ భావనా, నా మనసుని నేనింకా నమ్మించుకోలేకపోతున్నాను. అందరినీ కాదని, వదులుకుని పెళ్ళి చేసుకోవాలన్నది జీర్ణించుకోలేకపోతున్నాను” అన్నాడతను. భావనలో ఒక్కసారిగా ఆవేశం పొంగింది. ఏదో ఘాటుగా అనాలని నోరు తెరిచి, మళ్ళీ విరమించుకుని విసురుగా లేచి అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

✶ ✶ ✶ ✶ ✶ ✶

పది రోజులుగా కార్తీక్ రాకపోవడం, కూతురు మొహం ముడుచుకు తిరగడం చూసిన తరువాత ఉండబట్టలేక “కార్తీక్ రావడంలేదేం? ఊర్లో లేడా?” అని సునంద అడిగింది డైనింగ్ టేబిల్ దగ్గర టిఫిను తింటున్న కూతురితో. జవాబివ్వలేదు భావన. “పెళ్ళి అన్నావు, ఎప్పుడు చేసుకుందామని?” మళ్ళీ అడిగింది. “చేసుకోవడంలేదు” ముభావంగా అంది. ప్రసాదరావు, సునంద మొహాలు చూసుకున్నారు. “అదేం...?” అంది సునంద ఆశ్చర్యపోతూ. “అదంతే...” అంది భావన. తనకు ఏమీ అర్థం కానట్టు మొహం పెట్టింది సునంద.

“ఏం జరిగింది, చేసుకోనన్నాడా?’ కాస్త హేళనధ్వనించింది ఆ ప్రశ్నలో. భావన కొరకొరా చూసింది. “నేనే వద్దనుకున్నాను” తలెగరేసి పొగరుగా అంది. కూతురు ఎంత విసురుగా అన్నా, ఆగొంతులో పవరు తగ్గిందనిపించింది సునందకి. పరిస్థితేమిటో ఆ ఇద్దరికీ అర్థమైపోయింది. “అంతే, ఈ ప్రేమలు, దోమలు ఎంజాయ్ చేయడానికే. అన్నిప్రేమలూ పెళ్ళి దాకా రావు...” సునంద కూతురి వంక చూసి అంది. “డోన్ట్ బి స్టుపిడ్ మమ్మీ....” అంటూ భావన ఒక్కసారిగా మండిపడింది. కూతురు తనని ఎప్పుడూ అనని మాట అన్నందుకు ఆశ్చర్యపోయింది సునంద.

వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవడంలేదన్న వార్త బాధ కలిగించకపోగా, ఆ తల్లి దండ్రులకు గుండెల్లో ఏదో భారం దిగినట్లనిపించింది. తాము ఎన్నిసార్లు స్టుపిడ్ అయినా పరవాలేదు కానీ తమ కూతురు మాత్రం స్టుపిడ్ అవకూడదనే వాళ్లు కోరుకున్నారు.

***(సురభి, అక్టోబరు 2010)***

# తెలియని నిజాలు

"నీలమ్, ఏక్ కప్ చాయ్ బనాకే లానా" స్వప్న ఆఫీసు నించి వస్తూనే అలసటగా చేతిలోని హ్యాండుబాగు, చున్నీ తీసి ఓ సోఫాలో పడేసి, మరో సోఫాలో వాలింది, వంటింటివైపు కేకపెట్టి.

"స్వప్నా టీ తీసుకోమ్మా" రాజేశ్వరి కోడలి చేతికి టీ కప్పు అందిస్తూ మృదువుగా అంది.

స్వప్న కళ్లు తెరిచి చటుక్కున లేచి కూర్చుని "అయ్యో మీరు తెచ్చారేంటి అత్తయ్యగారూ! నీలమ్ లేదా వంటింట్లో" నొచ్చుకుంటూ అంది.

"పరవాలేదమ్మా ఎవరు తెస్తేనేమిటి, నీలమ్‌ని కొత్తిమీర, మిర్చి అవి తెమ్మని నేనే బైటికి పంపాను. టీ చేసినంత మాత్రాన అరిగిపోను, పనిపాటులేక తోచడంలేదు నాకు" అంది రాజేశ్వరి.

టీ తాగి హడావిడిగా లేచిన కోడలిని చూసి "ఏమిటివాళా వెళ్లాలా మీ 'ఆవా'కి (Airforce Officers Wives Association' A.O.W.A.) బాగానే ఉంది. ఈ ఉద్యోగంతో పాటు ఆ ఉద్యోగం – సాయంత్రం ఇంటికొచ్చి కాస్తన్నా విశ్రాంతి లేకుండా ఈ చాకిరి ఏమిటమ్మా" అందామె సానుభూతిగా.

"ఏం చెయ్యమంటారత్తయ్యా ఇది ఎయిర్‌ఫోర్స్ ఆఫీసర్ల భార్యలకి తప్పని డ్యూటి. ఈ చాకిరి తప్పించుకోలేం. కాదనడానికి లేదు. ఈ యూనిట్ C.O. (Comonding Officer) భార్య మా 'ఆవా'కి ప్రెసిడెంటు అవుతుంది. ఆవిడ మా బాస్. ఆవిడ చెప్పినట్టు చెయ్యాలి మేం. మీరు ఎల్లుండి వెళతారనిచెప్పి రేపు ఎగ్గొడ్తాను."

"బాగానే ఉంది. అటు ఆఫీసు ఇటు ఈ చాకిరి అయి తొమ్మిదింటికి నీరసంగా వస్తే ఇంక ఇల్లు పిల్లలని ఏం చూస్తావు? అంది రాజేశ్వరి.

"ఇదంతా ప్రతిరోజూ ఉండదులెండి. మా ఎయిర్‌ఫోర్స్ ఏనివర్సరి, ఎయిర్ మార్షల్స్‌లాంటి పై అధికారులు వచ్చినప్పుడు, స్వాతంత్ర్యదినాలు, హోలి వగైరా పండగలకి మా లేడీస్ క్లబ్బులు ఫంక్షన్ ఏర్పాట్లు, డిన్నరు ఏర్పాట్లు చెయ్యాలి. అలాంటి సందర్భాలలో ఓ వారం పది రోజులు వెళ్లాలి ఏర్పాట్లకి."

స్వప్న కప్పు లోపల పెట్టి, బాత్‌రూమ్‌లో మొహం కడుక్కుని ఫ్రెష్ అయివచ్చి "వస్తానత్తయ్యా. నేరావడం ఆలస్యం అవచ్చు. నీలమ్ రొట్టెలు చెయ్యగానే మీరు తినేయండి" అంటూ వెళ్లిపోయింది.

స్వప్న వెళ్లగానే రాజేష్ జీపుదిగి లోపలికొచ్చాడు.

"అమ్మా, స్వప్న వెళ్లిపోయిందా" అడిగాడు.

"ఆ... తను అలా వెళ్లింది నీవిలా వచ్చావు. పాపం ఆఫీసు నుంచి వస్తూనే పరుగులు పెడ్తూంది. అయినా ఇదేం చాకిరీరా బాబూ" అంది రాజేశ్వరి.

బూట్లు విప్పుకుంటూ రాజేష్ నవ్వాడు. "తప్పదమ్మా ఇక్కడ ఇదంతా. ఎవరూ చెయ్యకపోతే ఫంక్షను పార్టీలు ఆర్గనైజ్ ఎవరు చేస్తారు. మా ఆఫీసర్ల డ్యూటీల్లా ఆఫీసర్ల భార్యలకీ డ్యూటీలు తప్పవు. ఏడాదికి అయిదారుసార్లు ఇలా ప్రోగ్రాంలు చెయ్యాలి. ఓ పది పదిహేనురోజులు వెళ్లాల్సుంటుంది అలాంటప్పుడు."

"అందరి ఆఫీసర్ల భార్యలూ వెడతారా...?"

"మరీ చంటిపిల్లల తల్లులని వదిలేస్తారు. అమ్మా ఇక్కడ కాస్త స్మార్ట్‌గా, ఇంగ్లీషు అది బాగా వచ్చిన వాళ్ళని అసలు వదలరు. స్వప్నకి ఈ డ్యూటీ తప్పదు. బట్టలు మార్చుకు వస్తాను" లోపలికెళ్లాడు రాజేష్.

"మామ్మా ఏం చేస్తున్నావు. ఒక్కర్తివీ బోరుకొడ్తుందా" రాహుల్ వచ్చి మామ్మ దగ్గిర కూర్చున్నాడు.

"హోమ్‌వర్క్ అదీ అయిందా నాన్నా" మనవడి తల నిమురుతూ అడిగింది రాజేశ్వరి.

"మామ్మా కాసేపు 'కెనస్టా' ఆడుదాం రా" పేకముక్కలను తీస్తూ అన్నాడు రాహుల్.

"పరీక్షలపుడు పేకాట ఏమిటని మీ నాన్న కేకలేస్తాడేమో, సరేలే ఓ అరగంట ఆడుదాం. చదివి చదివి నీకూ బోరుకొడ్తొందా" ఆప్యాయంగా అంది.

"రాహుల్ పరీక్షలు పెట్టుకుని పేకాడుతున్నావా?" బట్టలు మార్చుకు వచ్చి నీలమ్ అందించిన టీ అందుకుంటూ రాజేష్ అన్నాడు.

"లేదురా పాపం ఇప్పటివరకు చదువుతూనే ఉన్నాడులే. కాసేపు వాడికీ విశ్రాంతి కావాలిగా..." మనవడిని వెనకేసుకువచ్చి అంది రాజేశ్వరి.

"నీకూ తోచడం లేదుగా – కాసేపు ఆడుకోండి. రాకరాక నీవొస్తే సాయంత్రాలన్నా ఇంట్లో ఉండకుండా తనకీ డ్యూటి పడింది" అన్నాడు రాజేష్.

"అవును నాకు తెలీక అడుగుతా, ఇంట్లో చుట్టాలున్నారు – పిల్లలకి పరీక్షలు – నేను రాలేను అని చెప్పకూడదా – అంత భయపడడం ఏమిటి?" అందామె.

"అమ్మా అందరికి ఇల్లు, సంసారం, పిల్లలుంటారు. ఎవరూ చేయకుండా తప్పించుకుంటే ఎలా అంటుందావిడ. అందులో స్వప్న డాన్సులు, చిన్న చిన్న టిట్‌బిట్స్ ప్రోగ్రామ్‌లు బాగా అరేంజ్ చేస్తుంది. అంచేత మిసెస్ రాథోడ్ అసలు వదలదు స్వప్నని.

ఓసారి ఇలాగే తనకి విసుగొచ్చి పనుంది రాలేనని తప్పించుకుంది. రెండు రోజుల తరువాత మా C.O. ఆఫీసులో నాకు క్లాసు తీశాడు.

"మేడమ్ చాలా అప్‌సెట్ అయింది. ఎయిర్ మార్షల్ నాల్గురోజులలో వస్తున్నాడు. అందరూ ఇంత బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తే ఆవిడ ఒక్కర్తి ఎలా చేయగలదు. ఇది మనందరి యూనిట్ అంతటికీ సంబంధించిన విషయం. మిసెస్ స్వప్నని రేపు పంపించు" అన్నాడు అథారిటిగా. ఇంకేం చేస్తాం అలాంటపుడు."

"మమ్మీ ఇంతకు ముందు పోస్టింగ్‌లో తనకేం రానట్టు, తెలీనట్టు క్లబ్బులో ఓ మూల కూర్చుంది మొదట్లో" స్వీటీ ఏదో చెప్పబోయింది.

"ఆ నాటకమూ ఫెయిల్ అయింది. మేం ఇదివరకున్న యూనిట్ బాస్ ఆఫీసు పనిమీద వచ్చి పార్టీలో స్వప్నని చూసి 'ఓ మిసెస్ స్వప్నా... ఇక్కడుండగా 'సుష్మాజీ' నిశ్చింతగా ఉండచ్చు పార్టీల ఆర్గనైజింగ్ విషయంలో, స్వప్న ఈజ్ ఎ వెరీ గుడ్ ఆర్గనైజర్' అని పొగిడి పొగిడి మరీ మెచ్చుకున్నాడు."

అతనన్నది విని మా బాస్ భార్య మొహం ఎఱ్ఱబడింది. మా మొహాలు నల్లబడ్డాయి.

తరువాత ఆవిడగారిని ప్రసన్నురాలిని చేసుకోడానికి ఇడ్లీలు, దోశలు పంపి, డిన్నర్లకి పిలిచి నానా తంటాలు పడ్డాం" రాజేష్ చిన్నగా నవ్వుతూ అన్నాడు.

"బాగానే ఉంది కాస్త స్మార్ట్‌గా ఉండడం తప్పన్నట్టుంది ఇక్కడ" అంది రాజేశ్వరి నవ్వి.

"అమ్మా ఎనిమిదన్నర అయింది. నీవు భోజనం చేసేయ్" అన్నాడు రాజేష్.

"పరవాలేదురా అందరం కలిసే తిందాం. తిని కూర్చుంటే అరగడంలేదు" అందామె.

✶ ✶ ✶ ✶ ✶ ✶

మర్నాడు రాజేష్ ఇంటికి వస్తూనే "స్వప్నా బ్యాడ్ న్యూస్ ఫర్ యూ" అన్నాడు అదోలా నవ్వి.

స్వప్న రాజేష్ మొహం వంక చూసి విషయమేమిటో అర్థం చేసుకుని "పోస్టింగ్ వచ్చేసిందా" కళ తప్పిన మొహంతో చిన్నగా అడిగింది.

"ఆ... జోధ్‌పూర్ ఆర్డర్లు వచ్చేశాయి" అంటూ కాగితం టీపాయ్ మీద పడేశాడు. ఎదురుచూస్తున్న విషయమే అయినా స్వప్న పెద్ద ఆపద నెత్తిన పడ్డట్లు నిస్పృహతో కుర్చీలో కూలబడింది.

"ఏమిటి అలా అయిపోయావు. పోస్టింగ్ వచ్చే టైమయిపోయింది ఇవాళ రేపో వస్తాయని తెల్సుగా. ఇదేం కొత్తా మనకు" ఓదార్పుగా అన్నాడు.

"మీకేం చెపుతారు. మళ్లీ ప్యాకింగ్ మొదలు. మళ్లీ ఆ ఊర్లో నా ఉద్యోగాల వేట మొదలు, మళ్లీ మెస్‌లో పడి ఉంటూ ఇళ్లకోసం ఎదురుచూపులు. పిల్లి పిల్లల్ని తిప్పినట్టు నాలుగిళ్లు మారడం. పిల్లలకి అక్కడ మంచి స్కూల్సు ఉన్నాయో లేదో" అంది.

"ఏమిటి డాడీ పోస్టింగ్ ఎక్కడికొచ్చింది. జోధ్‌పూరా" రాహుల్ గదిలోంచి వచ్చి అడిగాడు.

రాజేశ్వరి, స్వీటీ చుట్టూచేరారు.

"రాజస్థాన్ – అమ్మో అక్కడ ఎండలు. నీళ్ల ఇబ్బందిగా ... ఎప్పుడెళ్లాలి" రాజేశ్వరి అడిగింది.

"ఈ ఢిల్లీ కంటె ఎండలేం ఎక్కువ కాదులే. అక్కడ మా యూనిట్లకి నీళ్ల ఇబ్బంది

ఉండదు. పిల్లల పరీక్షలు అవి అయ్యేవరకు ఇల్లు ఉంచుకోవచ్చు. నేను పదిరోజులలో వెళ్లి జాయిన్ అవాలి” అన్నాడు.

రాజేశ్వరి కోడల్ని సానుభూతిగా చూసింది. ఎప్పుడు ట్రాన్స్‌ఫర్ అయినా సామాను సర్దడం బాధలు, ఇల్లు వెంటనే దొరకని అవస్థలు ఎన్నోసార్లు చెప్పింది.

“మనం ఈ ట్రాన్స్‌ఫర్‌కే ఇంత బెంగపడుతున్నాం. మీనన్‌కి ఎక్కడికి పోస్టింగ్ వచ్చిందో తెలుసా” స్వప్న వంక చూస్తూ అన్నాడు రాజేష్.

“వాళ్లకి కూడా పోస్టింగ్ వచ్చిందా, ఎక్కడికి వేశారు.” స్వప్న ఆరాటంగా అడిగింది.

“సి యా చిన్” అని చెప్పాడు రాజేష్.

బాంబు పేలినట్టు ఉలిక్కిపడింది స్వప్న.

“ఓ మైగాడ్ సియాచిన్.. పాపం మీనన్ పని అయిపోయింది. ఎలా మేనేజ్ చేస్తారో.. జ్యోతి అసలే పిరికిది. ఎలా రియాక్ట్ అయిందో” ఆందోళనగా అంది.

మీనన్ ఆర్మీలో మేజర్. అయినా ఆ యూనిట్‌లో ఆర్మీ, ఎయిర్‌ఫోర్స్ ఉన్న యూనిట్. ఇద్దరిళ్లు పక్కపక్క నుండడం – మీనన్ మలయాళి అయినా భార్య జ్యోతి హైదరాబాద్‌లో పెరిగి బాగా తెలుగు రావడం – ఇద్దరి వయసు ఒకటవడం, వాళ్ల పిల్లలు వీళ్ల పిల్లలు స్కూలు ఒకటవడం ఆ కారణంగా రెండు కుటుంబాల మధ్య మంచి స్నేహం కుదిరింది రెండేళ్లుగా.

అందులో మీనన్ సరదా అయిన వాడు. స్నేహానికి ప్రాణం పెట్టే రకం. ఏ కాస్త సమయం దొరికినా రెండిళ్ల వాళ్లు కబుర్లాడుకుంటూ ఆ వేళకి ఎక్కడుంటే అక్కడ భోజనాలు కానివ్వడం. వాళ్ల స్నేహం ముచ్చటైంది.

“ఫోనులోనే బెంబేలు పడిపోయాడు పాపం మీనన్. జ్యోతికి ఈ వార్త చెప్పగానే ఫోనులోనే ఏడ్పు ఆరంభించిందిట” రాజేష్ బాధగా అన్నాడు.

“నాకు తెలుసు జ్యోతి అసలు తట్టుకోలేదు. ఉత్తపిరికిది. ఓసారి వెళ్లి వద్దాం. కాసేపు కూర్చుని ధైర్యం చెప్పివద్దాం...” స్వప్న ఆందోళనగా అంది.

“ఏమిటి సియాచిన్ అంటే హిమాలయ పర్వత శిఖరాల దగ్గరకదా – అంత భయపడుతున్నారేమిటి – అక్కడ చలి విపరీతంగా ఉంటుందనా” రాజేశ్వరి వాళ్ళ గాభరా చూసి అడిగింది.

“అమ్మా సియాచిన్ అంటే ఏమిటనుకుంటున్నావు. మైనస్ ‘60’ డిగ్రీల టెంపరేచర్.

ఇరవై రెండువేల అడుగుల ఎత్తులో, ఎటుచూసినా మంచు ముద్దలు, చలిగాలులు, ఊపిరి అందడమే కష్టంగా ఉండేంత ఆ ఎత్తులో, గ్లాసులో నీరు తాగే లోపలే గడ్డ కట్టించే చలిలో ఓ ఏడాది ఉండడం అంటే తమాషాగాదు.

నీవు బదరి, కేదార్‌నాథ్‌లు 10, 12 వేల అడుగుల ఎత్తులో ఉన్నచోట్లకి వెళ్లినపుడు సరిగ్గా ఊపిరి అందక ఆయాసపడ్డావుగదా – అంతకు రెట్టింపు ఎత్తులో ఉండడం – భార్యాపిల్లలని ఓ ఏడాది పాటు చూడడానికి కూడా రాలేరు... అలాంటి చోటకి వెళ్లాలంటే ఎవరికి భయంగా ఉండదు" అన్నాడు రాజేష్.

"ఏం ఫ్యామిలినీ చూడడానికి ఎందుకు రాలేరు" ఆశ్చర్యంగా అడిగింది రాజేశ్వరి.

"అమ్మా ఇరవై రెండువేల హై ఆల్టిట్యూడ్‌లో మనిషి ఊపిరి పీల్చలేడు. ఒక్కసారిగా మనుష్యులని అక్కడ తీసుకెళ్లి వదిలితే 'ఆక్సిజన్' అందక చనిపోతారు – బేస్ క్యాంపునించి మొదలు పెట్టి క్రమంగా హైట్ పెంచుతూ 5, 10, 15, 20 వేల అడుగులలో అలవాటు చేసి ఆఖరికి ఆ ఆల్టిడ్యూడ్ అలవాటయ్యేట్లు తీసికెళతారు. అలా అయినా ఆక్సిజన్ ఎక్కించాల్సుంటుంది.

సెలవుమీద పంపితే మళ్లీ ముందునించి మొదలెట్టాలి. ఒక్కో క్యాంపులో నెల చొప్పున ఉంచుతూ ఆఖరి క్యాంపు చేర్చి అక్కడ మూడు నెలలు ఉన్న తరువాత క్రమంగా మళ్లీ దింపడం ఇదంతా ఓ ఏడాది ప్రోగ్రామ్" రాజేష్ విడమర్చి చెప్పాడు.

"మరి డాడీ అంటార్కిటిక్‌లో కూడా ఇంతే చలీ ఉంటుంది గదా ! మరి ప్రజలు ఎలా ఉండగలుగుతున్నారు అక్కడ – రాహుల్ సందేహం.

"గుడ్ క్వశ్చన్ – అంటార్కిటిక్‌లో చలి ఇలాగే ఉంటుందిగాని హైట్, ఆల్టిట్యూడ్ సమస్య ఉండదు. అంతేకాక పుట్టినప్పటి నుంచి ఆ వాతావరణంలో పెరుగుతారు కనుక వారికి అలవాటయిపోతుంది.

రాజేష్ మాట్లాడుతుండగానే మీనన్ దంపతులు వచ్చారు. స్వప్న ఎదురెళ్లి జ్యోతి చెయ్యి పట్టుకుంది ఓదార్పుగా. జ్యోతి మొహం పదిలంఖణాలు చెసినట్టు పీక్కుపోయి కళ్లు ఏడ్చినట్లు ఉబ్బి ఉన్నాయి.

"కమాన్ యార్. మేమే మీ ఇంటికి వద్దామనుకున్నాం. జ్యోతి మాట సరే స్వప్న గాభరాపడిపోయింది. నీ ట్రాన్స్‌ఫర్ విషయం విని" స్నేహితుడికి షేక్‌హ్యాండ్ ఇచ్చి కూర్చోపెట్టాడు రాజేష్.

“ఏం చేస్తాం స్వప్నా – ఎప్పుడో అప్పుడు ఈ పోస్టింగ్ తప్పదు కదా. వంతుల వారిగా అందరూ వెళ్లాల్సిందే – గదా” మీనన్ చిన్నగా నవ్వి అన్నాడు.

“తల్చుకుంటేనే గాభరాగా ఉంది. ఎలా ఉంటారో అక్కడ – మేం ఇక్కడ ఒంటరిగా ఎక్కడుండాలి – మీరూ వెళ్లిపోతున్నారు” బెంగగా అంది జ్యోతి.

“ప్రవరాఖ్యుడికి హిమాలయాల్లో ఏవో ఆకుపసర్లు దొరికి వేళ్లకి రాసుకుని ఎగిరాడు. అట్టాంటి ఆకులేమన్నా దొరికితే నేను మధ్య మధ్య వచ్చి చూసిపోతుంటాలే” జోక్సులర్ అన్నాడు మీనన్.

జ్యోతి కోపంగా చూసింది. “చూడు ఎలా జోకులు వేస్తున్నారో భయంతో చస్తుంటే” ఉక్రోషంగా అంది.

“అసలు నాకుతెలీక అడుగుతాను. అంత ఎత్తున ఆ మంచుపర్వతాలు దాటి ఎవరొస్తారని ఈ కాపలా కాయడం. అక్కడ మిలట్రీ స్థావరాల అవసరం ఏమిటి?” రాజేశ్వరి సందేహం వ్యక్తం చేసింది.

“ఏంటమ్మా అలా మాట్లాడ్తున్నావు. పేపర్లలో వార్తలు చదవడంలేదా. ఇండియా, పాకిస్తాన్ బోర్డరు గొడవలు, కాపలాగా మిలట్రీ లేకపోతే పాకిస్తాన్ మిలట్రీ వచ్చేసి ఆక్రమించుకుంటుంది” రాజేష్ అన్నాడు.

“ఆంటీ మీనరనుకున్నట్టే అక్కడ నరమానవులెవరూ ఉండలేరు. అటునించి ఏ ముప్పూ ఉండదని మనవాళ్లు పాకిస్తాన్ వాళ్లు 1947లో విడిపోయినపుడు ఆ స్థావరాల గురించి ఎవరూ ఎంతమాత్రమూ పట్టించుకోకుండా వదిలేశారు. 1947 కరాచి అగ్రిమెంటులోగాని, 1972 సిమ్లా అగ్రిమెంటులోగాని ‘లైన్ ఆఫ్ కంట్రోలు’లో సియాచిన్ ప్రాంతం లేదు.

కాని 1980 తరువాత నెమ్మది నెమ్మదిగా పాకిస్తాను పర్వతారోహణ పేర, కొంతమందికి పర్మిషను ఇచ్చి పైకి పంపి ఆ ప్రాంతం వారిదేనన్నట్టు జండాలు పాతి, గుడారాలు వేసి నెమ్మదిగా మౌంట్‌నీరింగ్ పేరిట స్థావరాలు ఏర్పరుచుకోవడం మొదలుపెట్టారు.

‘80లో మన రక్షణశాఖ ఆ ప్రాంతాలన్నీ పాకిస్తాన్ లైన్ ఆఫ్ కంట్రోల్‌లో ఉన్నట్టు అమెరికా మ్యాపుల్లో గుర్తించాక మన వైపునుంచి కొంతమందికి ‘పర్వతారోహణ’కి పర్మిషన్ ఇచ్చి పంపి అక్కడ పరిస్థితులన్నీ గుర్తించి, పాకిస్తాన్ ఆ ప్రాంతంలో దురాక్రమణకి తయారవుతున్నట్టు గుర్తించి 1984లో ‘ఆపరేషన్ మేఘదూత్’ పేరిట

హెలికాప్టర్లలో మన సైన్యాన్ని దించి పాకిస్తాన్ సైన్యాన్ని వెనక్కి పంపి సియాచిన్ ప్రాంతం అంతా 78 కిలోమీటర్లు పైన స్వాధీనం చేసుకుంది.

దాడికి ఎదురుచూడని పాకిస్తాన్ సైన్యాన్ని రప్పించి ఎదురుదాడికి దిగినా ఎత్తులో ఉండి అప్రమత్తమైన ఇండియా సైన్యం దెబ్బకి వెనుదిరిగింది. అప్పటి నించి రెండు వైపులా మిలటరీ స్థావరాలు నెలకొల్పారు.

అప్పటినించి పోగొట్టుకున్న స్థావరాల కోసం 90, 95, 96, 99లలో పోరాడుతున్నా పాకిస్తాన్ వారికి సియాచిన్ గ్లేసియర్‌లో దక్కింది కేవలం 5 కిలోమీటర్లే. వాళ్ళకి మైనస్‌పాయింట్ ఎత్తు ఎక్కి రావడం – అది ఇండియన్ ఆర్మీ అప్రమత్తంగా ఉండడంతో కుదరలేదు.

ఆఖరికి 2003లో సీజ్‌ఫైర్ డిక్లేర్ చేశాక ఎవరి పోస్టుల్లో వారుండాలి తప్ప కాల్పులు జరపరాదు అని నిర్ణయానికి వచ్చేసరికే మనం దాదాపు రెండువేల మంది సోల్జర్స్‌ని పోగొట్టుకున్నాం. 300 మిలియను డాలర్లు ఖర్చు అయిందిట" మీనన్ చెప్తుంటే అందరూ శ్రోతలై ఆశ్చర్యంగా వినసాగారు.

"సియాచిన్ ప్రాంతంలో సైన్య స్థావరాలకి ఇప్పటి వరకు 50 బిలియన్లు ఖర్చు అయిందట."

"అంతత ఖర్చా... అయ్యబాబోయ్... " రాజేశ్వరి కళ్లు పెద్దవిచేస్తూ ఆశ్చర్యంగా అంది.

"ఆంటీ వింటే మీరు ఆశ్చర్యపోతారు. అక్కడ బేస్ స్థావరాల యూనిట్ల కోసం కిరసనాయిలు, రేషన్లు సప్లయ్ చేయడానికి మన రక్షణ శాఖ రోజుకి కోటిరూపాయలు ఖర్చు పెడ్తోందన్నది తెలుసా. మనకి ఒక బ్రెడ్ పదిరూపాయలయితే ఆ ప్రాంతాలకి పంపేసరికి ఒక బ్రెడ్ రెండొందలు పడ్తుంది. ఎందుకంటే అన్ని సామాన్లు అక్కడికి హెలికాప్టర్ల మీద పంపాలి.

సైన్యానికి కావల్సిన ఆహార పదార్థాలు, మందులు, కిరసనాయిలు, పేపర్లు, పుస్తకాలు ఏది పంపాలన్నా హెలికాప్టర్లే గతి. అక్కడున్న చెక్‌పోస్టులు అన్నీ కలిసి మూడు వేలమందికి అన్నీ సరఫరా చేయడానికి పగలంతా హెలికాప్టర్లు చక్కర్లు కొడుతూనే ఉంటాయి. అక్కడికి మామూలు హెలికాప్టర్లు వెళ్లలేవు. 'చీలే' అనే ప్రత్యేకమైన తేలిక హెలికాప్టర్లు (Advanced Light Helicopter - ALH) మాత్రమే అంత ఎత్తు ప్రదేశానికి గాలి తక్కువ ఉండే ప్రాంతంలో ఎగరగలవు.

మామూలు చోట ఓ ట్రిప్పులో ఒకటిన్నర టన్నులు బరువు తీసికెళ్లగలిగే హెలికాప్టర్లు హై ఆల్టిట్యూడ్ ప్రదేశంలో కేవలం 50, 60 కిలోల బరువు మాత్రమే తీసికెళ్లగలవు. ఓ ట్రిప్పులో 50 లీటర్ల కిరసనాయిలు క్యాన్ మాత్రమే తీసికెళ్లగలవు. అంటే ఎన్ని ట్రిప్పులు వేయాలో చూడండి – ఇరవైవేల అడుగుల ఎత్తులో 'సోనమ్' అనే చోట మంచులో ఒక హెలీ పాడ్ కట్టారు.

సియాచిన్ ప్రాంతంలో ఆక్సిజన్ శాతమెంతో తెల్సా – 10 శాతం మాత్రమే. ఆ కారణంగా మామూలు చోటకంటె ఎన్నో రెట్లు పెట్రోలు ఖర్చు అవుతుంది.

"ఎందుకంకుల్" స్వీటీ అమాయకంగా అడిగింది.

"మన కారు ఎత్తు ఎక్కాలంటే గేరు మార్చాలి. గేరు మార్చి ఎత్తు ఎక్కడానికి పెట్రోలు ఎక్కువవదూ అలాగే ఇదీనూ – అక్కడ కిరసనాయిలులేనిదే క్షణం గడవదు. స్టవ్‌లు, హీటర్లు అలా వెలుగుతూంటాయి. మంచినీళ్లు తాగాలన్నా ఐసుగడ్డ కరిగించి తాగాలి. అక్కడ చలి ఎలా ఉంటుందంటే వేడివేడి నీళ్ళు బాల్చీలో పెడితే 15, 20 నిమిషాల్లో ఐస్ అవుతుందట.

అన్నివేల మందికి ఆహారం వేడి చెయ్యడానికి, కాఫీ, టీలకి, నీళ్ళకి ఎన్నివేల లీటర్ల కిరసనాయిలు ఖర్చు – అంచేత మన ఆర్మీ ఇంజనీర్లు ఆ మంచు కొండలలోంచి 121 కి.మీటర్ల పైపులైన్లు కేవలం కిరసనాయిలు సప్లయ్ చేయడానికి వేశారుట. ఆ చలికి పగలని పైపులతో ఆ లైను వేయడానికి కిలోమీటరుకి నాల్గు లక్షల ఖర్చుతో వేశారట. ఆపైపులైను అన్ని లక్షల ఖర్చుతో వేసినా, దానివల్ల నెలకి ఎన్నోకోట్లు మనవాళ్ళు ఆదా చేయగలుగుతున్నారట ఇపుడు..." మీనన్ అదంతా కథలా వర్ణించి చెప్తుంటే వింటున్నారు అందరూ.

"ఈ సంగతులన్నీ మాలాంటి మామూలు వారికి అసలు తెలియవు. ఏదో యుద్ధం వచ్చినపుడు సైనికుల త్యాగాలని పాటలుపాడి హారతులివ్వడం మినహా లోపల లోపల రక్షణశాఖలో సైన్య సిబ్బందిపడే ఈ పాట్లు తెలియవు..." రాజేశ్వరి ఉద్వేగంగా అంది.

"మీకేంటి ఆంటీ – మాకూ అన్నీ తెలియవు. రక్షణ శాఖ రహస్యాలు వెల్లడించరు పైకి.

నిజానికి ఈ ఆపరేషన్ కోసం ఎంతమందిని వినియోగిస్తున్నారో – ఎంత మంది చనిపోయారో.

ఎన్ని మిలియన్లు ఖర్చు అయ్యేది అంతా ఉన్నతాధికారులకి, రక్షణ మంత్రిత్వ శాఖకి మాత్రం తెలుస్తాయి. ఈ పోస్టింగ్ వచ్చిన తరువాత ఇవాళ ఇంటర్నెట్‌లో కొన్ని విషయాలు చదివాను" అన్నాడు మీనన్.

"ఇంకా చెప్పండి అంకుల్. అక్కడ మనవాళ్ళు చలిలో ఎక్కడుంటారు. ఎన్ని కోట్లు తొడుక్కుంటే చలి ఆగుతుంది. అక్కడ భోజనం ఏం చేస్తారు... బాత్‌రూములుంటాయా?" అని అడిగాడు రాహుల్.

"డోన్ట్  బి సిల్లీ మై బాయ్... స్వెట్టర్లు, కోట్లు మన ఢిల్లీ చలికే చాలవు. అక్కడ వాళ్ళ కోసం (High Altitude weather gear) అని ప్రత్యేక వాతావరణ గేర్స్ అంటే లోపల ఇన్సులేషన్ పెట్టి తయారు చేస్తారు. అవి ఒక్కొక్కటి ఎంతో తెలుసా లక్ష, లక్షన్నర. ఆ డ్రెస్సు – ప్రత్యేకంగా తయారైన బూట్లు, గ్లవ్స్, ఆక్సిజన్ మాస్కులు ఇన్ని వేసుకున్నా ఆ మైనస్ 60డిగ్రీల చలి తట్టుకోలేక ఎంతో మంది సైనికులు 'మంచుకొరుకుడు' (frost bite) బారినపడి చనిపోయారు.

అసలు యుద్ధంలో కంటె ఇలా మంచుబారిన, మంచుపెళ్లలు విరిగిపడి కూరుకుపోయి, ఊపిరితిత్తుల వ్యాధి (Pulmonary edema) లంగ్స్‌లో నీరుచేరే వ్యాధిన పడిపోయినవారు ఎక్కువట."

రక్తంలో నైట్రోజన్ పాలు ఎక్కువవుతుంది. దానివల్ల చాలా దుష్ఫలితాలుంటాయట."

"అబ్బ వింటుంటే ఎన్ని అవస్థలుపడ్తూ ఉంటున్నారక్కడ మన సైనికులు..." రాజేశ్వరి బాధగా అంది.

"జవాన్లకి, ఆఫీసర్లకి ఏదన్నా జబ్బులు చేస్తే వైద్యానికి కిందకి తీసుకురావల్సిందేనా" స్వప్న సందేహం.

"అక్కడే, ఆమంచుకొండల మధ్యే ఎమర్జెన్సీ కేసుల కోసం ఓ ఆసుపత్రి ఉంది. 'హండర్' అనే చోట – అంతా రెడీమేడ్ ప్రి ఫ్యాబ్రికేటెడ్, సెంట్రల్ హీటింగ్ సిస్టమ్ హట్స్... అంటే ఎప్పటికప్పుడు ఆ ఆస్పత్రి రెడిగా తయారుచేసేయొచ్చు ఓ టెంటు వేసినట్టు. అక్కడ ఆక్సిజన్, మందులు – ఎమర్జెన్సీ ఆపరేషన్ చేయడానికి డాక్టరు, సిబ్బంది అంతా రెడీగా ఉంటుంది.

రోజూ ఆక్సిజన్ అందక ఊపిరి తీసుకోలేనివారికి ఆక్సిజన్ పెడ్తారు. మంచు కొరుకుడు, ఊపిరితిత్తుల వల్ల ఆయాసం – అవి వచ్చే వారికి ప్రాథమిక వైద్యం

చేస్తారు. వారికి లొంగని కేసులని కింద 'బేస్ ఆస్పత్రికి' అక్కడ లొంగని కేసులని ఢిల్లీ మిలిటరీ ఆస్పత్రికి పంపించి వైద్యం చేయిస్తారు.

వైద్యం విషయంలో ఏలోటూ రానీయరు. డాక్టర్లు, నర్సులు, స్టాఫ్, వంటవాళ్ళూ, హెల్పర్లు, సోల్జర్లు, ఆఫీసర్లు... ఇలా ఎంత స్టాఫ్ కావాలో ఓ యూనిట్ కోసం..." అంటూ ఆగాడు మీనన్.

"రాజేష్... నాకు తెలియక అడుగుతా. ఈ సరిహద్దు గొడవలు సామరస్యంగా పరిష్కరించుకోవడం కుదరదా. ఎందుకీ యుద్ధాలు. కోట్ల ఖర్చులు, శ్రమ, ఇంత మంది చనిపోవడం... ఎన్నాళ్ళు ఇలా ఈ సరిహద్దుల్ని రక్షించుకోగలరు" అని అడిగింది రాజేశ్వరి.

"ఆంటీ చాలాసార్లు రెండు దేశాలమధ్య చర్చలు జరిగాయి – ఆ చర్చలు భారతదేశం ఆక్రమిత కాశ్మీరు అంశంతో ముడిపెట్టడం – ఇరువైపులా ఎవరూ తగ్గక పోవడం, మిలట్రీ అధికారులు ఎప్పటికప్పుడు లైన్ ఆఫ్ కంట్రోలు పర్మనెంట్‌గా గీసుకోవాలని చెప్పినా ప్రభుత్వ అధికారుల చర్చలు విఫలమవుతూనే ఉన్నాయి.

ఇరువైపులా ఒక అంగీకారానికి వచ్చే పరిస్థితులు వచ్చేసరికి ఏదో ఒక దాడులు, టెర్రరిస్టుల చొరబాట్లు, ముంబయి రైలు మీద దాడి, పార్లమెంట్ దాడులు జరగడం. ఈ ఉగ్రవాద దాడులకి పాకిస్థాన్ ప్రభుత్వం సహకరిస్తుంది. ముందు ఈ పరిస్థితులకి పరిష్కారం జరిగితే కాని సైన్యాన్ని ఉపసంహరించేది లేదని మన వాళ్ళు ముందు జాగ్రత్తగా ఉండడం.

పాకిస్థాన్‌కి ఈరక్షణ ఖర్చు తలకిమించినదవడం, అటు అమెరికా లాంటి అగ్రదేశాల ఒత్తిళ్లు... అన్నీ టెర్రరిస్టులకి పాకిస్థాన్ మద్దతు ఇస్తూంది.

పాకిస్థాన్ గట్టిచర్యలు తీసుకోవాలన్నా, అన్ని దేశాల ఒత్తిళ్ళతో పాకిస్తాన్ సియాచిన్ విషయంలో రెండు దేశాలు ఓ ఒడంబడిక రావాలన్న నిర్ణయం తీసుకున్నా ఇంకా రెండు దేశాల ఫారెన్ సెక్రటరీలు, రక్షణ అధికారుల చర్చలు ఇంకా సఫలం అవలేదు.

టెర్రరిజాన్ని పెంచి పోషించిన పాకిస్థాన్ ఇప్పుడు తనూ టెర్రరిస్టు విధ్వంసక చర్యలకి గురి అవుతూ ఎటూ చెప్పుకోలేని సంకట స్థితిలో ఉంది.

చర్చలు కాస్త ముందుకి వెళ్ళి అంగీకారం త్వరలో లభిస్తుంది అనే వేళకి మళ్ళీ మొన్న ముంబయి దాడితో కథ కాస్తా మొదటికి వచ్చింది.

కార్గిల్, ఆక్రమిత కాశ్మీరు సమస్య తీరందే ఈ సరిహద్దు గొడవలు తీరవు. అప్పటి వరకు రెండు దేశాలు ఇలా బిలియన్లు ఖర్చుపెడుతూ అనేకమంది చావుకి కారణమవక తప్పదు" మీనన్ నిట్టూర్చి అన్నాడు.

"ఇప్పుడింకా నయం... 2003 సీజ్ ఫైర్‌కి ముందు సామాను దించడానికి హెలీకాప్టరు ముప్పై సెకన్లు మించి అక్కడ కనిపిస్తే చాలు వెంటనే అట్నించి కాల్పులు, ఒక సైనికాధికారి బాత్‌రూము కెళ్ళాలంటే ముందో సోల్జర్ ఒక రౌండు కాల్పు జరిపి మేం ఇక్కడ అప్రమత్తంగా ఉన్నామని హెచ్చరించేవారట.

సీజ్ ఫైర్ తర్వాత ఇరుపక్షాల మధ్య కాల్పులు తగ్గి పోయి కాస్త ప్రశాంతంగా ఉంటున్నారక్కడ.

రోజుకి కనీసం ఎవరో ఒకరు ఏదో కారణంగా ప్రాణాపాయ స్థితిలోపడి (వాతావరణం మూలంగా) చనిపోతూనే ఉన్నారట. ఇలా ఓ రెండు వేలమందిని పోగొట్టుకున్నాం. ఈ 20 ఏళ్లలో" రాజేష్ అన్నాడు.

అందరూ నిట్టూర్చారు. ఒక విషాదకథ విన్నట్లుగా.

* * * * * *

ఎనిమిది నెలల తరువాత – స్వప్న ఓ రోజు ఫోను చేసింది – "అత్తయ్యగారూ మీనన్ జ్ఞాపకం ఉన్నాడా, మీరు ఢిల్లీ వచ్చినప్పుడు మా ఇంట్లో చూశారు. ఆ మధ్య ఒకసారి మీరు అడిగారు కూడా అతని గురించి...." స్వప్న గొంతు అదోలా ధ్వనించింది.

"ఆ... ఆ... గుర్తులేకపోవడం ఏమిటి... ఏమయింది" రాజేశ్వరి ఆరాటంగా అడిగింది.

"అతను మూడురోజుల క్రితం పోయాడత్తయ్యగారూ" స్వప్న గొంతులో దుఃఖం.

"అదేమిటి... ఎలా..." కలవరపడింది రాజేశ్వరి.

"సియాచిన్ గ్లేసియర్‌కి వెళ్లాక ఓ నెల రోజులు బాగానే ఉన్నాడు. ఆ ఆల్టిట్యూడ్‌లో. తరువాత అతని ఆరోగ్యం క్రమక్రమంగా దెబ్బతింది.

ముందుగా ఆయాసం... తరువాత 'పల్మనరీ ఎడిమా' (Pulmonary edema)... కొన్నాళ్ళు అక్కడ ట్రీట్‌చేసి తగ్గకపోయేసరికి ఢిల్లీ మిలిటరీ హాస్పిటల్లో జాయిన్

చేశారు. రెండు ఊపిరితిత్తులు పూర్తిగా దెబ్బతిని ట్రీట్‌మెంట్‌కి రెస్పాండ్ అవలేదు – రాజేష్ వెళ్ళి చూసి వచ్చారు. అప్పటికే అంతా ఆశవదిలేశారు. ఆఖరికి మొన్న పోయాడు.”

ఒక్క క్షణం పాటు రాజేశ్వరి నోటమాట రానట్లు నిశ్చేష్టురాలై మౌనంగా ఉండి పోయింది.

“పాపం నెలరోజులనించి ఎన్నిసార్లో ఫోనుచేసి ఒకటే ఏడుపు జ్యోతి...” స్వప్న బాధగా అంది.

“కాదు మరి, చిన్నవాడు – పిల్లలింకా చదువుల్లోనే ఉన్నట్లున్నారు. ఎలా వెళ్లదీస్తుందో రోజులు పాపం” రాజేశ్వరి కంట్లో నీరు తిరిగింది.

“డబ్బుకేం ఫరవాలేదు లెండి, డ్యూటీలో ఉండగా పోయాడు కనుక అతనికెన్నాళ్ళ సర్వీసు ఉందో అన్నాళ్ళు పూర్తి జీతం – తరువాత సగం జీతం, గ్రూఫ్ ఇన్స్యూరెన్స్ – జ్యోతికి కావాలంటే ఏదో ఉద్యోగం ... ఇవన్నీ బాగానే చూస్తారు. కాని మనిషి లేడు కదా. అంత చిన్న తనంలో ఒంటరిగా బతకాలి. సగం లైఫ్ ముందే ఉంది...” స్వప్న ఏడుస్తూ చెపుతోంది.

రాజేశ్వరికా క్షణంలో ఇలా ఎవరికి తెలియకుండా ఎంతమంది దేశరక్షణ కోసం ప్రాణాలు వదులుతున్నారు – మామూలు వాళ్ళకి ఎవరికీ ఈ విషయాలు తెలియనే తెలియవు అనిపించి హృదయం బరువెక్కింది. ఓ తల్లిగా బిడ్డను పోగొట్టుకున్న భావన కలిగింది. అప్రయత్నంగా అమృత వీరునికి జోహారులర్పించడానికి ఆమె సెల్యూట్ చేసింది.

(ఈకథలో టెక్నికల్ మిస్టేక్స్ ఉంటే విషయ సేకరణలో తప్పులు, పొరపాట్లు నావిగా భావించగలరు.)

*(స్వాతి, అక్టోబరు 2009)*

# మనసుతో ఆడొద్దు

సెల్ మోగుతుంటే నెంబరు చూసి ఆఫ్ చేసింది శిల్ప. మొహం చిట్లించి "ఇడియట్" అంది పళ్ళ బిగువున. పక్కన కూర్చున్న అఖిల "ఏయ్! ఎవరు? ఎందుకు స్విచ్ ఆఫ్ చేసావు? రాహులా? పాపం ఎందుకే అలా అతన్ని అవాయిడ్ చేస్తున్నావు ఈమధ్య?" అంది.

"నీకేం తెలీదు. మాట్లాడకు," విసుగ్గా అంది శిల్ప.

"నాకెందుకు తెలీదు, ఏడాదిగా ఈకాల్ సెంటర్ జాబ్‌లో చేరిందగ్గిర నుంచి మీ స్నేహం చూడలేదా, ఈ ఏడాదిలో మీరెంత సన్నిహితంగా మెలిగిందీ చూడలేదా. నెలరోజుల నుంచి అతన్నిలా ఎందుకు దూరం చేస్తున్నావో చూడడం లేదా. పాపం ఆ రాహుల్ మొహం చూసావా ఎలా పీక్కుపోయిందో! రోమియోలా తయారయ్యాడు. రాహుల్ ఏమన్నా మిస్ బిహేవ్ చేసాడా? అదే అయితే ఫ్రాంక్‌గా అతనితో చెప్పచ్చుగా!" నిష్ఠూరంగా అంది అఖిల.

"షటప్ అఖిలా! నీకేం అర్థం కాదు. మాట్లాడకుండా కూర్చో!" కోపంగా అంది శిల్ప.

"ఓ.కె. చెప్పడం ఇష్టంలేకపోతే మానేయ్! కాని రాహుల్ లాంటి మంచివాడిని దూరం చేసుకుంటే నష్టపోయేది నీవే." తన పాయింట్ దగ్గర క్యాబ్ ఆగగానే విసురుగా వెళ్ళిపోయింది అఖిల.

అసహనంగా కూర్చున్న శిల్పని వింతగా చూసింది భావన. గతవారంలోనే ఉద్యోగంలో చేరిందేమో, ఆమెకేమీ అర్థంకాలేదు. ముందు సీట్లో కూర్చున్న సందీప్

వెనక్కి తిరిగి “శిల్పా! వైడోంట్యూ హేవ్‌యే టాక్ విత్ హిమ్? అపార్థాలుంటే మాట్లాడి తీర్చుకోవచ్చు గదా! తప్పించుకు తిరగడం ఎందుకు?”

“షటప్ యార్. సలహా అడిగినపుడు ఇద్దువుగాని” కసిరింది శిల్ప. చిన్న పుచ్చుకున్నాడు సందీప్. తన పాయింట్ రాగానే దిగివెళ్ళింది శిల్ప.”

✶ ✶ ✶ ✶ ✶ ✶

మర్నాటు నైటిషిఫ్ట్ పూర్తయి అర్ధరాత్రి బయటకొచ్చిన క్యాబ్ ఎక్కబోతుంటే రాహుల్ హఠాత్తుగా వచ్చి క్యాబ్ తలుపు పట్టుకు ఆపి “శిల్పా! నీతో మాట్లాడాలిదిగు. నా బైక్‌మీద వెడదాం!” చాలా శాంతంగా, సూటగా ఆమె వంక చూస్తూ అన్నాడు. శిల్ప ఒక్క క్షణం చకితురాలై, తరువాత కోపంగా చేయి విదిల్చి “ఈ అర్ధరాత్రి నీ బైక్‌మీద రావాలా? ఆర్ యు క్రేజీ ...” అంది తీక్షణంగా చూస్తూ.

“మతి ఇంకా పూర్తిగా పోలేదు. చాలా మాట్లాడి తేల్చుకోవాలి నీతో! రా...” పంతంగా అన్నాడు.

“ఏయ్! ముందు చేయి తీయి. మాట్లాడాల్సి ఉంటే రేపు మాట్లాడొచ్చు.” అడ్డులే! రాహుల్ చేయి వదలకుండా శిల్ప వంక తీక్షణంగా చూసి ఏదో అనబోతుంటే అఖిల కల్పించుకొని “రాహుల్! ప్లీజ్! ఈ అర్ధరాత్రి ఇక్కడ సీనేం చెయ్యకు, రేపు పగలు మాట్లాడొచ్చు. మమ్మల్ని వెళ్లనీ డ్రైవరు ఎదురు చూస్తున్నాడు” అంది నచ్చచెప్తూ.

“నీకు తెలీదు అఖిలా! రేపు మాట్లాడదు. ఫోన్ కట్ చేస్తుంది. ఎస్సెమ్మెస్‌లకి జవాబివ్వదు. ఈ–మెయిల్‌కి రెస్పాన్సవదు. నన్నుకావాలని తప్పించుకుంటోంది.” చిన్నపిల్లాడిలా ఉక్రోషంగా అన్నాడు.

“కాదు రాహుల్! నేను తన తరఫున మాటిస్తున్నాను. శిల్పని ఎక్కడికి రమ్మంటావో చెప్పు, నేను పంపిస్తాను. ఇట్స్ మై ప్రామిస్! అంది అనునయంగా.

“ఓ.కె. నీ మాట నమ్ముతాను. రేపు లంచ్‌కి మినర్వాకి పన్నెండుకి రావాలి.” క్యాబ్ పైనించి చెయ్యి వెనక్కి తీసి చూడకుండా బైక్ స్టార్ట్ చేసి వెళ్ళిపోయాడు.

“ఇడియట్ అర్ధరాత్రి వచ్చి న్యూసెన్స్ చేస్తాడా? రేపు నేనొస్తానని ఎందుకు చెప్పావు?” ఎగిరింది శిల్ప.

“బుద్ధిలేకుండా మాట్లాడకు. చెప్పకపోతే అర్ధరాత్రి రోడ్డుమీద గొడవ పెట్టు కుంటావా? డ్రింక్ చేసి ఉన్నాడు రాహుల్.” కారులో కూర్చున్నాక కోపంగా అంది

అఖిల. "ఇదిగో శిల్పా ఓసారి రాహుల్‌ని కల్సుకుని ఇద్దరూ మీ సమస్యలేమిటో మనసు విప్పి మాట్లాడుకోండి. అతనితో స్నేహం వద్దనుకుంటే, కారణాలు నిజాయితీగా చెప్పు!" సలహా ఇచ్చింది.

"నాకిష్టం లేదన్నది అర్థం చేసుకోకుండా ఎందుకిలా వెంటపడి విసిగించాలి? ఎదురుగా చెబితే ఏదో అంటారు. నమ్మించాలని చూస్తాడు. వాదిస్తాడు. బతిమిలాడతాడు. ఈ గోలంతా నేను పడలేను." చిరాగ్గా అంది శిల్ప. అఖిల ఆశ్చర్యంగా చూసింది.

"ఏమయిందే నీకు, సడన్‌గా ఎందుకు రాహుల్‌ని వద్దనుకున్నావు? కారణం చెప్పకుండా ఇలా ఏడిపించడం బాగోలేదు."

"మా ఇంట్లో వాళ్ళు నాకు అమెరికా సంబంధం చూసారు. రాహుల్‌ది, మాది ఓ కులం కాదు. ఇంట్లో ఒప్పుకోరు. స్నేహం అంటూ తిరిగితేనే తిట్టేవారు. రాహుల్ కుటుంబ వాతావరణం నాకు నచ్చలేదు. వోల్డ్ ఫ్యాషన్."

"మరలాంటప్పుడు మొదట్లోనే కట్ చెయ్యాల్సింది."

"చదువుకున్నాడు. మంచివాడు గదా అని స్నేహంగా ఉన్నాను. చాలా సాయం కూడా చేసాడు. అంత మాత్రాన పెళ్ళిచేసుకోవాలా?" దబాయింపుగా అంది.

"శిల్పా! నాదగ్గిర చెప్పకీ కబుర్లు. ఉత్తి స్నేహం అంటే నమ్ముతానా? మీరిద్దరూ ఎంత దూరం వెళ్ళారో నాకు తెలుసు. నీకు కొత్తగా అతని కులం గురించి, కుటుంబం గురించి ఇప్పుడే తెల్సిందా? అమెరికా పెళ్ళికొడుకు రాగానే, రాహుల్ కంటికి ఆనలేదని చెప్పు" హేళనగా అంది అఖిల. ఉక్రోషంగా చూసింది శిల్ప.

"అలాగే అనుకో". తలెగరేసి పొగరుగా అంది.

"ఇప్పటికైనా నిజం చెప్పు. అతనికి ఇంకా ఆశలు కల్పించకుండ!" పాయింట్ రాగానే దిగిపోయింది శిల్ప. రాత్రి ఎంతోసేపు నిద్రపట్టక దొర్లుతూనే ఉంది శిల్ప. రాహుల్‌ని ఎలా హ్యాండిల్ చెయ్యాలి? ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి?... తెల్లవారు తుండగా నిద్రపట్టింది శిల్పకి.

*   *   *   *   *   *

"అఖిలా! శిల్ప లంచ్‌కి రానని చెప్పింది. రాహుల్ మరుసటి రోజు మధ్యాహ్నం ఆవేశంగా అన్నాడు ఫోను చేసి.

“రానందా? వదిలేయ్ రాహుల్. తనకంత లెక్కలేనపుడు, నీవెందుకు తన వెంట పడడం. స్నేహానికి ఫుల్‌స్టాప్ పెట్టేయ్!” అతన్ని శాంత పరచడానికి ప్రయత్నించింది. రాహుల్ టక్కున ఫోన్ పెట్టేసాడు.

ఐదుగంటలకి క్యాబ్ వచ్చే వేళకి తయారై బయటికి వస్తుంటే సెల్ మోగింది. సందీప్ చాలా గాభరాగా “అఖిలా! ఘోరం జరిగింది. రాహుల్ శిల్పమీద యాసిడ్ పోసాడు. శిల్పకి ఓ పక్క మొహం, మెడ బాగా కాలింది. హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు.”

“మైగాడ్. ఎప్పుడు జరిగింది.”

“పదిహేను నిమిషాలయింది. శిల్ప క్యాబ్ పాయింటిక్ వస్తుంటే హఠాత్తుగా బైక్‌మీద వచ్చి యాసిడ్ పోశాడు. నేను, భువన క్యాబ్‌లో ఉన్నాం. భువన శిల్పా వాళ్ళింటికి వెళ్ళి చెప్పింది. ఆస్పత్రిలో జాయిన్ చేసారు. వాళ్ళ నాన్నగారు పోలీస్ కంప్లైంట్ ఇవ్వడానికి వెళ్ళారు” జరిగిందంతా గుక్క తిప్పుకోకుండా చెప్పాడు.

“రాహుల్ ఎక్కడున్నాడు?”

“పోలీసులకి లొంగిపోవడానికి వెళ్తున్నానని వెళ్ళిపోయాడు.”

“ఓ... ” నేను ఆస్పత్రికి వస్తున్నా.

✶ ✶ ✶ ✶ ✶ ✶

పోలీస్ స్టేషన్ –

“అరగంట క్రితం నేనో అమ్మాయిమీద యాసిడ్ పోసాను. ఆ అమ్మాయి మొహం, మెడ కాలింది. వాళ్ళ వాళ్ళు ఆస్పత్రికి తీసుకెళ్ళారు.” ఇన్‌స్పెక్టర్ కోపంగా కుర్చీలోంచి లేచి, రాహుల్ కాలర్ పట్టుకుని “రాస్కెల్! ఎంత ధైర్యంగా చెప్తున్నావురా? ఘనకార్యం చేసాననుకుంటున్నావా? నీవు చేసిన పనికి జైలుకెడతావన్నది తెలిసే చేసావా?”

“తెలిసే చేసాను. నేరం అని తెలుసు కనకే శిక్షకి సిద్ధపడే వచ్చాను” ప్రశాంతంగా అన్నాడు. ఇన్‌స్పెక్టర్ షర్టు వదిలి ఆశ్చర్యంగా చూసాడు.

“నీవెవరు? ఎందుకీ పని చేసావు?”

“నా పేరు రాహల్. ఇంజనీరింగ్ చదివి, ప్రస్తుతం ఓ కాల్ సెంటర్‌లో జాబ్ చేస్తున్నాను. అమ్మ, నాన్న, చెల్లి అంతా ఉన్నారు. మా నాన్నగారు బ్యాంక్ ఆఫీసరు.” ఇంజనీరింగు చదివి మంచి కుటుంబంలోంచి వచ్చాడన్నది విన్నాక, గొంతులో కఠినం తగ్గించి “ఏమిటి ప్రేమవ్యవహారమా? ప్రేమించనుపొమ్మందా?” వ్యంగ్యంగా అన్నాడు.

"ముందే ప్రేమించను పొమ్మంటే ఈ పని చేసుండేవాడిని కాను, గత ఏడాది నుంచి ఈ కాల్ సెంటర్ జాబ్‌లో చేరిందగ్గర నుంచి మా పరిచయం స్నేహం ప్రేమగా మారింది. ఇద్దరం కలిసి తిరిగాం! మనసులు పంచుకున్నాం. శరీరాలు పంచుకున్నాం. తనని హోటళ్ళకి, సినిమాలకి, షికార్లకి తిప్పుతూ, ఎన్ని ప్రజెంటేషన్స్ ఇచ్చి ఎంతో డబ్బు తగలేసాను. మాది మధ్యతరగతి సంసారం. నాన్నగారు లోన్ పెట్టి చదివించారు. లోన్లు తీర్చకుండా జీతం అంతా తనతో తిరుగుతూ తగలేసాను. తను నిద్రకి ఆగలేకపోతే తనని పడుకోమని ఇద్దరి డ్యూటీ చేసేవాడిని. పెద్దవాళ్ళు అభ్యంతర పెట్టినా పెళ్ళాడాలనుకున్నాం. ఇంత జరిగాక, నెలరోజుల నుంచి నన్ను తప్పించుకు తిరుగుతుంది."

"ఇద్దరూ ఒకే చోట గదా పనిచేసేది. తప్పించుకోవటం ఏమిటి?"

"తనకి నెలక్రితం మంచి ప్లేస్‌మెంట్ వచ్చి ఇంకో జాబ్‌కి మారింది. అసలు నన్ను వదిలించుకోడానికే జాబ్ వదిలి వెళ్ళిందనిపిస్తోంది. అవాయిడ్ చేస్తూ ఏడిపిస్తూంది" కసిగా అన్నాడు.

అయితే మాత్రం యాసిడ్ పొయ్యటమేనా? కత్తులు పుచ్చుకుపోవడమేనా? ఎటు పోతుందయ్యా మీ యువత? అసలు అంత ప్రేమించినవాడివి యాసిడ్ ఎలా పోసావు?

ఆ నిర్లక్ష్యం, ఆ ద్రోహం సహించలేకపోయాను." బాధగా అన్నాడు.

"చూడు మిస్టర్! ఆవేశంతో నీవు చేసిన ఈ పనితో భవిష్యత్తు నాశనం అవుతుందని ఆలోచించావా?"

"నేనేమైనా ఫరవాలేదు. నా మనసుతో ఆడుకున్న ఆమెకి బుద్ధి చెప్పాలనే చేసాను. ఈతరం అమ్మాయిలు ఏం తక్కువ తినలేదు సార్. అబ్బాయిలని తళుకు బెళు కులతో, స్వీట్ టాక్‌తో చుట్టూ తిప్పుకుని తమ సరదాలన్నీ తీర్చుకుని, అక్కర లేదనుకున్న నాడు కరివేపాకులా తీసిపారేస్తున్నారు."

"మీతో ఇదే చిక్కు. ఆకర్షణని ప్రేమ అనుకుని తప్పటడుగులు వేసి జీవితాలు నాశనం చేసుకుంటున్నారు. చక్కగా చదువుకుని తల్లిదండ్రులు మీ శ్రేయోభి లాషులన్నది గుర్తించి వారు చెప్పినట్టు..."

"ఈ నిజం ఆలస్యంగా గుర్తించాను. అందుకే నాలాంటి అబ్బాయిలు ఈ నిజం గుర్తించాలని నన్ను నేను సమిధని చేసుకున్నాను. నా ప్రేమని చంపేసి సజీవ దహనం చేసింది. ఈ నిజం అబ్బాయిలంతా గ్రహించాలి."

"ఉత్త పిచ్చివాడిలా ఉన్నావు. ప్రేమ జీవితంలో ఓ భాగం అనుకోవాలి గాని ప్రేమే జీవితం అనుకుంటే భవిష్యత్తన్నది ఉండదు."

*  *  *  *  *  *

"డాక్టర్ పేషంటుకి తెలివొచ్చిందా? స్టేట్‌మెంట్ తీసుకోవాలి" ఇన్‌స్పెక్టర్ అడిగాడు.

"మరీ ఎక్కువ ఇబ్బంది పెట్టకండి. చాలా షాక్‌లో ఉంది" ఇన్‌స్పెక్టర్ తలూపి లోపలికి వెళ్లాడు.

"చూడమ్మా! నీవు ఈ సంఘటన గురించి ఏమన్నా చెప్పదలిచావా?"

"పట్టపగలు అందరూ చూస్తుండగా మొహాన యాసిడ్‌పోసి, వాడే వచ్చి సరెండర్ అయ్యాక, ఇంకా అమ్మాయి చెప్పడానికి ఏం ఉందండి?" శిల్ప తండ్రి వెంకట్రావు కోపంగా అన్నాడు.

"రాహుల్ ఎందుకు చేశాడు ఈ పని? అతనికి నీకు మధ్య గొడవ జరిగిందా? అతను నీ మీద ఇంత కక్ష కట్టడానికి కారణం ఏమిటి?" ఇన్‌స్పెక్టర్ ఏమీ తెలీనట్టు ప్రశ్నలు వేశాడు. శిల్ప కళ్ళు తెరిచింది. జవాబు చెప్పలేని దానిలా కళ్ళు వాల్చుకుని ఏడుస్తూ చేతులెత్తి నమస్కారం చేసి "నన్నేం అడగద్దు. నేనేం చెప్పలేను."

"మీరిద్దరూ ఒకేచోట పనిచేస్తారని, స్నేహితులని తెలిసింది. సన్నిహితంగా ఉండేవారని అంతా చెప్పారు. అలాంటప్పుడు ఇంత దారుణం ఎందుకు చేశాడు?" శిల్ప మరింతగా రోదించసాగింది.

"సార్! అడగాల్సిందిక్కడ కాదు. ఆ రాస్కెల్‌ని అమ్మాయిలనిలా వెంటపడి వేధించి, కాదంటే యాసిడ్ పోయడం, చంపడం లాంటి హింసకి పాల్పడుతున్న వెధవలందరిని తరిమి పట్టుకుని జైల్లో వేయండి." ఆక్రోశంతో ఉద్రేకంగా అరిచాడు వెంకట్రావు. కూతురి దుస్థితి చూసి.

ఇన్‌స్పెక్టర్ సాలోచనగా ఆయన వైపు చూసి "సార్! మీ ఆవేశం అర్థమవుతోంది. కాని జరిగిందానిలో ఆ అబ్బాయిదే కాదు, మీ అమ్మాయిదీ తప్పుంది. ఈ కాలం అమ్మాయిలు, ఏం తక్కువ తినలేదు. ఉద్యోగాల పేరున స్వేచ్ఛగా తిరగడం, అబ్బాయిలతో స్నేహాలు, సినిమాలు, షికార్లు, పార్టీల పేరుతో కలిసి తిరిగితే అబ్బాయిలు ఆశలు పెంచుకుంటే వాళ్ళనెలా తప్పుపడతారు. తిరిగినన్నాళ్ళు తిరిగి

అవసరం తీరాక నిర్లక్ష్యం చేస్తున్నారు. అది తట్టుకోలేని కొందరు అబ్బాయిలు హింసా ప్రవృత్తికి దిగుతున్నారు."

"అంటే యాసిడ్ పోయడం, చంపడం చేస్తారా? దౌర్జన్యాలకి దిగుతారా? అమ్మాయిలూ చదువుకున్నారు. తోటి ఉద్యోగితో సరదాగా ఉంటే పెళ్ళి చేసుకుంటుందనేనా అర్థం. హింసని కట్టడి చెయ్యాల్సిన మీరు ఇలా రౌడీ వెధవల ని వెనకేసుకు వస్తున్నారు. ఇన్‌స్పెక్టర్!" తీక్షణంగా అన్నాడు వెంకట్రావు.

"చూడండి సార్! హింసని, దౌర్జన్యాన్ని అరికట్టడమే మా ఉద్యోగం. కాని అమ్మాయిలు జాగ్రత్తగా ఉండాలనే చెప్తున్నాం. స్నేహం చెయ్యొచ్చు. స్నేహానికి హద్దులు ఉండాలి. వారికి ఇష్టం లేనపుడు గౌరవంగానే మొదటే దూరం పెట్టాలి. ఎవరిమీద ప్రత్యేక శ్రద్ధ చూపకుండా అందరితో స్నేహంగా ఉండి తమకి తాము గిరిగీసుకోవాలి అమ్మాయిలు. అలా హద్దులో ఉంటే అమ్మాయి దరిచేరడానికి అబ్బాయిలూ భయపడతారు. చనువిస్తే గదా! అబ్బాయిలు వెంటపడి ప్రేమ పాఠాలు వల్లించే సాహసం చేస్తారు. మీ అమ్మాయి విషయం మీకూ తెలుసు. ఎందుకు ముందే కట్టడి చెయ్యలేదు. వీళ్ళిద్దరి వ్యవహారం, పూర్తి వివరాలు నేను సేకరించాను. తిరిగినన్నాళ్ళు తిరిగాక, ఇప్పుడు అమెరికా సంబంధం కుదరగానే ఆ అబ్బాయిని దూరంపెట్టి నిర్లక్ష్యం చేస్తే, నిజంగా ప్రేమించిన ఆ అబ్బాయి మనసు దహించి తిరగబడ్డాడు. ఇదంతా ఆ అబ్బాయిని సమర్థించడానికి చెప్పడం లేదు. హింసా ప్రవృత్తిని ఎవరూ... అందులో పోలీసులం ఎప్పుడూ సహించం. ఆ అబ్బాయికి ఎలాగో శిక్ష పడ్తుంది. తనంతట తాను వచ్చి లొంగిపోయిన ఆ అబ్బాయి మాటల్లో నిజాయితీ కన్పించింది. అందుకే ఇంత మాట్లాడాను. నాశనం అయింది మీ అమ్మాయి భవిష్యత్తు కాదు. ఆ అబ్బాయి భవిష్యత్తు. కొంతమంది అబ్బాయిలు ప్రేమించమని అమ్మాయిల వెంటపడి వేధించి, కాదంటే కక్ష పెంచుకుని దౌర్జన్యాలు చేస్తున్నారు. అలాంటి వారిని కఠినాతి కఠినంగా శిక్షించాలి. కాని ఈ కేసులో మీ అమ్మాయిదీ తప్పు ఉంది. అది గుర్తించండి" కోపంగా అని బయటికి వెళ్లాడు ఇన్‌స్పెక్టర్.

"మర్నాడు టి.వి.లలో, న్యూస్ ఛానల్స్, పేపర్లు అన్నీ ప్రముఖంగా శిల్ప, రాహుల్ గురించిన కేసులతో నిండిపోయాయి. కోర్టులో హాజరు పరిచిన రాహుల్ కేసుకి కొన్ని గంటలలోనే జడ్జి విప్లవాత్మక తీర్పు ఇచ్చారు.

సిల్పని శారీరకంగా గాయపరిచి ఆమె భవిష్యత్తును నాశనం చేసిన రాహుల్‌కి

రెండు రకాల తీర్పు ఇచ్చారు. ఒకటి శిల్పని ఆమె కోలుకున్నాక పెళ్ళి చేసుకోవాలి. రెండు, అది ఇష్టం లేకపోతే రెండు సంవత్సరాల కఠిన కారాగారం శిక్ష అనుభవించాలి. తీర్పు చెప్పాక ఇంత తొందరగా ఈకేసులో శిక్ష అమలు చేయడం వెనక ఉద్దేశం భవిష్యత్తులో ఇలాంటి హింసా ప్రవృత్తికి దిగిన దోషులకి వెంటనే శిక్షపడితే తప్పించుకునే వీలు ఉండదు. ఏళ్ళ తరబడి కేసు కొనసాగితే కేసు పల్చబడి జనం మర్చిపోతారు. ఇలా వెంటనే శిక్ష పడితే ఈ పని చేసినందుకు భయపడతారు. కనుక ఇకముందు న్యాయాధిపతులు అందరూ పాడైపోతున్న యువతని దారిలోకి తేవాల్సిన బాధ్యత గుర్తెరగాలి అన్న ఉద్దేశ్యంతో అమలు చేసాం" అంటూ జడ్జిమెంట్ చదివి వినిపించేసరికి చప్పట్లతో మారు మోగింది కోర్టు.

టి.వి.లు ఈ వార్తని ప్రసారం చేసాయి. అన్నింటికంటే రాహుల్ రెండేళ్ళ జైలు శిక్షనే కోరుకోవడం. దానికి అతను చెప్పిన కారణం ఆవేశంతో చేసిన ఈ పనికి తనలాంటి యువత శిక్ష అనుభవించడమే సరి అని చెప్పాడు.

ఆస్పత్రి బెడ్‌మీద ఉన్న శిల్ప, ఇదంతా విని అస్థిరంగా పక్కమీద దొర్లి... "నో .. అతనికి శిక్ష వద్దు... తప్పునాది..." అరిచింది.

"శిల్పా, శిల్పా... ఏమిటే ఆ కేకలు లే... లే... డ్యూటీకి టైమవుతోంది. అంత మొద్దు నిద్ర ఎలా పడ్తుందే పగటిపూట? ఒకటే కలవరిస్తున్నావు?" తల్లి కుదిపి లేపితే కళ్ళు తెరిచిన శిల్ప... తెల్లబోతూ తన వంక చూసుకుంది.

చుట్టూ చూసింది.

ఓగాడ్. ఇది కలా... ఎంత ఘోరమైన కల! నిజంగా రాహుల్ కోపం మీద ఉండి అలా చేస్తే తన బతుకేం కావాలి... ప్లీజ్ రాహుల్! సారీ! నన్ను క్షమించు. రాహుల్‌ని కలవాలి. అతనికి పరిస్థితి చెప్పి శాంతపరచాలి. తన తప్పు ఒప్పుకోవాలి. పెద్దవాళ్ళు ఇష్టపడకుండా పెళ్ళి చేసుకుంటే సుఖం ఉండదని చెప్పాలి. స్నేహంగా విడిపోదామని చెప్పాలి. లేచి డ్యూటీకి తయారవుతూ రాహుల్‌కి ఎలా నచ్చజెప్పి శాంతపరచాలి? అని ఆలోచిస్తూనే ఉంది శిల్ప.

*(చిత్ర మాసపత్రిక - 2009)*

# తారుమారు

**కా**లింగ్ బెల్ విని తలుపు తెరిచిన కల్యాణికి – ఓ అమ్మాయి జీన్ ప్యాంట్ పై తెలుపు కుర్తీ, బాబ్డ్‌హెయిర్, భుజాన పెద్ద హేండ్ బ్యాగ్‌తో, చదువుకుని మంచి కుటుంబం నుంచి వచ్చినట్లున్నమ్మాయి కనిపించింది. తెలివైన మొహం, పెద్ద కళ్ళు, చూడ్డానికి చక్కగా ఉంది. కల్యాణి ప్రశ్నార్థకంగా చూసింది.

కల్యాణిగారేనా మీరు, లోపలికి రావచ్చా? ఆ అమ్మాయి అడిగింది.

ఎవరు. ఎవరమ్మా నువ్వు? ఏం కావాలి? మర్యాదగా అడిగింది కల్యాణి.

నా పేరు శృతి, నేను సంకల్ప్ కొలీగ్స్‌మి. కొలీగ్స్ అంటే ఆయన సీనియర్ అనుకోండి.

ఓ మావాడి ఆఫీసులో పనిచేస్తున్నావా? కల్యాణి తేలికగ నవ్వి – "రామ్మా, లోపలికి" అంటూ అప్యాయంగా భుజం పట్టి లోపలికి నడిపించి సోఫాదగ్గర కూర్చో అంటూ కూర్చుంది.

సంకల్ప్ నీవూ ఒకే కంపెనీలో పనిచేస్తున్నారన్నమాట. శృతీ నీ గురించి మావాడెప్పుడూ చెప్పినట్టు గుర్తులేదు. వాడేడి ఇంక ఆఫీసులోనే ఉన్నాడా? నీవు ఒక్కర్తివే వచ్చావేం? గబగబా ప్రశ్నలు కురిపించింది.

శృతి చూపు తప్పించి "నేను మీతో మాట్లాడాలని వంటరిగా వచ్చాను" అంది.

కల్యాణి మొహంలో రంగులు మారాయి. సంకల్ప్ ఏం చేశాడు – కలవరపడుతూ "వాడి గురించేం మాట్లాడాలి – చెప్పు. ఏం చెప్పాలి నాతో?" అంది.

ఆంటీ "నేను సంకల్ప్ ప్రేమించుకున్నాం" శృతి మాటల మధ్యలోనే

కల్యాణి "ప్రేమించుకున్నాం అంటే ఇప్పుడు కాదా?" సూటిగా చూస్తూ అడిగింది.

శృతి కాస్త తడబడి – తల అడ్డంగా తిప్పి – "అదికాదు, ప్రేమించుకున్నాం పెళ్ళి చేసుకోవాలనుకున్నాం. కానీ ఇప్పుడు సంకల్ప్ పెళ్ళి చేసుకోనని చెప్పాడు. మీరు కొంచెం చెప్పండి. ఆరేడు నెలలుగా ఇద్దరం ఎంతో కలిసి మెలిసి...."

అంటే "మీ ప్రేమకథకి ఆరునెలలకే ముగింపు కార్డు పడిపోయిందన్నమాట" కల్యాణికి సగం సంగతి అర్థమైంది.

ఆంటీ, మీరు చదువుకున్నారు. ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నారు. సంకల్ప్ ఎందుకిలా చేశాడో అడగాలి – ఓ స్త్రీగా మీరు నన్ను సపోర్ట్ చేస్తారన్న ఆశతో మీ దగ్గరకి వచ్చాను" ఆరాటంగా అంది.

చూడమ్మా మీ ఇద్దరూ ప్రేమించుకునే ముందు నాకు చెప్పారా? అని అడగను. ఎందుకంటే, ప్రేమించుకునే ముందెవరూ తల్లిదండ్రులకి చెప్పి అనుమతి తీసుకోరని నాకు తెలుసు. ఇంతకీ సంకల్ప్ పెళ్ళి చేసుకోనని ఎందుకన్నాడు? అసలు ముందు పెళ్ళి చేసుకుంటానని నీకేమైనా చెప్పాడా? లా పాయింట్ తీస్తూ అడిగింది కల్యాణి.

ఆంటీ, ముందు పెళ్ళిచేసుకుంటావా అని అడగరు కదండి. కొన్నాళ్ళు కలిసి మెలిసి తిరిగాక, నచ్చాక కదా అనుకుంటాం తనూ లా పాయింట్ మాట్లాడింది.

సరే, కొన్నాళ్లు తిరిగాక చెప్పాడా పెళ్లిచేసుకుంటానని?

ఇద్దరం అనుకున్నాం.

ఎప్పుడనుకున్నారు – ఆ నిర్ణయానికి ఎందుకు వచ్చారు?

రెండు నెలల క్రితం అనుకున్నాం. ఎందుకనుకున్నాం అంటే, ఇద్దరం ఒకరినొకరు అర్థం చేసుకున్నాం అనుకున్నాం. కల్యాణి వంక సూటిగా చూస్తూ ధైర్యంగా అంది.

సరే, బాగుంది మరి ఇప్పుడెందుకు చేసుకోనని చెప్పాడు. కారణం చెప్పాడా?

సరిగా చెప్పలేదు. మన పెళ్ళి వర్క్ అవుట్ అవుతుందనిపించడంలేదు. మనం గుడ్ బై చెప్పుకుని స్నేహితుల్లా విడిపోదాం అంటూ ఏదో మాట్లాడాడు. ఇన్నాళ్ళు తిరిగి ఇప్పుడిలా అంటున్నారు. కోపంతో మాటలు తడబడ్డాయి శృతికి.

వాడలా అన్నాడంటే, కారణం మీ ఇద్దరికి తెల్సుండాలి. ఈ విషయంలో నేనేం చెయ్యగలనని నీవు అనుకుంటున్నావు? కల్యాణి శృతి వంక సూటిగా చూసింది.

మీరు తన తల్లిగదా. ఓ ఆడపిల్లతో తిరిగినన్నాళ్ళు తిరిగి పెళ్ళిమాట ఎత్తేసరికి

ఇలా అనడం ఏం న్యాయం అని ఓ తల్లిగా నచ్చచెప్తారని, ఓ చదువుకున్న తల్లిగా మీరు పరిస్థితి అర్థం చేసుకుని సరిదిద్దుతారని. ఆమె కళ్ళల్లో బాధ కంటే పౌరుషం, అవమానం కనిపించాయి.

చూడమ్మా, ఇందాక అనను అన్నమాట ఇప్పుడనక తప్పడంలేదు. మీరిద్దరూ కలిసి తిరిగినప్పుడు, ప్రేమించుకున్నప్పుడు నాకు చెప్పారా, నా అనుమతి తీసుకున్నారా? ఇప్పుడు తల్లిగా నేనేదో నా కొడుక్కి చెప్పేసి, మందలించేసి, పరిస్థితి చక్కదిద్దాలని ఆశించడం అత్యాశేమో. ఇంతకీ నా కొడుకు నే చెప్పినంత మాత్రాన మాట వినేస్తాడా? ఈరోజుల్లో పిల్లలు తల్లి తండ్రుల మాటకి విలువ, గౌరవం ఇస్తున్నారా? ఇదే స్థితిలో నువ్వంటే నీ తల్లి మాట వింటావా. తల్లితండ్రుల మాట వినివుంటే మీ ఇద్దరూ ప్రేమ వ్యవహారం నడిపి ఉండేవారా?

శృతి ఆవేశంగా ఏదో అనబోయింది. కల్యాణి చేత్తో వారించి, "చూడమ్మా, అసలు మీ ఇద్దరి మధ్య ఏం జరిగిందో, వాడెందుకలా అన్నాడో నాకేం తెలీదు. నీవైపు నీవు చెప్పావు - వాడి వర్షన్ కూడా వినాలి కదా! వాడ్ని అడుగుతాను, వాడు చెప్పింది విన్నాక... ఇంతకీ ఓ విషయం చెప్పు. మీ ప్రేమ సినిమాలు షికార్లు, డిన్నర్ల వరకేనా అంతకంటే ముందుకు వెళ్లిందా?"

శృతి కళ్లు వాల్చుకుంది. జవాబుకి తడుముకుంటూ - చాలా దూరమే వెళ్ళింది. కానీ మీరనుకున్నంత దూరంకాదులెండి, ఇంత ఇంటిమెసిగా మెలిగాక ఓ ఆడపిల్ల భవిష్యత్తు ఏమవుతుందో మీకు తెలుసు.

ఫరవాలేదు. ఇంకా ఈ మాత్రం ఆలోచించగలిగే విచక్షణ నీకు మిగిలినందుకు సంతోషం. మీ యువత ఎవరినీ లెక్క చెయ్యక్కరలేదనుకుంటుంది. కానీ, ఇంక ఈ సమాజం మీరు ఆశించినంత ఎదగలేదు. కనీసం పెళ్ళిళ్ల విషయంలో ఇలాంటివన్నీ పట్టించుకుంటుంది. ప్రేమించుకోడానికి పెద్ద వాళ్ళ ప్రమేయం అక్కరలేదు. కానీ సమస్యలెదురయినపుడు పెద్దవాళ్ళు గుర్తుకు వస్తారు చిక్కుముళ్ళు విప్పడానికి. పిల్లలు చేసిన తప్పులకి పెద్దలని బాధ్యత చేస్తారు. అలాగే నీవిపుడు నన్ను.

మిమ్మల్ని నేనేం అనలేదు. ఓ తల్లిగా ఓ ఆడపిల్లకి బాసటగా నిలుస్తారని ఆశించానంతే. అది తప్పంటారా? నిలేసింది.

శృతీ, నీవు మంచి తెలివైన అమ్మాయివని, మాటకారివని ఈ తెలివితేటలతో నీ ప్రయత్నాలు నీవు చేసి ఉంటావనిపిస్తుంది. సరే, నీవు ఈ వ్యవహారం నాదాక

తెచ్చావు కనుక ముందు సంకల్ప్ ఏం చెప్తాడో విని నీకు ఫోను చేసి చెప్తాను - వీటన్నింటికంటే ముందు మీ కుటుంబం గురించిన వివరాలు, నీ బయోడేటా నాకు కావాలి. నా ఇ మెయిల్ అడ్రసుకి పంపు అంటూ కాగితం మీద ఇమెయిల్ అడ్రసు రాసి ఇచ్చింది.

థాంక్స్ ఆంటీ, మీ నుంచి మంచి న్యూస్ వింటానని ఆసిస్తా - అంటూ బయటికి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళినవైపు అలా చూస్తూ కూర్చుండిపోయింది కల్యాణి.

* * * * * *

"ఓ, ఆవిడగారు నీదగ్గరకొచ్చిందా కంప్లైంట్ చేయడానికి?" కాస్త కోపం, కాస్త హేళన కలిపి అన్నాడు అన్నం తింటూ.

"అసలు ఏమిటిదంతా, మీ ఇద్దరి మధ్య సమస్య ఏమిటి, అసలు ఇన్నిరోజులు మీ పరిచయం గురించి ఎప్పుడూ చెప్పలేదు నీవు - పెళ్ళిచేసుకుందాం అనుకున్నప్పుడైన మాతో చెప్పాలని నీకనిపించలేదా?" నిష్టూరంగా అంది కల్యాణి.

సంకల్ప్ చూపు తప్పించి, చిన్నగా దగ్గి, నీళ్ళు తాగి "చెప్పాలనుకున్నానమ్మా! కానీ మేం ఇద్దరం పూర్తిగా నిర్ణయించుకున్నాక, మీ దగ్గరకి తీసుకువచ్చి చెప్పాలనుకున్నాను. కానీ, ఈలోగానే" ఆగాడు.

"ఈలోగానే ఏం అయింది, ఎందుకు మనసు మార్చుకున్నావు? - ఒక అమ్మాయితో తిరిగినన్నాళ్ళు తిరిగి పెళ్ళి మాటవచ్చేసరికి మనసు మార్చుకున్నానని చెప్పడం సంస్కారమా?" కొడుకుని నిలేసినట్లడిగింది కల్యాణి.

"కూల్ డౌన్ అమ్మా! నీవు స్త్రీ పక్షపాతివని నాకు తెలుసు. నీ ఆశయాలు, ఆదర్శాలు పక్కన పెట్టి ఓ తల్లీ కొడుకులా మాట్లాడుకుందాం."

"సరే చెప్పు. ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకోనన్నావుట - కారణ్ ఏమిటో తల్లిగా అడిగే హక్కు నాకుందా? ఉందంటే చెప్పు."

"అమ్మా, ఆ అమ్మాయిని చేసుకుంటే నా జీవితం సులువుగా ఉండదనిపించింది. ఆమెతో చనువు పరిచయం పెరిగిన కొద్దీ, ఇద్దరి అభిప్రాయాలు కలవడం లేదనిపించింది. పెళ్ళిచేసుకునే ముందే అభిప్రాయాలు కలవకపోతే ఆ తర్వాత ఆ కాపురం ఎలా ఉంటుంది? లక్కీగా ముందే ఇలా నిర్ణయం తీసుకోగలిగినందుకు ఎంత రిలీఫ్‌గా ఉందో తెలుసా?"

"సంకల్ప్ – ఏడెనిమిది నెలల పరిచయం కదా! ఇంతదూరం వెళ్ళేముందే అన్నీ సరిగా ఆలోచించుకుని ప్రొసీడ్ అవాల్సింది – "

"ఏంటమ్మా అలా మాట్లాడుతావు. ముందే ఎవరెలాంటివారో ఎలా తెలుస్తుంది? అమ్మాయి బాగుంది – చదువుకుంది, తెలివుంది అని స్నేహం మొదలుపెడతాం. తర్వాత అది ప్రేమగా మారాక కదా పెళ్ళిదాకా వెళ్తాం ఎవరన్నా – కొన్నాళ్ళు దగ్గరగా కలిసిమెలిసి తిరిగాక కదా ఎవరెలాంటివారో అసలు సంగతులు అర్థమవుతాయి."

"సరే, ఇప్పుడా అమ్మాయిలో నీకు నచ్చనిది ఏమిటి?

సంకల్ప్ జవాబు చెప్పకుండా భోంచెయ్యసాగాడు.

"చెప్పు. అసలు సంగతి ఏమిటో తెలిస్తే కదా నేనా అమ్మాయికి జవాబు చెప్ప గలను –"

"నీవెందుకు చెప్పడం – చెప్పాల్సింది నే చెప్పానుకదా – 'ఇది మీ ఇద్దరికి సంబంధించింది, మధ్యలో నేనెందుకు' అని చెప్పు–" నిర్లక్ష్యంగా అన్నాడు.

"చూడరా, అలా చెప్పి వదుల్చుకోడానికి అరనిమిషం పట్టదు. ఓ ఆడపిల్ల తల్లిగా అంత బాధ్యతారహితంగా ప్రవర్తిస్తే నా చదువుకి అర్థంలేదు. ఇదే పరిస్థితిలో నా కూతురు ఉంటే, నీ చెల్లెలు ఉంటే ఇంత నిశ్చింతగా వదిలేస్తామా? మన చేతనయినంతగా సరిదిద్దాలని తాపత్రయపడ్తాంగదా! ఆ అమ్మాయి ఇంటికి వచ్చి నా సాయం కోరింది. ఏం జరిగిందో, జరిగిందానిలో నీ తప్పేంటో తెలుసుకోకుండా నిశ్చింతగా ఉండడం నా మనసుకి నేను నచ్చచెప్పుకోలేని విషయం. నీవు నా కొడుకువి. విషయం నాదాక వచ్చాక పట్టనట్టు ఎలా ఉండమంటావు?" పట్టుదలగా అంది.

"అబ్బ, అమ్మా! నీవు చాలా సెన్సిటివ్. అతిగా ఆలోచిస్తావు – చూడమ్మా ఆ అమ్మాయితో నాకు సరిపడదమ్మా – ఊరికే వాడుకుని వదిలేసే రకం కాదు నీ కొడుకు – నీ పెంపకం మీద నీకామాత్రం నమ్మకం ఉంటే నేనేం తనని అన్యాయం చెయ్యలేదని నమ్ము. అమ్మా చెప్పడానికి పెద్ద కారణం లేదు – ఆ అమ్మాయి స్వభావం నాకు నచ్చలేదంతే.

"ఉదాహరణ చెప్పు. ఆ కారణం నన్ను నమ్మించగలిగితే నిన్ను ఇబ్బంది పెట్టను."

"అమ్మా, కొన్ని విషయాలు చెప్పడానికి ఉండవు. అనుభవంలోకి వస్తాయి. అవి

చెప్పినా చిన్న విషయాలుగా నీకు కనపడవు. కానీ అవతలివాళ్ళకి విముఖత కల్గించవచ్చు. సరే, అడుగుతున్నావుగా, విను, తను నన్నెందుకు చేసుకోవాల నుకుంటుందో తెలుసా! నా ఉద్యోగం, డబ్బు, నా ఆస్థి, హోదా, అంతస్థు చూసి. మొదట్లో తను నిజంగా నన్ను ప్రేమిస్తూందనే అనుకున్నాను, నా మీద చాలా అభిమానం అనుకున్నాను. నా గురించి, మీ గురించి, మీ ఉద్యోగాలు, మనిల్లు అన్నీ చూపించాను."

"మన ఇల్లు చూపించావా? ఎప్పుడు తీసుకువచ్చావు?" ఆశ్చర్యంగా అడిగింది.

"మీరిద్దరూ తాతగారికి బాగోలేదని వైజాగ్ వెళ్ళారు చూడు అపుడు" చూపు తప్పించి అన్నాడు.

కొడుకు వంక ఓ చూపు విసిరి కల్యాణి – "ఊ, సరే చెప్పు" అంది.

"అమ్మా – మన ఇల్లు, హోదా, మన కార్లు, అంతస్థు అన్నీ చూసింది మొదలు పెళ్ళి పెళ్ళి అంటూ ఊదరగొట్టడం మొదలుపెట్టింది." పెళ్లికాకుండా నీతో తిరిగితే మా వాళ్ళు ఒప్పుకోవడంలేదు. వెంటనే చేసుకో అంటున్నారు అని రోజూ ప్రెషరైజ్ చేయడం మొదలుపెట్టింది. ఓ రోజు బలవంతంగా వాళ్ళ ఇంటికి తీసుకెళ్ళి వాళ్ళ నాన్నచేత అడిగించి నన్ను ఇబ్బందిలో పడేసింది. అమ్మా వాళ్ళు చాలా మామూలు సంసారులు. ఆయనకేదో చిన్న ఉద్యోగం, తల్లి టీచరు. ముగ్గురమ్మాయిలు. ఒక అమ్మాయి పెళ్ళి అయింది. ఇంకో అమ్మాయి చదువుతోంది. లోను పెట్టి ఇంజనీరింగు చదివిందట. నేను తనకి మొదట్లోనే చెప్పాను. 'పెళ్ళి ఇప్పుడప్పుడే చేసుకోను. నన్ను కంపెనీ అమెరికా పంపిస్తోంది. అక్కడెన్నాళ్ళుండాలో ఏడాదా, రెండేళ్ళా ఇవన్నీ తేలకుండా చేసుకోను' అన్నాను. అప్పటి నుంచీ నేను తనకందకుండా ఎక్కడ జారిపోతానో అని, 'పోనీ ముందు ఎంగేజ్ మెంట్ చేసుకుందాం – మీ వాళ్ళని కలిసి మా వాళ్లు మాట్లాడతారు' అంటూ చంపడం మొదలుపెట్టింది. అంతేకాదమ్మా తను చాలా గ్రీడి అని చాలా సందర్భాలలో అర్థమయ్యాక తన మీద సదభిప్రాయం జారిపోసాగింది. సంకల్ప్ విముఖత మాటల్లోనే కనిపించింది కల్యాణికి.

అంటే – "ఎందుకలా అనిపించింది?" రెట్టించి అడిగింది.

"అమ్మా ఈ ఆరునెలలలోనే నాచేత ఎంత ఖర్చుపెట్టించిందో తెలుసా – ఫైవ్ స్టార్ హోటళ్ళకి వెళ్ళాలి నీలాంటివాడు, ఈ హోటల్‌కంటే అనేది. బర్త్‌డేకి ఇదేం గిఫ్ట్? అంటూ బుంగమూతి పెట్టి హాస్యంగా అంది. 'వాలెంటైన్స్ డేకి ఏమిస్తావో

చూస్తా ఇలాంటలాంటిదయితే ఊరుకోను' అంటూ జోక్‌గా అంటున్నట్టు అనేది. ఓసారి చనువుగా నా పర్స్ తీసి మూడు, నాలుగు క్రెడిట్ కార్డులు చూసి హాస్యంగా అన్నట్టు 'ఇన్ని కార్డులా' నా కోటి ఇచ్చిచూడు ఒక్క రోజులో నీబ్యాంక్ బాలెన్స్ జీరో అయిపోతుంది. యూ ఆర్ లక్కీ యార్! మీ ఇంట్లో అందరూ ఇంత సంపాదిస్తున్నారు – మీకు ఒక బంగళాయేనా ఇంకా ఇళ్ళున్నాయా – నీవు వేరేగా ఏదన్నా అపార్ట్ మెంట్ కొనుక్కున్నావా? – పెళ్ళి అయ్యేసరికి పెద్ద అపార్ట్‌మెంట్ రెడీగా ఉండాలి తెలుసా? నా ఇష్టం వచ్చినట్టు డెకరేట్ చేస్తాను. నాకో కారు కావాలి తెలుసా...' ఇలా కోరికలు – డబ్బుపట్ల ఆమె గ్రీడీనెస్, అసహ్యంగా ఓపెన్‌గా బహుమతులు అడగడం, మన ఆస్తుల గురించి ఆరాలు ఇవన్నీ నాకెందుకో ఆమెది ఛీప్ మెంటాలిటీలా కనిపించింది. పెళ్ళికాకముందే ఇంత డిమాండ్, ఇన్ని కోరికలు. రేపు పెళ్ళయ్యాక ఆమె ఆశలు, కోరికలకి అంతుండదేమో, ఎందుకో నాకు ఆమె మీద సదభిప్రాయం పోయింది అమ్మా. అంతేకాదు వాళ్ళ నాన్న మాటలూ అంతే – నా జీతం, మనిల్లు, ఆస్థి గురించి ఆరాలు – "

"సరే ఆయన తండ్రిగా మన ఆస్థిపాస్తులు తెలుసుకోవాలనుకుని ఉండవచ్చు."

"అమ్మా, తెలుసుకునే పద్ధతి ఉంటుంది. లేకిగా మొహం మీదే అడగరు – ఏమోనమ్మా నాకెందుకో మొత్తం వ్యవహారం నచ్చలేదు. మనకి తగినవారు కారు."

"అంటే, హోదా, అంతస్థు."

"అదికాదమ్మా వాళ్ళు మనకంటే అంతస్థులో ఉండడంలో తప్పులేదు. అంతస్థు తక్కువయినా ఆత్మాభిమానం తక్కువ ఉండకూడదు. డబ్బులేకపోయినా హుందాతనం ఉండాలి. అది ఆ ఫ్యామిలీలో కరువు అని అర్థమయిందమ్మా" విసుగ్గా అన్నాడు.

"ఆడపిల్లకదా, కాస్త లేనింటినుంచి వచ్చింది, కోరికలు తీర్చుకోవాలని కలలు కనడం సహజం." కల్యాణి సాలోచనగా అంది.

"అమ్మా ప్లీజ్ తనని సమర్థించవద్దు. నీకు తెలియదు తన సంగతి – దగ్గిరనుంచి కలిసి మెలిసి తిరిగినపుడే తెలుస్తుంది స్వభావాల సంగతి. అంతేకాదమ్మా తనతో తప్ప ఆఫీసులో ఇంకెవరితోనైనా మాట్లాడితే అలకలు – అసూయ."

"అదేరా ఇప్పుడు సమస్య. కలిసి మెలిసి తిరిగాం – చాలా క్లోజ్‌గా మూవ్ అయ్యాం అంది అలాంటప్పుడు ఇప్పుడు కాదనడం తప్పుకదా, అదే నన్ను ఆలోచింపచేస్తూంది."

"ఏమిటమ్మా తన మాటలు అంత సుళువుగా నమ్మావు. మా మధ్య మీరనుకునే టంత సీను ఏం లేదు. డిన్నర్లకెళ్ళాం, సినిమాలకెళ్ళాం. హద్దులేం దాటలేదు. స్నేహితుల్లా దగ్గిరగా ఫోటోలు, తనే నాకు దగ్గిరకావాలని ప్రయత్నించేది. కారులో నా భుజం మీద తలవాల్చేది, పార్కులో చేతిలో చెయ్యేసి బిగించేది, డిన్నర్లలో స్పూన్‌తో తినిపించేది, సినిమాలో ఓసారి తనే చటుక్కున బుగ్గమీద కిస్ చేసింది. పెద్ద ఏదో జరిగిపోయినట్టు చెప్పినవి ఇవే సీన్‌లు. ఇంతకంటే ఏంలేదు. నన్ను నమ్ము" నిజాయితీగా అన్నాడు.

"ఏమిటో నాయనా మీ ప్రేమలు, స్నేహాలు. చెట్టాపట్టాలేసుకుని తిరుగుతారు. మళ్ళీ నచ్చలేదంటారు. ఏదో పెద్దవాళ్ళు చూసిన సంబంధం చేసుకుంటే వివాహ బంధంలో, ఆ బంధం అంత సుళువుగా విడిపోనీయదని నమ్మేవారం. పెళ్ళికాక ముందు తిరగడాలు, మూన్నాళ్ళ ముచ్చటగా మురిపాలు ముగిసిపోవడం, పెళ్ళికాకముందే అన్ని అనుభవాలు పూర్తయినట్లు, అసలు రంగులు బయటపడి పోవడం, వద్దనుకోడాలు, ఒకళ్ళమీద ఒకరు నెపాలు, కక్షలు. ఏమిటో మీ యువత ధోరణి మాలాంటివారికి అర్థం కాదు. సరే పాపం ఆ అమ్మాయి నీమీద ఆశలు పెట్టుకుంది, ఇప్పుడు నేనేం చెప్పాలి."

"అబ్బ అమ్మా ఇంత చెప్పినా ఇంకా జాలిపడ్తావేమిటి? నేనే తనతో చెప్పుకుంటా. నీవేం మాట్లాడకు" సంకల్ప్ తేలిగ్గా అన్నాడు.

* * * * * *

కల్యాణి చెప్పింది అంతా విన్నాక సారథి చిన్న నిట్టూర్పు విడిచి "ఏం చేద్దాం అనుకుంటున్నావు?" భార్యవంక చూసి అడిగాడు.

"అదే ఆలోచిస్తున్నా."

"చూడు ఆ అమ్మాయి మనింటికి వచ్చి అడిగింది కనుక నీవూ వాళ్ళింటికి వెళ్ళి వాళ్ళ పేరెంట్స్ ముందే సంకల్ప్ అభిప్రాయం చెప్పిరా. జరిగిందానిలో మన ప్రమేయం లేదు కనుక మనం దోషులుగా నిలబడక్కలేదు. మర్యాదగా చెప్పి వచ్చేయ్" సలహా ఇచ్చాడాయన.

* * * * * *

"శృతీ.. శనివారం మీ ఇంటికి వస్తాను, మీ వాళ్ళని కూడా ఉండమను."

"తప్పకుండా ఆంటీ" శృతి గొంతులో ఆనందం. ఇంటికొచ్చి అందరితో మాట్లాడతాననడం సంబరంగా తల్లిదండ్రులతో వార్త చెప్పింది.

✶ ✶ ✶ ✶ ✶ ✶

"శృతీ నేను మా అబ్బాయితో మాట్లాడాను. చూడమ్మా సిఫార్సులతో పెళ్ళిళ్లు చేయగలం కాని కాపురం చేయించలేం అన్నది వాడితో మాట్లాడాక అర్థమైంది. సారీ, నీకు నేనేం సాయం చెయ్యలేకపోయాను."

శృతి మొహం మీద ఒక్కసారి నీళ్ళు జల్లినట్టు ఉలిక్కిపడింది. ఆమె మొహం కళావిహీనం అయింది.

"కారణం ఏంచెప్పాడు సంకల్ప్?" ఆమె గొంతులో మార్ధవం పోయి కాఠిన్యత చోటుచేసుకుంది.

"ప్రత్యేకంగా ఇది అని చెప్పలేదు" కొడుకు చెప్పిన కారణం శృతికి ఎలా చెప్పాలో అర్థంకాక నసిగింది." అమ్మా చూడు... వాడిష్టపడనప్పుడు బలవంతంగా వప్పించలేం. అలా పెళ్ళాడుతే ఆ పెళ్ళిలో నీకేం సుఖం దొరుకుతుంది? నీకు నచ్చిన వాడిని చేసుకో."

"నచ్చినవాడనే తిరిగాను మీ అబ్బాయితో. ఆడపిల్లలతో ప్రేమాయణాలు జరిపి ఇప్పుడిలా అనడం... పెద్దవారు మీరు ఒప్పిస్తారని ఆశపడ్డాను" ఆవేశంగా అంది.

"చూడండమ్మా మేం ఆడపిల్లవాళ్ళం. మా అమ్మాయికేం తక్కువని మీ అబ్బాయి ఇప్పుడు వెనక్కి తగ్గాడు. కనీసం కారణం చెప్పాలికదా! దురుసుగా అన్నాడు శృతి తండ్రి.

"చూడండి, ఇది మనం కుదిర్చిన సంబంధం అయితే మీకు ప్రశ్నించే అధికారం జవాబు చెప్పాల్సిన బాధ్యత మాకుండేది. వాళ్ళిద్దరూ ఇష్టపడి ప్రేమించుకున్నారు, కలిసి తిరిగారు, మా ప్రమేయం లేనిదానికి మేము జవాబుదారి కాలేం. మా అబ్బాయి వద్దనుకోడానికి వాడికారణాలు వాడికున్నాయి. వాడిని బలవంతం పెట్టి పెళ్ళి చేయించలేం కదా. నన్ను అనే ముందు మీ అమ్మాయిని మీరు అదుపులో పెట్టుకున్నారా? వాళ్ళిద్దరూ కలిసి తిరుగుతున్నప్పుడే ఆరా తీయాల్సింది. మీకు వీలయితే కట్టడి చేసుకోవాల్సింది. ఈనాటి యువత ప్రేమించుకోడం వాళ్ళ హక్కు అనుకుని కేవలం అక్షింతలు జల్లే బాధ్యత మనకిస్తున్నారు. ఇది మీకూ తెలుసు. వారిద్దరూ స్వవిషయం అనుకున్నపుడు నా జోక్యం ఎంతవరకన్నది మిమ్మల్ని మీరు

ప్రశ్నించుకోండి. మా అబ్బాయి మీ అమ్మాయితో చెప్పేశానని చెప్పినా మీ అమ్మాయి నా దగ్గరకొచ్చి సాయం అడిగింది కనుక మర్యాదగా చెప్పాలని వచ్చాను. నాకూ, ఓ ఆడపిల్ల ఉందన్న సానుభూతితో" శృతి తండ్రి మాట్లాడిన ధోరణి నచ్చక కాస్త దృఢంగానే అంది కల్యాణి.

"మీ సానుభూతి కోసం అడగలేదు" విసురుగా అంది శృతి.

"సరే అమ్మా, ఇందాక చెప్పినట్లు సిఫారసులతో కాపురాలు, పెళ్ళిళ్ళు నిలబడవు. వస్తా!" కల్యాణి లేచి గుమ్మం వైపు నడిచింది.

"మీ అబ్బాయికి చెప్పండి. అంత ఈజీగా తప్పించుకోలేడని. నేను అందరమ్మాయిల లాంటిదాన్ని కానని. నా దగ్గరున్న ఆధారాలతో ఏదన్నా చేయగలను" కసిగా అంది శృతి వెనకనుంచి.

గుమ్మందగ్గర నుంచి వెనక్కి తిరిగి శృతి వంక ఓసారి సూటిగా చూసి వెనక్కి తిరిగి కల్యాణికి ఆ క్షణంలో రెండురకాల భావాలు మనసుని చుట్టుముట్టాయి. అమ్మగా కొడుకు తీసుకున్న నిర్ణయానికి ఓపక్క సంతోషపడాలా – అతివగా అబ్బాయి అమ్మాయిల స్థానాలు తారుమారు అయిపోతున్నందుకు మరోపక్క సంతోష పడాలా!!??

*(కథా కౌముది, సెప్టెంబరు 2013)*

# బ్రతుకు తెరువు

“ఎంత పెద్ద ఇల్లే అమ్మా!” ఏడేళ్ళ వెంకటేశు తల్లి కొంగు పట్టుకొని గేట్లోంచి వస్తుండగా ఆశ్చర్యంగా అన్నాడు పెద్ద పెద్ద కళ్ళు తెరుస్తూ. “ఇల్లనరురా దీని, అపార్టుమెంటు అంటారు. వారం రోజులుగా అక్కడ పనిచేస్తున్న మల్లమ్మ తను నేర్చుకున్న ఆ మాట కొడుక్కి చెప్పింది. ఇది ఒక ఇల్లు కాదురా, యిక్కడ నలభై ఇండ్లున్నాయిట. ఇట్లా అన్నీ కలిపి కట్టిందానిని అపార్టుమెంటు అంటారుట. ఇలాంటివి ఈ ఐదరాబాదలో వేలున్నాయట” ఎంతో తెల్సినట్టు విడమర్చి చెప్పింది.

‘నీవీడనే పనిచేస్తండవా’ కొడుకు ఆనందంగా అడిగాడు. ఒకటేటి, మూడిల్లల్లో సేస్తండ. మన భూదేవి పిన్నమ్మ పని కుదిర్చిందిగా. పిన్నమ్మ కొడుకు యీడనే ఎప్పుడూ పనిసేస్తడు. అదేగా, ఆల్లమ్మకి మనిషి కావాలని సెపితే పిన్నమ్మ నన్నట్టుకొచ్చి కొలువులో పెట్టింది.

మాటల్లో ఇప్పుడు దగ్గిరకొచ్చింది మల్లమ్మ. అక్కడ గోడకున్న ఎఱ్ర బల్బుని వత్తింది. జఱ్రున పనైనించి ఓ బోనులాంటిది కిందకి జారుకుంటూ రావడం, అందులో బల్లమీద కూర్చున్న యాదగిరి ‘ఏంటక్కా యీడ్ని ఎంటేసుకొచ్చావియాళ’ అని పలకరిస్తూ ‘ఏఁట్రా అట్లా గుడ్లు మిటకరించి సూస్తున్నావు. గమ్మున లోపలికిరా’ చేయి పట్టి లాగి తలుపు మూసి ఎఱ్ర బటను నొక్కాడు. ‘సూసావా, ఎలా జర జర పైకి పోతుందో, మెట్లెక్కి రానక్కరలే, ఇదే తీసకపోతది. గొప్పగా అందులో కూర్చుని పని చేయడం చాలా గొప్ప పని అన్నట్లు గర్వంగా అన్నాడు యాదగిరి. జఱ్రున పైకి తోడేసింది లిఫ్టు. తలుపు తెరిచి ఎంకటేసు నెత్తి జెల్లకాయ కొట్టి ‘నోరుమూయరా ఎదవా ఈగలెల్లిపోగలవు నోట్లోకి.’ నోరెళ్ళపెట్టి చూస్తున్న వెంకటేసుతో హాస్యం

ఆడాడు. కొడుకు చేయి పట్టుకొని ఓ గుమ్మందగ్గిర కెళ్ళి బెల్ కొట్టింది మల్లమ్మ. తలుపు తీసినావిడ 'ఏమిటి వీడెవడు, నీ కొడుకా లోపలికెందుకు ఆ మెట్ల మీద కూచోబెట్టు' అంది కాస్త మొహం అప్రసన్నంగా పెట్టి.

"ఈ పొద్దుకి రానీ తల్లి, అంతా కొత్త, ఎనకాతల గిన్నెలు తోమేకాడ కూకోపెడతాను. రారా" అంటూ తీసికెళ్ళి వంటింటిదగ్గర బాల్కనీలో కూచోబెట్టింది. గబగబా చీపురు పట్టుకుని "యీడనే కూకో అమ్మ 'చా' ఇస్తుంది తాగిపిస్తా. నా వెంట వురక్క" అంటూ లోపలికెళ్ళింది. ఇల్లు వూడ్చి వచ్చి బకెట్‌లో నీళ్ళు, గుడ్డ పట్టుకుని మళ్ళీ వెళ్ళి ఇల్లు తుడిచి వచ్చింది. వంటింట్లో పనిచేసుకుంటున్న ఇంటామె 'ఏమిటి' వాడిని స్కూలుకి పంపరాదా, నీ వెంట తిప్పుకుంటావెందుకు' అంది టీ చేసి ఓ పాత గ్లాసులో పోసి ఇస్తూ.

"ఏదమ్మా ఊరు కొత్త గందా, బడి ఏడుంతో సూడాలి, నాలుగు డబ్బులు చేతిలో పడాలి. ఏసంకాలం శలవులయ్యాక బడిలో సేర్చమన్నారు మావోళ్ళు." గ్లాసులో సగం టీ ఓ విరిగిన కప్పులో సగం పోసి కొడుక్కిచ్చి, తను తాగింది. తరువాత అంట్ల గిన్నెలన్నీ పోగేసి గబగబా తోమి గంపలో బోర్లించింది. గిన్నెలయ్యాక నానబెట్టిన బట్టల బకెట్ తీసుకొచ్చి బ్రష్ పెట్టి ఉతక సాగింది. 'అమ్మా యాదగిరి మామకాడి కెళతానే' అన్నాడు. 'వద్దురా, నీవీడే కూర్చో, పని కాంగానే ఎళదాం యిదిగో యీ బట్టలు గుంజినాక పని అయిపోతాది' అంటూ బట్టలు గబగబా పిండి ఆరేసింది. గంటన్నరలో పనిచేసి రెండో అంతస్థులో ఇంకో యింటికి వెళుతూ మధ్యలో లిఫ్టు దగ్గర ఆగి "తమ్ముడూ యీడిని కాస్త నీకాడ కూకుండబెట్టుకోరా ఆ మార్వాడమ్మ లోపలికి తీసికెళితే అరుస్తుంది." అలాగే! నీవు పో. నాకాడుంటాడులే యీడు' అని లోపలికి లాగి స్టూలు మీద కూర్చోబెట్టి యీ కబురూ ఆకబురూ చెప్పసాగాడు. కానీ ఎంకటేసుకి మాత్రం లిఫ్టులో కూర్చోడం అది పైకి కిందకి వెళుతుంటే బలే గమ్మత్తుగా వుండి మొహం చింకి చాటంత చేసుకుని కూర్చున్నాడు. ఓ గంట తరువాత తల్లి పనిచేసుకు వచ్చి 'పద కిందకి ఇంటికి పోవాల' అంటూ మొదటి అంతస్థులో యింకో యింటికి తీసుకెళ్ళి 'ఇంద ఈ రొట్టి తింటూ ఆ మెట్లకాడ కూచో... ఏడికీ పోవద్దు. గమ్మున కూర్చో జాగ్రత్త' అంటూ ప్లాస్టిక్ కాగితంలో చుట్టిన పరోటా వాడి చేతిలో పెట్టి వెళ్ళింది. ఆ మెట్ల మీద కూర్చుని వచ్చి పోయేవారిని, లిఫ్టులో ఎక్కేవారు దిగేవారు స్కూలు పిల్లలంతా రంగు రంగుల యూనిఫారాలు తొడిగి భుజాన పుస్తకాల సంచులు, చేతిలో టిఫిను బుట్టలు

పట్టుకుని స్కూలుకి వెళ్ళడం, కింద ఆటోవాళ్ళు, పేపరు వాళ్ళు, కింద నుంచే తాగే నీరు తెచ్చే పనివాళ్ళు అంతా హడావిడి. అదో చిన్న ఊరులా వుందనిపించింది ఎంకటేసుకి. తల్లి మధ్యలో ఓసారి వచ్చి మెట్లమీద కూర్చుని తానొకటి తిని వాడికొకటి తెనిపించింది. గ్లాసులో టీ సగం తను తాగి సగం వాడికిచ్చింది. 'అమ్మా నేను స్కూలు బోతనే' అన్నాడు స్కూలు పిల్లలని చూపించి. 'పోదువులే స్కూలు శలవలయ్యాక మొదలెట్టాక పోదువులే రేపటికాడ నించి పలక బలపం తెచ్చుకుని యాదగిరి మామకాడ కూకుని అచ్చరాలు రాపించుకో అంది లోపలికి వెళుతూ.

మల్లమ్మ మూడిళ్ళలో పని పూర్తిచేసి బయటికి వచ్చేసరికి పదకొండున్నరయింది. చేతిలో స్టీలు డబ్బా పట్టుకుని వచ్చి 'పద పోదాం యింటికి' అంది. అక్కడికి ఓ ఫర్లాంగు దూరంలో వుంది మల్లమ్మ యిల్లు. ఇల్లంతా ఓ చిన్ని గది. వెనక పంచదించిన చోట గోడ అడ్డం పెట్టిన చోట వండుకునే చోటు. మరో పక్క మనిసి పట్టేంత చిన్న స్నానం గది. ఆ బస్తీ ఆ సందుకి వున్న పన్నెండిళ్ళకి కలిపి కామన్ లెట్రిన్లు రెండున్నాయి. అక్కడికి పోవాలి బాల్చా నీళ్ళు పట్టుకుని. ఆ గదే ఐదువందల బాడుగ. ముప్ఫై రూపాయలు కరెంటు బల్బుకి. పదిహేను రూపాయలు నీళ్ళకి పుచ్చుకుంటుంది ఇంటామె. ఈ యిల్లు, ఈ కొలువు పింతల్లి భూదేవి పుణ్యాన దొరికాయి అనుకుంటుంది మల్లమ్మ. లేకపోతే తనగతి ఏమయ్యేదీ ఆ పల్లెలో కొడుకుని పెట్టుకుని తిండిగింజలు లేక మాడాల్సి వచ్చేది అనుకుంటుంది. భూదేవి పిన్నికి ఆ బస్తీలోనే చిన్న యిల్లుంది. రెండు గదులు, వంటిల్లు. కొడుకు కోడలు చిన్నకొడుకు యాదగిరి వుంటారు. ఇంటికి నల్లా (పంపు) వుంది. పంకాలున్నాయి. టి.వి. వుంది. కొడుకు గవర్నమెంటు నౌకరి. కోడలు బ్యాంక్‌లో అటెండరు. భూదేవి నాలుగిళ్ళలో పనిచేస్తుంది. యాదగిరి బిల్డింగులో లిఫ్టు బాయ్ అంతా కలిసి సంపాదించి దర్జాగా వుంటారు.

మల్లమ్మ మొగుడు కొమరయ్య నాలుగు నెలల క్రితం పురుగుల మందు తాగి ఆత్మహత్య చేసుకున్నాడు. మల్లమ్మ కొమరయ్యది మహబూబ్‌నగర్ టజిల్లాలో అచ్చంపేట. రెండకరాల భూమున్న రైతు. పొలాన్ని, పంటని నమ్ముకున్న చిన్నకారు రైతు. గత ఐదేళ్ళుగా రైతుల కడగండ్లు మొదలయ్యాయి. వర్షాభావం, నకిలీ విత్తనాలు, కల్తీమందులు, విపరీతమైన ఎరువుల ధరలతో రైతుల నడుం విరిగింది. గత మూడేళ్ళు వర్షాలు లేక, భూమిలోని నీరింకి, అప్పులు తెచ్చి మూడు చోట్ల వేయించిన బోర్ బావులు ఖర్చు ఎవరు తవ్వుకున్న గోతిలో వారే పడ్డట్టయింది. రైతుల కథలు,

పండిన కాస్త పంటకైనా గిట్టుబాటు ధర రాకపోవడం ఎరువులు, మందులు ఖర్చులు విపరీతంగా పెరిగి తీసుకున్న అప్పులు అలా ఏటికేడు పేరుకుపోయి ఆఖరికి వడ్డీకూడా కట్టలేని దుస్థితిలో పడ్డారు రైతులు. వరి వేస్తే నీరు లేదని మెట్ట పంటలు వేశారు. ఓ ఏడాది చీడపురుగువాత, ఇంకో ఏడు పంట కాస్తా బాగుందనేసరికి అకాల వర్షాలతో పట్టిన గింజ రాలిపోయి నీళ్ళల్లో తేలాయి. కంది మడులు, మిరప పంట, వేరుశనగ మార్చి మార్చి పంట వేసినా ప్రతి ఏడూ పెట్టిన ఖర్చన్నా గిట్టక అటు బ్యాంకుల్లో అప్పు, ఇటు వడ్డీ వ్యాపారుల దగ్గర అప్పు పాపంలా పెరిగిపోయి లక్షన్నర దాకా అప్పుల్లో పీకదాకా మునిగాడు కొమరయ్య. అప్పుల బాధతో రైతులు మరోదారి లేక  బతకలేక పురుగుల కోసం తెచ్చిన మందులు వాళ్ళు తాగి పురుగులు చావకపోయినా వాళ్ళు చచ్చారు. గత మూడేళ్లుగా రైతుల ఆత్మహత్యల పర్వం మొదలైంది. అలా చచ్చిపోతే ప్రభుత్వం సహాయం అందిస్తుందని, డబ్బులిస్తారని ఆ డబ్బుతో కనీసం భార్యాబిడ్డలన్నా కడుపు నిండా తింటారని. బతికి బావుకుందే ముందని రైతులు ఒకరి తర్వాత ఒకరు ఆత్మహత్యలు మొదలెట్టారు. అలా ఆత్మహత్య చేసుకున్న వాళ్ళలో కొమరయ్య ఒకడు. మొగుడు నే చస్తానే, ఈ పురుగులు సావకపోయినా నే సావచ్చు తాగి... గవర్నమెంటోల్లు పైసలిస్తారంట. నీవు, ఎంకటేసు సుకంగ బతకొచ్చు' అంటూ దారి తెన్ను తోచక కొమరయ్య నిస్పృహరఅలో రెండు మూడు సార్లు అన్నప్పుడు 'ఊరుకోయ్యా పానం తీసుకుంటే నామీదొట్టే నన్ను సంపుకు తినమాకు. ఈ పొలం అమ్మేపారేయి వచ్చినకాడికి, మనం ఐదరాబాదు పోదాం. అక్కడ మస్తుగా కూలీలు మస్తుగా కావాలంట. సచ్చి సాదించేందయ్యా. అట్టాంటి ఆలోచన మాను. బేరం పెట్టు పొలం వచ్చినకాడికి అమ్మిపోదాం. భూమిని నమ్ముకు బతికే రోజులు కావియి." భార్యాభర్తలు చాలా రోజులు మధనపడి పొలం బేరం పెట్టారు. కానీ కొనే నాథుడే కనబడలేదు. ఊర్లో కామందు పరిస్థితి చూసి సగానికి సగం రేటు తగ్గించాడు. వచ్చినకాడికి అమ్ముదామన్న పొలం కాగితాలు బ్యాంకు దగ్గర తనఖాలో వున్నాయి. డబ్బు కట్టి కాగితాలు తీసుకెళ్ళమన్నారు. పొలం అమ్మి డబ్బు బ్యాంకికి కట్టేటట్టుగా వాళ్ళ ఆఫీసరు ముందు రాతకోతలు జరగాలన్నారు. దానికీ ఒప్పుకొని బేరం పెట్టి అమ్మాడు. బ్యాంకికి డబ్బు కట్టగానే, పొలం అమ్మిన సంగతి తెలిసి అప్పులిచ్చిన వడ్డీ వ్యాపారులు చుట్టుముట్టారు. 'ఏందిరా తెలివి మీరావు. అప్పులంటూ కాళ్ళావేళ్ళా పడి డబ్బులుచ్చుకొని చెల్లుబడి సేయకుండా పొలం అమ్ముకుని గప్‌చుప్‌గా పోదామని సూస్తుండవా? మా డబ్బులక్కడ ఎట్టి

కదులు. లేకపోతే మెడమీద తలకాయుండదు. అదిరించి, బెదిరించి గుండాలని పట్టుకొచ్చి ఎవరికి రావాల్సిన డబ్బులు వారు గుంజుకుపోయారు. అన్నీ పోగా చేతిలో మిగిలిన మూడు వేలు చూసుకుని వెర్రివాడిలా మాట పలుకు లేకుండా మిడిగుడ్లేసుకు కూర్చున్నాడు. మల్లమ్మ నెత్తీ నోరూ బాదుకుని కేకలు పెట్టింది. ఇరుగు పొరుకు పొలం అమ్మి తప్పుచేశారని తలో మాటా అని పోయారు. ఆ రాత్రే పురుగుల మందు తాగిన కొమరయ్య తెల్లారేసరికి గుడిసెలో చచ్చిపడి వున్నాడు. మొగుడ్ని తగలెట్టడానికి సేతిలో డబ్బులుంచావయ్యా దేముడో అంటూ ఏడ్చింది మల్లమ్మ.

పరామర్శకొచ్చిన పిన్నమ్మ భూదేవి పరిస్థితి అర్థం చేసుకుంది. 'ఇంక యీడ ఏం తిని బతకతావు? పోరిగాడ్నెట్టుకు ఎలా బతకతావు? ఐదరాబాదు వచ్చేయి, నాలుగిండ్లలో గింత పాచిపని చేసన్నా బతకచ్చు. ఈడ కూలిపని కూడా నీకు దొరకదు గదా' అంటూ తనతో ఐదరాబాదు ప్రయాణం కట్టించింది. వండుకునే గిన్నెలు, కట్టుకునే బట్టలతో, చేతిలో వెయ్యి రూపాయలతో మహాపట్నానికి వచ్చి చేరింది. భూదేవి కొమరయ్య పురుగుల మందు తాగి చచ్చాడన్న సర్టిఫికెట్టు సంపాదించి, ఆత్మహత్య చేసుకున్న రైతులకిప్పించే సాయం అందాలని ఆర్జి పెట్టించింది పంచాయితీ ఆఫీసులో. "ఆడబ్బు వచ్చేదో పోయేదో దేముడి కెరుక ఈడుండి పస్తులుండి మాడి సావద్దు" అంటూ తీసికెళ్ళి ఓ బంగళాలో ఐదొందలకి పనికి కుదిరింది.

"మా అపార్టుమెంటులో సానా ఇల్లున్నాయి. ఎవరన్నా అడిగితే ఇంకో రెండిల్లు సేసుకుందువుగాని, ఏదోవిధంగా బతకనేకపోవు' అంటూ ఓదార్చింది. మూడిళ్ళలో పనిచేసుకుంటూ, యీ అమ్మ ఆ అమ్మ యిచ్చే చాయ నీళ్ళు తాగి, వారు పెట్టింది తిని ఇచ్చింది తెచ్చుకుని తల్లీ కొడుకులు బతుకీడ్చసాగారు.

* * * * * *

'మావకాడ కూకుని అచ్చరాలు రాపించుకో. అరే, ఈడిని కాస్త నీకాడ కూకుండబెట్టు' తమ్ముడి కప్పగించి పనులకి పోయింది మల్లమ్మ. ఎంకటేసుకి ఆ లిఫ్టులో కూర్చోడమే బతుకు ధన్యమైనంత ఆనందంగా వుంది. వచ్చే పోయేవాళ్ళని చూస్తూ యాదగిరితో ఈ మాటా ఆ మాటా చెప్పుకుంటూ కూర్చోడం బలే సరదాగా వుంది. 'ఏందిరా మొగం సింకిసాటంతయింది. రెండు రోజులు యిందులో కుకుంటే బోరుకొడ్తది. బోనులో వున్నట్టుంది నాకు. ఎటూ పోదారికి వుండదు. చాయ టైముకు

పదినిముషాలు, భోజనానికి గంట మద్దెలో సెలవంతే. తలుపు గుంజి గుంజి సేయి నొప్పేస్తది. ఒకటే ఉడకపోత ఫేనేస్తే సెక్రటరీ జూసిండంటే తిడ్తడు' తన కష్టం చెప్పుకున్నాడు. మొదట్లో కొన్నాళ్ళు మజాగా అనిపించింది. ఇప్పుడు సిరాకు పుడ్తుంది. ఎక్కడైనా వాచ్‌మెన్ కొలువు దొరికితే పోతా. చక్కగా వాచ్‌మెన్ బయట గేటుకాడ కుర్చీ వేసుకుని కూచుని వచ్చిపోయేవాళ్ళతో కబుర్లాడడం తనేమో ఖైదులో వున్నట్టు కదలడానికి లేదని వాచ్‌మెన్ ఉద్యోగం చెయ్యాలని యాదగిరి ఆశ. లిఫ్టులో బోరు అంటున్న యాదగిరిని వింతగా చూశాడు వెంకటేసు. 'రాయరా, మీ అమ్మ తిడ్తది. అచ్చురాలు రాసిచ్చినాగా దిద్దు కూకుని' అన్నాడు. మావా నాకు నేర్పవా లిఫ్టు నడిపేది' ఆశగా చూశాడు. 'ఏందిరా నేర్పేది సిన్నపిల్లలు సేసే పనా యిది. నా అంత అవు, అప్పుడు చేద్దువులే ఈ నౌకరీ. ముందసలు అచ్చరం ముక్కలు, అంకెలు నేర్చు అన్నాడు. నవ్వి వెంకటేసు పలక మీద అంకెలు దిద్దక ముందే లిఫ్టులో నంబర్లు గుర్తుపట్టేశాడు. అ ఆ లు దిద్దుతున్నా వాడి దృష్టి అంతా యాదగిరి నొక్కే లిఫ్టు బటన్ మీద వుండేది. 'మూడో ఫ్లోరు ఎలిగింది మావా' అనేవాడు ఎర్రలైటు వెలగ్గానే యాదగిరి వాడి యింటరెస్ట్ చూసి 1 నంబరు ఫస్ట్ ఫ్లోరు, రెండు సెకండ్ ఫ్లోర్ అంటూ చెప్పేవాడు. ఓరోజు అన్నింటికంటే పై అంతస్తులో లిఫ్టు తిరిగే మిషను చూపించాడు. ఓ రోజు లిఫ్ట్ కరెంట్ పోయి మధ్యలో ఆగిపోయింది. అప్పుడు తన దగ్గరున్న యినప చువ్వతో లిఫ్టు దగ్గర గోడకున్న చిన్న కన్నంలో పెడితే తలుపు తీస్తే ఇద్దరూ స్టూలెక్కి బయటికి వచ్చారు. వారం పదిరోజులు అన్నీ గమనిస్తూ 'మావా నీవు స్టూలు మీద కూకో, సూడు నేను నడిపిస్తా' అని సరదాపడ్డాడు. ఎర్రలైటు వెలగ్గానే సెకండ్ ఫ్లోర్ అని రెండో బటన్ నొక్కి తలుపులు వేయడం తీయడం అంతా సరదాగా వుండేది. నెల రోజులు లిఫ్టులో కూర్చోగానే నడిపే మెలకువలన్నీ నేర్చుకున్నాడు. అక్కా యీడికి బలే బుర్రుందే. బలే నేర్చేశాడు అన్నాడో ఓ రోజు. నాలుగచ్చరం ముక్కలు నేర్పరా అంటే లిఫ్టు నడిపేది నేర్పావు. మల్లమ్మ నవ్వింది. 'మావా నీవు వాచ్‌మెన్ ఉద్యోగానికి వెళితే నేనీ లిఫ్టు నడుపుతా' గర్వంగా అన్నాడు వెంకటేసు.

'పోరా ఎదవకానా ఇంతున్నావు నీకెవడిస్తాడు ఉద్యోగం? ముందు పెద్దోడివికా, అచ్చరం, అంకెలు నేర్వు స్కూలికి పో' అయ్యాయంగా మందలించాడు. ఎప్పటికైనా, పెద్దయ్యాక లిఫ్టులో కూర్చోవాలి, నడపాలి అన్న కోరిక రోజు రోజుకీ పెరిగింది కాని తరగలేదు వెంకటేసుకి.

కానీ ఏ రోజు ఆ లిఫ్టు సరదాయే తన జీవితంలో నరకం సృష్టిస్తుందని వెంకటేసుకి తెలియదు.

ఓరోజు పదకొండు గంటల వేళ యాదగిరి టీ తాగి వచ్చే టైము. యాదగిరి లిఫ్టు ఆటో మేటిక్‌లో పెట్టి చాయ్ తాగడానికి వెళ్ళాడు. వెంకటేసు లిఫ్టు బయట వరండాలో నిలబడి పిల్లల ఆటలు చూస్తున్నాడు. మూడో ఫ్లోర్‌లో లిఫ్టు నిలబడి వుంది. ఎవరో లిఫ్టు నొక్కుతున్నారు. తలుపు సరిగా మూయకపోవడంతో లిఫ్టు కదలడంలేదు. చప్పుడవుతూంటే వెంకటేసు చూశాడు. తలుపు సరిగా మూయకపోవడంతో లిఫ్టు కదలడంలేదు. చప్పుడవుతూంటే వెంకటేసు చూశాడు. తలుపు సరిగా మూయకపోతే లిఫ్టు కదలదన్నది వాడికి తెలుసు కనక తలుపు దగ్గరకెళ్ళి లోపలి వైపు తలుపులో చెయ్యి పెట్టి సరిగా కనెక్ట్ అయ్యేట్టు తలుపు లాగాడు. వాడు చెయ్యి లాగే లోగానే పైనించి ఎవరో నొక్కడంతో లిఫ్టు పైకి లేచింది. వెంకటేసు చేతికున్న రాగి గాజు గ్రిల్లుకి అడ్డంపడి చేయి తొందరగా లాక్కోలేక పోయాడు. అంతే లిఫ్టుతోపాటు చేయి యిరుక్కున్న వెంకటేసు కాళ్ళు నేలమీద నుంచి లేచి వేళ్ళాడుతూ కేకలు పెట్టాడు. వాడి కేకలకి వాచ్‌మెన్, టీ తాగడానికి వెళ్ళిన యాదగిరి చుట్టూ ఆడుకుంటున్న పిల్లలు, పెద్దలు హాహాకారాలు చేస్తూండగానే మూడో ఫ్లోర్ నుంచి నాలుగో ఫ్లోర్‌కి లేచిన లిఫ్టు వెంకటేసు చేతిని కూడా తీసుకుని పైకి వెళ్ళింది. నాలుగో ఫ్లోరు సీలింగ్‌కి వాడి తల బలంగా తగలడం, యిరుక్కున్న వాడి చేయి మణికట్టు వరకు తెగి లిఫ్టులో పడి లిఫ్టు ఐదో ఫ్లోరుకి వెళ్ళి ఆగడం, తల కొట్టుకుని వెంకటేసు తెలివి తప్పి కిందపడడం, నెత్తుర్మడుగు, హాహాకారాలు అందరూ గబగబా వచ్చి తెగిపడిన చేయి ప్లాస్టిక్ కవల్‌లో వేసి, రక్తం కారిపోతున్న వెంకటేసు చేతిని ఓ చీరలో చుట్టి దగ్గరలో ఉన్న ఆస్పత్రికి మోసుకుపోయారు. ఇంట్లో పని చేస్తున్న మల్లమ్మ గోలకి బయటికివచ్చి జరిగింది చూసి తెలివితప్పి పడిపోయింది. దగ్గర ఆస్పత్రివాళ్ళు ప్రథమచికిత్స చేసి పెద్దాసుపత్రికి తీసుకుపొమ్మన్నారు.

నెలా పదిహేను రోజుల తర్వాత ఆస్పత్రి నుంచి వెంకటేసు బయటపడ్డాడు. కుడి చేయి మణికట్టు వరకు లేకుండా తెగి పడిన చేయి ఆస్పత్రిలో నాలుగు గంటలు ఆపరేషన్ చేసి అతికించారు. నాలుగు సీసాల రక్తం ఎక్కించారు. నలిగి నుజ్జు అయిన ఎముక చిన్న ముక్క కోసి తీసి తెగి, చితికిన నరాలు కలిపి కుట్టి డాక్టర్లు చెయ్యాల్సిందంతా చేశారు. ఆపరేషన్ సక్సెస్ కాలేదు. గాంగ్రిన్ డెవలప్

అవడంతో తెగినంత మేరా చెయ్యి తీయక తప్పలేదు. మొండిచెయ్యితో బతికి బయటపడిన కొడుకుని చూసి మల్లమ్మ ఏడుపుకి అంతే లేదు. తల సీలింగ్‌కి గుద్దుకోవడం వల్ల మెదడు బాగా అదురికి గురి అయి అసలు రెండు రోజులు స్పృహలోకే రాలేదు. ఆ దెబ్బవల్ల వాడికి కాస్త జ్ఞాపకశక్తి తగ్గడం, ఎవరన్నా ఏదన్నా చెప్పినా అర్థం కావడానికి టైము పట్టేది. అదోరకంగా వెర్రి చూపు చూస్తున్నాడు. 'ఓరి నాబిడ్డో, నీకిదేం గతిరో దేముడా, బగమంతుడింత అన్నాయం సేసాడో దేముడో!' కట్టుకున్నాడు లవంతం చావు సచ్చాడు. దేముడు బతికుండగానే సచ్చినోడితో సమం చేశాడురో నిన్ను. సేయి లేకుండా ఎట్లా బతకతాడు ఏటి సేస్తాడు. దేముడో నా బతుకు యిట్టా సేసిండో ఏదో బతుకు దారి లేక యీడకొస్తే ఆడి బతుకే చిందర చేశావురో... పల్లెటూరిలో వుంటే ఆడి బతుకు యిలా అయ్యేది కాదు. దేముడో, మల్లమ్మ దుఃఖం ఎవరూ తీర్చలేనిది. అపార్టుమెంటు వాళ్ళంతా తోచిన డబ్బు సాయం చేశారు. సానుభూతి చూపారు. అంతకంటే ఎవరేం చెయ్యగలరు? ఆ కొడుకు భవిష్యత్తు తలుచుకుంటూ మల్లమ్మ తల్లడిల్లాల్సిందే బతుకంతా.

దుఃఖం వెనకబడి రోజులు ముందుకెళ్ళాయి. వెంకటేసు బడిలో చేరడం వాయిదా పడింది. చేయి పుండు మాని, వాడి పిచ్చి చూపుల ధోరణి కాస్త తగ్గి వాడు మళ్ళీ మనుషుల్లో పడడానికి ఆర్నెల్లు పట్టింది. వంటి చేత్తో ఎడం చేత్తో పనులు చేసుకోడానికి అలవాటుపడ్డాడు. వాళ్ళమ్మ పని చేసుకుంటుంటే అలా మెట్లు మీద కూచునేవాడు. యాదగిరి లిఫ్టు పని మాని ఎక్కడో వాచ్‌మెన్ ఉద్యోగానికి కుదురుకున్నాడు. ఆ తరువాత యిద్దరు లిఫ్టు బాయ్‌లు వచ్చినా తలో నెలరోజుల పని చేసి మానేశారు. లిఫ్టు ఆటోమేటిక్‌గా నడుస్తోంది. మల్లమ్మ కొడుక్కి గట్టిగా వార్నింగ్ ఇచ్చింది లిఫ్టు వైపు వెళ్ళరాదని. ఆ జరిగిన సంఘటనతో బిల్డింగ్ అసోసియేషన్ వారు పిల్లలు దగ్గరకి వెళ్ళకుండా చూసుకోవాల్సిన బాధ్యత తల్లిదండ్రులది అని గట్టిగా వార్నింగ్ ఇచ్చారు.

ఏడాది గడిచింది. మల్లమ్మ ఆర్థిక పరిస్థితి చితికిపోయింది. పెద్దాసుపత్రిలో ఆపరేషను ఫ్రీగా చేసినా మందులు మాకులు, నెలరోజులు ఆస్పత్రి తిరిగిన ఖర్చులు, టెస్టులు అన్నీ కలిపి పది, పదిహేను వేలు అప్పులు చేయాల్సి వచ్చింది. దానికి తోడు నెల రోజులు పనికి సరిగా వెళ్ళకపోవడంతో రెండిళ్ళవాళ్ళు కొత్త మనిషిని పెట్టుకున్నారు. రెండిళ్ళే మిగిలాయి. డబ్బుకి కటకట. కొత్త ఇల్లు దొరకలేదు. ఓపూట తిని ఓ పూట తినక మనసులో బెంగతో చిక్కి శల్యమైంది. భవిష్యత్తు

భూతంలా భయపెడుతుంది. కొడుకుని చదవించాలని కన్న కలలు కల్లలయ్యాయి. వాడంతటవాడు ఏ పని పడితే ఆ పనికి రాడు. బెంగతో నిద్రాహారాలు కరువయ్యాయి మల్లమ్మకి.

మరో ఆర్నెల్లు గడిచాస వెంకటేసు కళ్ళలో బెదురు, ఆ తెల్ల మొహం చూపులు తగ్గి కళ్ళలోకి కాస్త కళ వచ్చింది. ఉన్నట్టుండి ఏ రోజు 'అమ్మా లిఫ్టు నడిపే ఉ ద్యోగం చేస్తానే. సార్‌తో మాట్లాడే మనకి డబ్బుల్లేవు. నీ వొక్కితివి ఎంత కష్టపడతావు. నేనూ నౌకరి సేస్తా. ఈ పని యిప్పించమని అయ్యగార్లని అడగవే అన్నాడు. మల్లమ్మ తెల్లబోయింది. 'ఓరి నా కొడకా, మళ్లీ ఏందిరా లిఫ్టు అంటావు. సావాలనుందేట్రా? కలో గంజో తాగుదాం. లిఫ్టు దెయ్యంరా. అది భూతంరా, నిన్ను మింగతది యీసారి. దాని జోలి వద్దురా మనకు. కొడుకుని కౌగలించుకుని భోరుమంది మల్లమ్మ. ఆ ఏక్సిడెంటు తరువాత మల్లమ్మ మళ్ళీ లిఫ్టు ఎక్కలేదు. నడిచే వెళ్ళేది. 'కాదే అమ్మా నాకేం కాదే ఇప్పుడు సూడు ఎట్టా కూకుని నడుపుతానో, నాకేం బయం లేదు. అమ్మా, ఈపని సేసేయగలనే. నేను స్కూలికి పోను.'

'వద్దురా, సదుకోరా, ఇప్పటికాడ నించి నౌకరి ఎందుకు, సదుకో. పదేల్ల పిల్లగాడికి ఎవరిస్తారు ఉజ్జోగం.'

'అమ్మా ఎడం సేత్తో రాయడం నావల్ల కాదే. నాకసలు అచ్చరాలు, అంకెలు రావే'. ఇంట్లో తల్లి మామయ్య అందరూ వీడి బుర్రకి దెబ్బతగిలింది. ఈడేం చదూతాడు అంటూ మాట్లాడుకోడం విన్నాడు. ఎడం చేత్తో పెన్సిలు పట్టి అసలు రాయను రావటం లేదు. దాంతో వాడికి చదువు మీద అసలు బుద్ధిపోవడం లేదు. 'అమ్మా లిఫ్టు ఉద్యోగం సేసే యాదగిరి మామకి పన్నెండొందలు ఇచ్చారు గందా. నాకందులో సగం ఇమ్మనే. అందులో బల్లమీద కూకుని కట్టపడకుండా డబ్బులు సంపాదిస్తా' ఆశగా అడిగాడు. మల్లమ్మ ఆలోచనలో పడింది. పిన్నమ్మ, యాదగిరి సలహా అడిగింది. 'యీ పోరడు సేస్తానన్నా అల్లు పెట్టుకోవద్దా, పదేళ్ళ వాడిని పనికెవరెట్టుకుంటారు. పోనీ అడిగి సూడు, ఆడన్నట్టు వంటి చేత్తో కట్టపడకుండా కూకుని నాలుగు రాళ్ళు సంపాదిస్తే నీకు తోడవుతాడు. ఆడికో బతుకు తెరువుండాలి కందా' అన్నారు.

తను పనిచేస్తున్న ఇల్లాళ్లకి చెప్పి బిల్డింగ్ సెక్రటరీకి చెప్పించింది మల్లమ్మ. 'అదెట్లా, అసలే వాడు లిఫ్టులో చెయ్యిపెట్టి అప్పుడు నెత్తిమీదకి గొడవ తెచ్చాడు.

పదేళ్ళవాడిని పనికి పెట్టుకుంటే చైల్డ్ లేబర్ యాక్ట్ కింద మమ్మల్ని జైల్లో వేస్తారు' అంటూ ఒప్పుకోలేదు. "బాబ్బాబు, అట్టా అనబోకండి, ఆడికి అచ్చరం ముక్క రావడంలేదు. వంటి సేత్తో ఏ పని సేయగలడు? వంటరి ఆడదాన్ని, బోలెడు అప్పుల్లో మునిగాను. ఈ లిఫ్టు ఆడిపాలిట అమ్మోరు అయి ఆడి సేయి బలి గోరింది. ఇప్పుడింక ఆడ్ని ఆ తల్లే సల్లగా సూస్తుంది. ఆడికి పనిప్పించండి దొరా. ఆడికి ఏం జరిగినా మీకు మాట రానీయను. ఆడిది అసలు ఉజ్జోగం ౘద్దు. మీరెంత ఇచ్చినా మాకు కొండంత అండ. బల్లమీద కూకోపెట్టండి. ఈ బిల్డింగే యింక ఆడికి తల్లి. మీరే ఇంత బతుకు తెరువు సూపాలి అని కాళ్ళు పట్టుకు ఏడ్చింది. అసోసియేషన్ వాళ్ళు మాట్లాడుకున్నారు. తమ బిల్డింగ్‌లోనే వాడికి అన్యాయం జరిగింది. మానవతా దృక్పథంతో ఏదో విధంగా వాడిని ఆదుకోవాలని వారిలో వారు చర్చించి నిర్ణయించారు. 'బానే వుంది కానీ, పిల్లలచేత చాకిరీ చేయించడం నేరం. ఎవరికన్నా తెలిస్తే...' 'ఏటి బాబూ అమ్మ పెట్టదు, అడుక్కు తిననీయదంటారు. పూట గడవని మాలాంటోరు ఏం తిని బతుకుతాం? గవర్నమెంటోళ్ళు పిల్లలకి కూకోపెట్టి తిండెడతారా? పిల్లలని కట్టబెట్టాలని మాకుంటుందా? తిండే లేకపోతే సదూలు సట్టబండలు ఏటి బాబూ, మీరు దయ సూపకపోతే ఆడికి బతుకుతెరువు నేదు బాబూ. లిఫ్టులో సుళువులన్నీ నేర్చుకున్నాడు ఆడు. మీకు తోచినంత యిచ్చి ఆడ్ని అందులో కూకోపెట్టండి బాబూ. మల్లమ్మ మాటలకి ఏ ప్రభుత్వమూ జవాబు చెప్పలేదు. చైల్డ్ లేబర్ వద్దన్నప్పుడు దాని ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయకుండా పిల్లలని కూర్చోబెట్టి పోషించడం పూట గడవని వారికి సాధ్యమా అన్నది ప్రభుత్వాలు ఆలోచించాలి గదా!

వెంకటేసుకి రెండు మూడు రోజులు లిఫ్టు గురించి చూపించి తీసుకోవాల్సిన జాగ్రత్తలు చెప్పి నెలకి ఎనిమిది వందలు జీతంకి కుదిర్చారు.

లిఫ్టులో కూర్చుని పైకి ఎక్కుతూంటే వెంకటేసు మొహంలో సంబరం చూసి 'బగమంతుడు ఏదో దారి సూపాడు, పుట్టించినా గిట్టించినా అన్నీ ఆడికే ఎరుక' అని దండం పెట్టుకొని కళ్ళు తుడుచుకుంది మల్లమ్మ.

***(ప్రియదత్త సకుటుంబ వారపత్రిక, 29.6.2005)***

# అమ్మమ్మ గారి వంట

"ఏమండోయ్" ఒక గావు కేక పెట్టింది కనక మహాలక్ష్మి. వీధి వరండాలో సావకాశంగా పేపర్ తిరిగేస్తున్న ఆ ఏమండి తుళ్ళిపడి ఊడిపడుతున్న లుంగి కట్టుకుంటూ లేచి లోపలికి పరిగెత్తాడు. కొంపదీసి ఇల్లాలేమన్నా జారిపడిందా, నడ్డో, కాలో విరిగిందా, అసలే భారికాయం అని భయపడి లోపలికెళ్ళే సరికి ఫోను చేతిలో పట్టుకుని, మొహం అంతా పౌడర్ అంత మందాన పులుముకున్నంత నవ్వుతో నిలుచున్న భార్యని చూసేసరికి తిక్కరేగింది ఆ ఏమండి గారికి.

"నీ దుంపతెగ ఎందుకే అలా అరిచావ్. నీ కేకలకి ఎప్పుడో గుండె ఆగి చస్తాను. పడ్డావేమో నని పరిగెత్తి వచ్చాను. ఏమైందే" కోపంగా అరిచాడు ఏమండీ అనే ఆంజనేయులు. "అబ్బా అది కాదండీ – 'మీ టి.వి. వస్తుంది' ఆనందంతో మాటలు తడబడ్డాయి. 'నీబొంద మీ టి.వి. వచ్చి ఏడుస్తుంది కదా, ఇందులో కొత్తేముంది.'

'అబ్బ అది కాదండీ, ఎల్లుండి మీ టి.వి. వారు అమ్మమ్మగారి వంట కోసం మన ఇంటికి వస్తున్నారు తెలుసా...'

'మనింటికా! ఎందుకు?'

'అబ్బ మొద్దు బుర్ర, ఎందుకేమిటి? నా వంట ప్రోగ్రాం షూట్ చేయడానికి వస్తున్నారు' తబ్బిబ్బవుతూ అంది ఆవిడ.

'నీవంట, నీ ప్రోగ్రామా – హతోస్మి నీవే దొరికావా వాళ్ళకి' ఇల్లాలిచేత వంట గత ముప్పై ఐదేళ్ళుగా తింటున్న ఆయన కంటే ఆ రుచులు ఎవరికి తెలుస్తాయి.

కనకమ్మ మొగుడి వంక చురచుర చూస్తూ "అంతేలెండి, పెరటి చెట్టు వైద్యానికి

పనికి రాదు. పెళ్ళాం వంట రుచి మొగుడికి తెలియదు. మీకో దండం అదంతే రోజు ఉండే గోలేగా మన మధ్య... పదండీ ముందు బ్యాంక్‌కి వెళ్ళాలి మనం. బట్టలు మార్చుకోండి" ఆర్డర్ వేసింది.

"బ్యాంక్‌కి ఎందుకు? నీ వంటకి ఎన్ని వేలు కావాలేమిటి డబ్బు –" వెటకారంగా అన్నాడాయన. కనకమ్మ నుదుట కొట్టుకుని "ఇదే అయోమయం మొగుడమ్మ. రోజూ టి.విలో నాతో పాటు వంటల ప్రోగ్రాం చూస్తున్నారుగా కళ్లింత చేసుకుని...", చూడక చస్తానా, రిమోట్ నా చేతికి వస్తే కదా", అమాయకంగా అన్నారాయన.

"చూడండి వంటల ప్రోగ్రాంలో అందరూ చక్కగా వెండి కటోరీలు, పళ్ళాలు, బౌల్స్ అన్ని ఎంత నిగనిగ లాడుతూ చక్కగా అలంకరిస్తారు కదా. కటోరీలలో పంచదార, పిండికూరలు అన్ని నింపి పెడతారు కదా..."

"ఆవాలు, జీలకర్ర, ఉల్లిపాయల ముక్కలకు వెండి సామానెందుకే, స్టీలు బొచ్చెలు ఇంటినిండా ఉన్నాయి కదా. ఇప్పుడు బ్యాంక్ నుంచి అవన్నీ తెచ్చి ఇంట్లో పెట్టుకుంటే... రోజులసలే బాగాలేవు."

"చాల్లే ఊరుకోండి. వెండి సామానే కాదు నగలు తెచ్చుకోవాలి."

"ఇదేం పెళ్ళా, వడుగా నగలు దిగేసుకోడానికి", మళ్ళీ ఓ అడ్డుపుల్ల వేసాడు.

"నా ఖర్మ, అందరూ ఆడవాళ్ళు చక్కగా పట్టుచీరలు కట్టుకుని ఒంటినిండా నగలు పెట్టుకుని మహాలక్ష్మిలా కలకల్లాడిపోతుంటారు. చూడట్లేదా? పెళ్ళాం చక్కగా కనపడాలన్న ఆరాటం ఏకోసాన లేదు మీతో వాదించే టైం లేదు. మీరు రానంటే ఆటోలో పోతా. అంత బంగారం, వెండి పట్టుకుని ఆటోలో వస్తే ఏదైనా అయితే నన్నువద్దు" కోపంగా అంది.

పతిదేవుడు గతిలేక సతి వెన్నంటాడు.

బ్యాంక్ నుంచి నగల షాపుకి వెళ్ళి వెండి సామాన్లు పాలిష్ పెట్టించి తెచ్చింది. రాగానే బీర్వాలో చీరలన్నీ అటూ ఇటూ లాగి మంచి రంగు బ్లౌజ్ ఉన్న చీర సెలెక్ట్ చేసుకుంది. టైం లేదు. లేకపోతే కొత్త చీర కొందును అనుకుంది. ఆ మర్నాడంతా ఇంట్లో ఒకటే హడావిడి. ఇల్లంతా బూజులు దులిపించి కర్టెన్‌లు, సోఫా కవర్లు మార్చి షోకేసులో బొమ్మలన్నీ సర్ది దుప్పట్లు కొత్తవి వేసి ఫ్లవర్‌వాజ్‌లో పాత ప్లాస్టిక్ పువ్వులు తీసి కొత్త పువ్వులు మార్చి ఒకటే హడావిడి పడిపోయింది.

"ఏమిటి బాబూ ఈ హడావిడి. పిల్లల పెళ్ళికన్నా ఇలా సర్దావా ఇల్లు."

"మాట్లాడకండి, ఓ మూల కూర్చోండి అడ్డురాకండీ", కన్నెర్ర చేసింది.

ఇంతకీ ఏ వంట చేస్తున్నావు? కుతూహలంగా అడిగాడు ఆయన.

"సస్పెన్స్... ముందు చెప్పకూడదు. ఫోజు కొట్టింది. ఆ సాయంత్రం బ్యూటీ పార్లక్‌వెళ్ళి ఫేషియల్ చేయించుకుని, జుట్టుకి రంగు వేయించుకుని అటునుంచి బజారుకెళ్ళి వంటకి కావాల్సిన సామానంత కొనుక్కొచ్చింది.

* * * * * *

ఆ మర్నాడు తెల్లారే అయిదు గంటలకి లేచింది కనకమ్మగారు. రాత్రంతా నిద్రపోతే కదా ఆవిడ. ఎలా పడుతుంది. టి.వీ.లో పడడం అంటే మజాకానా మరి.

ఎన్నిసార్లు ఎస్.ఎమ్.ఎస్.లు, ఉత్తరాలు పంపింది. ఆఖరికి దేముడు కరుణించాడు.

గుమ్మం ముందు రంగురంగుల రంగవల్లులు దిద్ది, పూలరేకులతో 'మీ టి.వి.కి స్వాగతం' అంటూ రాసి బంతి పూల మాలలు గుమ్మానికి అలంకరించి వంటకి కావాల్సిన సరంజామా అంతా వెండి గిన్నెల నిండా సర్దింది. కూరలవి తరిగించి పెట్టింది. ఏర్పాట్లన్నీ పూర్తయ్యేసరికి అలసిపోయి వేడి వేడి నీళ్ళు పోసుకుని, వేడి కాఫీతో అస్ప్రిన్ వేసుకుంది.

'మీ టి.వీ.' రాక ఇరుగు పొరుగుకి నిన్ననే తెలిసింది. తెలియని వారందరికీ స్వయంగా ఆవిడే ఫోన్ చేసి గర్వంగా చెప్పేసింది. ఆడబడుచుకి, చెల్లెలికి ఫోన్ చేసి సాయానికి రమ్మంది. ఇరుగు పొరుగు వస్తామంటే అబ్బే ఇంత మంది వస్తే గోల అవుతుందంటారు – అయినా టి.వి.లో ఎలాగైనా చూస్తారుగా అనేసింది.

పదకొండు గంటలకి టి.వి. వాళ్ళనుంచి ఫోన్. మరో పదినిమిషాలలో వస్తున్నామని. వ్యాన్ హారన్ మ్రోగగానే 'రండర్రా వాళ్ళొచ్చారు' అని హడావుడి పడుతూ బొకే, వెండి పళ్ళెం పట్టుకుని ఆడవాళ్ళంతా గేటు దగ్గరికి నడిచారు.

"బాగుంది వెర్రి మగ పెళ్ళివారికి ఎదురు సన్నాహంలా హడావిడి – యాంకరమ్మకి కాళ్ళు కడిగి హారతి ఇస్తుందేమో.." నవ్వుకున్నాడు ఆంజనేయులు.

కాళ్ళు కడిగి హారతి ఇవ్వలేదు గాని బొట్టుపెట్టి రవిక గుడ్డ, పళ్ళు చేతిలో పెట్టి బొకే అందించి అట్టహాసంగా ఆహ్వానించింది కనకమ్మగారు.

“అబ్బో బాగా అరేంజ్ చేసారు. ముగ్గులవి మీరే పెట్టారా అమ్మమ్మగారూ”, అంది యాంకరమ్మ వయ్యారంగా నడుస్తూ.

“ఆ, ఆ... అంతా నేనే చేసాను’ అంది. కాని మనస్సులో “అమ్మమ్మగారూ అనడం ఎందుకు నేనేం అంత ముసలి దానిలా కనపడుతున్నానా అనుకుంది.

కెమెరాలు, లైట్లు, మనుషులు లోపలికి నడిచారు. లైటింగు, కెమెరా అన్నీ సర్దుకునే వరకు అందరికి కూల్‌డ్రింక్ ఇచ్చింది మేనకోడలు. కెమెరా మెన్ అంతా సరి చూసుకుని ‘రెడీ కవితా, స్టార్ట్ చేద్దాం’ అన్నాడు సిగ్నల్ ఇస్తూ – మేకప్ మేన్ వచ్చి యాంకరు మేకప్ టచ్ చేసాడు. అద్దంలో చూసుకుని, పూలు, చీర అవి సర్దుకుని ‘పదండి అమ్మమ్మగారు వెళ్దాం’ అంది యాంకరు. మేకప్ తనకి వేయలేదే అన్న సందేహం వచ్చి ‘మరి నాకు మేకప్ వద్దా’ అంది కనకమ్మగారు.

‘మీకెందుకు చక్కగా అందంగా అమ్మమ్మలా ఉన్నారు’ అంది యాంకరు. ఈ అమ్మమ్మ పదం వదలదు గాబోలు అనుకుంది కినుకుగా ... ఆవిడ మొహం చూసి ‘హరీ ఆవిడకి కాస్త టచప్ చెయ్యి’ అంది. మేకప్ కుర్రాడు పౌడర్ పేడ్ మొహం మీద ఇటు అటూ అద్దాడు.

లైట్లు వెలిగాయి. కెమెరా పొజిషన్ చూసుకుని ‘రెడీ’ అన్నాడు కెమెరామెన్. అంత వరకు లేని గాబరా లైట్లు వెలిగి కెమెరా ముందుకు వెళ్ళగానే చెమట్లు పట్టాయి ఆవిడకి. ‘నమస్కారం’ ఈరోజు ‘మీ టి.వి. అమ్మమ్మగారి వంట’ కోసం మనం కనకమహాలక్ష్మి గారింటికొచ్చాం’ – ‘అమ్మమ్మ గారూ! ప్రేక్షకులకి ఏం వంట పరిచయం చేసి చూపిస్తారు’ – కనకమ్మ కాస్త తడబడి ‘ఈరోజు రెండు కొత్త రకం వంటలు చూపిస్తాను’ అంది కాస్త తడబడి.

‘అలాగా, మీలా కొత్త వంటలు చేసి చూపించే వారే కావాలి మాకు, మీ మొదటి వంట ఏం చూపిస్తారు?’ అంది యాంకరు కవిత.

‘బెండకాయ, చామదుంపలు, బచ్చలి కూరతో కూటు చేసి చూపిస్తాను’ గర్వంగా అంది. ఏంకరు మొహం అదోలో పెట్టి, ‘చామదుంప, బెండకాయ, బచ్చలి అన్నీ జిగురుగా ఉంటాయి కదా, కూటు బాగుంటుందా, జిగురుండదా.’

“అబ్బే వండే విధంగా వండితే అన్నీ బాగుంటాయి. చేసి చూపిస్తాగా – ’ గొప్పగా అంది.

“అయితే సరే, ఏమేం కావాలో – ఎలా చేయాలో చెప్పండి మరి –”

'కుక్కరులో ఓ కప్పు పెసరపప్పు ఉడికించి పెట్టుకోవాలి – ఓ కొబ్బరి చిప్ప, నాలుగు పచ్చి మిర్చి, జీలకర్ర వేసి రుబ్బి పెట్టుకోవాలి' ఒక్కొక్కటి చూపిస్తూ అంది.

"ఓ ఇవన్నీ ముందే రెడీ చేసి పెట్టుకున్నారన్నమాట. ఎంతయినా, అమ్మమ్మల కాలంలో అంతా పద్ధతి ప్రకారం చేసేవారు" మెచ్చుకోలుగా అంది ఏంకరు.

'మరంతే అమ్మాయీ, ఈ కాలం వాళ్ళ అన్నీ కుక్కర్లో తలో గిన్నెలో పడేసి ఉడికించడమా వంట అంటే – పప్పు సన్నని సెగన ఉడకాలి, పులుసు నెమ్మదిగా మరగాలి'.

"ఆ... ఆ... అవునవును..." ఆవిడ్ని ఆపకపోతే ధోరణి పక్క త్రోవ పడుతుందనిపించి ఆపింది... "సరే ఇప్పుడు ఏం చెయ్యాలో చూపండి."

కనకమ్మగారు కుక్కర్ స్టౌమీద పెట్టి నూనె వేసి జీలకర్ర, ఆవాలు, ఇంగువ, కరివేపాకు వేసింది. "వేగిందా, ఇంక ఇప్పుడేం వెయ్యాలి" ఏంకరు అంది. "అయ్యో దానమ్మకడుపుడక, తొందరపడితే ఎలా అమ్మాయి పోపు వేగద్దా, ఆవాలు చిటపటలాడద్దా – అయినా మీ టి.వి. వంటల్లో పోపు వేస్తారు. అవివేగకుండా దానిమీద ఉల్లిపాయల ముక్కలు, టమోటా ముక్కలు కూరలు అన్నీ వేసేస్తూంటారు – అపుడు అడుగున పోపు ఎలా వేగుతుంది. ఆవాలు కసకసలాడవూ – నేనెన్నిసార్లు మీకు ఓ కార్డు రాసి పడేద్దామనుకున్నాను. అంతేకాదు – ప్రతి వంటలో ఇంత అల్లం వెల్లుల్లి ముద్ద పడేస్తారు అన్నీ ఒకే రుచిలో ఉండవూ కూరలు –" హాస్యంగా అన్నట్టు దులపడం మొదలుపెట్టింది కనకమ్మ. ఏంకరమ్మ బిక్క మొహం పెట్టి 'అవునా అమ్మమ్మగారూ అలా వేయకూడదా' అంది ఏడవలేని నవ్వు నవ్వి – పోపు వేగాక ఓ గ్లాసు నీళ్ళు పోసి అందులో బెండకాయ ముక్కలు, బచ్చలి ఆకు, ఉడికించిన చామదుంపలు, పెసరపప్పు, కొబ్బరిముద్ద అన్నీ వేసింది – 'ఇప్పుడేం చెయ్యాలి అమ్మమ్మగారూ?"

"ఏం చెయ్యడం ఏమిటి, అన్నీ ఉడకద్దూ మరి –' అంటూ కుక్కరు మూత పెట్టింది.

'ఇది వరకీ కూర చేసారా, ఇదే మొదటి సారా –' ఆవిడ అన్నీ కలిపి కుక్కరు ఉడికించడం చూసి సందేహంగా అడిగింది ఏంకరమ్మ.

'ఓ చాలా సార్లు చేసా – ఇందులో ఉండే కూరలన్నింటిలో పుష్కలంగా విటమిన్లు, ప్రొటీన్లు అన్నీ ఉన్నాయి. తినేదేదో కాస్త హెల్దీ ఫుడ్ తినాలమ్మా – ఈ కాలం

పిల్లలు నేతులు, నూనెలు మానేసి ఎండుపుల్లల్లాగా తయారవుతున్నారు. మా కాలంలో అన్నీ తినడం వల్ల చూసావా, ఇప్పటికి మా చర్మం ఎలా నిగనిగలాడుతుందో' –

'అమ్మో అమ్మమ్మగారికి విటమిన్లు, ప్రొటీన్లు అన్నీ తెలుసన్నమాట.'

'బలేదానివే అమ్మాయీ – అమ్మమ్మ అంటే నాకేం ఎనభై ఏళ్లున్నాయా ... అమ్మమ్మ అవ్వడానికి ఏం ఉంది. నలభై ఆరేళ్ళకే అయిపోయాను. నేను ఇంటర్ చదువుకున్నాను తెలుసా' చదువురాదని అనుకుంటుందేమోనని సందు చూసి చెప్పేసింది.

"మరీ, ఉడికిందేమో చూద్దామా –" కవిత తొందరపెట్టి మూత తీయబోయింది.

'అలా తొందరపడితే ఎలా – ఇప్పుడేగా స్టవ్ ఆర్పాము – ఆవిరి పోవద్దూ" దబాయింపుగా అంది.

'ఆ, అమ్మమ్మగారు తీరిక సమయాల్లో ఏం చేస్తుంటారు?'

'బుక్స్ చదువుతాను, టి.వి. చూస్తాను – మీ వంటలన్నీ ఎక్స్‌పెర్‌మెంట్ చేస్తుంటాను.'

'సరే, ఇంక చూడండి మరి.' ఎట్టకేలకు యుగాల తర్వాత అన్నట్టు మూత తీసింది.

'అబ్బ, ఎంత కమ్మటి వాసనొస్తుందో చూసావా –' అని తనే పొగుడుకుని గరిట తీసి అడుగునించి కలిపింది. కుక్కర్లోకి చూసిన కవితకి అంత కలిపి చిక్కటి జిగురు ముద్దలా గరిటలోంచి జారుతూ కనిపించింది. కనకమ్మగారు గాభరాపడిపోయింది. మొహం తెల్లగా పాలిపోయింది. ఆవిడ అవతారం చూసి 'కట్' అన్నాడు కమెరామేన్. – 'ఏమిటివాళ్ళ ఎందుకిలా అయింది. ఎక్కువ ఉడికిపోయినట్లుంది. మామూలుగా కుక్కర్‌లో కాకుండా విడిగా చేస్తాను. మీరు తొందరపెడ్తారని గబగబ అయిపోతుందని కుక్కర్లో వేసాను –' తప్పు మీదేన్నట్టు అంది కనకమ్మ. కూరలోంచి గరిట ఊడిపడలేదు. ఆ ఉడికిన కూర వడగడితే ఎన్ని సీసాల జిగురు తయారవుతుందో అనిపించింది కవితకి. పెద్ద గొప్పగా చేస్తానని ఫోజిచ్చింది – జిగురుకూరలన్నీ కుక్కర్లోవేస్తే బంక ముద్ద కాకపోతే ఏం అవుతుంది అనుకుంది కసిగా ఏంకరు.

"అయినా రుచి బాగానే ఉంటుందిలేండి. కాస్త ముద్దయినా –" సర్దుకుంటూ అంది కనకమ్మ.

"భగవంతుడా ఈజిగురు ముద్దతింటే నా నోరు మళ్ళీ పెగుల్తుందా' అని భయపడి ప్రోగ్రాం ఇన్‌చార్జ్ కెమెరామాన్ వంక చూసింది – 'కూర సరిగా రాలేదు, ఏం చేద్దాం రమేష్' అంది కవిత.

'పోనీ మళ్ళీ చేస్తాను కాస్త టైమిస్తే ఈసారి సరిగా చేస్తా–' నసిగిందావిడ.

'వద్దు, వద్దు అంత టైంలేదు, ఉడికిన దాన్ని లాంగ్ షాట్‌లో చూపించి లాగించేద్దాం. కవిత ఓ చెమ్చాతో తింటున్నట్టు ఫోజిచ్చేయ్ లాగించేద్దాం' అన్నాడు రమేష్.

బితుకు బితుకుమంటూ చెమ్చాతో కాస్త తీసి నోట్లో పెట్టుకోబోతూంటే ఆమెకి తెలియకుండానే మొహం వెగటుగా పెట్టింది ఏంకరమ్మ. 'కట్' అన్నాడు కెమరామేన్.

'కవిత, ఎక్స్‌ప్రెషన్ చూసుకో సరిగా...' రమేష్ హెచ్చరిస్తూ అన్నాడు.

'ఆ... ఆ.. కట్ చెయ్యకండి... అలా ముందు వెగటుగా పెట్టి నోట్లో పెట్టుకోగానే అలా క్రమంగా ఆమె మొహంలో ఎంత బాగుంది అన్న ఎక్స్‌ప్రెషన్ ఇచ్చేసి "ఏమో అనుకున్నాను రుచి చాలా బాగుంది సుమా" అనిపించేయండి. 'డైరెక్షన్ ఎడిటింగూ తనే చెప్పేసింది కనకమ్మ. రమేష్ చిరాగ్గా చూసి "కవిత, ఎక్స్‌ప్రెషన్ ఇచ్చేయి త్వరగా – " అని తొందరపెట్టాడు.

మొత్తానికి మొదటి వంట పూర్తి అయిందనిపించారు.

మళ్ళీ రెండో వంటకి సీను – 'అమ్మమ్మగారూ మీ రెండో వంట ఏం చూపిస్తారు' ఎంత మామూలుగా అడగాలనుకున్నా కాస్త అప్రసన్నత తొంగిచూసింది మొహంలో.

కనకమ్మగారి మొహంలో మొదట ఉన్న ఉత్సాహం తగ్గి కళా విహీనమైంది.

"మైదా హల్వా చేస్తాను...", 'ఓ స్వీటా' అని పైకి అని ఇది మరో బంక ముద్దచేసి నా మొహాన పడేస్తావా తల్లీ అని అనుకుని – 'సరే మరి మొదలుపెట్టండి అంది.' కనకమ్మ స్టౌ వెలిగించి మూకుడు పెట్టి ఓ గ్లాసు నీళ్ళు పోసి మైదా కలిపి మూకుడులో పోసింది. దాన్లో ఓ గ్లాసు పంచదార కూడా వేసి తిప్పడం మొదలుపెట్టింది. "ఇంకేం వెయ్యాలి దీన్లో –" కవిత అడిగింది.

"కాస్త ఉడికి ముద్దగా అయ్యాక నెయ్యి వెయ్యాలి – హల్వా అంటే మరి నెయ్యి కదా ఇలా తిప్పుతూ గట్టి పడ్డాక కాస్త కాస్త నెయ్యి వెయ్యాలి..."

'సరే, ఈలోగా మీకు తెల్సిన ఓ చిట్కా చెప్పండి మరి' అంది అలవాటుగా.

'ఓ దానికేం భాగ్యం – బోలెడు వచ్చు – మనం నిమ్మకాయ రసం పిండాక ఆ డిప్పలు పారేయకుండా మొహం చేతులకి రాసుకుంటే చర్మం నిగారింపు వస్తుంది. నేనలాగే చేస్తాను. అందుకే నా చర్మం ఇలా ఉంది' అంది గొప్పగా.

చిట్కా చెప్తూ గరిట తిప్పడం మర్చిపోయింది కనకమ్మగారు – హైలో ఉందేమో స్టవ్ నిమిషంలో మూకుడులో ముద్ద అడుగంటి మాడు వాసన మొదలయింది – కవిత గాభరాగా స్టవ్ ఆర్పేసింది. 'నా మతిమండా సమయానికి స్టౌ అర్పేసావు, అడుగంటలేదులే అంటూ నెయ్యి పోసి మళ్ళీ తిప్పడం మొదలుపెట్టింది. అడుగంటిన రంగు కలిసి తెల్ల ముద్ద రంగుమారింది. అదేం చూడనట్టు తిప్పుతున్నా హల్వాలాగే ఆవిడ మొహం మాడింది. హల్వా కాస్తా గట్టిపడగానే జీడిపప్పులు, కిస్‌మిస్, ఏలకిలు వేసి పళ్ళెంలో దిమ్మరించి హల్వా రెడి, రుచి చూసి చెప్పండి మరి' నవ్వుతూ పోజిచ్చింది.

ఇదో జిగురు ముద్ద, చిన్నప్పుడు అమ్మ పుస్తకాలు అంటించుకోడానికి మైదా ఉడకపెట్టి ఇచ్చిన ముద్దలా ఉంది అనుకుంది.

ఏదో స్వీట్ గనక కాస్త తియ్యగహా ఉంటుంది కనుక ఆ కూరంత, ఘోరంగా ఉండదులే అనుకుంటూ చెమ్చాతో రెండు జీడిపప్పులు తీసి నోట్లో వేసుకుంది.

ముందు మాడు వాసన, ఆ తరువాత పచ్చి మైదా రుచి. బాగున్నది ఏదన్నా ఉంటే జీడిపప్పుల రుచి! 'బాగుంది బాగుంది' అంది నవ్వు పులుముకుని.

"మీరూ తినండి... రుచి చూడండి" అంటూ అందరికి ఇచ్చింది కనకమ్మ. అందరూ నోట్లో పెట్టుకుని అతి కష్టం మీద నవ్వులు మొహాన పులుముకుని బాగుంది అంటూ అడ్డంగా, నిలువుగా తలలాడించారు. ఇంత మంచి వంటలు చూపించి నందుకు 'మీ టి.వి. తరపున మీకీచీర' అందిస్తూ అంది కవిత.

షూటింగ్ పూర్తయి బతుకుజీవుడా అన్నట్లు గబగబ కెమెరాలు, లైట్లు సర్దేసుకుని బయటపడ్డారంతా – మామూలుగా అయితే స్నాక్స్, టిఫిన్లు చేసినవి రోజు అందరూ ఫలహారాలు రుచి చూసి వెళ్ళేవారు. ఆరోజు చేసినవి ఎక్కడ మారు తినమంటుందో నన్నట్టు ఎవరో తరిమినట్టు బయటపడ్డారంతా.

"ఏమిటయ్యా రమేష్ ఇంతకంటే మంచి సెలక్షన్ దొరకలేదా సెలెక్ట్ చేయడానికి. మీకేం బాబూ ఆ వంటలు తినలేక చచ్చేదాన్ని నేను' గయ్‌మంది కవిత వ్యాన్ ఎక్కాక.

'ఆవిడ వంటలు కాదు వెంటి సామాను, తన నగలు చూపించడానికి పిలిచి నట్లుంది. మాటలు మాత్రం కోటలు దాటాయి.'

'ఈ వంటలు ప్రేక్షకులకి చూపిస్తే ఎన్ని తిట్లు తిడతారో, ప్రొడ్యూసర్ ఏం అంటాడో ఆలోచించుకో' – అన్నాడు కెమెరామెన్.

'మరి చీర కూడ సమర్పించుకున్నాం. ప్రోగ్రాం లేకుండా చీర నష్టం అంటారేమో' కవిత అంది.

'ఏమో ప్రొడ్యూసర్‌కి చూపిద్దాం – ఫైనల్ డెసిషన్ ఆయనే చూసుకుంటాడు' రమేష్ అన్నాడు.

'శంకర్ కాస్త ఈ గుడి, పార్క్ వగైరా నాలుగైదు చోట్ల షాట్లు తీద్దాం. ఈవిడని వీలయినంత కట్ చేద్దాం' వేన్ ఆపి కాస్త నాలుగైదు షాట్లు తీయి' అన్నాడు రమేష్.

✶ ✶ ✶ ✶ ✶ ✶

వారం తర్వాత 'టెక్నికల్ ప్రాబ్లమ్స్ వల్ల, అనివార్య కారణాల వల్ల ఆవిడ ప్రోగ్రాం వేయలేక పోతున్నందుకు చింతిస్తున్నాం' అన్న ఫోను అందుకున్న కనకమ్మ మూర్ఛ అయితే పోలేదు కాని చేష్టలుడిగినట్లు అలా ఉండిపోయింది చాలా సేపు.

**(చిత్ర – అనుబంధ హాస్య కథల సంపుటి, మే 2012)**

# చదరంగం

**ఆ** ఊరు పల్లె గాదు. ఆ ఊరులోనూ చెట్లు చేమలుతోపాటు ఆవులు, కుక్కలు, నక్కలుతోపాటు మనుషులున్నారు. మనుషులున్నారు కనుక పాలించడానికి ప్రభువులుండాలి కనుక ఆ ఊళ్ళోనూ ప్రభువులున్నారు. కనుక పార్టీలు, కక్షలు, కొట్లాటలు, వైషమ్యాలు తప్పవు గనుక అవీ వున్నాయి.

ఆ ఊరికి మిగతా ఊర్లతోపాటు ఎన్నికలొచ్చాయి పార్టీలు బయలుదేరాయి. హడావిడి వచ్చింది. మిగతా పార్టీలమాట ఎలావున్నా ఆ ఊర్లో చిన్నపరెడ్డి, బాపయ్యనాడు ఎదురెదురుగా పోటీపడ్తున్న పార్టీ ముఖ్యమైంది.

ఆఊర్లో బాపయ్యనాయుడు, చిన్నపరెడ్డి ఇద్దరూ సమబలులే. ఇద్దరూ ఊరికి ముఖ్యులే. అంగబలం, అర్థబలం సరిసమానంగా ఉన్న వాళ్ళే. ఇద్దరి కిద్దరూ రాజకీయపు ఎత్తులు, పై ఎత్తులు తెలిసినవారే.

అంచేత వారిద్దరిలో ఎవరు నెగ్గుతారు అన్న విషయం గురించి ఊర్లో ప్రజలు ఊహాగానాలు, చర్చలు ఆరంభించారు. ఊరు ఊరంతా వారిద్దరి పోటీ ఫలితాల గురించి ఆరాటంగా నిరీక్షిస్తుంది.

బాపయ్య నాయుడు నాలుగురోజుల క్రిందటే రంగంలోకి దూకాడు. పురాణా లేమిటి, హరికథలేమిటి, ఇంటింటికి కాన్వాసింగు ప్రారంభించాడు. నోట్లకట్టలు శనగపప్పు బెల్లాలు మాదిరి పంచిపెడుతున్నాడు. సీసాలకొద్ది సారాయి రోడ్లమీదే పారుతూంది. దొరికినంతవరకు నోట్లు కొనాలన్న ఆరాటంతో బీద ప్రజానీకం గుమ్మాల ముందే చేతులు చాపుకుని కూర్చున్నాడు.

చిన్నపరెడ్డి రంగంలోకి దుమకలే దేమిటని అందరూ చూస్తున్నారు. అలాంటి సమయంలోనే ఆయన కుడిభుజం అయిన కోటిగాడి హత్య వార్త.

తెల్లారేసరికి కోటిగాడి హత్య వార్త ఊరంతా పాకింది. అప్పుడే నిద్రలేచి వీధరుగు మీద పందుల పుల్ల నములుతున్న చిన్నపరెడ్డికి పాలేరు వాడు పరిగెత్తుతూ వచ్చి కోటిగాడి హత్య వార్త అందించాడు. చిన్నపరెడ్డి ఒక్క క్షణం నోటమాట రాక స్థాణువై అలా వుండిపోయి ఆ తరువాత 'ఆ' అంటూ ఒక్క కేకపెట్టి చేతులో పందుం పుల్ల పారేసి పంచె ఎగలాక్కుంటూ వున్నవాడున్నట్టే పరుగెత్తాడు వీధిలోంచే.

కోటిగాడి శవం చుట్టూ అప్పటికప్పుడే పెద్ద గుంపు తయారయింది. ఊరవతల చెరువు గట్టున కోటిగాడు ఘోరంగా హత్య చేయబడ్డాడు. తల మీద ఏ గునపం తోటో పొడిచినట్టుంది. బుర్ర చితికిపోయి నెత్తురు వరదలై గడ్డకట్టింది. మొహం అంతా కారి గడ్డ కట్టింది. కనుగుడ్లు వెళ్ళు కొచ్చి భయంకరంగా వుంది మొహం. గోలు గోలున మొగుడి శవంమీద పడి మాలచ్చి గుండెలు బాదుకుంటూ ఏడుస్తోంది. గుంపుని త్రోసుకుని, దారి చేసుకుని ముందుకెళ్ళి పడ్డాడు చిన్నపరెడ్డి రొప్పుతూ. కోటిగాడిని ఆ స్థితిలో చూశాక ఒక క్షణం అలా స్థాణువులా నిలబడి ఆ తర్వాత 'కోటిగా' అంటూ అంత మనిషి చేతుల్లో మొహం కప్పుకుని క్రింద కూలబడిపోయాడు.

కోటిగాడు చిన్నపరెడ్డికి నమ్మినబంటు. కుడిభుజం, మంత్రి, సలహాదారు అన్న సంగతి ఊరందరికీ తెలుసు. అంచేత చిన్నపరెడ్డి అంతవాడు కోడిగాడి లాంటి వాడి కోసం విచారించడం వింత అన్పించలేదు ఎవరికీ. చచ్చిపోయిన కోటిగాడి వంక జాలిగా, రెడ్డివంక సానుభూతిగా చూశారు.

ఓ ఐదు నిమిషాలు గడిచాక తలెత్తాడు. ఈసారి అతని కళ్ళలో దుఃఖానికి బదులు క్రోధం చోటు చేసుకుంది. మూడో కన్ను విప్పిన శివుడిలా వున్నాడు.

'ఎవరూ ఇంత ఘోరం సేసారు? ఏ ఎదవలురా నా కోటిగాడ్ని యింత దారుణంగా సంపేరు? అన్నెం పున్నెం ఎరుగని నా కోటిగాడ్ని సంపిన ఎదవలెవరో వాళ్ళు నట్టుకుని మూడు సెరువులు నీళ్ళు తాగించక పోతే నా పేరు సిన్నపరెడ్డి కాదు' అంటూ భీకరంగా ప్రతిజ్ఞ చేశాడు.

'నామీద కోపం కసి ఉంటే నా మీద తీర్చుకోవాలి. అంతేకాని ఏ పాపం ఎరుగని కోటిగాడేం సేసాడని ఆడ్ని సంపాల... ఆడు నా మనసవడమా ఆడి అపరాధం. ఆడు నా మనిషి, గూడెంకి నాయకుడు ఆడి మూలకంగా గూడెం ఓట్లన్నీ నా

కొస్తాయనీ ఆడ్ని సంపేత్తే గొడవుండదని ఇంత ఘోరం సేస్తారా? చావుంటే బలా బలాలు తేల్చుకోవాలగాని ఇలా మడిసిని అన్నాయంగా సంపేత్తారా.

"ఓట్ల కోసం, పదవుల కోసం నిండు ప్రాణాన్ని యిలా ఘోరంగా తీయడం మడుసులు సేసేపనేనా.... కోడిగాడ్ని సంపిందెవరో, ఎక్కడున్నా పట్టుకుని ఉరిశిక్ష వేయించిందాకా నేను నిద్రపోను" మళ్ళీ భీకరంగా ప్రతిజ్ఞ చేశాడు.

అప్పటిదాకా అక్కడున్న గుంపు అందరూ కోడిగాడి హత్య గురించి రకరకాలుగా అనుకున్నారు. ఎవరు చంపి వుంటారన్న విషయం ఊహాగానాలు చేశారు. యిప్పుడు చిన్నపరెడ్డి మాటలు విన్నాక వాళ్ళ సందేహం తీరిపోయినట్లయి అందరూ ఆశ్చర్యంగా గుండెలమీద చేతులు వేసుకున్నారు.

"ఏటి, ఇది బాపయ్యనాయుడి పనా!"

"ఓట్ల కోసం యింత ఘోరం సేసాడా? ఓరి నాయనో మనిషిని సంపేయడమే ఓట్లకోసం!"

"కలికాలం మహాప్రభో... ఎంతకి తెగించారో" ఇంతకీ బాపయ్య నాయుడే చేయించాడని ఏముంది?" అంతా తలోమాట అనుకున్నాడు. చిన్నపరెడ్డి అందరివంక చూశాడు.

మీకింకా సందేహం ఏమిటి? ఇది బాపయ్య నాయుడు పని కాక పోతే మరెవరి పనయ్యా, సీమకైనా అపకారం సెయ్యని కోటిగాడ్ని సంపేయడానికి ఎవరి కవుసరం వుందయ్యా. ఆడు నా మనిషి. ఆడి మూలకంగా గూడెం ఓట్లన్నీ నాకేస్తారు. ఆడ్ని సంపేసి, డబ్బాశ చూపించి ఆళ్ళందరిని అటు తిప్పుకోవచ్చని ప్లానేసాడు. యింత ఘోరం సేసాడు విడమర్చాడు.

అందరూ వప్పుకున్నట్టు తలలాడించారు. "యింత పని సేసిన ఆళ్ళని పట్టుకుని పోలీసుల కప్పగించందే నేనూరుకోను. ఒరే పోలిగా, గమ్మున పోలీసు స్టేషనుకి పరిగెట్టి యిక్కడ హత్య జరిగిందని ఇన్‌స్పెక్టరుని వెంట బెట్టుకురా, ఆ ... ఆ తోవనే మన ప్రెసు రిపోర్టరు మూర్తి బాబుని కూడ వెంటబెట్టుకురా... యీ దగుల్బాజీల పని పేపర్లో ఏయించి లోకానికి సెప్పాల..." కోపంతో వణికి పోతూ అన్నాడు రెడ్డి పోలిగాడు పరిగెత్తాడు.

కాస్త కోపం దుఃఖం సర్దుకున్నాక మొగుడి శవం మీద పడి హృదయ విదారకంగా ఏడుస్తున్న లచ్చి దగ్గిరకి వెళ్ళి నిలబడ్డాడు రెడ్డి. కామందుని చూసి మరింత శోకాలు

పెట్టసాగింది లచ్చి. "ఓరి నాయనో ఓరి దేముడో, నానే సెర్లో పడనో దేముడో, నాకేటి దిక్కోరో, నేనేం సేతునే నన్నన్నాయం సేసినోడో దేముడో" ఏడుస్తున్న లచ్చి వంక జాలిగా చూసి పై పంచతో కళ్ళొత్తుకున్నాడు రెడ్డి.

'ఊరుకో లచ్చీ... వూరుకో... యింక ఏడ్చి లాభం ఏటి? సూడు... నీ మొగుడ్నంటే నీకు తెచ్చి యీయలేనుగానీ నీకు, నీ పిల్లలకి ఏలోటు రాకుండా నే సూత్తానుగా... ఏడవకు' అంటూ ఓదార్చాడు.

అరగంటలో పోలీసు ఇన్‌స్పెక్టర్ వచ్చాడు. చిన్నపరెడ్డి ముందుకువెళ్ళి సంగతంతా విశదీకరించి తన అనుమానం వివరించాడు. ఈ కేసుని ఆషామాషీగా తీసుకుని వదిలేయకూడదని, తన స్వంత కేసనుకుని ప్రయత్నించి హంతకులని పట్టుకోవాలని చెప్పాడు. ఇన్‌స్పెక్టరు అంతా విన్నాడు. చుట్టూ ఉన్న మనుష్యులనీ ప్రశ్నించాడు. పోలీసు ఫోటో గ్రాఫరు ఫోటోలు తీసుకుంటున్నాడు. అసలు అంత ఉదయాన్నే చెరువు గట్టుకి ఎందుకు వెళ్ళాడని ప్రశ్నించాడు.

"రోజూ సీకట్నే ఆడు సెరువుగట్టుకాడకి బయలు కెడతాడు బాబూ! అట్నించొచ్చి గంజి త్రాగి బాబుగారింటికి పనికెల్తాడు. ఈ పొద్దు సెరువుగట్టు కాడ కెళ్ళినాడు ఎంతకీ రాకపోతే అట్నించటే బాబుగారింటికెళ్ళి పోనాడనుకున్నాను... గానీ యింత ఘోరం జరిగి పోనా దనుకోలేదు" లచ్చిమళ్ళీ గొల్లుమంది.

ఇన్‌స్పెక్టరు వివరాలన్నీ రాసుకుని బాపయ్య నాయుడిని కలవడానికి బయలుదేరాడు.

శవపరీక్ష ముగిశాక పోలీసులు శవం అప్పగించాక చిన్నపరెడ్డి పెద్ద ఎత్తున ఆర్భాటంగా కోటిగాడి శవాన్ని దహనం చేయడానికి దగ్గిరుండి అన్ని ఏర్పాటులు చేశాడు. లారీ తెప్పించి పూలదండలు కట్టించాడు. కోటిగాడి శవంమీద పూలు జల్లాడు. ఊరంతా ఊరేగించి దగ్గిరుండి మరీ దహనం చేయించి కోటిగాడి మీద తనకున్న అభిమానాన్ని చాటుకున్నాడు.

* * * * * *

పోలీసు ఇన్‌స్పెక్టరు బాపయ్యనాయుడి దగ్గరికి వచ్చే లోపలే ఆయన అనుచరులు కోటిగాడి హత్య వార్త అందించేశారు. చిన్నపరెడ్డి అన్న మాటలన్నీ పొల్లుపోకుండా చెప్పారు. ఆ మాటలు విన్న నాయుడు మొహం చిట్లించాడు.

"ఏటి, మనం సంపింసినాం అంటున్నారా? ఏడిశాడు ఎదవ. కూసుకోనీ మనకేటి నట్టం? మనం సంపడం ఆడు సూశాడా? సాచ్చికం ఏదన్నా సూపమను లంజి కొడుకిని. ఆడేమాటంటే అదే రైటా ఏటి? ఆడి మాటే సెల్లిపోతాదనుకుంటున్నాడు గామోసు... ఆడు, నేను మాటంటే సెల్లిపోదు కోర్టులో... సాచ్చికం వుండాలి సాచ్చ్యం" అంటూ కోపంగా కొంతసేపు, నిర్లక్ష్యంగా కొంతసేపు మాట్లాడాడు.

ఇన్‌స్పెక్టరు వచ్చి అడిగినా అదే చెప్పాడు. ఆడి మాట లట్టుకుని అనవసరంగా నామీద నేరం ఎట్టారంటే నేనసలే మంచోడ్నిగాను. జాగ్రత్త, మీపని సెపుతాను. పరువునట్టం దావా ఏస్తాను. ఆ ఎదవ ఏదో కూసినంత మాత్రాన ఆడి మాటలట్టుకుని నాకాడకి వస్తారా... నేనే సేసాననడానికి సాచ్చ్యం వుంటే సూపండి ఆడు మీరు! అంటూ దులిపి వెళ్ళాడు.

ఇన్‌స్పెక్టరు ఏం చెయ్యాలో తెలియక బుర్ర గీక్కున్నాడు. ఆఖరికి ఆలోచించి బాప్యయ నాయుడి పార్టీలో జమా జెట్టీలలాంటి ఇద్దర్ని అనుమానితులుగా అరెస్ట్ చేసి తీసుకెళ్ళాడు.

* * * * * *

కోటిగాడు చనిపోయిన పదకొండో రోజున ఊర్లో కోటిగాడి ఆత్మ శాంతికి సంతాప సభ జరిపించాడు రెడ్డి. అతని ఆత్మ శాంతికి ప్రార్థనలు చేశాడు. అన్నమాట ప్రకారం కోటిగాడి పెళ్ళానికి వెయ్యి రూపాయలు ఇచ్చాడు. గుడిసె వేసుకోడానికి డబ్బిచ్చాడు. కోటిగాడి కొడుక్కి ఎవరితోనో చెప్పి బంట్రోతు పని వేయిస్తానన్నాడు.

చెప్పినవన్నీ చేసి మాట నిలబెట్టుకుని కోటిగాడి మీద తనకున్న అభిమానంతోపాటు అతని దయార్ద్ర హృదయాన్ని కూడా చాటుకుని నలుగురిచేత ఔననిపించుకున్నాడు రెడ్డి.

* * * * * *

ఎలక్షన్లు వచ్చాయి... వెళ్ళాయి.

పాతికవేలు ఖర్చుపెట్టిన బాపయ్య నాయుడు చిత్తుగా ఓడిపోయాడు. మూడువేలు మాత్రం ఖర్చు పెట్టిన చిన్నపరెడ్డి ఘనవిజయం సాధించాడు.

కోటిగాడి హత్యకేసు కాలగర్భంలో కలిసిపోసాగింది.

* * * * * *

విజయోత్సాహంతో మెడలో పూలదండలతో అభిమానుల, ఆప్తుల అభినందనలు అందుకుని, ఆనందంగా గర్వంగా యింట్లోకి అడుగుపెట్టిన చిన్నపరెడ్డి లోపల వరండాలో కూర్చున్న వీరిగాడ్ని చూడగానే ఆయన మొహం అంతవరకు పెట్రోమాక్సు లైటులా వెలుగుతున్నదల్లా ఆముదం దీపంలా మారిపోయింది. నుదురు చిట్లించి తీక్షణంగా చూశాడు.

వీరిగాడు ముసిముసి నవ్వు నవ్వుతూ దండం పెట్టాడు.

"ఏరా ఇలా వచ్చావు?" అన్నాడు పళ్ళబిగువున రెడ్డి.

"ఓసారి తమ దర్శనం చేసుకుందావని, తవరు ఎలచ్చన్లో నెగ్గారు గందా అని... " అంటూ వెకిలి నవ్వు నవ్వాడు.

"ఊ... చూశావుగా... యింక వెళ్ళు" కఠినంగా అన్నాడు.

"దొరా!" నసుగుతూ బుర్ర గోక్కున్నాడు వీరిగాడు.

"ఊ... ఏమిటి?" తీక్షణంగా చూశాడాయన.

"దొరా, యింట్లో చాలా కష్టంగా ఉంది. జరుగుబాటు... ఏదన్నా యిప్పించాలి దొరా" అన్నాడు.

"ఇచ్చాగా, ఇంకా ఏమిటి?"

"అది సరే దొరా, కష్టం చాలదు దొరా.. ప్రాణాలకి తెగించి, మూడో కంటివాడికి తెలియకుండా..."

"వీరిగా!" మధ్యలోనే గర్జించాడాయన. "నోర్మూయ్ చంపేస్తాను నోరెత్తావంటే" మధ్యలోనే అరిచాడు. కాసేపు తీక్షణంగా వీరిగాడ్ని చూస్తూ ఆలోచించి లోపలికి వెళ్ళి, అంతలోనే తిరిగి వచ్చాడు రెడ్డి. చేతిలో ఉన్న ఐదు పచ్చనోట్లు వీరిగాడి చేతిలోపెడుతూ మింగేసేట్టు చూశాడు.

"ఒరేయ్ వీరిగా, నోరెత్తి మరోమాట మాట్లాడావంటే చంపేస్తాను.

ఈ సంగతి మూడో మనిషికి తెలిసిందన్న సంగతి నాకు తెలిస్తే ఆ రోజుతో నీ చావు మూడిందన్న సంగతి గుర్తుంచుకో!... ఈవంకతో మళ్ళీ ఈ ఇంటి గుమ్మం తొక్కితే నీకు భూమ్మీద నూకలు నిండుకున్నాయన్న విషయం తెలుసుకో. పిచ్చిపిచ్చి వేషాలు వేద్దామనుకుంటున్నట్టున్నావు గాబోలు ఈ సాకు అడ్డం పెట్టుకుని. నేనెవరో తెల్సుగా. జాగ్రత్త. వెళ్ళిక్కడనించి.. మళ్ళీ నాకంటికి కనిపించకుండా.. పో...

ముందు..!" కోపంతో వణికిపోతూ వేలుపెట్టి గుమ్మం చూపించాడు రెడ్డి.

వీరిగాడు ఆ కోపానికి బెదరకుండా, నక్క వినయం చూపిస్తూ, వంగి దండం పెడ్తూ... 'నాకు తెల్దా దొరా తమ సంగతి' అంటూ ఓనవ్వు విసిరి వెళ్ళిపోయాడు బయటికి.

*(స్నేహ మాసపత్రిక - 1975 ప్రాంతం)*

# కుక్కబ్రతుకు

ఉదయం పది గంటలు దాటింది. బజారులో దుకాణాలన్నీ ఒక్కొక్కటీ తెరుస్తున్నారు.

బూల్‌చంద్ బట్టల దుకాణం అప్పుడే తెరవబడింది. పని కుర్రాళ్ళు షాపుతుడిచి, బీరువాలు, బల్లలు దుమ్ముదులుపుతున్నారు. సేట్ బూల్‌చంద్ వచ్చి దేముళ్ళ పటాలకి కేష్ బాక్స్‌కి నమస్కారం చేసి కేష్‌బాక్స్ ముందు కూర్చున్నాడు. బూల్‌చంద్ పెద్ద కొడుకు కిషన్ ఎకౌంటు పుస్తకాలు ముందేసుకున్నాడు. చిన్నకొడుకు రామచంద్ షో కేసుల్లో ఆడబొమ్మలకి అందంగా క్రొత్త చీర కడ్తున్నాడు.

ఇంతలో పూజారి వచ్చాడు. షాపులో వున్న దేముడి పటాలకి పూలదండలువేసి, అగరువత్తులు వెలిగించి పూజచేసి కర్పూరం వెలిగించి హారతిచ్చి, బూల్‌చంద్ దగ్గిరికి తీసుకెళ్ళాడు. సేట్ భక్తిగా హారతి కళ్ళకద్దుకున్నాడు. ఇనెప్పెట్టకి హారతిచ్చాడు. కొడుకులిద్దరూ కూడా వచ్చి భక్తిగా హారతి తీసుకున్నారు. రోజూలా పూజ తంతు ముగిసిందే తడువు అన్నట్టు వరసపెట్టి ముష్టివాళ్ళు రావడం ఆరంభించారు. రామ్‌చంద్ తండ్రి దగ్గర ఉన్న ఓ గ్లాసులోంచి చిల్లర డబ్బులు తలో ఐదుపైసలు వచ్చిన వాళ్ళందరికీ వేస్తున్నాడు. "ధర్మరాజులు, మహాప్రభువులు, పదికాలాల పాటు చల్లగా వుండాలి" అంటూ ముష్టివాళ్ళు దీవించి వెడుతున్నారు.

ఒక్కొక్కళ్ళు కస్టమర్స్ రావడం ఆరంభించారు. చీరలు, బట్టలు తీస్తున్నారు, చూపిస్తున్నారు, కత్తిరిస్తున్నారు, బిల్లులేస్తున్నారు. కేష్ బాక్స్‌లోకి వెడుతూంది. పదకొండు అయ్యేసరికి బేరం జోరుగా అందుకుంది.

అదే సమయంలోనే ఓ భార్యాభర్తలు దుకాణంలోకి వచ్చారు. చీరలు తీయించారు.

ఆమె ఇవి కావు అవి అంది. అవి కావు ఇవి అంది. దీని రంగు బాగులేదు. దానికి జరీ నచ్చలేదు. ఈ చీర వెడల్పు లేదు అంటూ మొత్తం షాపునంతా తిరగతోడించింది. ఏది బాగులేదని చప్పరించింది. ఆమెకి చీరలు చూపిస్తున్న పని కుర్రాడు రంగడికి విసుగుతోపాటు కాస్త కోపం వచ్చింది. ఆమె ముందున్న చీరల దొంతర్లవి, కుప్పకుప్పలుగా పడివున్న అన్నింటిని చూసి అవన్నీ సరిగా సర్దడానికే వక గంట పడ్తుందన్న విసుగుతో "ఏమిటమ్మగారు, ఇన్ని చీరలు తీయించారు. ఏది నచ్చ లేదంటారు" అన్నాడు అసహనంగా.

కాస్త దూరంగా ఎవరికో సూటుగుడ్డలు, టెర్లిన్లు చూపిస్తున్న కిషన్ రంగడి మాటలు విని "ఏం కావాలంటారు వారు" అంటూ ఆ బేరం తమ్ముడి కప్పగించి చీరలువైపు నడిచాడు. "ఏమిటి మేడమ్, ఏం కావాలి బెనారస్, కంజీవరం, ధర్మవరం, మైసూర్ సిల్క్, జపాన్ సిల్కు, షిఫాన్, నైలాన్‌జార్జట్, క్రేప్, కాలిసింధ్..... అన్నీ వున్నాయి ఏం కావాలి?" అంటూ ఓ డజను పేర్లు గడ గడ చదివాడు.

"ప్చ్, ఏం బాగులేవు. అన్నీ ఓల్డు పాషన్, పాత స్టాకే... క్రొత్త వెరైటీ ఏం లేదే? వీటిల్లో" అంటూ ఆమె చప్పరించింది.

"ఈ కాలిసింధ్ క్రొత్త డిజైనులు చూడండి. ఈ జపాను సిల్కు బంగీ మొన్ననే విప్పాం. కంజీవరం నించి మొన్ననే తెచ్చాం ఈ చీరలు. ఇవన్నీ ఇప్పటివే పాతవికావు మేడమ్, ఒరేయ్ రంగా నిన్న వచ్చిన బంగీలో షిఫాన్, జార్జెట్ పట్రారా..." అన్నాడు కిషన్. చీరలు సర్రున విప్పి, ఆమె ముందు ఒక్కొక్కటీ పడేస్తూ వాటి గుణ విశేషాలు అప్పచెప్పసాగాడు. కష్టమర్లని అంత సులువుగా వదులుకోవడం అతనికిష్టంలేదు. తండ్రి దగ్గిర వ్యాపార దక్షత, మెళకువలు బాగా నేర్చుకున్న కిషన్ కష్టమర్లని ఎలా ఆకట్టుకోవాలో, వాళ్ళు షాపంతా తిరగతోడించినా విసుక్కోకుండా వుండే అలవాటు, వగైరా వ్యాపార కిటుకులన్నీ బాగా తెలుసుకున్నాడు. ఆమె కళ్ళముందు చీరలు కుప్పలు కుప్పలు పడుతున్నాయి. అన్నింటిని చూసి మొహం తిప్పేస్తున్న ఆమెని చూసి ఆఖరికి ఆమె భర్తకే విసుగొచ్చింది.

"చూడు రమా, ఏదీ నచ్చలేదంటే ఎలా, ఇన్ని చీరలు చూపించారు, ఒక్కటేనా నచ్చలేదా" అన్నాడు అసహనంగా.

"బావుందండీ, నాకైతే ఎలాంటివన్నా కొందును. మరొకళ్ళకి కొంటున్నప్పుడు వాళ్లడిగినట్లు కొనద్దూ! అది రాసిన రంగులుంటే బార్డరు సరిగాలేదు. జరీ బావుందంటే రంగు సరిపోలేదు. నన్నేం చెయ్యమంటారు?"

"బావుంది, మీ చెల్లెలు మాట దేముడెరుగు నీకే నచ్చటంలేదు, అబ్బబ్బ, అందుకే ఆడవాళ్ళతో అసలు షాపింగుకి రాకూడదు. మీ చెల్లెలి పెళ్ళికాదు కాని ముందు నీ వెంట షాపులకి తిరగలేక నా ప్రాణాలు పోతున్నాయి. పన్నెండు గంటలవుతూంది. ఏదన్నా కొనే మాటయితే కొను. లేకపోతే పద" అన్నాడు విసుగ్గా.

"ఉండండి, ఉండండి ఏవో క్రొత్త చీరలు పట్టుకొస్తున్నాడు" అంది రమ. క్రొత్తగా వచ్చిన చీరలు దొంతర్లు పేర్చారు. పైకి కిందకి లాగి, ప్రక్కకి తోసి, ఇదివరకటివే బావున్నట్టున్నాయి అంటూ మళ్ళీ వాటిల్లోంచి పైకిలాగి క్రొత్తవి పాతవి పోల్చిచూస్తూ, ఏది కొనాలో తేల్చుకోలేక, "అదిగో అక్కడ ఆ బీరువాలో ఏదో వున్నట్టుంది. ఆ చీర తీయండి" అంటూ అది లాగించింది. తీరా చూస్తే బీరువాలో ఉన్నంత సేపు అంతంగా కనిపించినది ముందు పడగానే చప్పరించేసింది.

కిషన్‌లో ఓర్పి ఆఖరిమెట్టుకు వచ్చేసింది. రెండు గంటలనించి షాపునంతా కలయతీయించిన ఆమె అన్నిరకాల చీరల్లో ఏది నచ్చలేదంటం అతనికి కోపంతోపాటు, ఎలాగైనా ఆమెచేత ఒక్క చీరైనా కొనిపించకుండా వదలకూడదన్న పంతం పెరుగుతూంది. మరో బీరువా చర్రున లాగి మరికొన్ని చీరలు తీశాడు. చీరలన్నీ విసురుగా విప్పి కుప్పలా పోసేస్తున్నాడు. "అమ్మా... మీరు ఈ ఊరంతా తిరిగినా యింతకంటే మంచి చీరలు ఏ షాపులోనన్నా దొరికితే మా షాపు మూసేస్తాం, వ్యాపారం ఎత్తేస్తాం, ఇన్ని రకాల చీరలు మా షాపులో కాక మరెక్కడమ్మా దొరికేవి. ఎర్రబడ్డ మొహంతో సవాల్ చేశాడు. మూర్తి షాపువాడి చిరాకును గమనించాడు. ఇంకా ఊరుకుంటే మర్యాద పోతుందని "రమా, వాటిల్లో ఏదో ఒకటి తీసుకుని త్వరగా రా! ఇంక చాలు ఎంచడం" అన్నాడు కఠినంగా.

"అయినా ఇంటిదగ్గర ఏం చీరలు కావాలో, ఎంత ఖరీదు కావాలో అన్నీ నిర్ణయించుకోకుండా ఇక్కడికొచ్చీ అన్నీ తీయించడం వాళ్ళని బాధ పెట్టడం ఏమిటి? ఏమిటి కొనేమాటయితే కొను లేకపోతే పద వెంటనే.

కిషన్ కాస్త శంకించి "ఫర్వాలేదు సార్! అమ్మగారికి నచ్చితేనే తీసుకోమనండి. మా షాపులోనే నచ్చకపోతే మరెక్కడా నచ్చవు అన్నా అంతే, మా కిది అలవాటే సార్! లేకపోతే వ్యాపారం ఎలా చేస్తాం" అన్నాడు. కుర్రాళ్ళు చీరలు మడతలు పెడ్తున్నారు. అన్నీ తీయించి ఏదో ఒకటి కొనకపోతే బాగుండదని, ముఖ్యంగా భర్త కేకలేస్తాడని తప్పక అసంతృప్తిగానే ఓ చీర తీసింది రమ.

"హమ్మయ్య" అన్నాడు మూర్తి. కిషన్, కుర్రాడు లోపలనుకున్నారు, ఆ మాట.

చీర ప్యాక్ చేయించి, నూరు రూపాయలు బిల్లు చెల్లించి బయటికి నడిచారు ఇద్దరూ.

"భలే బేరం సార్" అన్నాడు రంగడు చీరలు సర్దుతూ. కిషన్ చీరలకుప్ప మధ్యనించి చీరలు తీస్తూ అదోలా నవ్వాడు కళ్లెగరేసి రంగడిని చూసి, రంగడు ఆశ్చర్యంగా చూశాడు, షాపు వెనకాల ఇంట్లో కెడుతున్న కిషన్‌ని.

రమ, మూర్తి వెళ్ళిన మరో పదినిముషాలకి ఆదరా బాదరా చెమటలు కక్కుతూ హడావిడిగా లోపలికి వచ్చారు.

క్యాషుబాక్స్ దగ్గర బూల్‌చంద్, ఎకౌంట్ బుక్ దగ్గిర కిషన్, బట్టలు చూపిస్తున్న కుర్రాళ్ళు అందరూ ప్రశ్నార్థకంగా చూశారు.

"ఏమండీ ఇక్కడ మా పార్శిల్ ఒకటి ఒదిలేశామండీ" మూర్తి హడావిడిగా అన్నాడు.

"ప్యాకెట్టా... ఏం పార్సిల్ సార్" రామచంద్ ప్రశ్నించాడు.

"మరో షాపులో తీసుకున్న మూడు చీరెల ప్యాకెట్ ఇక్కడ వదిలేశామండీ కొంతదూరం వెళ్ళాక గుర్తువచ్చి చూసుకున్నాం. అందుకని వెంటనే వచ్చాం."

"చీరల ప్యాకెట్టా... యిక్కడేం లేదే ..." అన్నాడు రంగడు కిషన్‌ని చూస్తూ.

"ఇక్కడే వదిలామండీ, ఇందాక చీరలు చూస్తున్నప్పుడు చేతిలోది బల్లమీద పెట్టాను. తరువాత చీరెలు చూసే హడావిడిలో మర్చిపోయాను. ఆ చీరల క్రింద ఎక్కడో వుండిపోయి వుంటుంది. అదిగో అక్కడ పెట్టాను" అంటూ చూపింది రమ.

"మీరెళ్ళాక మేం చీరలన్నీ బీరువాల్లో సర్దేశాం. మాకేం కనపడలేదే. మీరెక్కడ మర్చిపోయారో ఏమిటో... " కిషన్ అన్నాడు.

"అయ్యో లేదండీ. ఆషాపులో చీరలు కొని ఇక్కడికి వచ్చాం. ఇట్నించి తిన్నగా ఇంటికే బయలుదేరాం. దారిలో గుర్తువచ్చి చూస్తే లేదని పరిగెత్తి వచ్చాం" రమ ఆదుర్దాగా, గాబరాగా అంది.

"ఉంటే ఏమయిపోతుంది. మా షాపులోనే వదలివుంటే ఇక్కడే వుంటుంది. ఏరా రంగా చీరలు సర్దినప్పుడు నీ కేమన్నా కనిపించిందా?"

"లేదు సార్, ఇక్కడం లేందే" అన్నాడు.

"బాగుందండీ, లేదంటే ఏమయిపోయినట్టు... ఇక్కడ మరిచి వెళ్ళాం – మరో

పది నిమిషాలలో వచ్చాం. లేదంటే సరిపోతుందా?" రమ ఈసారి కాస్త ధాటీగా అంది. ఆ మాటకి కిషన్ మొహం ఎర్రబడింది. బూల్‌చంద్ కాషుబాక్స్ మీదగా తలెత్తి చూశాడు. అతని కళ్ళల్లో కాస్త కోపం తొంగిచూసింది.

"మేడమ్, మేము అబద్ధం చెప్తున్నాం అనుకున్నారా? అయితే మా షాపంతా మీరే చూసుకోండి. ఒరేయ్ రంగా అమ్మగారికి ఆ బీరువాలన్నీ చూపు" అన్నాడు పౌరుషంగా రామ్‌చంద్.

మూర్తి కలుగజేసుకుంటూ "అది కాదండీ మా ఉద్దేశం. మీరు తీశారని అందం లేదు మేము. ఇక్కడ మర్చిపోయామని, ఒకవేళ మీరు తీసి దాచి వుంటారని వచ్చాం" సర్ది చెప్పబోయాడు.

"సార్, మేం చూసుంటే భద్రంగా దాచి మీరు రాగానే యిచ్చేవారం కదండీ. ఈ మాత్రం నిజాయితీ లేకపోతే వ్యాపారం ఎలా చేస్తాం సార్, ఇలాంటివి ఇక్కడ జరిగితే మర్నాడు మా షాపుకి కస్టమర్స్ వస్తారా..." కిషన్ అన్నాడు.

"ఏభై ఏళ్ళుగా వ్యాపారం చేస్తున్నాం సార్. ఎవరితో ఇలా అన్పించుకోలేదు. మా పేరు. మా నిజాయితీ మీకు తెలియక పోవచ్చు గానీ ఎవర్నన్నా అడగండి" బూల్‌చంద్ కష్టంగా అన్నాడు. సాధారణంగా యింతంత పెద్దషాపు వర్తకులు ధరలలో బిగిస్తారు, మోసం చేస్తారుగాని సరుకులో, కొలతలు, తూకాలు వగైరాలలో మోసం చేయరని కస్టమర్స్ పట్ల నిజాయితీలో లోపం వుండదని మూర్తికి తెలుసు. ఇలాంటి పనులు చేసి బయటపడితే వాళ్ళ బిజినెస్ దెబ్బ తింటుందన్న భయం వాళ్ళకి వుంటుంది. కనుక వాళ్ళిప్పుడు అబద్ధం చెపుతున్నారని మూర్తికి అన్పించలేదు. కాన రమ అన్నట్టు వాళ్ళు కాకపోతే ఆ పనిచేసే కుర్రాళ్ళు ఎవరన్నా వుండచ్చు. చూస్తూ చూస్తూ ఆరొందల రూపాయలు తాము మాత్రం వదులుకోలేరు గదా!

"మీరు మరోలా అనుకోకండి. మా ఆదుర్దా మాదిగదా. ఇక్కడ మరిచిపోయి వుంటామన్న అనుమానంతో."

"అనుమానం ఏమిటండీ, స్పష్టంగా నాకు గుర్తుంది. పోనీ యిక్కడనించి మరెక్కడికన్నా వెళ్ళాం గనుకనా... వాళ్ళు తీసుండకపోవచ్చు, పనివాళ్ళు తీసుండచ్చుగదా, మీ పనివాళ్ళని అడగండి, కాస్త వెతికించండి –" రమ కాస్త ధాటిగానే అంది. బూల్‌చంద్ మొహం ఎర్రబడింది. "కిషన్ షాపంతా చూపించు" అన్నాడు గంభీరంగా.

కిషన్ విసురుగా అరలలోని చీరలన్నీ లాగిపడేస్తూ "చూసుకోండి, చూసుకోండి...

మా పనివాళ్ళు షాపువదలి వెళ్ళనేలేదు, వాళ్ళెలా దాచివుంటారు. ఉంటే యిక్కడే వుంటుంది. చూసుకోండి" అన్నాడు. రమ చీరలు క్రిందా పైనా తీసి వెతికింది. "మన పిచ్చిగాకపోతే తీసిన వాళ్ళు ఎదురుగా పెడతారా ఏమిటి" అంది.

మూర్తి ఎటూ చెప్పలేని స్థితిలో పడ్డాడు. వాళ్ళమీద దొంగతనం మోపలేడు, అలా అని చూస్తూ చూస్తూ అంత సొమ్ము వదలలేని ఆ నిస్సహాయతలో భర్తమీద కోపం ముంచుకు వచ్చింది. "పద ఇంక యింటికి, చేశావు నిర్వాకం. అయినా అంత వళ్ళు తెలియకుండా వదిలేయడం – పోయిన వస్తువు దొరకడం ఉత్తమాట."

"బాగుందండీ... ఒకటా రెండా పోనీలే అని ఊరుకోడానికి ... ఆరువందలు. అందులో మనవి కావు. ఇప్పుడే వాళ్ళకి మనం ఒట్టం యిచ్చుకోవాలి... అంత సులువుగా వదిలేస్తామా, పోలీసులకి రిపోర్టు యీయండి. వాళ్ళే తేలుస్తారు వ్యవహారం."

కిషన్ మొహం ఎర్రబడింది. యువరక్తంగదా ఆవేశ పడిపోతూ "మేడమ్, యిందాకటి నించి చూస్తున్నాం, మేం దొంగలం అంటున్నారు, పోలీసులంటే భయపడి పోతామనుకుంటున్నారా?" దూకుడుగా అన్నాడు.

"కిషన్" బూల్‌చంద్ కొడుకుని వారిస్తున్నట్టు హెచ్చరికగా పిలిచాడు. "సార్ పోలీసులని పిలవండి, వాళ్ళే చూస్తారు... పని కుర్రాళ్లు ఎవరన్నా తీసివుంటే అది మా తప్పుకాదు... పోలీసులు... అల్లరి మా షాపుకి చెడ్డపేరు తెస్తుంది అనుకోండి, అయినా  మీరు అనుమానిస్తున్నారు గనుక పిలవండి... అదిగో ఫోను" అన్నాడు గంభీరంగా.

వాళ్ళంత ఖచ్చితంగా మాట్లాడుతూంటే రమలో వాళ్ళు తీయలేదేమో ననిపించింది. కాని మరెలా పోయినట్టు? ఆ పని కుర్రాడిమీదే రమ అనుమానం అంతా వుంది. చీరలు సర్దుకున్నప్పుడు వాడే చూసి ఎక్కడో దాచేసి వుంటాడు తరువాత పట్టుకుపోవడానికి అని నిశ్చయించుకుంది. అందుకే పోలీసు రిపోర్టు ఇస్తే వాళ్ళే నిజం లాగుతారు అనుకుంది, మూర్తి చూస్తూ ఆరేడువందలు వదలలేక రిపోర్టు ఇస్తే పోయేదేం వుంది, అదృష్టం బాగుంటే దొరకవచ్చు ననిపించి ఫోను చేశాడు.

షాపులో బూల్‌చంద్ మొహం గంభీరంగా పెట్టుకుని కూర్చున్నాడు. కిషన్ మొహం గంటుపెట్టుకుని కోపంగా చూస్తున్నాడు. పని కుర్రాళ్ళు భయం భయంగా చూస్తూ నిల్చున్నారు. కొనడానికి వచ్చిన ఒకరిద్దరికి అన్యమనస్కంగానే గుడ్డలు చూపిస్తున్నాడు రామ్‌చంద్.

అరగంటలో పోలీసులు వచ్చారు. ప్రశ్నలు జవాబులు, ఆరాలు అన్నీ చేశారు. మూర్తి తన అనుమానం చెప్పాడు. బూల్‌చంద్ తమ నిర్దోషిత్వం చెప్పి కావలిస్తే షాపు సోదా చేసుకోమన్నాడు. షాపు షాపంతా పోలీసులు గాలించారు. "దొంగ సొమ్ము మీకు కనపడేట్టు పెడ్తారా... అదిగో ఆ కుర్రాడే మాకు బట్టలు చూపించాడు. తీస్తే వాడే తీసి వుండాలి మరోలా పోవడానికి ఆస్కారం లేదు, వాడ్నే గట్టిగా అడగండి" అంది రమ.

పోలీసులు రకరకాలుగా రంగడిని ప్రశ్నించారు. దబాయించారు. బెదిరించారు. జైలుకి పద అని బయపెట్టారు. ఏం చేసినా "లేదు, తెలియదు, నేను చూడలేదు" అన్నపాటే పాడుతున్న రంగడిని చూసి పోలీసు కానిస్టేబుల్‌కి వళ్ళు మండింది.

"నీవిలా ఎందుకు చెప్తావురా దొంగ రాస్కెల్, నీచేత నిజం ఎలా పలికించాలో మాకు తెలుసురా" అంటూ లాఠీతో కొట్టడం ఆరంభించాడు. "చెప్పరా నిజం చెప్పు... ఎక్కడ దాచావో చెప్పు... లేకపోతే ఎముకలు విరుగుతాయి. రక్తం కక్కిస్తా... నిజం లాగడం మాకు తెలుసురా..." అంటూ అందినచోటల్లా లాఠీతో కుళ్ళ బొడవడం రంభించాడు. ఫెడీ ఫెడీ మని లాఠీ చప్పుడవుతూంది. మొదటి రెండు మూడు దెబ్బలని పౌరుషంగా తట్టుకున్నాడు. రంగడు, తరువాత మరో రెండు మూడు దెబ్బలని పెదాలు బిగపట్టి బాధ అణుచుకుని భరించాడు. అంతసేపు "నాకు తెలీదు, నే తీయలేదు" అంటూ దెబ్బలు తప్పించుకుంటూ అరుస్తూనే వున్నాడు. వాడు మొండికెత్తి అదే జవాబు యివ్వడం, దెబ్బలని లక్ష్యపెట్టక పోవడం చూసి పోలీసు మరింత పంతంగా కోపంగా కొట్టడం ఆరంభించాడు. దాంతో రంగడు దెబ్బలకి బాబోయ్... నిజంగా నేను తీయలేదు బాబోయ్..." అంటూ దెబ్బల నించి తప్పించుకుంటూ గగ్గోలు పెట్టసాగాడు... వాడి ముక్కునించి నెత్తురు కారడం ఆరంభించింది. దెబ్బలు తగిలినచోటల్లా నల్లగా కమిలి పోయింది చర్మం.

కిషన్ ఆవేశంతో వణికిపోతూ పళ్ళు బిగించాడు. బూల్‌చంద్ చూడలేనట్లు ఎర్రబడ్డ మొహం త్రిప్పుకున్నాడు. తక్కిన పనివాళ్ళు బిక్కచచ్చిపోయారు. ఆషాపులో కొనడానికి వచ్చినవాళ్ళు, చుట్టు ప్రక్కల షాపులవాళ్ళు గుమ్మంలో గుమిగూడి భయంగా చూస్తూ "అబ్బబ్బ..." అని నిట్టూర్చసాగారు.

అంతవరకు తెల్లబోయి చూస్తున్న మూర్తి తెప్పరిల్లి... "ఆగండి.... ఆగండి అలా కొట్టకండి.. కట్టద్దు... కావలిస్తే జైలుకి తీసుకెళ్ళండిగాని అలా కొట్తారేమిటి" అన్నాడు ఆ గోల చూడలేక.

"ఆ... మీరూరుకోండి సార్... యిలాంటి అణాకాని దొంగ వెధవలందరిని జైళ్ళల్లో పెట్టాలంటే మరిన్ని జైళ్ళు కావాలి. ... నాలుగు దెబ్బలకి నిజం పైకొస్తుంది. అపాటి దానికి జైలు ఎందుకు?" అంటూ మళ్ళీ కొట్టడం ఆరంభించాడు.

రంగడలా చావుదెబ్బలుతింటూ అరుస్తూంటే చుట్టు అందరు రమ మూర్తిలని వీళ్ళే కారకులన్నట్టు చూస్తుంటే గిల్టీగా ఫీలవుతూ తలవంచుకుంది రమ. ఆమె కూడ ఆ కొట్టడం భరించలేకపోయింది. రెండు నిమిషాలు చూసి మరి భరించలేక "ఆగండి, అబ్బబ్బ యిదేమిటి, మీకు రిపోర్టిచ్చింది యిలా కొట్టడానికా... కావలిస్తే పోలీసు స్టేషనుకు తీసుకుపోయి కొట్టుకోండి కాని మా కళ్ళముందు యిలా కొట్టకండి... అబ్బబ్బ చూడలేం... పోయినవి ఎలాగో పోయాయి, ఈ పాపం కూడా మా కెందుకు" రమ అంది. మూర్తి భార్యవంక నీవే కారకురాలివన్నట్టు చూశాడు.

ఇంచుమించు స్పృహలేనట్లు చలనరహితంగా పడుండిపోయాడు రంగడు.

బూల్‌చంద్ ఉద్రేకంగా "ఆగండి సార్, వాడ్ని విడవండి. ఇంక చంపకండి వాడ్ని ఎంతయినా మా క్రింద సంవత్సరం నించి పనిచేస్తున్నాడు. మేమూ మనుష్యులం సార్... మా కళ్ళ ఎదురుగా వాడ్ని అలా కొట్టకండి... మా షాపులో దొంగతనం జరిగిందంటున్నారు. సరే మీకు కావల్సింది డబ్బేగా.. తీసుకోండి. ఈ ఆరొందలతో మేము మేడలు కట్టం సార్! న్యాయం అన్యాయం చూడటానికి ఆ దేముడే వున్నాడు. తీసుకోండి సార్, తీసుకుని మమ్మల్నింక వదలి వెళ్ళండి" ఆవేశంగా అంటూ నోట్లు తీశాడు బూల్‌చంద్."

కిషన్ ఏమనాలో తెలియక తిరస్కారంగా చూశాడు. మూర్తికి బూల్‌చంద్ మాటలకి తలకొట్టేసినట్లయింది. తాము అబద్ధం ఆడుతున్నట్టు, ఏదో దానధర్మం క్రింద బిచ్చగాడికి విదిల్చినట్లు డబ్బు విసరడం అవమానమనిపించింది. "మేం అడిగింది పోయిన మా చీరలుకానీ, మీరు దయతల్చి పారేసే డబ్బు కాదు వుంచండి. పద రమా. జరిగిన ఈ గొడవలింక చాలు. పోయిన వస్తువు దొరకడం ఎక్కడన్నా వుందా. పదపద యింక" అన్నాడు తీక్షణంగా. రమ చూస్తూ చూస్తూ అంత డబ్బుని వదలలేక అలా అని ఆ రంగడిని పోలీసులు కొడుతూంటే చూడలేక, ఏం చెయ్యాలో తెలియక యింకా ఏమన్నా అంటే భర్త ఊరుకోడన్న భయంతో అయిష్టంగానే కదిలింది.

"సార్, వీడ్ని ఏం చెయ్యమంటారు సార్, కేసు విత్‌డ్రా చేసుకున్నారా?" అన్నాడు పోలీసు. "మీ యిష్టం, లాకప్‌లో పెడితే పెట్టండి కాని అలా కొట్టద్దు. ఏదన్నా

ఆచూకీ దొరికితే ఇదిగో మా అడ్రస్, కబురు చెప్పండి" అన్నాడు మూర్తి మెట్లు దిగుతూ.

మూర్తి అలా వెళ్ళగానే కానిస్టేబుల్ క్రిందపడివున్న రంగడిని లాఠీతోకొట్టి "బ్రతికిపోయావు – పోరా పో – ఇంక ఇలాంటి కేసులని లాకప్‌లో పెట్టడం ఆరంభిస్తే మా పని అయినట్టే" అంటూ వెళ్ళిపోయాడు. చుట్టూ మూగిన అందరూ చోద్యం అయిపోయినట్టు వెళ్ళారు.

షాపులో మిగతా కుర్రాళ్ళు రంగడిని లేవదీసి కూర్చోపెట్టి నీళ్ళుపట్టారు. తడిగుడ్డతో ముక్కంట కారుతున్న నెత్తురు తుడిచి గాయాల్ని తడిగుడ్డతో తుడిచారు. కిషన్ టీ తెప్పించి తాగించాడు. రంగడు కాస్త తేరుకున్నాడు. బూల్‌చంద్ రామచంద్ భోజనానికి లోపలికెళ్ళారు. పని కుర్రాళ్ళు వెళ్ళారు. ఓరిక్షా తెప్పించి ఆస్పత్రికి వెళ్ళి మందేయించుకుని ఈ పూటకి విశ్రాంతి తీసుకో అని చెప్పి వెళ్ళాడు బూల్‌చంద్ సానుభూతిగా.

రిక్షా వచ్చింది. రంగడి కెళ్ళేముందు కిషన్ ఓదార్పుగా వాడి భుజం తట్టాడు. జేబులోంచి ఓ ఇరవై రూపాయలు తీసి వాడి జేబులో పెట్టాడు. రంగడి కళ్ళనిండా సంతోషం, కృతజ్ఞత "ఫరవాలేదు సార్" అన్నాడు.

రిక్షా కదిలివెడుతుంటే వీధి గుమ్మంలో నిలబడి చూస్తున్నాడు కిషన్. షాపుకి ఎదురుగా కొద్దిదూరంలో ఉన్న ఓ చెట్టు నీడని ఓ ముష్టివాడు అడుక్కు తెచ్చుకున్న అన్నం తింటున్నాడు. ఓ గజ్జికుక్క ఆ ముష్టివాడి దగ్గిర ఆశగా తోకాడించుకుంటూ, చొంగ కార్చుకుంటూ తారట్లాడుతూంది. ముష్టివాడు కర్రతోదాన్ని తోలుతున్నాడు, కర్రెత్తి కొట్టినప్పుడల్లా "కుయ్యో" మంటూ వెనక్కి వెడుతూ మరుక్షణం మళ్ళీ తోకాడించుకుంటూ దగ్గర చేరుతూంది. ముష్టివాడు ఆఖరికి ఓ ముద్ద దానికి పడేశాడు. తిన్న దెబ్బలన్నీ మరిచి మహా సంతోషంగా, ఆశగా ఆ ముష్టి అన్నం పరమాన్నంలా ఆప్యాయంగా తినసాగింది ఆకుక్క. దాని కళ్ళనిండా సంతోషం, కృతజ్ఞత, విశ్వాసం.

***(1970 – 75 మధ్య)***

# గట్టు తెగింది

**రా**త్రి తొమ్మిది గంటలు. అంత మహాపట్టణం అప్పుడే గాఢనిద్రలో మునిగినట్లు ఎటు చూసినా గాడాంధకారం. కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి. మనుష్య సంచారంలేదు. ఎటు చూసినా నిశ్శబ్దం. రోజూ ఎడతెగని జనప్రవాహం, కదలాడే రోడ్లు అన్నీ నిర్మానుష్యమయి వున్నాయి. అంత పెద్ద పట్టణమూ యే దేవత ఆగ్రహానికో గురయి, శాపగ్రస్తయి శిలగా మారిపోయినట్టు నిశ్చలంగా నిలబడ్డ రోడ్లు మాత్రం కనిపిస్తున్నాయి. మనుష్యులందరినీ మంత్రించి కదలకుండా చేసేసినట్లు అందరూ ఇళ్ళల్లో బిగుసుకుపోయారు. ఎవరో రాక్షసులు ఊరిమీద పడి దోచుకోడానికి వస్తే అంతా భయంతో ఇళ్ళల్లో దాక్కున్నట్లుండిపోయారు. ఆ రాక్షసుల అడుగుల చప్పుళ్ళలా గస్తీ తిరుగుతున్న సి.ఆర్.పి. బూట్ల టకటకలు ప్రజల గుండెలమీద సవారి చేస్తున్నట్లున్నాయి. ఆ రాక్షసులు బరువుగా ఊపిరి తీస్తున్నట్టు మధ్య మధ్య సి.ఆర్.పి. జీపులు, వ్యానులు రోడ్లమీద రొదచేసుకుంటూ పహారా కాస్తున్నాయి. ఇళ్ళ కిటికీలలోంచి కనపడే క్రొవ్వొత్తి హరికెన్ లాంతర్ల గుడ్డివెలుగూ లేకపోతే పట్టణం పూర్తిగా యే మారణాయుధానికో నేలమట్టమైపోయిందనుకునే ఆస్కారంవుంది.

ప్రజలంతా ఇళ్ళల్లో తలుపులు బిగించుకుని, ఉన్నదేదో తిని ఆ చీకటిలో చేసేదేంలేక నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ అదృష్టానికి నోచుకోని కొందరు ఇంటికి రాని భర్త గురించో, కొడుకుల గురించో ఆదుర్దాపడుతూ ఎక్కడున్నారో, యేమయ్యారో అనుకుంటూ ఇంట్లో వుండలేక, బయటికి వెళ్ళలేక తచ్చాడుతూ ఆదుర్దాపడుతున్నారు. పడుకున్న వాళ్ళకి నిద్రపట్టకుండా గుండెలమీద ధన్‌ధన్‌మని రిజర్వుపోలీసుల బూట్ల చప్పుడు అదరగొడ్తుంది.

ప్రజా జీవితం యెక్కడికక్కడ స్థంభించిపోయిన ఆ కాళరాత్రి... ఆ చీకటిలో పార్వతమ్మ అలా మంచంమీద మేకులా కూర్చుంది.

"ఎంత సేపలా కూర్చుంటావు పడుకో, పడుకో" అన్నారు సీతారామయ్యగారు మూడోసారి. ఆమె మాట్లాడలేదు. ఆమె కళ్ళు కిటికీలోంచి చీకటిని చీల్చుకుని అంధకారంలోకి చూస్తున్నాయి.

"పడుకో పార్వతీ, ఎంతకని అలా కూర్చుంటావు. ఈ కర్ఫ్యూ వుండగా వాడిప్పుడు ఇంటికి ఎలా రాగలడు."

"ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో, ఏమయ్యాడో ఎలా నిద్ర పోనండీ. తిండి తిన్నాడో లేదో, మధ్యాహ్నం రెండుగంటలకు ఇంట్లోంచి వెళ్ళాడు. ఏమయ్యాడో" ఆవిడ గొంతుపట్టుకుంది.

"ఎక్కడో ఏ స్నేహితుడింటిలోనో వుండిపోయి వుంటాడు" నీవిలా బెంగపడి ఇప్పుడు చెయ్యగలిగింది యేముంది? అయినా వాడికి బుద్ధిలేదు. కర్ఫ్యూ పెట్టారని తెలిసి, తిన్నగా ఇంటికి తగలడకుండా యేం చేస్తున్నాడు" కోపంగా అన్నారు సీతారామయ్యగారు. ఆయన మనసులోనూ కొడుకుపట్ల ఆదుర్దాగా వుండకుండా ఎలా వుంటుంది. ఆదుర్దాపడడం మినహా యేం చెయ్యలేని నిస్సహాయతతో ఆయనకి కోపం వస్తూంది.

"వద్దురా నాయనా యింటిలోంచి వెళ్ళకురా అంటే విన్నాడా? వద్దురా బాబూ, ఈ గొడవలలో తల దూర్చకురా అని నెత్తికొట్టుకు చెప్పాను. నా మాట లక్ష్యం వుండేనా. బజారులో సాయంత్రం కాల్పులు జరిపారు. ఇద్దరు కుర్రాళ్ళు చచ్చి పోయారట. పదిమందికి దెబ్బలు తగిలాయని చెప్పుకుంటున్నారు. వీడా గుంపులో ఉన్నాడో యేమిటో, ఆమాట విన్న దగ్గిరనించి నాకాళ్ళూ, చేతులు ఆడటంలేదు. ఏమయ్యాడో, ఎక్కడున్నాడో" ఆవిడింక మాట్లాడలేకపోయింది.

"ఏదొచ్చినా ముందీ స్టూడెంట్లకే. అన్నింటికీ మేమున్నాం అని తయారవుతారు. వాళ్ళకోసం మనం ఇలా బెంగలుపెట్టుకు చావడం. కానీ, మన అదృష్టం యెలా వుంటే అలా అవుతుంది. దేముడిమీద భారం వేయడం మినహా మనం యేం చెయ్యగలం. చెప్పగలమా, వాళ్లని ఆపగలమా?"

"ఏమిటండీ ఈ గొడవ. ఇంకెన్నాళ్ళండీ. ఎప్పటికి తగ్గుతుంది ఈ గొడవ. ఎన్నాళ్ళింకా యీ బాధలు. చదువుసంధ్యలు లేకుండా పిల్లలు తిరుగుతున్నారు. ఆఫీసులు లేవు, జీతాలు లేవు. అసలెందుకండీ ఈ అల్లర్లు" అధమం రోజూకోసారన్నా పార్వతమ్మ అమాయకంగా ప్రశ్న వేస్తుంది.

పాపం పాతకాలం పార్వతమ్మకి యీ 'ముల్కీ' గొడవేమిటో యెంత చెప్పినా అర్థం కాదు. ఈ అలజడి ఏమిటో, ఈ ఆవేశాలు, కక్షలు ఏమిటో బోధపడదు. ఈ బంద్‌లు, కర్ఫ్యూలు, పోలీసులు, కాల్పులు ఇదంతా ఎందుకో అర్థం కాదు. బంద్‌కి అర్థం ఏమిటో తెలియకపోయినా ఆ రోజు బజార్లో ఏమీ దొరకవని, కర్ఫ్యూ అంటే మనుష్యులు ఇళ్ళలోంచి బయటికి వెళ్ళకూడదని మాత్రం యిప్పుడిప్పుడు తెలుస్తొంది. ఆంధ్రులు, హైదరాబాదువాళ్ళు వేరవడానికి దెబ్బలాడుకుంటున్నారని, ఇంటిలో కొడుకు, తండ్రి మాట్లాడుకునే మాటలవల్ల ఇప్పుడిప్పుడు కొద్దిగా అర్థమవుతూంది. 'వేరవడం యెందుకండీ, హైదరాబాదువాళ్ళు తెలుగువాళ్ళే కదా!' అంటుంది. మహా మహా నాయకులే ఆ ప్రశ్నకి జవాబు చెప్పలేక తలక్రిందులవుతూంటే ఆ తండ్రీ కొడుకులు యేమని జవాబివ్వగలరు. 'నీకర్థం కాదులే ఊరుకో' అని విసుక్కుంటారు తప్ప ఆవిడకి విడమర్చి చెప్పరు. కరెంటు లేక చీకటిలో తడుముకుంటూ వంటచేసుకోడానికి, పైపుల్లో నీళ్ళురాక బెందెడు నీళ్ళకి నానా అవస్థలు పడే వేళ, పాలురాక ఏ డబ్బాపాలతోనో కాఫీ త్రాగాల్సి వచ్చినప్పుడు, ఆ డబ్బాలకీ కరువొచ్చి బ్లాకులో కొండానికి మాయమయిపోయినపుడు, ఉత్తకాఫీ డికాషన్ తాగాల్సివచ్చినప్పుడు, ఇల్లు కదలడానికి వీలులేక, కూర నార కొనుక్కునే వీలులేక యే ఊరగాయతోనో అన్నం తినాల్సి వచ్చినప్పుడు, పనిమనుష్యులు రాక యింటెడు చాకిరీ చేసుకుంటున్నంతసేపు, కాలేజీలు, స్కూళ్ళు లేక పిల్లల గోల ఇంట్లో భరించలేక ఆవిడ – 'ఏం గొడవమ్మా దిక్కుమాలిన గోల. తిని కూర్చోక ఎందుకొచ్చిన దెబ్బలాటలంట. ఎప్పుడూ యేదో గోల. చదువు సంధ్యలు లేక పిల్లలు బలాదూరులా తిరుగుతున్నారు. ఈ రైళ్ళు కూడా ఆపుచేసేస్తున్నారు. ప్రయాణాలు చేయాల్సినవాళ్ళెలా చస్తారనుకున్నారో, అమ్మాయికి యేడునెలలు నిండిపోతాయి. ఈ గొడవ యిలా వుండగా రైళ్ళవీ సరిలేనప్పుడు అల్లుడు అమ్మాయిని పంపనంటాడు. ఈ గొడవ యెప్పటికి తగ్గేను. అదెప్పుడొస్తుందో – ఓపలేని పిల్ల యెలా చేసుకుంటుందో, నేనుండీ లేనిదాన్నయ్యాను. ఈ గొడవెపుడు తగ్గుతుందో, అదెప్పుడు వస్తుందో. విస్సుగాడి పెళ్ళి ముహూర్తం మాఘమాసంలో పెట్టుకున్నాం. ఈ గొడవ ఇలా ఉంటే యింకేం పెళ్ళి. కుదరక కుదరక కుదిరిందంటే ఆ ఆలశ్యానికి తోడు ఈ ఆలస్యం ఒకటి. ఏమిటో ఈ పాడుగోల' రోజల్లా ప్రతి సందర్భంలో ఆవిడ విసుక్కుంటూనే వుంటుంది గట్టిగానే.

"వూరుకో అమ్మా, నీకెంతసేపూ అక్కయ్య పురుడు, అన్నయ్య పెళ్ళిగోల, పాలు లేవో, కూరలు లేవో అనే గోలతప్ప... అవతల పరిస్థితి యెలావుందో, ప్రజలు

ఎలా గగ్గోలు యెత్తిపోతున్నారో నీకేం తెలుసు, మనుష్యుల ప్రాణాలకి గడ్డిపోచ విలవనీయకుండా కాల్చిపారేస్తూంటే... పాలో, కూరలో అంటావేమిటి? ఎన్ని త్యాగాలుచేస్తే స్వాతంత్ర్యం వచ్చింది, మరింకెన్ని త్యాగాలు చేసన్నా మనం ప్రత్యేక రాష్ట్రం తెచ్చుకోవాలి. ఈ మాత్రం కష్టాలకి ఓర్చుకోలేకపోతే, ఈ మాత్రం త్యాగాలు చేయలేకపోతే మనం ఇంకేం సాధించగలం?" ఉడుకు రక్తంలో ఉన్న కొడుకు ఆవేశంతో, ఉద్రేకంతో తల్లి చాదస్తం మాటలకి విసుక్కుంటూ కేకలేస్తాడు. ఆమెలో లోపించిన దేశభక్తిని నిరశిస్తాడు.

కొడుకు బయటకు వెడుతున్నప్పుడల్లా 'వెళ్ళద్దురా నాయనా, నీ వెందుకు తలదూరుస్తావు ఇలాంటి వాటిల్లో. నా మాట వినరా' అంటూ ఆదుర్దాగా గోల పెడుతుంది. బ్రతిమాలో, కోపగించో కొడుకుని వీధిలోకి వెళ్ళకుండా చెయ్యాలని తాపత్రయ పడుతుంది. ఉడుకురక్తం పొంగులారే ఆ కొడుకుకి తల్లి ఆదుర్దా యెలా తెలుస్తుంది. ఆవిడ వంక కోపంగా, నిరసనగా చూస్తాడు.

"ఇదిగో అమ్మా. నీలాంటివాళ్ళుండబట్టే ఆంధ్రుల గతి ఇలా ఉంది. నీ కొడుకు ఇంటిలో కడుపులో చల్ల కదలకుండా కూర్చోవాలి, తక్కినవాళ్ళంతా పోరాడి సాధిస్తే అప్పుడు నీకొడుకు కాలేజీలో చదివి, ఉద్యోగాలు సంపాదించుకుంటాడు. అవునా? ఆంధ్రునికి ఐకమత్యంలేని వాళ్ళని ఊరికే అన్నారా, నీలాంటివాళ్ళుండబట్టే' దూకుడుగా అంటాడు. పార్వతమ్మ యేం మట్లాడలేక విసుక్కుంటుంది. "ఏమోరా నాయనా, అన్ని ఆవేశాలూ నీకే, ఆ సుబ్బమ్మగారి మనవడు చూడు, ఇల్లు వదల కుండా బుద్ధిగా యింటిలో కూర్చుని చదువుకుంటాడు."

"ఆ... ఆ... వాడో ఆడారి వెధవ. తప్పు, తప్పు అలా అని ఆడవాళ్ళని అవమానించకూడదు. ఆడవాళ్ళూ మాతో సమానంగా ఈ సమరంలో పాల్గొంటు న్నారు. నాతోటివాళ్ళందరికీ లేని ప్రాణభయం నాకేనా. నేనేనా యేం చెయ్యకుండా చేతులు ముడుచుకుని ఇంటిలో కూర్చుంటాను" ఆవేశంతో, ఉద్రేకంతో ఊగిపోతూ అంటాడు.

"అవును నాయనా, బజార్లంట గొంతులు చించుకుంటూ తిరగడం బస్సులు తగలెట్టడం, ఏది కనిపిస్తే అది విరక్కొట్టటం, రైళ్ళ లైనులు పీకడం, రాళ్ళు రువ్వడం ఇదట్రా దేశభక్తి అంటే. బస్సులు తగలెట్టు కుంటే, రైళ్ళు లేకపోతే, చదువులుపోతే యెవరికిరా నష్టం. ఎవరిని ఉద్ధరించడానికిరా ఈ గోలంతా."

"నీకేం తెలియదు ఊరుకో అమ్మా. ఇంత గొడవ జరిగితేనే కాని పట్టించుకుంటా

రనుకుంటున్నావా. ఎక్కడో ఢిల్లీలో కూర్చున్నవాళ్ళకి మా గోడు మామూలుగా వినిపిస్తుందనుకుంటున్నావా? ప్రతీదానికి యింత రాద్ధాంతం జరిగితే తప్ప నాయకులకి చురుకుపుట్టదు."

"బాగుంది నాయనా, అయినా నాకు తెలీక అడుగుతా, ఇలా యెప్పుడూ ఎవరో ఒకరు దేనికోదానికి గొడవచేస్తూ వుంటే పాపం ఆ 'ఇందిరమ్మ' మాత్రం ఏం చేస్తుంది. ఇప్పుడు ఇక్కడ యిలా ప్రత్యేక రాష్ట్రం ఇస్తే, మరెవరో చాలామంది గొడవచేస్తారని ఆలోచిస్తున్నారని మీ నాన్న అన్నారు. రేప్పొద్దున వాళ్ళందరికీ కూడ అడిగినవన్నీ ఇలా యిస్తూ ఎంతకని పోతారు. అయినా ఉన్నవాళ్ళు వుండకుండా ముందు వాళ్ళతో ఎందుకు కలవాలి. ఇప్పుడెందుకు వాళ్ళు, మనం ఈ కీచులాడుకోడం..."

'అదే అసలు జరిగిన పొరపాటు, అప్పుడు ఈ నాయకులంతా కలిసి అటూ ఇటూ ప్రజలకేం తెలియకుండా వాళ్ళిష్టం వచ్చిన నిర్ణయాలు చేసేసుకుని ఒప్పందాలు చేసుకున్నారట విశాలాంధ్ర కోసం. ప్రజల అభీష్టం, సమ్మతం అప్పుడు ఎవరికీ అక్కరలేకపోయింది. నిజం బైటికి వచ్చాక నిర్ణయాలు ఇటు అటు ప్రజానీకానికి అసంతుష్టి కారణమైంది. ఈనాడు దాని ఫలితం అనుభవించేది అమాయక ప్రజలు అయ్యారు. ఇంత దాకా వచ్చాక, ఇలా ఒకరిపట్ల ఒకరు ద్వేషంతో కొట్టుకునేకంటే విడిపోవడం మంచిది. ఇద్దరికీ రాజీ కుదరదని బోధపడ్డాక ఇంకా సమైక్యత కావాలని, ఆశించడం వ్యర్థం. అది యింక జరగదు. అన్నదమ్ములు ఆస్థులు పంచుకు విడిపోవడంలేదూ, అలాగే ఇదీనూ, అవనీ, ముక్కలవనీ దేశం ఈ అయిన ముక్కలకి యిదో ముక్కతోడు అవుతుంది. అంతేగాని దేశంలో యెక్కడా లేని యెవరికీ లేని రూలు ఆంధ్రుల కొక్కరికే నెత్తిన రుద్దితే ఆ అన్యాయాన్ని మేం ఇంకా సహించం. ఏమయినా సరే మా రక్తం ధారపోస్తాం. ప్రాణాలు త్యాగం చేస్తాం. ఈ అన్యాయాన్ని ఎదుర్కొని ప్రత్యేకరాష్ట్రం తెచ్చుకుంటాం. చివరి వరకు పోరాడుతాం. ఆంధ్రులంటే అసమర్థులు కాదని నిరూపిస్తాం. మేం పోరాడేది అన్యాయంతో, న్యాయం ఎప్పటికన్నా గెలుస్తుంది' పిడికిలి బిగించి ఉద్రేకంగా ఉపన్యసిస్తున్నట్లు అంటున్న కొడుకుని వింతగా చూస్తుంది ఆమె. ఆ ఆవేశం, ఉద్రేకం కొడుకులోనే కాదు, కొడుకు కోసం యింటికి వచ్చే కుర్రాళ్ళందరిలోనూ ఒకటే ఉత్సాహం, ఉద్రేకం. ఏదో ఏ ఆటో, సినిమా చూడ్డానికో వెళ్ళినంత ఉత్సాహంగా, చావంటే భయమన్నాలేకుండా అందరూ కట్టకట్టుకుని గుంపులు గుంపులుగా తోసుకుంటూ, నవ్వుకుంటూ పరిగెడ్తున్నారు. 'ఒరేయ్ యివాళ ఆల్ ఇండియా రేడియో' దగ్గిర పికెటింగ్ చెయ్యాలిరా అనో, ఫలానా పోస్ట్ ఆఫీసు తగల బెట్టాలనో, రైలు స్టేషను మీద దాడి చెయ్యాలంటూనో

చెప్పుకుంటూ చేతికందిన ఏ కర్రో పట్టుకుని పోలోమంటూ పరిగెడ్తున్న కుర్రాళ్ళని చూస్తూ వీళ్ళకింత భయం లేదేమిటి చెప్మా, ఇలా తయారయ్యారేమిటి అనుకుంటూ విస్తుపోతుంది. ఇదంతా దేశభక్తేనా అనుకుంటుంది. చదువుకుంటున్న కుర్రాళ్ళు సరే, అంట్లుతోమే అప్పి, పాలు పోసే నరసమ్మ, చాకలి అందరూ ఒకటే గోల. "సందు దొరికింది గదా అని ఎలా ఏదో వంకన ప్రతిరోజూ పని ఎగగొడితే ఎలాగే" అంటే 'ఏటమ్మగోరూ, ఊరంతా అట్టుడికి పోతంటే గిన్నెలంటారేటి, మాకు పాణంమీద తీపి నేదేంటి, రోడ్డుమీదికి వస్తే కాల్చి పారేస్తాండారు పోలీసోళ్ళు' అంటుంది. 'దొంగముండ, కర్ఫ్యూ వుండగాగాని, ఉత్తప్పుడు ఇది రోడ్డుమీద ఊరికే నడిచి వస్తూంటే కాల్చి పారేస్తారా ఎక్కడన్నా' విసుక్కుంటూ గొణుక్కుంటుంది ఆవిడ ఏం చెయ్యలేక. 'ఇవి పాలా నీళ్ళా' అంటే చాలు పాల మనిషి భారతం విప్పుతుంది. 'ఏమిటమ్మగారూ, ఇంకా ఇయన్నా పోస్తున్నా మీకు పాత ఓడిక గదా అని. ఊర్లో పాలచుక్క లేదు. సంటిపిల్లలకి కూడా పాలులేక ఏడుస్తున్నారు. మావోళ్ళందరూ శేరుకి శేరు నీళ్ళు కలిపి మూడు రూపాయలకమ్ముతున్నారు. నేనింకా మీ కాపాటి యిస్తున్నాను' అంటుంది ఉద్ధరిస్తున్నట్టు. దాన్నని ఏం లాభం. నిజం అంతే. పాలేమిటి, కూరలేమిటి, దినుసులేమిటి ఏదడిగితే దాని ధరలు రెండింతలు మూడింతలు పెరిగిపోయాయి. కొన్ని అసలు మార్కెటులో కనిపించడం లేదు. ఓపక్క దేశభక్తి, త్యాగం అంటూనే, అందినంతమేరా, అవకాశమున్నంత వరకు ఈ అవకాశంలో డబ్బు చేసుకోవాలనే మనుష్యుల స్వార్ధం పార్వతమ్మకి ఆశ్చర్యం కలిగిస్తుంది.

ఏదయితేనేం. ఎవరు పెడితేనేం, నిప్పంటించారు, అది అంటుకుంది దావానలంలా. నాలుగువైపులా రాజుకుంది. ఆ కారుచిచ్చుని ఇంక ఆర్పడం ఎవరితరం కాదని అందరికి అర్థమవసాగింది. సమైక్యత కుదరదని, రాజీ కుదరదని అర్థమవసాగింది నాయకులకీ. ఇటు అటు సంతృప్తికరంగా నిర్ణయాలు చేయడం అన్నది అసంభవమని వేర్పాటు తప్పదని అందరికీ బోధపడింది. అది జరిగే లోపల ఇంకెందరు ప్రాణాలు కోల్పోవాలో, ఇంకెంత ఆస్థి నష్టం జరగాలో, ప్రజలు ఇంకెన్ని రోజులు అవస్థపడాలో దేముడి కెరిక.

* * * * * *

మర్నాడు ఉదయం ఓ రెండు గంటలు కర్ఫ్యూ తొలగించారు, ప్రజల అవసరాల కోసం. వెంటనే నేల ఈనినట్లు, పుట్టలోంచి బయటకు వచ్చిన చీమల బారులా, ఎక్కడ పడితే అక్కడ మనుషులు. ఆరెండు గంటలలో తమ తమ పనులు పూర్తి

చేసుకోవాలన్న ఆరాటంలో పరిగెడ్తున్నారు మనుషులు. అప్పటికప్పుడు దుకాణాలు తెరిచేశారు. ఎటు చూసినా హడావిడి, గాభరా.

కర్ఫ్యూ తొలగించిన పది నిమిషాలకి హడావిడిగా యింటికివచ్చాడు ప్రసాద్. రాత్రంతా కలతబడిన మనసుతో నిద్రలేకుండా కొడుకుకోసం ఆరాటపడ్డ పార్వతమ్మ – కొడుకు కంటపడగానే అప్పటివరకు పడ్డ ఆరాటం మరిచి కోపంగా, ఎదురెళ్ళింది. 'ఏమిరా, కర్ఫ్యూ పెట్టగానే ఇంటికి రాకుండా ఎక్కడేదుస్తున్నావురా, రాత్రంతా నీకోసం ఏమయ్యావోనని ఏడుస్తూ కూర్చోవాలా. ఆ మాత్రం బుద్ధి ఉండక్కరలేదురా' కొడుకు మొహం చూసిన ఆవిడ వాగ్ధోరణి ఆగింది. 'అదేమిటిరా అలా వున్నావు. రాత్రి భోజనం చెయ్యలేదా ఏమిటి, అయ్యో అయ్యో, ఆ మొహం ఏమిటిరా అలా వుంది. అసలెక్కడున్నావురా రాత్రి, ఇంకా ఏ స్నేహితుడింట్లోనో ఉన్నావనుకున్నాం, ఏం జరిగిందిరా?' ఆవిడ ఆదుర్దాగా కొడుకు నుదురు ముట్టుకు చూసింది. ప్రసాద్ మొహం ఒక్క రాత్రిలో గుర్తుపట్టలేనంతగా మారింది. మొహం నల్లబడి ఎర్రటి వాచిన కళ్ళు, చెదిరిన క్రాఫు, కళ్ళలో నీరసం కాక వ్యథ, నలిగిన మాసిన బట్టలు, కొడుకు అవతారం చూసి పార్వతమ్మ బెదిరింది. ప్రసాద్ 'అమ్మా' అంటూ చేతుల్లో మొహం కప్పుకుని కుర్చీలో కూలబడ్డాడు.

"ఏం జరిగిందిరా, అదేమిటిరా అలా వున్నావు?" ఆవిడ భయం మరింత ఎక్కువయింది.

"అమ్మా, శ్రీనివాస్ చచ్చిపోయాడమ్మా, చంపేసారమ్మా" అంటూ బావురుమన్నాడు.

"ఆ.." పార్వతమ్మ నిర్ఘాంతపోయింది. "ఎప్పుడురా... అదెప్పుడు రా... ఎలా చచ్చిపోయాడురా."

"నిన్న ఫైరింగులో గుండు తగిలింది. చచ్చిపోయాడు. సీనూ ఇంక లేడు" చిన్న పిల్లాడిలా ఏడుస్తూ అన్నాడు ప్రసాద్.

"అయ్యో!" పార్వతమ్మ అంతకంటే మాట్లాడలేకపోయింది. ఆవిడ గొంతులో దుఃఖం అడ్డుపడింది. ఆవిడకళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. శ్రీనివాస్ – సీనూ, ఒకటో క్లాసునించి కాలేజివరకు కూడా కొడుకుతో కలిసి చదువుకుంటున్న ఆకుర్రాడికి – ప్రసాద్‌కి ప్రాణ స్నేహం అని ఆమెకి తెలుసు. ఒక కంచంలో తిని ఓ మంచంలో పడుకునే స్నేహం ఆ ఇద్దరిదీ. ఎన్నిసార్లో తన చేతుల్తో భోజనం పెట్టింది. "పెద్దమ్మా" అంటూ చనువుగా టలుస్తూ ఇంట్లో తిరిగే శ్రీనివాస్‌పట్ల ఆమెకి పుత్రవాత్సల్యం వుంది. కలిసి చదువుకుంటూ, కలిసి షికార్లు, సినిమాలు తిరుగుతూ ఇద్దరూ ఒకే

ప్రాణంలా తిరిగారు ఇన్నాళ్ళూ. శ్రీనివాస్ మరణం, అందులో దుర్మరణం కొడుకుమీద ఎంతలా దెబ్బతీసి వుంటుందో ఆవిడకి అర్థం అయింది. కళ్ళెదుట జరిగిన ఆ ఘాతుకానికి కొడుకు ఎంత చలించి ఉంటాడో ఆమెకి అర్థం అయింది. పాపం వాళ్ళ వాళ్ళకి ఒక్కడే కొడుకు. అయినింట్లో పుట్టాడు. అపురూపంగా పెరిగాడు. ఆఖరికి పట్టుమని ఇరవైయేళ్ళు నిండకుండానే దుర్మరణం. ఆ తల్లిదండ్రుల దుఃఖం తల్చుకుంటుంటే పార్వతమ్మ కడుపులో దేవినట్లయింది. ఆక్షణంలో కొడుకు క్షేమంగా వున్నాడన్న సంతోషాన్ని శ్రీనివాస్ మరణించాడన్న నిజం అధిగమించింది.

'ఎంత కష్టం వచ్చిందిరా పాపం వాళ్ళకి, ఏ రోగమో వచ్చిపోవడం వేరు. ఇలా ఉన్నపాటున చచ్చిపోతే వాళ్ళెలా భరిస్తున్నారో ఆ దుఃఖం. అందుకే వద్దురా నాయనా ఇల్లు వదిలి వెళ్ళకండర్రా అని మొత్తుకున్నాను. నా మాట విన్నారా. ఎంత ఘోరం జరిగింది. ఓసారి వెళ్ళి చూపివస్తానురా. మీ నాన్న బజారెళ్ళారు. తొరగావస్తే వెళ్ళి వద్దు. మళ్ళీ కర్ఫ్యూ పెట్టేస్తారు గాబోలు." ఏదేదో గాభరగా అంటూ హడావిడి పడింది పార్వతమ్మ.

ప్రసాద్ కళ్ళు తుడుచుకున్నాడు. "కొడుకు చచ్చిపోతే పాపం ఓదార్చడానికన్నా మనిషి లేకుండా వాళ్ళిద్దరే అలా ఒకరి నొకరు ఓదార్చుకుంటూ కూర్చున్నారమ్మా! కర్ఫ్యూ పెట్టగానే ఎక్కడి వాళ్ళక్కడ వుండి పోయారు. సీనూ ఆస్పత్రికి తిసికెళ్ళే త్రోవలోనే చచ్చిపోయాడు... తీసికెళ్ళి డాక్టర్లు సర్టిఫికెట్ ఇచ్చాక మేం ఇంటికి తీసికెళ్ళాం. ఈలోపలే కర్ఫ్యూ పెట్టేశారు. తక్కిన వాళ్ళంతా ఇళ్ళకి పరిగెత్తారు. నేను వుండిపోయాను."

"మంచిపని చేశావు. ఆ మాత్రం మనిషి సాయం వుండకపోతే మరింత బెంగపడి పోయేవారు."

"అబ్బా, నిన్న రాత్రంతా వాళ్ళ ఏడుపు చూడలేకపోయానమ్మా... నేనేం చెప్పగలను, ఏమని ఓదార్చగలను. చూడలేకపోయాను. వాళ్ళమ్మగారు మాటిమాటికి తెలివి తప్పిపోయేవారు. ఆయన, నేను అలా రాత్రంతా కూర్చున్నాం. శవాన్ని తీసికెళ్ళడాని కన్నా ఏం ఏర్పాట్లు చేయడానికి లేదు. ఇప్పుడింక వెళ్ళాలి. గబగబా ఏర్పాట్లు చేసి తీసికెళ్ళాలి. ఒక్కసారి ఇంటికి వచ్చి మీకు చెప్పి వెళ్ళాలని వచ్చాను. కాస్త కాఫీ ఇయ్యమ్మా, త్రాగి వెడతాను" అంటూ హడావిడి పడ్డాడు వెళ్ళడానికి.

"మళ్ళీ వెడతావురా, అయ్యో వద్దురా. మళ్ళీ కర్ఫ్యూ రెండు గంటలలో పెట్టేస్తు న్నారు. ఎక్కడో చిక్కడిపోతావు. వెళ్ళద్దురా నా మాట విను. మీరు తిన్నటివాళ్ళు

గాదు. ఏదో గొడవ చేస్తారు. పోలీసులు మళ్ళీ కాలుస్తారు. వెళ్ళద్దు నాయనా, నా మాట విను" కడుపుతీపితో ఆవిడ ఆదుర్దాగా గోలపెట్టింది.

"అమ్మా!" ప్రసాద్ తీక్షణంగా చూశాడు. "అవతల సీనూ చచ్చిపోయి... వాళ్ళ వాళ్ళు నిస్సహాయ స్థితిలో వంటరిగా వుంటే నన్ను వెళ్ళద్దంటున్నావా. ఇదే నీ కొడుకయి ... ఎవరూ నీ యింటిగుమ్మం తొక్కక పోతే నీకెలా వుంటుంది. ఈ సమయంలో ఇలా మాట్లాడుతావా. ఇవాళ సీనూ అయ్యాడు, రేపు నేనయితే" కఠినంగా అన్నాడు.

"ఊరుకోరా నాయనా, ఎందుకురా అలాంటి మాటలు. నా మాట వినవూ. ఆఖరికి ఆ సీనులా నీవూ ఎప్పుడో ఏదో చేసి నా కడుపులో చిచ్చు పెడతావు. నాకు తెలుసు. ఇదంతా ఇందుకే వచ్చింది. నాలాంటివాళ్ళని ఏడిపించడానికే ఈగొడవంతా వచ్చింది" ఆమె కంఠం రుద్ధమయింది. కొడుకు విసుగ్గా చూశాడు.

"ఊరుకో అమ్మా. ఎప్పుడూ ఇదే గోల నీకు. చస్తే యేం, ఓ మంచి పనికోసం దేశం కోసం ప్రాణం ఇచ్చే అదృష్టం కావాలన్నా అందరికీ రాదు. నాకేం చావంటే భయంలేదు. ఈ పోలీసులు, ఈ కర్ఫ్యూలు మమ్మల్నేం చెయ్యలేవు. మా ఆశియసిద్ధికోసం మేం అందరం ప్రాణాలీయడానికి సిద్ధంగా వున్నాం. ఇంత మాత్రానికే బెదిరి ఇంటిలో కూర్చునేటంత పిరికి పందలం కాం మేము. అందరినీ పిలుస్తాను, అందరం కలుస్తాం. సీనూ అంతిమయాత్రకి అందరం కలిసి పెద్ద ఎత్తున యేర్పాటుచేసి ఊరంతా ఊరేగించాలని, ఊరేగించి, ఇంకెందరు ఇలా ప్రాణాలర్పిస్తే తప్ప మన నాయకులకి చురుకు పుట్టదా అని ప్రశ్నిస్తాం" ఆవేశంగా అంటూ గుమ్మందాటుతున్న కొడుక్కి పార్వతమ్మ గాభరాగా అడ్డువెళ్ళింది. "వరేయ్, నా మాట వినరా. వెడితే వెళ్ళావుగానీ మళ్ళీ కర్ఫ్యూ పెట్టేలోగా తిరిగిరా నాయనా. అనవసరంగా మొండితనం చేసి ప్రాణాలతో చెలగాటాలు ఆడకండిరా" ఆవిడ మాటలు గాలిలో కలిసిపోయాయి. ప్రసాద్ పరుగులాంటి నడకతో సందు తిరిగిపోయాడు.

ఎడా పెడా సంచులతో కూరలు, దినుసులు మోసుకొచ్చిన సీతారామయ్యగారు ఇంట్లోంచి కేకలు పెడ్తున్న భార్యని చూసి కాస్త ఆశ్చర్యంగా 'వీడు మళ్ళీ ఎక్కడికి పోతున్నాడు?' అని అడిగాడు. అంత వరకు ఆరాటాన్ని, ఆవేదనని ఒంటరిగా అనుభవిస్తూన్న పార్వతమ్మ భర్త కనపడగానే, అడగ్గానే ఆవేశంగా అంతా చెప్పుకొచ్చి 'వెళ్ళండి, వాడ్ని పిలుచుకునిరండి. మీరు కేకలేస్తే వస్తాడు, త్వరగా వెళ్ళి తీసుకురండి!

లేకపోతే ఈ ఆవేశంలో యేం అఘాయిత్యం చేస్తాడో. నిన్న సీనయ్యాడు. ఇవాళింకేం జరుగుతుందో' ఆవిడ గోలపెడుతూ తొందర చేసింది. అంతావిని నిట్టూర్చారు సీతారామయ్యగారు. "లాభం లేదు పార్వతీ, వాడ్ని ఆపడం మనవశంలో లేదు. బజార్లో చాలా గొడవగా వుంది. నిన్న చచ్చిపోయిన, దెబ్బలు తగిలినవారి గురించి ఈ కుర్రాళ్ళందరూ చాలా గొడవ ఆరంభించారు. మళ్ళీ యేదో గొడవ జరుగుతూంది. లాఠీచార్జి జరుగుతుంది. మళ్ళీ వెంటనే కర్ఫ్యూ పెట్టేస్తారనుకుంటున్నారు. అందుకే గబగబా వచ్చేశాను. కుర్రాళ్ళందరూ ఆవేశంతో శివం యెక్కిపోయి రాళ్ళు రువ్వుతున్నారు."

"అయ్యయ్యో, ఎలాగండీ, వీడు గుంపుని చేరేసి కుర్రాళ్ళందరూ కలిసి సీనూని ఊరేగింపుతో తీసికెడతారట. పోలీసుల మాట వినరు గాబోలు. మళ్ళీ కాల్పులు జరుగుతాయో ఏమిటో... అలా చూస్తారేమిటండీ. నయానో భయానో వాడ్ని ఇంటికి లాక్కురండీ."

"వాడు రాడు పార్వతీ, ఇప్పుడు వాళ్ళెవరిమాటా వినే స్థితిలో లేరు. వాడు వస్తానన్నా తక్కినవాళ్ళు రానిస్తారా. డి.ఎస్.పి.ని ఘోరావో చేశారు. ఏదో చాలా గొడవగా వుంది. మళ్ళీ షాపులు అవి మూసేస్తున్నారు. అందుకే యేవో దొరికినవి నాలుగు కొని వచ్చేశాను.

"మరెలాగండీ, మనం చూస్తూ ఊరుకోవలసిందేనా?" ఆవిడ ఆరాటంగా అంది.

"అంతే. దేముడిమీద భారంవేసి ఊరుకోవాలి. మన అదృష్టం ఎలా ఉంటే అలా జరుగుతుందనుకోవాలి. ప్రశాంతంగా పారే నదిని వరద వెల్లువ వచ్చి కొట్టేసింది. గట్టు తెగింది. ఆ ప్రవాహాన్నింక అడ్డగలగడం ఎవరితరం. ఆ గండి పూడ్చగలగడం యెవరి శక్యం. గండి పూడిస్తేగాని వెల్లువ ఆగదు. వరద ఆగితేగాని గండి పూడ్చడం జరగదు. ప్రస్తుత పరిస్థితి ఇది. ఇంకా వెల్లువలో యెందరి ప్రాణాలు కోల్పోవాలో, ఇంకెంత నష్టం జరగాలో, ఇదంతా ఎందుకొచ్చిందో, ఏం జరుగుతుందో" ఆయనలో ఆయన గొణుక్కుంటూ సీతారామయ్యగారు సంచులతో లోపలికి నడిచారు.

పార్వతమ్మ అయోమయంగా గుమ్మంలో నిలబడిపోయింది యెటో చూస్తూ. బహుశా ఆవిడ ఆ కనపడని దేముడిని కొడుకు క్షేమం కోసం ప్రార్థిస్తోందేమో.

**(ఆంధ్రసచిత్ర వారపత్రిక, 1972 ప్రాంతం)**

# కథకానిది

**కా**లింగ్ బెల్ విని తలుపు తీసింది కామేశ్వరి. ఎదురుగా ఓ అపరిచిత యువతి. పాతికేళ్లు పైబడి, పొట్టిగా, పీలగా చామనచాయ రంగుతో ఉన్న ఆమెని ఎక్కడా చూసిన గుర్తు లేక సందిగ్ధంగా చూసింది.

"మీరు కామేశ్వరిగారేనా..." చిరునవ్వుతో నమస్కారం చేస్తూ అడిగిందా అమ్మాయి.

"అ, అవును... మీరు?"

"నాపేరు సుగుణమణి అంటారండి. నేను మీ అభిమానినండీ... మిమ్మల్ని చూడాలని, మాట్లాడాలని వచ్చాను."

"అహా అలాగా... రండి లోపలికి. కూర్చోండి... నా ఎడ్రసు మీకెలా తెలిసింది?" చిరునవ్వుతో అడిగింది రచయిత్రి కామేశ్వరి. ఆ అమ్మాయి లోపలికి వచ్చి కూర్చుంది.

"ఈమధ్యే ఒక మాసపత్రికలో మీరు రాసిన 'జీవితం చేజార నీయకు' నవల చదివాక మిమ్మల్ని తప్పక కల్సుకోవాలనిపించింది. ఆ పత్రికాఫీసులో మీ అడ్రసు తీసుకుని ఇదివరకు ఒకసారి వస్తే మీరు కంట్రీలో లేరని ఫారెన్ టూర్ వెళ్లారని చెప్పారండి – అందుకని మళ్లీ ఇప్పుడు వచ్చాను.... మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడగాలని, నా సందేహాలని తీర్చుకోవాలని వచ్చాను..."

"చాలా సంతోషం అమ్మా సుగుణమణీ, ఒక నవల చదివి రచయిత్రిని కల్సుకుని మాట్లాడాలని వచ్చినందుకు థాంక్స్.. నాకు చేతనయినంతగా మీ సందేహాలని తీర్చడానికి ప్రయత్నిస్తాను. ముందు మీరేం తీసుకుంటారు? కాఫీ, టీ, కూల్‌డ్రింక్" అతిథిమర్యాద కోసం అడిగాను.

"ఏం వద్దు. కాస్త చల్లని నీళ్లివ్వండి చాలు..." అంది సుగుణ. కామేశ్వరి యిచ్చిన నీళ్లు తాగింది.

"యిప్పుడు చెప్పండి మీ గురించి? మీరేంచేస్తుంటారు?" కుతూహలంగా అడిగాను.

"మొన్నటి వరకు గృహిణి ప్లస్ ఉద్యోగినిని. ఈ రోజు కేవలం ఉద్యోగినిని మాత్రమే. జూనియర్ ఉమెన్స్ కాలేజీలో లెక్చరర్‌గా ఉన్నానండి" అదోలా నవ్వింది.

"అంటే..." అర్థంకాక సందిగ్ధంగా చూశాను.

"అంటే నా మొగుడ్ని వదిలేసి ఉద్యోగం చేసుకుంటున్న ఆడదాన్ని – నేను మిమ్మల్నెందుకు కల్సుకోవాలనుకున్నానో తెలుసా? మీ నవల చదివాక నాకు చాలా ఆవేశం వచ్చింది. అసలు మీరా నవల రాయడంలో మీ ఉద్దేశం ఏమిటో చెపుతారా?" వచ్చింది మొదలు ఏదో అడిగేయాలన్న ఆమె ఆరాటం గుర్తించింది కామేశ్వరి.

"ఆ నవల చదివాక కూడా మీకు ఇంకా నేను చెప్పదలచింది ఏమిటో అర్థం కాలేదంటే నే చెప్పదలచింది సరిగ్గా వ్యక్తం చేయలేకపోయానన్నమాట" కామేశ్వరి నవ్వుతూ అంది. "అహా అది కాదు. అర్థం కాలేదని కాదు. మీరు సరిగా చెప్పలేదనీ కాదు.. వాట్ ఐ మీన్, మీరు ఆ నవలలో మొగుడెలాంటివాడైనా... తిట్టినా, కొట్టినా సహించి ఆత్మాభిమానం చంపుకుని కాపురాలు చేసుకోండి. కాపురాలు పాడు చేసుకుంటే నష్టపోయేది ఆడవాళ్లేనని చెప్పడంలో మీ ఉద్దేశం ఏమిటో కాస్త వివరంగా చెప్పగలరా..." ఆవేశంగా, దూకుడుగా అంది.

"మొగుడు తిట్టినా, కొట్టినా, హింసించినా నాథా నీవే గతి అని కాళ్ల దగ్గర పడుండమని ఆ నవలలో నేనెక్కడా రాసిన గుర్తులేదు నాకు." శాంతంగా నవ్వుతూ అంది కామేశ్వరి.

"మీరేమిటి రాశారు? ఆ నిర్మల భర్తనించి వేరుపడి, తను కోల్పోయిందేమిటో గుర్తించి పశ్చాత్తాపపడి తనలా యింకో అమ్మాయి జీవితం చేజార్చుకోరాదని ఆ అమ్మాయికి నచ్చచెప్పి భర్త దగ్గరికి పంపి కాపురం కుదుటపర్చాలని తాపత్రయపడి కాపురం నిలుపుతుంది అని రాశారు. అంటే దానర్థం, ఈరోజు మొగుడ్ని వదిలిన వాళ్లందరూ రేపు పశ్చాత్తాపపడితే ప్రయోజనం ఉండదు. మీ కాపురం ఎలాగైనా నిలుపుకోండి అని చెప్పడమే కదా మీ ఉద్దేశం –" ఆవేశంగా నిలేసినట్టు అడిగింది.

"చూడమ్మా, సుగుణమణీ.. నీవు కాస్త ఆవేశం తగ్గించుకుని ఆ నవల మరోసారి చదివి చూడు... పరిశీలనగా చదివితే నేచెప్పదలచింది నీకర్థం అవుతుంది... ఓ రచయిత్రిగా ఏదో ఒక సాంఘిక సమస్య తీసుకుని నా నవలలో ప్రతిబింబింప చెయ్యాలని నా తాపత్రయం. నేను స్త్రీని కనక స్త్రీల సమస్యలు ఏదో ఒకటి నా నవలలో ప్రతిబింబింపచేసి వీలయితే పరిష్కార చూపడం, లేదంటే సమస్య ఇది ఆలోచించండి అని తెలియచెప్పడం నా ధర్మం. అందులో నీతో, మంచీ చెడో, గ్రహించడం, మానడం పాఠకుల ఇష్టం... అవునంటావా."

"అవునండీ. ఇది వరకు మీ నవలలన్నీ చదివాను. మీ 'కొత్తమలుపు'లో హీరోయిన్ తనని మోసం చేసి అన్యాయం చేసిన హీరోని పరువు ప్రతిష్ఠలు పక్కన పెట్టి కోర్టుకు లాగి బుద్ధి చెప్తుంది. మీ 'అరుణ' అందరినీ ఎదిరించి తన ఆశయం కోసం ప్రేమని త్యాగం చేసి పల్లెటూరిలో ప్రాక్టీసు పెట్టి ఆదర్శం నిలుపుకుంది. మీ వివాహబంధాలలో హీరోయిన్ భర్త బాధపెట్టి, ఇల్‌ట్రీట్ చేస్తే ఇంకో స్త్రీ సహాయంతో అతని పై అధికారికి కంప్లైంట్ చేసి దారికి తెస్తుంది. మీ 'శుభోదయం'లో మానభంగానికి గురి అయిన స్త్రీ అది తన తప్పుకాదని, మానభంగం అన్నది శరీరానికి కాని మనసుకి కాదని అలా గురయిన స్త్రీలకి ఆత్మహత్యే శరణ్యం కానక్కరలేదని భర్తని ఎదిరించి వేరుపడి, తనలాంటి ఇంకో అమ్మాయిని కోడలుగా చేసుకుని ఆదర్శంగా నిలుస్తుంది. 'కోరికలే గుర్రాలైతే' నవలలో ఈ కాలం అమ్మాయిలు నవలలు సినిమాలు చూసి జీవితం గురించి ఏవో కలలు కని అవి నిజ జీవితంలో దొరక్కపోయేసరికి జీవితాన్ని ఎలా పాడుచేసుకుంటారో చక్కగా చెప్పారు..."

"మీరు నా నవలలన్నీ చదవడమే కాక గుర్తుపెట్టుకున్నారే బాగా..." ఆమె వాక్ప్రవాహాన్ని అడ్డుతూ అంది కామేశ్వరి.

"అవును మీరు స్త్రీల సమస్యని ప్రతిబింబింపచేసే రచనలు చేస్తారన్నది నాకు నచ్చిన విషయం. మీ నవలలు అందుకే మిస్ కాను... కాని ఈసారి మీరిలా స్త్రీకి పిరికి మందుపోస్తూ రాయడం సహించలేక మీతో దెబ్బలాడాలని వచ్చాను" కాస్త చనువుగా, కాస్త దూకుడుగా నిలేస్తున్నట్టే అంది సుగుణమణి.

"సరేనమ్మా సుగుణా... ఆ నవలలో నీకు నచ్చనిది ఏమిటో ముందు చెప్పు. నిజంగా నేరాసింది తప్పు అని నీవు నన్ను నమ్మించగలిగితే ఆ నవల ప్రింట్ అయి పుస్తకరూపంగా వచ్చే ముందే మార్చేస్తాను. ఆ నవలలో రాసింది తప్పు వెనక్కి

తీసుకుంటున్నానని నా అభిప్రాయం పాఠకులకి చెప్పేస్తాను. సరేనా...” ఓ రచయిత్రి నించి ఈ విధమైన జవాబు ఆశించని సుగుణమణి ఒక్క క్షణం తెల్లపోయి తడబడింది. ఏం అనాలో అర్థం కానట్టు చూసింది.

“అదికాదండీ, పురుషుడు ఎలాంటి వాడైనా ఆడదే సర్దుకుని అడ్జెస్టయి బతకాలని మీలాంటి వారు కూడా అనడం నాకు బాధ కలిగించింది.

“చూడమ్మా ... ఆ నవలలో నేను చెప్పిందేమిటి? ఏ పురుషుడు గాని, ఏ స్త్రీగాని పెర్‌ఫెక్ట్‌గా వుండరు. ఒక్కక్కరికి ఒక్కొక్క బలహీనతలుంటాయి. అందరి స్వభావాలూ ఒకలాగే వుండవు. భర్తలో లోపాలు ఎంచే ముందు, మనలో వీక్ పాయింట్లు ఏమిటో ఆలోచించుకోవాలి. తరువాత భర్తలో లోపం వుంటే అది సరిదిద్ది రిపేరు చేయగలమా అని ఆలోచించాలి ఒక్క క్షణం. శరీరంలో ఏదో రోగం వస్తే వెంటనే ఆ భాగం కోసి పారేసుకుంటున్నామా. డాక్టరు దగ్గరకెడతాం, మందులు పుచ్చుకుంటాం. మనం చెయ్యాల్సిన ప్రయత్నాలు అన్నీ చేసినా శరీరంలో అవయవానికి రోగం తగ్గక పోతే శస్త్ర చికిత్సచేయించి ఆ భాగం తీసేస్తాం కాని మొత్తం శరీరాన్నే త్యజించం గదా – అలాగే భర్తలో లోపం ఉంటే నీ చాతనయినంత వరకు ప్రయత్నించి – అనురాగం, ప్రేమ, సహనం, ఓర్పు అనే ఏ మందులకీ అతనిలో గుణం కన్పించకపోతే శరీరానికి మరణం తప్పదు. అలాగే అప్పుడు నీ వివాహబంధానికి అంతం తప్పదు. చదువు, వ్యక్తిత్వం, ఆత్మాభిమానం, ఉద్యోగం అన్నీ ఉన్నాయి గనక ప్రతీ చిన్న లోపాన్ని భూతద్దంలో చూసి, మాట మాట పెంచుకుని, మనస్పర్థలు, కార్పణ్యాలు, అహాలు పెరిగి చిలికి చిలికి గాలివాన చేసుకుని ఆ గాలి తాకిడికి ఎటో వెళ్లి పడి జీవితాన్ని వ్యర్థం చేసుకోకండి. ఏవో చిన్న చిన్న అపోహలతో కాపురం వదులుకొని తరువాత జీవితంలో పశ్చాత్తాపపడే అవసరం రానీయకండి. చిన్న లోపాలను క్షమించండి. సర్దుకోండి. అభిప్రాయభేదం వస్తే కూర్చుని చర్చించుకోండి. మాట మాట పెంచుకుని, పంతాలు పెంచుకుని పరిస్థితి చేయిజార్చుకుంటే ఒరిగేదేం వుండదు’ అని ఓ రచయిత్రిగా పాఠకులకి సందేశం ఇవ్వడం తప్పంటావా...” కామేశ్వరి కాస్త ఆవేశంగానే అంది.

“క్షమ, ఔదార్యం, సహనం యివన్నీ వినడానికి చదవడానికి బాగుంటాయి. కొందరి మనుష్యులపట్ల అవి ఆచరించడం ఎంత కష్టమో మీకెలా తెలుస్తుంది ఏం? క్షమ, ఔదార్యం ఆడదే ఎప్పుడూ ఎందుకు చూపాలి? ఆడదే ఎప్పుడూ ఎందుకు

ఎడ్జస్ట్ అయి సర్దుకు బతకాలి? ఎన్ని యుగాలైనా పురుషాహంకారానికి స్త్రీయే తల ఒగ్గి ఎడ్జస్ట్ అవమని మీలాంటి రచయిత్రులు రాస్తూంటే ఎన్ని యుగాలైనా స్త్రీ పురోగమనం ఎలా సాధిస్తుంది?"

"చూడు సుగుణా.... ఈ ఎడ్జస్ట్‌మెంట్ అన్నది వివాహం విషయంలోనేనా? ఒక్క భర్తతోనేనా? జీవితంలో ప్రతి దశలో ప్రతి మనిషితో ఎడ్జస్టయ్యే మనిషి బతుకుతాడు... ఏం చిన్నతనంలో నిన్ను కన్న తండ్రో తల్లో కోపగించి తిడితే ఎడ్జస్ట్ అవకుండా ఇల్లు వదిలి వాళ్లని వదిలిపోయావా? అక్కో, అన్నో దెబ్బలాడి, కొడితే వాళ్లతో తెగతెంపులు చేసుకుని వచ్చేశావా? ఈరోజు నీ కాలేజీలో ప్రిన్సిపాల్ నీలో ఏదో తప్పు ఎత్తి చివాట్లు వేస్తే ఉద్యోగం వదిలేస్తావా? నీ తోడి లెక్చరర్లు నిన్నేదో వ్యంగ్యంగానో, హాస్యంగానో అంటే కాసేపు ఉడుక్కుంటావు గాని ప్రతి వాళ్లతో తెగతెంపులు చేసుకుంటున్నావా? అంత దాకా ఎందుకు? నీవు డబ్బిచ్చి పెట్టుకున్న మనిషి ఏమన్నా అంటే మానేస్తుందేమోనని ఆలస్యంగా వచ్చినా, నాగాలు పెట్టినా గట్టిగా ఏమనలేక సర్దుకుంటున్నావా లేదా? బస్సులో టిక్కట్టిచ్చి కూర్చోడానికి చోటులేకపోతే నిల్చుని సర్దుకుని ప్రయాణిస్తున్నావు కాని బస్సులో వెళ్లడం మానేశావా? లేక బస్సు వాళ్లతో రోజూ తగవుపెట్టుకుంటున్నావా? బజార్లో డబ్బిచ్చి సరుకు బాగున్నా లేకపోయినా ఉన్నదానిలో మంచిది ఏరుకుని సర్దుకుంటున్నావా లేక కొనడం మానేస్తున్నావా? డబ్బిచ్చి సినిమా టిక్కెట్టు కొనుక్కుని హాలు వాళ్లు ఏ.సి. వేయకపోయినా చచ్చినట్టు ఉక్క భరించి సినిమా చూస్తున్నావా లేక సినిమాలు మానుకున్నావా లేక వాళ్లతో దెబ్బలాట పెట్టుకున్నావా? అంతదాకా ఎందుకు? మన కడుపున పుట్టిన బిడ్డలు... ఎదిరించి నీవెంత అని సమాధానాలు ఇస్తుంటే ఈరోజుల్లో పిల్లలింతే అని సర్దిచెప్పుకుని వాళ్లని చూసీ చూడనట్లు క్షమించుతున్నామా లేక పిల్లలేదో అన్నారని వాళ్లని యింట్లోంచి తరిమేస్తున్నామా? మనిషి ప్రతి రోజూ ప్రతిక్షణం సర్దుకుని ఎడ్జస్టయ్యే బతుకుతాడు సుగుణా – కన్న తండ్రి అంటే తప్పుపట్టం, కన్న బిడ్డలు ఎదిరిస్తే సహిస్తాం. అక్క చెల్లెలు ఏదో అన్నా కాసేపు కోపగించుకున్నా సంబంధ బాంధవ్యాలు తెంపేసుకోం... పనిమనిషి అంటే పడతాం, పాలవాడు నీళ్లు కలిపి మోసం చేసినా సహిస్తాం... రోజూ ఇన్ని రకాలుగా ప్రతి క్షణం ఎడ్జస్ట్ అవుతూ బతికే మనం కేవలం భర్త మనల్ని ఏదో అంటే ఎందుకింత గింజుకుని గోరంతని కొండంతలుగా ఊహించుకుని, అవమానపడి అష్టకష్టాలు పడ్తున్నట్టు,

అదంతా సహించి పడుంటున్నామే ఇంకా ఇలా ఎన్నాళ్లు? అని బాధపడి పోవడం ఎందుకు?" కామేశ్వరి ధాటిగా ఉపన్యసిస్తున్నట్లుంది.

సుగుణమణి మొహంలో రంగులు మారాయి... ఏదో అనబోయింది. అనే అవకాశం ఆమెకివ్వకుండా మళ్లీ అందుకుంది కామేశ్వరి.

"చూడు సుగుణా... ఎందుకో చెప్పమన్నావా... వివాహం అయ్యేవరకు తల్లి దండ్రుల కట్టడిలో పెరిగిన మనం పెళ్లవగానే ఒక్కసారి స్వేచ్ఛ పొందినట్లు ఫీలవుతాం. నా మొగుడు, నా ఇల్లు... సంసారం నాది, నా ఇష్టం వచ్చిన రీతిలో ఉండవచ్చు. నా మొగుడు నామాట జవదాటడు. నన్ను అలరిస్తాడు, మురిపిస్తాడు, అన్న ఊహలతో కాపురానికి వస్తుంది ఆడపిల్ల. రాగానే భర్త కాస్త సౌమ్యుడు, సరసుడు అయితే గొడవలుండవు. కాని భర్త కాస్త అహంకారి, అహంభావి అయితే ఆమెకన్న కలలు తారుమారై కలవరపడిపోతుంది. భర్త అదుపాజ్ఞలు, కట్టడి ఆమె ఊహలని తల్లకిందులు చేసేసి తనేదో స్వతంత్రం కోల్పోయి బానిసలా భర్తకి లోబడి ఉండడమా అన్న అహంకారం తలెత్తుతుంది భార్యలో. ఇదివరకటి స్త్రీకి చదువుసంధ్యలు ఆర్థిక స్వాతంత్ర్యం లేదు కనుక భర్త ఏం అన్నా సహించి నాఖర్మ ఇంతే అనుకుని పడి వుండేది. భర్త కాస్త సంతోషంగా పలకరిస్తే పరవశించి, తిట్టిననాడు ఏడ్చి నా బతుకింతే ననుకుంటూ ఇంట్లో చాకిరీ చేసుకుటూ, పిల్లల్ని కంటూ అదే బతుకనుకొనేది. ఈనాటి ఆడపిల్లకి చదువు, ఆర్థిక స్వాతంత్ర్యం రాగానే ... ఏం మేం ఎందుకు అలాపడుండాలి? అని తిరగబడడం నేర్చుకున్నాక పంతాలు పట్టింపులు పెరిగి కాపురాలు వదులుకుంటున్నారు."

సుగుణమణి మళ్లీ ఆవేశంగా ఏదో అనబోయింది. కామేశ్వరి ఆమెని చేత్తో వారిస్తూ, 'వుండు నన్ను పూర్తిగా చెప్పనీ, నే చెప్పడం అయ్యాక నీవు మాట్లాడుదువు గాని.. సుగుణా ఈ విషయం మధ్య అమ్మాయిలు ఒక విషయం మర్చిపోకూడ దంటాను నేను. పుట్టిన తరువాత ఇరవై ఏళ్లో పాతికేళ్లో తండ్రి మనల్ని కట్టడి చేస్తే ఎందుకు మనం సహిస్తున్నాం. ఆయన పెద్దవాడు, పెట్టి పోషిస్తున్నాడు కన్నందుకు మన బాధ్యత తనది అనుకుని తండ్రి ఏమన్నా భరిస్తాం మనం. అలాగే పెళ్లి అయ్యాక తండ్రిలాగే భర్త పెద్దవాడు - ఇరవై ఏళ్లు కాకుండా ఏభై ఏళ్లు మన బరువు బాధ్యతలని పైన వేసుకున్న అతను మనల్ని ఏ విషయంలోనన్నా కట్టడి చేసినా, ఆజ్ఞలు అధికారాలు జారీ చేసినా మనం ఎందుకు భరించం? ఎందుకింత

బాధపడిపోతాం అన్నది ఒక్క క్షణం ఆలోచిస్తే మన బాధకు అర్థం లేదనిపిస్తుంది. నవలలో చెప్పినట్టు ఒకచోట ఎక్కువరోజులు ఇద్దరు కల్సి బతికితే కన్న తల్లితోనే సరిపడదు. పుట్టిన పాతికేళ్ల వరకు వేరువేరుగా బతికి పెళ్లి పేరుతో ఇద్దరు బతుకులు ముడివేసుకుని ఒక ఇంట్లో ఓ ఏభై ఏళ్లు బతకాలంటే జీవితంలో ఎన్ని రకాల ఎడ్జస్ట్‌మెంట్స్ వుండాలంటావు! కాపురం నడవడానికి స్త్రీ, పురుషులిద్దరూ కావాలి కనుక ఒకరికి నచ్చనివి ఒకరు కొన్ని చూసీ చూడనట్టు వదిలేస్తూ, కాసింత క్షమ, ఔదార్యం చూపిస్తూ సర్దుకుపోవాలి గాని ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్నంత మాత్రాన కాపురాలు వదులుకుంటే వివాహ వ్యవస్థ దెబ్బతింటుంది…” అని నేను చెప్పాను.

సుగుణమణి మొహం కాస్త మాడింది. ‘అది సరే మీరు చెప్పింది బాగుందనుకోండి. నా పాయింటు మీకు అర్థం కాలేదు. ఈ ఎడ్జస్టుమెంటు ఎప్పుడూ స్త్రీ వైపునించే ఎందుకుండాలి… మీ నవలలో విద్య భర్త దగ్గరికి వెళ్లి అతన్ని మార్చడానికి ప్రయత్నించింది కాపురం కోసం… కాని అతనేం పట్టనట్టు ఊరుకున్నాడు గదా పురుషుడికి భార్య, సంసారం అక్కరలేదా?”

“చూడమ్మా… పురుషుడూ ఎడ్జస్ట్ అవలేదని నీవెలా అనగలవు? ఆ నవలలో విద్య భర్త ఎంత అహంకారి. అహంభావి అయినా సంసారం కావాలనుకోబట్టే గదా కాస్త బెట్టు నటించి విద్యతో రాజీకి వచ్చాడు. ఎడ్జస్ట్ కాకపోతే విద్యని బయటికి నెట్టచ్చుగదా? ఆడదాని అవసరం ప్రతి స్టేజీలోనూ పురుషుడికి కావాలి. చిన్నప్పుడు తల్లి, పెద్దయ్యాక భార్య, వార్ధక్యంలో కూతురో కోడలో ఏ పురుషుడైనా ప్రతి దశలోనూ స్త్రీ మీద ఆధారపడక ఎలా ఉండగలడు – సంసారం అన్నాక స్త్రీ పురుషులు ఒకరి కొకరు ఆధారపడక ఏమవుతారు? ఎటొచ్చీ ఈ పురుషాధిక్య సమాజంలో తరతరాలుగా పురుషుడినన్న అహం, స్త్రీ కంటే తను పై మెట్టున ఉన్నానన్న భావం ఒక్కసారిగా మగవాడిలో ఎలా పోతుంది? పురుషుడి కంటే స్త్రీ ఏ విషయంలోనూ తీసిపోదని వారూ గుర్తించారు. గుర్తిస్తున్నారు. అయినా రక్తంలో జీర్ణించుకుపోయిన భావాలు ఒక్కసారిగా ఎలాపోతాయి? వంటింటి గడపదాటి స్త్రీ ఈ స్థితికి చేరుకోడానికి ఇన్నాళ్లు పట్టింది. ఇంకో తరంలో పురుషుడూ మారి భార్య స్థానం గుర్తించి ఆమెకివ్వాల్సిన విలువ, గౌరవం ఇస్తాడు.

సుగుణ అదోలా నవ్వి … “ఇవన్నీ మాటల్లో వింటుంటే బాగానే వుంటాయి.

భర్త ఆదరణ అనురాగం లేనిచోట వుండడం ఎంత కష్టమో మీకు తెలియదు. ప్రతి భార్యకి తన భర్త తనని ప్రేమించాలని, తనని అర్థం చేసుకొని సహకరించాలనుకుంటుంది. అలా జరగకుండా అతను అహంకారంతో ఆజ్ఞాపించి గుప్పిటలో బిగించాలని చూస్తే ఎంత సహనం ఓర్పు చూపాలంటారు? ఒక్కరోజు కాదు, నెలకాదు, ఎన్నాళ్లు అణిగిపడి ఉండాలి?" ఆమె ఆవేశం కోపంగా మారింది.

కామేశ్వరి ఒక్క క్షణం సూటిగా ఆమె వంక చూసింది. "చూడమ్మా సుగుణా నేనొక మాట అంటాను కోపం తెచ్చుకోకుండా ఆలోచించు. చూడు... ఇలా పెళ్లవగానే అలా నీ దాసుడయిపోవడానికి, నిన్ను సినిమాల్లో మాదిరి ఆరాధించడానికి, అతను చూడగానే పడిపోయేంత అందం నీలో ఏంలేదు. చూడడానికి అతి సామాన్యంగా ఉన్న నీవు అతన్ని అందంతో కాక నీ మంచి మనసుతో ఆకట్టుకోవాలి – తల్లిలా లాలించి, భార్యగా అనురాగంతో ముంచెత్తి అతన్ని ఆకట్టుకునే ప్రయత్నం నీవు చేశావా? ఇంతకీ మీ ఇద్దరి మధ్య కలతలు ఎందుకు వచ్చాయో చెప్పనే లేదు... అసలు కారణం ఏమిటి–" కుతూహలంగా అడిగింది కామేశ్వరి.

"ఎందుకేమిటి మేడమ్. ఆయనకి ఆడదానికి ఆత్మాభిమానం వుండడం, వ్యక్తిత్వం వుండడం నచ్చదు. ఇంచుమించు ఆయనతో సమానంగా సంపాదించినా నాకోసం స్వతంత్రంగా ఏదీ ఖర్చు పెట్టుకోకూడదు. ఉద్యోగం చేస్తున్నా అరగంట ఆలస్యంగా వచ్చే స్వతంత్రం లేదు. నాకు ఇష్టమైన చీర కొనుక్కొని, నా ఇష్టం వచ్చిన వాళ్లతో ఒక సినిమాకన్నా వెళ్లే స్వేచ్ఛలేని నేను ఆయన అదుపాజ్ఞలకి లొంగిపడి వుండలేదని – పొగరుబోతునని, భర్తంటే లెక్కలేదని, సంపాదన చూసుకుని విర్ర వీగుతున్నానని, కాపురం చేసే లక్షణాలు లేవని రోజూ ఏదో ఒక గొడవతో మనశ్శాంతి లేకుండా చేస్తే అలాంటి మనిషితో ఇంకో ఏభై ఏళ్లు ఎలా బతకమంటారు? అలా సర్దుకు బతకవలసిన ఖర్మ నాకు లేదు కనక ఇల్లు వదిలి వచ్చాను... ఏం నేను చేసింది తప్పంటారా?"

"తప్పు అనను. కాని, అతని వైపు నించి ఆ కోణంలో ఆలోచిస్తే ఒకటి బోధపడ్తోంది నాకు. అతను నిన్ను చేసుకోడానికి కారణం నీ అందం కాదు కనక నీ సంపాదన మీద ఆశ. అతనికి డబ్బాశ వుందని అర్థం అయ్యాక ఏడ్చేపిల్లాడికి కావాలన్న బొమ్మ చేతికిచ్చేస్తే కాసేపు ఆడుకున్నాక వాడే పక్కన పడేస్తాడు – అతని మనస్తత్వం గ్రహించి ఓ ఏడాది ఆ డబ్బుని అతనికే ఇస్తే ఆ యావ తగ్గేదేమో – అతన్ని

ఆకట్టుకోడానికి నీవు ఏవిధంగానూ ప్రయత్నించలేదు కదా, పైగా నీవు సంపాదిస్తున్న సంగతి అడుగడుగునా గుర్తు చేసి అతని అహాన్ని రెచ్చగొట్టి వుంటావు – ”

సుగుణమణి కోపంగా చూసింది. “అంటే నేనేం మనిషిని కాదు దేవతననా మీ ఉద్దేశం – ఆయనేమన్నా కోపం తెచ్చుకోకుండా పరమశాంతంగా వూరుకోడానికి – నాకు అభిమానం, పౌరుషం వుండకూడదనా?”

“ఉండవచ్చు. ఉంటాయి. అందరికీ – అదేం కాదనడం లేదమ్మా. ఈ నవల రాసిన నేను మా ఆయనతో దెబ్బలాడనని కాదు. మేమిద్దరం అరుచుకోమనీ కాదు. ప్రతి సంసారంలో ఇవి తప్పవు. ఇద్దరు మనుష్యులు కల్సి బతికేటప్పుడు ఏ మాట, ఏ కోపం రాకుండా ఎలా వుంటుంది? ఎటొచ్చీ నే చెప్పదలచింది నవలలో చెప్పింది ఏమిటంటే ... సంసారంలో వచ్చే చిన్న కలతలని సర్దుకోండి నైపుణ్యంగా ... కాపురాలు వదులుకుని భవిష్యత్తులో ప్రతి నిమిషం టెన్షన్‌తో బతుకుతూ ఏ అనుభూతులకి, స్పందనలకి నోచుకోకుండా బతికే వంటరి బతుకు కంటే కలతలు, కన్నీళ్లు ఉన్న సంసారమే బెటర్ ఏమో అన్న నిర్మల కథ చెప్పిన తరువాత అర్థం అయ్యేట్టు రాశాను. చూడమ్మా.... విద్యలా నీవింకా చిన్నదానివి, ఇవాళ ఉన్న ఈ వేడి, వాడి, ఆవేశం మరో పదేళ్ల తరువాత నీలో ఉండవు... అప్పుడు చేజార్చుకున్నది చూసుకుని పశ్చాత్తాపపడి ప్రయోజనం ఉండదు. ఆడదానికైనా మగాడికైనా డబ్బొకటే కాదు కావాల్సింది. నా అనేవాళ్లు ప్రతి దశలోను ఉండాలి. ప్రతి దశలోనూ, ప్రతిరోజూ మనిషికి మార్పుకావాలి. మార్పు లేని గానుగెద్దు జీవితం మనిషిని పిచ్చివాడిని చేస్తుంది. ఇదంతా నవలలో చెప్పాను. చెప్పిందే చెప్పడం విసుగనిపిస్తుంది నీకు... నాకూ ... నవల చదివావు గనక ఇంత కంటే ఏం చెప్పను.”

“ఆ పాయింటే నేనూ అడగాలనుకుంటున్నానండీ... జీవితానికి పెళ్లి ముఖ్యమే గాని, పెళ్లే జీవితం కాదు కదండీ ... జీవితంలో వంటరితనం లేకుండా ఉండాలంటే మొగుడే ఉండాలంటారా – మీరు నవలలో నిర్మల జీవితం చేజార్చుకుని వంటరి బతుకుతో పశ్చాత్తాప పడిందని రాశారు. ఏం మొగుడు, సంసారం లేకపోతే జీవితం వ్యర్థమయి పోయినట్టు ఎందుకనుకోవాలి? చెయ్యాలంటే ఎన్ని మంచి పనులు లేవు? సంఘసేవ చెయ్యొచ్చు – అనాథలని ఆదరించవచ్చు – వృద్ధులకి ఆశ్రమం కట్టించి నడపవచ్చు. అనాథ బిడ్డలని చేరదీసి పెంచుకుని కాలక్షేపానికే లోటు రాకుండా చేసుకోవచ్చు. కావాలనుకుంటే వంటరితనం పోగొట్టుకోవడం మన చేతిలో

పని అంటాను నేను". ఇప్పుడేం చెబుతారన్నట్టు గర్వంగా సవాల్ చేసింది సుగుణమణి. కామేశ్వరి వేదాంతిలా నవ్వింది.

"చూడమ్మా సుగుణా, ఇక్కడ వికలాంగుల శరణాలయం ఒకటుంది. అందులో సిస్టర్ నాకు బాగా తెలుసు. ఆవిడకి నేను చెపుతాను గాని, ఒక వారంరోజులు నువ్వక్కడికి వెళ్లి వాళ్లతో కలిసి వాళ్లకి సేవలు చేసి వస్తావా? నీకు మంచి కాలక్షేపం – ఒంటరితనం బాధ ఉండదు." సుగుణమని తెల్లబోయి చూసింది. ఒక్క క్షణంలో మొహంలో రంగులు మారాయి. కామేశ్వరి మాటల్లో వ్యంగ్యం అర్థమైంది. జవాబుకి తడబడింది.

"ఇప్పుడు నాకేం కాలక్షేపం లేదని నేననలేదే – నేనేం ఒంటరిగా ఫీలవుతున్నా నన్నానా?

కామేశ్వరి నవ్వింది – "చూడమ్మా యీ అనాథ సేవలు నీవు నేను అందరూ చెయ్యగల్గితే ఇన్ని వేలమంది లక్షలమందిలో ఏ 'మదర్‌థెరిసా'లాంటి వారి పేరు ఒక్కటో రెండో మాత్రం ఎందుకు వినిపిస్తాయి? అలా ఏ అనాథాశ్రమం, ఏ అంధులకు, కుష్టురోగులకి, వికలాంగులకి సేవ చెయ్యడం అంటే మాటలు కాదు – దానికి చాలా పెద్ద మనసుండాలి. అలాంటి నిత్య సేవకి ఎంతో త్యాగ బుద్ధి, సహనం, శాంతి, ఓర్పు అన్నింటినీ మించి నిస్వార్థ బుద్ధి వుండాలి. రోగులని, వికలాంగులని, అనాథలని అసహ్యించుకోకుండా చేరదీసి ఆ సేవలో లీనమయి మనసా వాచా నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి సంఘసేవ అందరూ చేస్తే అందరూ మదర్ థెరెసాలయ్యేవారు. సంఘసేవ అంటే ఏ గాంధీ జయంతినాడో ఏ అనాథాశ్ర మానికో వెళ్లి మిఠాయిలు పంచి, ఫోటోలు తీయించుకోవడం కాదు – ఒక్క రోజు నీవలాంటి చోటికి వెళ్లి అసహ్యం లేకుండా వాళ్లలో ఒకరిగా కల్సి వాళ్లకి సేవలు చేసిరా చూద్దాం – అలా చెయ్యగల్గిన వాళ్లు మహనీయులు అవుతారు..." సుగుణమణి ఆ మాటలకి మొహం మాడ్చుకుంది.

"చూడమ్మా నీకింకా చిన్నతనం. సంసారం వదులుకుని వచ్చి పట్టుమని ఆరు నెలలు కాలేదు. అందుకే నీలో ఇంకా ఆ వేడి తగ్గలేదు. ఈరోజు నీ భావాలు ఇంకో పదేళ్లు పోయాక ఉండవు. ఈ వేడి ఉండదు. ఈ ఆవేశం స్థానంలో పశ్చాత్తాపం చోటుచేసుకోవచ్చు. మొనాటనస్ జీవితం కంటే కాస్త కలతలున్న సంసారం నయమేమోనని నిర్మలలా నీవు పశ్చాత్తాపపడకూడదని నా కోరిక... సినిమాలలో

పుస్తకాలలో మాదిరి ఏ భర్తా ఉండడు. నిజ జీవితంలో ప్రతి దశలోనూ ఎడ్జస్ట్‌మెంట్ అనే పదానికి తప్ప ప్రేమలు, అనురాగాలు అనే పదానికి తావుండదు. నీ తల్లి వయసున్న దానిని, ఓ రచయిత్రిగా కాక పెద్దదానిగా చెప్తున్నాను. మరో చాన్సు యిచ్చి చూడు ఆయనకి – విద్యలా తెలివిగా ప్రవర్తించి మారినట్టు ఆయనకి నమ్మకం కల్గించు – అప్పటికీ మారకపోతే నీవెన్నుకున్న దోవ నీకుండనే ఉంది. అమ్మా సుగుణా నీవు ఎన్నుకున్న దారి నీ గమ్యం చేర్చదు. ఆ దారంట వెడితే అవస్థల పాలవుతావు. ఆ దారి ఎటుపోతుందో తెలియదు. ఇది సరి అయినదారి అని మంచి చెడు తెలియచెప్పి ఆవేశంలో ఉన్న యువతులకి నచ్చజెప్పడం తప్పంటావా? రచయిత్రిగా నాబాధ్యత అది కాదంటావా – నీలాగే కొంతమంది – ఆడవాళ్లకి పిరికి మందు పోశారు అని ఉత్తరాలు రాశారు. 'ఆడవాళ్లూ ... భర్త ఏదన్నా అంటే పడకండి. అమ్మాయిలూ, సంసారాలు వదులుకుని లేచిపోండి' అని రాస్తే పాఠకులు నన్ను కాకుల్లా పొడిచేవారు. చేతనయితే మంచి చెప్పాలిగాని, అసలే ఆవేశంలో ఏం చేస్తున్నదీ తెలియని వారిని ప్రోత్సహిస్తున్నట్టు నేను రచయిత్రిగా చెయ్యకూడదు. అన్యాయానికి తిరగబడాలి కాని, భార్యా భర్తల విషయంలో న్యాయన్యాయాలు కాదు కావాల్సింది. పరస్పర అవగాహన, పరస్పర గౌరవం. ఆ గౌరవం భర్త ఇవ్వకపోతే యిచ్చేట్టు చేయడానికి ప్రయత్నించండి. అంత తొందరగా ఏ నిర్ణయానికి ఆవేశంతో రాకండి అని ఓ రచయిత్రిగా నేను చెప్పడం సబబో కాదో నువ్వే చెప్పు."

ఏకధాటిగా ఉపన్యాసం ఇచ్చి అలిసిపోయినట్టు కుర్చీలో వెనక్కి వాలింది కామేశ్వరి. సుగుణమణి మొహం అవమానంవల్లో, సిగ్గు వల్లో నల్లబడింది. జవాబు ఏదో చెప్పాలని తడబడి సర్దుకుని నోరు తెరిచే సరికి కాలింగ్‌బెల్ విన్పించింది. కామేశ్వరి లేచి వెళ్లి తలుపు తీసింది. గుమ్మం అవతల ఓ యువతి, యువకుడు. అపరిచితులు – వీళ్లూ ఫాన్స్ కాదు గదా అనుకుంది.

"నమస్కారం అండీ, మీరు రచయిత్రి కామేశ్వరిగారేననుకుంటాం... మిమ్మల్ని కలుసుకోవాలని వచ్చాం. సారీ డిస్టర్బ్ చేయలేదు కదా... మీ నవల చదివి..." అతనన్నాడు.

కామేశ్వరి నవ్వుతూ "ఇవాళెంత సుదినం. ఓ నవల చదివి పాఠకులు రియాక్టయి రచయిత్రితో మాట్లాడాలని రావడం నిజంగా సంతోషించదగ్గ విషయం. రండి లోపలికి, ఇదిగో ఈమె సుగుణమణి అని నవల చదివి మాట్లాడాలని వచ్చారు. ఇందాకటి నించీ అదే చర్చిస్తున్నాం."

"నాపేరు రవి అండీ, ఈమె నా మిసెస్ కృష్ణవేణి. ఇద్దరం బ్యాంక్‌లో ఆఫీసర్లం మేడం... మీ నవల చదివి మా ఆవిడకి జ్ఞానోదయం కలిగి ..." నవ్వుతూ ఏదో అంటున్నాడు.

"ఇదిగో జ్ఞానోదయం నాకేనా ... మీకూ అయింది..." అమ్మాయ్ గయ్‌మంది మొగుడి మీద.

"అదిగో మళ్లీ దెబ్బలాటకి దిగకు. మనం సంధి కుదుర్చుకుని ఇంకా రెండు రోజులన్నా కాలేదు. మేడమ్... మేం ఇద్దరం పంతాలకి, పౌరుషాలకి పోయి ఇద్దరికిద్దరం బిగుసుకుని ఆరు నెలలుగా విడిగి ఉన్నాం. ఆవడ అలిగి పుట్టింటికి పోయి కూర్చుంది. నేనెందుకు పిలవాలన్న మగ అహంతో నేను కూర్చున్నాను..."

".... ఆ సమయంలో మీ నవల 'జీవితం చేజారనీయకు' చదివాను. ఆ నవల్లో విద్యలా నేనూ నటించి ఆయన్ని మార్చగలనో లేదో చూడాలన్న పంతం వచ్చింది. పరీక్షించి మారకపోతే రచయిత్రిగారూ ఇలాంటి అభూత కల్పనలు రాయకండి, మంత్రాలకి చింతకాయలు రాలవు అని మీతో దెబ్బలాడాలనుకున్నాను. ఇదంతా ఆయనకి తెలీదనుకోండి."

"ఫార్చునేట్లీ... నేను బుద్ధిమంతుడినయిపోయాను. మా కాపురం కుదుటపడింది. అయితే మా ఆవిడకి తెలియనిదొకటుంది... ఆ నవల మా ఫ్రెండొకడు తెచ్చి ఇస్తే నేనూ చదివాను. ఆవిడ రాగానే ఎందుకు వచ్చింది, ఏ ప్లానుతో వచ్చిందో నాకర్థం అయినా తెలియనట్లు నటించాను. అఫ్‌కోర్సు – అలాంటి అవకాశం కోసం నేనూ చూశాను. కనుక ఏం తెలీనట్లు నటించి... మారినట్టు నమ్మించాను." అతను చిలిపిగా నవ్వాడు భార్యని చూసి... ఆ అమ్మాయి ఒక్క క్షణం తెల్లపోయింది. తరువాత ఒక్కసారిగా "యూ చీట్..." అని అరిచి కోపం నటించి కొట్టబోయింది.

"ఇదిగో ఇలా బిహేవ్ చేస్తే మళ్లీ రాం, రాం నీకు నాకు." వాళ్లిద్దరి చిలిపి కయ్యం చూసి కామేశ్వరి నవ్వింది.

"మేడమ్ మేం ఇద్దరం మీకు థాంక్స్ చెప్పాలని వచ్చాం. మమ్మల్ని కలిపిన మీ నవలకి, అది రాసిన మీకు మా కృతజ్ఞతలు... ఇన్నాళ్లు సామాజిక స్పృహ ఉన్న రచన అంటే ఏమిటో అర్థం కాలేదు. అది ఇప్పుడు తెలిసింది..." అతను ఆ అమ్మాయి మనస్ఫూర్తిగా అన్నారు. కామేశ్వరి ఆ మాటకి చలించింది. కళ్లు చెమర్చాయి. "ఇంతకంటే ఓ రచయిత్రికిచ్చే అమూల్యమైన కానుక ఏముంటుంది? ఓ రచన

వల్ల ఒక కాపురం కుదుటపడిందంటే రచనకి, నాకు సార్ధకత చేకూరింది. థాంక్స్... మీలాంటి దంపతులందరూ మరొక్కసారి ఆలోచిస్తే... చూడమ్మా సుగుణా, విన్నావు కదా వీళ్లు చెప్పింది. నీవు ఒక ఛాన్సు ఇచ్చి చూడు. ఇది రచయిత్రిగానే కాక, నీతల్లిలాంటి దానిగా చెప్తున్న మాట." సుగుణమణి భుజం తట్టి అంది కామేశ్వరి.

సుగుణమణి ఇంతసేపూ ఓడిపోయిన దానిలో తలదించుకుంది. జవాబిచ్చేందుకు మాటలు రాలేదు. చాచిన చేతి వంక ఒకసారి చూసి కామేశ్వరి చేతిలో చెయ్యివేసి గబగబా వెళ్లిపోయింది.

* * * * * *

సుగుణమణి మళ్లీ వచ్చి చెప్తుందనుకున్న శుభవార్త కోసం కామేశ్వరి ఎదురు చూసింది. ఏడాది దాటినా ఆ వార్త వినలేదు. ఓరోజు హఠాత్తుగా సుల్తాన్‌బజార్లో చేతిలో చంటిపిల్లతో దూరంగా కన్పించింది. గుర్తుపట్టి పిలిచేలోగా ఆమె వెళ్లి పోయింది. ఆమెతో మాట్లాడలేకపోయినందుకు బాధపడలేదు కామేశ్వరి. తెలుసు కోవాలన్నది తెలుసుకుని తృప్తిగా ఫీలయింది.

*(వనిత మాస పత్రిక – 1990 ప్రాంతం)*

# మానవత్వం మరువకు

**హెచ్**.ఐ.వి. అంటే అర్థంకాక అయోమయంగా చూసిన కవితని చూసి, ఆమెకి అర్థం కాలేదన్నది అర్థం అయి 'ఎయిడ్స్' అంది డాక్టరు రిపోర్టు చూపిస్తూ.

కవిత భయంతో బిగుసుకుపోయి పెద్ద పెద్ద గుడ్లేసుకుని డాక్టరువంక చూసింది. కళ్లలో గిర్రున నీరు తిరిగింది. అప్రయత్నంగా కళ్లనిండా నీరు కారుతుంటే బిక్క చచ్చి డాక్టరు వంక వెర్రిగా చూసింది.

"అలా ఏడవకు. ఏం భయం లేదు... ఇప్పుడు బోలెడు మందులొచ్చాయి. ప్రభుత్వం మందులు ఉచితంగా ఇస్తుంది. మందులు రోజు వేసుకుంటూ, బలమైన ఆహారం, అంటే పాలు, గుడ్డు, పండ్లు తింటూ, రోజు నడక, వ్యాయామం చేస్తూ ఆరోగ్యం కాపాడుకుంటే బాగయిపోతుంది." మందులు ఎక్కడ తెచ్చుకోవాలో చెప్పి రిపోర్టు కాగితాలు చేతికి యిస్తూ... "చూడు. ఈ హెచ్.ఐ.వి. తగ్గాలంటే రోగంతో పోరాడే శక్తి శరీరానికి వుండాలి. అప్పుడు అదే పారిపోతుంది జబ్బు. ముందు మనసుకి భయం పోవాలి. యిదీ అన్ని జబ్బుల్లాంటిదే... తగ్గిపోతుంది. ఎయిడ్స్ అంటే మరణమే అనుకోనక్కరలేదు." డాక్టర్ ఓదార్పుతోపాటు ధైర్యం చెప్తూ అంది.

పాలు, గుడ్డు, పండ్లు, బలమైన ఆహారం – గంజికే లేనిదానికి యివన్నీ తినే అవకాశం వుంటే యీ సమస్య ఎందుకు తెచ్చుకునేది, వళ్లమ్ముకుంటే గాని నోట్లోకి వేళ్లు వెళ్లని స్థితి అన్నది డాక్టరమ్మకి తెలియదేమో! కూటికి లేని వాళ్లంతా వళ్లమ్ముకోరు, కాయకష్టం చేసుకు బతుకవచ్చుగా అనచ్చు. తన ఖర్మ కాలి యీ ఊబిలోకి దిగబడింది. దిగబడ్డాక గాని పైకి రాలేం అన్నది తెలియలేదు. కావల్సిందే! తనలాంటి వాళ్లకి

యీా శాస్తి! తల్లిదండ్రులని కాదని గడపదాటిన అమ్మాయిలకీశాస్తి కావలసిందే. చేతిలో రిపోర్టు పట్టుకుని మందులిచ్చే వైపు జీవచ్ఛవంలా నడుచుకుంటూ వెళ్లింది. "చూడమ్మాయి... " వెనకనించి మళ్లీ డాక్టరు పిలిచింది. "చూడు అందరూ యిది అంటరాని జబ్బని, ఒకరి నుంచి ఒకరికి వస్తుందనుకుంటారు. అదేం లేదు. అందరిలా మామూలు జీవితం గడపవచ్చు. కేవలం సెక్స్ ద్వారా, రక్తం మార్పిడి ద్వారా వస్తుంది. ఆ రెండింటితో జాగ్రత్త పడితే చాలు. ఊరికే భయపడి ఏడుపులు, రాగాలు పెట్టి అందరికీ చెప్పుకుంటే నిన్ను వెలేసినట్టు చూస్తారు. మళ్లీ మామూలవచ్చు." అంది. శుష్కహాసం చేసి వెనుదిరిగింది కవిత.

డాక్టరు చెప్పిన జాగ్రత్తలో ఒకటి పాటించగలదు! రెండోది... అదే తన జీవనం కదా... దానికి దూరంగా... ఆలోచిస్తుంటే.. కసి, కోపం, కక్ష, పగ, దుఃఖం, నిస్సహాయత... తననీ దుస్థితిలో పడేసిన మగాళ్లందరిమీదా కసి... మగజాతినంతటిని నల్లుల్లా కాలికింద నలిపేయాలన్నంత కసి... తను యిలా అవడానికి కారణం అయిన మగాళ్లందరినీ తలలో పేలల్లా ఏరి, గోళ్లతో నొక్కి పారేయాలన్నంత కసి... పురుషజాతినంతటినీ కాళ్లకింద తొక్కి పెట్టాలన్నంత ఆవేశం. కారుతున్న కన్నీళ్లు తుడుచుకోకుండానే అలా నడిచి నడిచి ఇల్లు చేరింది. అలసిపోయి, వాడిపోయి, నీరసంగా యిల్లు చేరి గది తాళం తీసి మంచానికి అడ్డం పడిపోయింది నిస్త్రాణగా.

చప్పుడు విని పక్కగది కనకం లోపలికి వచ్చి, "అక్కా! వచ్చావా... యీా రోజన్నా రిపోర్టు వచ్చిందా? డాక్టరేమన్నారు? నీర్సంగా ఉందంటే ఏం అన్నారు?" గబగబా ఆరాటంగా ప్రశ్నలు గుప్పించింది. కవిత కళ్లు తెరిచి నీర్సంగా నవ్వింది. "కాసిని మంచినీళ్లు తెద్దూ" అంది లేచే ఓపిక లేనట్టు. "అయ్యో... పొద్దుటనగా పోయావు తిండి తిప్పలు లేకుండ. ముందు మంచి నీళ్లు తాగు. అన్నం వండాను నీకోసం కూడా. పట్టుకొస్తానుండు." అంటూ గ్లాసు అందించి తన గదిలోకి వెళ్లింది. పళ్లెంలో అన్నం పెట్టి, యింత టమోటా వేసి పల్చగా చేసిన పప్పు వేసి తీసుకొచ్చి "లే లే.... ముందు అన్నం తిను." అంది. కవిత పెట్టిందే చాలన్నట్లు ఆబగా తిని.. ప్రాణం కుదుటపడ్డాక "అయిన వాళ్లందరినీ దూరం చేసుకున్నా. నీవే మిగిలావు." అంటూ చీర కొంగుతో కళ్లు తుడుచుకుంది. "సర్లే. మనం ఒకరికొకరం తోడు. మన బతుకుల్లో అయినవారంతా వుండరులే."

"సర్లే చెప్పు. డాక్టర్ ఏమన్నారు. మూడు నెలలుగా రిపోర్టు రాలేదంటూ

తిప్పుతున్నారు. ఏవో మందు బిళ్లలు యిస్తూనే వున్నారు.. యిప్పుడేమన్నా మందు యిచ్చారా?"

కవిత కళ్లు వాల్చుకుంది అరక్షణం... "ప్రత్యేకం జబ్బు ఏం లేదంటారు. నీర్సంగా వున్నావు. పాలు గుడ్డు పండ్లు తిని బలం పుంజుకోవాలన్నారు. మందు ఇచ్చారు. మందులిస్తారట వాళ్లే. మధ్య మధ్య వచ్చి పరీక్షలు చేయించుకుంటూ ఉండాలంటా. బలం లేకపోతే ఏదో జబ్బు వస్తుంది జాగ్రత్త అంటూ చెప్పారు.. తిండే గడవక పోతే గుడ్లు, పాలు యివన్నీ ఎలా కనకం?" దిగులుగా అంది. కనకం నవ్వింది. కన్నుగీటి "యింకో రెండు గంటలు కష్టపడితే సరి..." అంది. ఎలకకి ప్రాణసంకటం పిల్లికి చెలగాటం అంటే యిదేనేమో? "కనకం, ఏం బతుకే యిది. నామీద నాకే అసహ్యం వేస్తూంది. పంది బురదలో దొర్లుతూ అదే పన్నీరనుకుంటూ బతుకుతున్నట్టు వుంది మన బతుకు. చావు రావాలని ఎన్ని సార్లు ప్రయత్నించినా మృత్యుదేవతకీ నన్ను ముట్టుకోవాలంటే అసహ్యమేనేమో!" గొంతు బొంగురుపోయింది కవితకి.

"సర్లెద్దూ. ఎన్నిసార్లు చెప్పుకున్నా యివే ముచ్చట్లు. నే పోతున్నా. కాసేపు నడుం వాల్చకపోతే నైటుషిప్టు ఎలా చేస్తాం" విలాసంగా నవ్వుకుంటూ వెళ్లిపోయింది.

ఎండలో నడిచి, అలసిపోయి, కాస్త అన్నం కడుపులో పడగానే మత్తులాంటి నిద్ర ఆవహించింది కవితని. అలా ఎంతసేపు నిద్రపోయిందో....

ఆ గాఢనిద్రలో కలలు! పీడకలలు! తోడేళ్లు, నక్కలు మీదపడి పీక్కుతింటున్నాయి. అవి జంతువుల మొహాలు తగుల్చుకున్న మనుషులు! వికృతంగా, వికటాట్టహాసం చేస్తూ తనవంటి మీద గుడ్డలన్నీ పీలికలు చేస్తూ, యిష్టం వచ్చినట్టు వళ్లంతా కుళ్లబొడుస్తూ, అందిన చోటల్లా రక్తం జుర్రుకుంటున్నాయి... నొప్పి, బాధ...తప్పించు కునేందుకు, అరుస్తూ... కేకలు పెడ్తూ... చెమటలు కక్కుతూ కళ్లు తెరిచింది. చీకట్లో ఓ అంబోతు తనమీద... ఒక్క తన్ను తన్నింది పొట్టలోకి "ఎవడ్రా నీవు... నీ జిమ్మడ..." "ఏటే కాళ్లు చేతులు తన్నుకుంటూ... ఊపిరి అందక గిజగిజలాడుతూ... ఏసాలు ఏస్తనావు... నన్నే తంతావుటే...." జుత్తు పట్టుకుని గుంజాడు.

"ఒరేయ్, నీ పెళ్లాం అనుకున్నావట్రా... తిన్నగా వచ్చి పక్క ఎక్కడానికి. లేరా, ముందు బయటకెళ్లు...." శివంగిలా అరిచింది, మంచం మీదనించి లేస్తూ.

"ఏటి, వూరికే తొంగోడానికొచ్చాననుకున్నావేటి, ఆ కనకం ఏభై నోటుచ్చుకుంది.

అదే ఎల్లమంది లోపలికి... పడేయ్ నా ఏభై, నీలాంటి వాళ్లు పది రూపాయలకొస్తారు. తేడబ్బు" పౌరుషంగా అరిచాడు. "పోరా – పో – దానిదగ్గరే ఆ డబ్బిచ్చుకో. యియాల నాకు వళ్లు బాగులేదు... పో...." అరిచి నీర్సంగా మంచంలో కూలబడింది.

ఇంతజబ్బులో, యింత నీర్సంలో కూడా... 'ఛీ... తన బతుకు... చావాలి ఇంక బతకడంలో అర్థం లేదు. పాతికేళ్లకే నూరేళ్ల అనుభవాలన్నీ పూర్తయ్యాయి... యీ 'ఎయిడ్స్' తనని ఎలాగో తినేస్తుంది... డాక్టరంటుంది నిరాశపడనక్కరలేదు, ధైర్యంగా పోరాడాలి, గెలవాలి అంటూ ప్రతిసారి ధైర్యం చెపుతుంది. మాటలతో బతుకులు వెళ్లమారవు. ధైర్యం ఎలా వస్తుంది. చేతిలో డబ్బుంటే, వంట్లో శక్తి వస్తుంది. పోరాడే పటిమ వస్తుంది. అన్నింటికి డబ్బు కావాలి. దానికోసం నీచపు బతుకు బతికి ఆఖరికి వాతబడింది. ఇంకెక్కడి ధైర్యం!' మళ్లీ మగత నిద్రలోకి జారుకుంది....నిద్రలో కలలాంటి నిజాలు! "ఏయ్. కవిత ఆగు ఎందుకలా వెళ్లిపోతావు పిలుస్తుంటే".. వెనకనుంచి రవి పిలుపు. మామిడి తోపులో కాపలా కాసేవాడు, స్కూలునుంచి వచ్చే టైముకి రెడీగా సైకిలుతో నిల్చునేవాడు. "ఏయ్ చేయి వదులు, అరుస్తా, ఎందుకిలా నా వెంట పడ్తావ్.. వదలమంటుంటే..' ఆ మాటల్లో బిగువు సడలుతోంది రోజు రోజుకీ. తను రవి చూపుల తూపులకి లొంగిపోతోంది. రెండు నెలలనించి వెండబడ్తున్న రవి కోపగించినా, కసిరినా, వెంటపడే అతను వద్దనుకుంటూనే దగ్గిరవుతూ...దగ్గిరవుతూ.. ఇద్దరి మనసులే కాక శరీరాలు కల్సిపోయేంత దగ్గిరయ్యారు. ఎన్నాళ్లు.. తొమ్మిదో క్లాసులో మొదలైన ప్రేమాయణం పదో క్లాసు పరీక్షలయ్యే వరకూ.. పరీక్షలయ్యాక మామిడి తోపు నుంచి రాకపోకలు... రవి ధైర్యానికి మెచ్చుకోవాలా, యిరుగు పొరుగు చూసి తల్లికి చెప్తారేమోనని భయపడాలా... జరగాల్సింది భయపడాల్సింది జరిగింది.

ఇంట్లో తన్నులు, కట్టడి... స్కూలు ఫైనలు తప్పింది. రవి 'పారిపోదాం' అంటాడు. అమ్మో అనుకుంది. ఆఖరికి రవి సమ్మోహనాస్త్రం నుంచి తప్పించుకోలేకపోయింది. పారిపోయింది ఇంట్లోంచి. తరువాత కథ మామూలే. ప్రేమ పొరలు తొలగిపోయాక గడపదాటిన ఆడపిల్ల, డబ్బు సంపాదించే దారి తెలియని ఆడపిల్ల ఎక్కడికి చేరాలో అక్కడికి చేరింది. రవి మాయమాటలు నమ్మినందుకు ఎన్నివందలసార్లు తనని తను శపించుకుందో! మగవాడి మోజు నీటిబుడగలాంటిదన్న నిజం తెలిసే సరికి బతుకు సానికొంప చేరింది. అమ్ముకుని బతకడానికి వళ్లు తప్ప ఏం లేని ఆడపిల్ల అదే అమ్ముకుని... అమ్ముకుని రోగాల బారినపడి... ఆఖరికి.. నిద్రలోనే వెక్కి వెక్కి

ఏడ్చింది.  తనిలా ఏడవడం కాదు. ఏడుస్తుండగా మెలకువ వచ్చింది. ఎంత ఏడ్చినా ఓదార్చే వారు లేరన్న సత్యం తెలిసి మరోసారి ఏడ్చింది. తనిలా ఏడవడం కాదు. తనని యిలా ఏడ్పించిన మగాళ్లంతా ఏడవాలి, వాళ్లని ఏడ్పించి కక్ష తీర్చుకోవాలి. మగాళ్లని ఏడిపించాలంటే, ఆడదాని శరీరంతో ఆడుకునే అందరినీ శిక్షించాలి. తనకొచ్చిన ఎయిడ్స్ వాళ్లకీ రావాలి. కృంగి కృశించి చావాలి. కళ్లు తుడుచుకుంది ధృఢ నిశ్చయంతో... తలగడ కింద పెట్టిన రిపోర్టు కాగితాలు తీసి చూసింది. తనకొచ్చిన ఇంగ్లీషు ముక్కల పరిజ్ఞానంతో రిపోర్టు చదివింది. ఇదే తన ఆయుధం. తనని యీగతికి తీసుకొచ్చిన మగవాళ్లని శిక్షించే ఆయుధం ఇదే. తను మందులు వేసుకోదు. బతికినన్నాళ్లు బతుకుతూ తనతో ఆడుకునే అందరినీ ఆడిస్తుంది. వాళ్లంతా ఈ ఎయిడ్స్ అంటించుకుని కుళ్లి కుళ్లి ఏడుస్తూ చావాలి!

"అక్కా... ఏమిటి మధ్యాహ్నం పడుకున్నదానివి తెల్లారి లేచావు. మధ్యలో ఆడెవడో వస్తే డబ్బులు లేవన్నావని తప్పక పంపించా. తన్నావుట గదా. మరి ఎట్టా బతకాలనుకుంటున్నావు? నీవట్టా సేస్తే రేపెవడొస్తాడు? తినే నాలుగు ముద్దలన్నా దొరకాలి కదా. పైగా డాక్టరమ్మ చెప్పింది బలంగా తినాలని. ఏం పెట్టి తింటావు?" కనకం టీ గ్లాసు చేతికందిస్తూ అంది కోపంగా. కవిత మాట్లాడలేదు. ఊదుకుంటూ టీ తాగింది సాలోచనగా.

"ఏంటో వంట్లో నీర్సంతో పిచ్చి కోపం వచ్చింది. నిద్దట్లో ఆంబోతెదవని చూసి బయపడ్డానే.." సంజాయిషీ యిస్తున్నట్టు గొణిగింది.

"సర్లే.... నే బజారుకి పోతన్నా. యింట్లో సరుకులు తెచ్చుకోవాలి. నీకేమన్నా కావాలా..."

"నాదగ్గర డబ్బులు లేవు.." గొణిగింది. "సర్లే... నే తెస్తా. తరువాతివ్వు" కనకం బయటికెళ్లింది.

కనకం ఉప్పు, పప్పు, బియ్యం తెచ్చుకుని యిల్లు చేరేసరికి గుమ్మం ముందే రిపోర్టు కాగితాలు చించి ముక్కలు ముక్కలు చేసినవి యిల్లంతా పరుచుకున్నాయి. వాటిమధ్య మాత్రల బిళ్లలు. కవిత స్నానం చేసి జుత్తు చిక్కు తీసుకుంటోంది.

"అక్కా, ఏమిటి మందులన్నీ యిలా పారేశావు. అయ్యో, ఈ రిపోర్టు కాగితాలు చించేశావు. యీ కాగితాలు పట్టుకెళ్లందే మళ్లీ చూడరు గదా" ఆందోళనగా అడిగింది. "ఇంక మళ్ళీ వెళ్లను. ఏ మందులూ వేసుకోను. అందుకే పారేశాను."

"అక్కా!" అయోమయంగా చూసింది కనకం.

"కనకం.. నాకింక బతకాలని లేదు. బతుకుపోరాటం చేసే శక్తి లేదు. వున్నన్ని రోజులు నా దగ్గరకొచ్చే మగాళ్లకి సంతోషం పంచుతాను. ఏ భోగం కోసం వస్తారో అది భోగం కాదు రోగం అన్నది వాళ్లకి అర్థమయ్యేట్టు చేయడమే నా ధ్యేయం." కసిగా పెదాలు బిగపట్టి కటువుగా అంది. "నా ఆస్థి అందరికీ దానం ధర్మం చేస్తానంటున్నాను." తెల్లపోయి చూస్తున్న కనకంతో నవ్వుతూ అంది.

"ఆస్థా, నీకున్న ఆస్థేమిటి?"

"పోయేముందు వున్నదేదో నలుగురికీ పంచుతారు కదా..." మళ్లీ నవ్వింది.

ఆమె మొహంలో వికృతానందం చూసి కనకం కలవరపడింది. "అక్కా" అంది గాబరాగా. "ఏమైంది నీకు, అలా మాట్లాడుతున్నావేమిటి?"

"నీకర్థం కాదులే" విలాసంగా నవ్వింది.

"కనకం.. నీకో రహస్యం చెప్పనా. నాకొచ్చిన జబ్బు ఏంటో చెప్పనా. చెబితే నాకు దూరం అవ్వనని ఒట్టేయి."

కనకం కళ్లు వాల్చుకుని "నీవేం చెప్పక్కరలేదు. నాకు తెలుసు ఆ సంగతి. నీ రిపోర్టు కాగితాలు నేను మొదటిసారి చూసినప్పుడే నాకు తెలుసు."

"నీకు తెలుసా? ఎలా?"

"నాదీ నీలాంటి కేసే కదా! అక్కా! యిన్నాళ్లు జబ్బు సంగతి నేనెవ్వరికీ చెప్పకుండా దాచిపెట్టాను. చెబితే నన్ను అందరూ దూరం పెడతారని, నా దగ్గరకి ఏ మొగాడూ రాడని..." తలదించుకు అంది. "అంటే నీకు హెచ్.ఐ.వి. ఉందని తెలిసీ...." తెల్లబోతూ అడిగింది కవిత.

కనకం నిర్లక్ష్యంగా నవ్వింది. "చావనీ వెధవల్ని! నాకేం బాధ. నా డబ్బులు నాకు కావాలి బతకడానికి. మనల్ని వాళ్లు సంతోషానికి వాడుకోవడం లేదూ. మనమెందుకు వాళ్లకోసం బాధపడాలి." కసిగా అంది.

కవిత మొహంలో రంగులు మారాయి. మంచం మీద కూలబడింది. "ఏయ్ వంట చేసుకోవాలి. అదిగో అక్కా మనం ఏదీ ఆలోచించకూడదు. బతికినన్నాళ్లు హాయిగా రెండుపూటల తిండితినడమే మన పని. జల్సాగా వుందాం. తక్కిందంతా మనకి అనవసరం. అదిగో నీ సామాను బిల్లు" తన గదిలోకి వెళ్లింది కనకం.

ఆ రాత్రి... నిద్రపట్టక దొర్లుతూనే వుంది కవిత. తన ఆలోచన ఎంత సబబు? తన ఆలోచనా ధోరణి యిలా వుందేమిటి! తన నిర్ణయంతో, అవతలి వాళ్లమీద కసి తీర్చుకోవడం కోసం... ఛా... తనీ పని ఎలా చేయగలదు? కనకం చేస్తోంది కదా! కనకంలాంటి వాళ్లు ఎంతమంది ఉన్నారో.. రోగం సంగతి తెలియక కొందరు.. తెలిసి గతిలేక కొందరు... ఒకరి ద్వారా ఒకరు... ఇలా ఎంతమంది రోగాన పడుతున్నారో... దేశం నిండా ఈ రోగాన్ని తనలాంటి వాళ్లు అంటించి ఒదులుతున్నారు. తనూ యాభై మందికో... వందమందికో... గుండె దడదడలాడింది.

హఠాత్తుగా కళ్లముందు రెండేళ్లక్రితం చనిపోయిన కరీం భార్య, కొడుకు గుర్తుకొచ్చారు. తాగుబోతు కరీం లారీ డ్రైవరు. తెగ తాగేవాడు. ఆఖరికి హెచ్.ఐ.వి. సోకి శవం లాగా మారాడు. పిల్లలిద్దరికీ జబ్బు సోకిందని పరీక్షల్లో తేలింది. కరీం భార్య ఫాతిమా సగం చచ్చింది. ఆ బాధలు పడలేక అందరూ... అబ్బో ఆ విషయం గుర్తుకొస్తే ఇప్పటికీ వెన్నునుంచి చలి పాకుతుంది. బస్తీ అంతా భయంతో బిక్కచచ్చిపోయారు. భయంతో ఆసుపత్రికి పరుగెత్తి పరీక్షలు చేయించుకున్నారు. తమ బస్తీలోనే మరో ఇద్దరు మగాళ్లకు ఉందని పరీక్షల్లో తేలితే ముందుగా మేల్కొని మందులతో తగ్గించుకున్నారు. మళ్లీ ఇప్పుడు తనకి, కనకానికి... తమ వల్ల ఇంకా ఎంతమందికి ఇది అంటుకుంటుందో! మగాళ్ల మీద కోపంతో తమ నిర్ణయం మగాళ్లనే కాదు... ఆడవాళ్లు, వాళ్లు కన్న పిల్లలూ అందరూ బలౌతారు కదా! అభం శుభం తెలియని పిల్లలు, ముందు తరాలు ఈ రోగంతో బాధ పడాలని కోరుకోవటం ఎంత రాక్షసత్వం, ఎంత ఆత్మవంచన!

చించేసిన రిపోర్టు కాగితాలవంక చూసి... మళ్లీ ఇమ్మంటే ఇస్తారేమో! నెమ్మదిగా లేచి మాత్రలన్నీ ఏరుకుంది. లోపలికి వచ్చిన కనకం ఆశ్చర్యంగా చూసింది.

"కనకం, ఆ మధ్య యాదమ్మ అడిగింది కదా ఓ ముసలావిడ ఒంటరిగా వుంటుంది, చూసుకునే మనిషి కావాలని. ఎవరన్నా దొరికారంటనా?"

"ఏమో తెలియదు. అయినా నీకెందుకు.?"

"వుండు. యాదమ్మను అడిగి వస్తాను" అంటూ బయటికి వెళ్లింది కవిత.

***(ఆశాదీపం - హెచ్.ఐ.వి./ఎయిడ్స్‌పై రచయిత్రుల కథాసంకలనం - 2014)***

# ఇలాంటి అమ్మాయిలెందరో!

**"ఆ**ంటీ!

సెకండ్‌ఫ్లోర్ 201లో ఒక అమ్మాయి కొత్తగా వచ్చింది. చూశారా?" అంది పక్కింటి రోష్ని. "ఎవరు? ఎవరొచ్చారు. కొత్తగా వచ్చారా! నేను చూడలేదే" అన్నాను.

"అదిగో, అదిగో అక్కడ నిల్చుంది చూడండి ఒకసారి" అంది రోష్ని. నేను కుతూహలంగా రేలింగ్ దగ్గరకు వెళ్లి కిందకి చూశాను. మా అపార్ట్‌మెంట్స్ డిజైన్ గుండ్రంగా ఒక నుయ్యి ఆకారంలో వుండి ఏ యింటి నుంచి చూసినా అన్ని యిళ్లు కనిపిస్తాయి. మధ్య రేలింగ్ దగ్గిర నిలబడితే మొత్తం యిళ్లన్నీ కనిపించేట్లు వుంది. నేను ఫోర్త్ ఫ్లోర్‌లో నిలబడి చూశాను. 202 గుమ్మం దగ్గర ఓ చామనచాయగా, పొట్టిగా, పీలగా పంజాబి దుస్తుల్లో వున్న ఒకమ్మాయి నిలబడి వుంది. "ఆంటీ! ఆ అమ్మాయిని చూశారా. ఇందాక లిఫ్ట్‌లో వస్తుంటే చూశాను. ఫ్యామిలీ టైపు అమ్మాయిలా లేదాంటీ" అంది మళ్ళీ. ఈలోగా ఆమె భర్తకూడా మా దగ్గిరకి వచ్చి "అవునాంటీ! ఆ అమ్మాయి సరి అయిన అమ్మాయి కాదు, మామూలు ఫ్యామిలీ టైపు కాదు" అన్నాడు. మగవాళ్లకీ విషయాలు మనకంటే బాగా అర్థమవుతాయి.

"అదేంటి, ఎందుకలా అనిపించింది? ఒక్కర్తే వుంటుందా? భర్త, సంసారం ఎవరూ లేరా?" అన్నా ఆశ్చర్యంగా.

"ఏమో ఆంటీ! మాటా, మొహం చూస్తే ముస్లిమ్ అనిపించింది. కాని ఒకరితో గుజరాతీ అంది, యింకోరితో మార్వాడి అందిట" రోష్ని.

"నిన్న రాత్రి, అర్ధరాత్రి దాటాక ఎవరో యిద్దరు మగవాళ్లు వచ్చి అడిగారట

202 ఫ్లాట్ ఎక్కడని. వాచ్‌మన్ కొత్తవాళ్లని చూసి మీరెవరు అంటే ఆ యింటికెళ్లా లన్నారట. వాచ్‌మన్ చెప్పాడు వాళ్లు ఆ యింట్లోకెళ్లి మళ్లీ తెల్లారి ఐదు గంటలకి వెళ్లిపోయారట." అన్నాడు రోష్ని భర్త మనోజ్.

"అదేమిటి నాకసలు తెలియనే తెలియదు. ఎప్పుడొచ్చిందో అసలు చూడనే లేదు నేను. మరి సామాను అదీ ఏం లేదా?"

"ఏమో ఎవరికి తెలుసు? ఏవో అట్ట పెట్టెల్లో కొన్ని సామాన్లు రిక్షాలో తెచ్చిందంతే. ఒకసారి మీరు పిల్చి అడగండి తెలుస్తుంది అసలెవరనీ" అంది మళ్లీ.

ఆ బిల్డింగులో నా పెద్దరికానికి అంతా కాస్త విలువ యిస్తారు. ముందునుంచి ఆ బిల్డింగు మంచి చెడ్డలు, అవసరాలు చూడడం ప్రెసిడెంటుగా, సెక్రటరీగా, ట్రెజరర్‌గా చాలా రోజులు పనిచేసి, ఆడవాళ్లకి క్లబ్బు పెట్టి, గేమ్స్ ఏనివర్సరీ డేలు, సెలబ్రేట్ చేసి, గణేశ్ పూజలవీ చేసి ప్రతి దానిలో నేను ఇంటరెస్ట్ తీసుకుని చేసేదాన్ని. మంచయినా, చెడయినా అంతా నన్ను సంప్రదిస్తుంటారు. నీళ్లు రాకపోయినా, పని మనుషులు తుడవక పోయినా కేకలు పెడ్తుంటాను.

బిల్డింగు మీద ఇంటరెస్ట్ చూపే ఇద్దరు ముగ్గురిలో నేనూ ఒకరినవడం వల్ల ఆడవాళ్లంతా ఏం జరిగినా నాకు చెప్తుంటారు. అసలు ఆ అమ్మాయి ఎవరో, ఏమిటో తెల్సుకోవాలని చప్పట్లు కొట్టి పైకి రమ్మని పిలిచాను. పైకి వచ్చింది.

"కొత్తగా వచ్చారా? ఎవరు నీవు? ఎక్కడ నుంచి వచ్చారు?" అన్నా హిందీలో కాస్త నవ్వుతూనే పలకరించా. ఎవరో సరిగ్గా తెలియకుండా అమర్యాదగా మాట్లాడడం సభ్యత కాదు కదా! మనిషి చామనచాయ రంగుతో పీలగా, గిడసబారినట్టు వుంది. వయసు ఇరవై దాటదు. మెడలో నల్లపూసల గొలుసు, చేతులకి మెహందీ వుంది. చుడీదార్, కుర్తా వేసుకుంది.

"అవునండీ! ఓల్డ్ సిటీలో వుండేవాళ్లం. మొన్నే వచ్చాం!" అంది.

"మీవారేం చేస్తారు?" అన్నాను.

ఆ అమ్మాయి నా మొహం వంక చూసి "మాకు ఓల్డ్ సిటీలో డ్రైఫ్రూట్స్ షాపు వుంది." అంది.

పేరేమిటి? షాపెక్కడ అన్నా. ఏదో పేరు చెప్పింది.

"చూడమ్మాయి! నీ పేరేమన్నావు? షాలిని అన్నావు కదూ! ఇక్కడ కొత్తగా అద్దెకు

వచ్చినవాళ్లు ఒక నెల అడ్వాన్స్‌గా మెయిన్‌టెనెన్స్ కట్టాలి. మీ ఆయన వస్తే తీసికెళ్లి ప్రెసిడెంటు గారిని, సెక్రటరీ గారిని కలవమని చెప్పు. ఎవరు ఇల్లు మారారో, కొత్తగా వచ్చారో అసోసియేషన్ వాళ్లకి తెలియాలి. అంచేత అతన్ని వెళ్లి కలవమని చెప్పు" అన్నాను.

"అలాగే" అంది.

"కొత్తగా పెళ్లయిందా? ఎక్కడయింది?" మళ్లీ అడిగా. చేతుల మెహందీ, కొత్తగా మట్టి గాజులు చూసి అడిగా.

"ఆ... మాది గుజరాత్. అక్కడయింది." అంది.

"ఒక్కర్తివే వున్నావు. అత్తవారెవరూ లేరా?" మళ్లీ ఆరా తీసా.

"మా సాస్‌జీ వాళ్లు తరువాత వస్తారు." అంది.

"నిన్న రాత్రి ఎవరో ఇద్దరు మగవాళ్లు అర్ధరాత్రి వచ్చారని వాచ్‌మన్ చెప్పాడు. అలా ఎప్పుడు పడితే అప్పుడు రాత్రి కొత్తవాళ్లని బిల్డింగ్‌లోనికి రానీయం. ఎవరు వాళ్లు?"

ఆ అమ్మాయి మొహంలో రంగులు మారాయి. కాస్త తడబడి "మా కాకాజీ, చాచాజీ. యిదివరకుండే వారం కదా. అక్కడ మేమంతా పరిచయం" అంది.

"పరిచయం అయితే అలా అర్ధరాత్రి వస్తే తలుపు తీయడు వాచ్‌మన్. వాళ్లకి చెప్పు" అన్నాను. కాస్త మొహం ముడుచుకుంది. "ముందు రేపు ఆదివారం కదా! మీ ఆయన్ని సెక్రటరీని కలవమని చెప్పు. అడ్వాన్స్ కట్టాలి." అన్నాను.

అపుడు అసలు సంగతి ఏమిటో తెలియకుండా యింకేమనలేక అంతటితో సరిపుచ్చాను. మొగుడున్నాడో లేడో, సంగతేమిటో తెల్సుకున్నాకే మిగతా విషయాలు చూడొచ్చు అనుకున్నాను.

"చూశారా ఆంటీ! ఆ అమ్మాయి ముస్లిం పిల్లలా లేదు. బొట్టు పెట్టుకుని తయారయింది కాని ఆ భాష అది గుజరాతీలా వుందా?" అంది రోష్ని.

"ఏమో ఓల్డ్‌సిటీలో వుండేవారం అందిగా. అందుకని ఆ భాష పట్టుబడిందేమో. చూద్దాం! నాల్గు రోజులు పోతే సంగతులు తెలుస్తాయిగా" అన్నాను.

✶ ✶ ✶ ✶ ✶ ✶

తరువాత మర్నాడు రాత్రి పంటిగంటప్పుడు ఎవరో ఇద్దరు మగవాళ్లు వస్తే వాచ్‌మన్ అడ్డుకుంటే గొడవయిందని, వాచ్‌మన్ వారిస్తున్నా దురుసుగా అతన్ని తోసి, తిట్టి వాళ్లు ఆ యింటికెళ్లారని తెల్లారి వాచ్‌మన్ సెక్రటరీకి కంప్లయింట్ ఇచ్చాడు. భర్తని తీసికెళ్ల పరిచయం చేసి డబ్బు కట్టమన్నా వచ్చి నాల్గురోజులయినా భర్తనీ తీసికెళ్లలేదు, డబ్బూ కట్టలేదు. సూపర్‌వైజర్‌ని పిలిచి అడిగి పిల్చుకురమ్మంటే మా ఆయన ఊళ్లో లేడు. వచ్చాక కడ్తాంలే అని నిర్లక్ష్యంగా అందిట. ఆ రాత్రి ఎనిమిది గంటలకి ఈ అమ్మాయి మిలమిలలాడే బట్టలు, లిప్‌స్టిక్, సెంటులు, మల్లెలు పెట్టుకుని బయటికి వెళ్లి అర్థరాత్రి ఎవరో మగవాళ్లతో వచ్చిందట. వాచ్‌మన్ ఆపితే నా ఇంటికి నావాళ్లొస్తారు. అడగడానికి నువ్వెవరు అని దబాయించిందట. సెకండ్ ఫ్లోర్‌లో ఆడవాళ్లంతా మాట్లాడుకుని నా దగ్గరకు వచ్చారు. "ఆంటీ! ఆ అమ్మాయి విషయం చూడండి. మొగుడు లేడు మొద్దులు లేడు. రాత్రిళ్లు రకరకాల మగవాళ్లు వస్తున్నారంట. నిన్న రాత్రి నేను మా ఆయన సెకండ్‌షో సినిమాకి వెళ్లి వచ్చేసరికి వాచ్‌మన్‌తో గొడవపడ్తోంది." అంది ఒకావిడ. "పగలంతా పడుకుంటుంది. సాయంత్రం ఎనిమిదయ్యాక ముస్తాబయి ఎక్కడికో వెళ్తుంది. మళ్లీ రాత్రి మగాళ్లతో వస్తుందని వాచ్‌మన్ అన్నాడు." అన్నారిద్దరుముగ్గురు. మావి అరవై ఫ్లాట్లు. రాత్రిళ్లు ఏం జరిగేది మాలా పెందరాడే పడుకునే వారికి తెలియదు కాని ఆలస్యంగా షాపులనుంచి వచ్చే బిజినెస్‌వాళ్లకి, క్లబ్బులకి వెళ్లి వచ్చే మగాళ్లకి తెలుస్తుంది.

అసలు సంగతి వాచ్‌మన్‌నే అడుగుదాం అని పిలిచా. "ఏంటమ్మ గారూ, అది దొంగముండండి. మొగుడు లేదు, పెళ్లి లేదు. దందా పెట్టిందిక్కడ. మేం సెక్రటరీ గారికి చెప్పాం. ప్రెసిడెంటుగారికి చెప్పాం. మీరెవరూ పట్టించుకోకపోతే మేం ఏం చెయ్యాలి? మొగుడ్ని చూపించమంటే ఊరెళ్లాడంటుంది. వచ్చిన వాళ్లందరినీ కాకాజీలు, చాచాజీలు, బంధువులు అంటుంది. మేం ఏం చెయ్యాలి?" అన్నాడు.

"ఆంటీ! ఇంట్లో వున్నట్టుంది. మీరు రండి మాట్లాడదాం. రండి." అన్నారు. నలుగురైదుగురు ఆడవాళ్ల కలిసి వెళ్లి తలుపు కొట్టాం. నిద్రపోతున్నట్టుంది. నిద్రలోంచి లేచి విసుగ్గా తలుపు తీసింది. లోపలికి తొంగి చూస్తే బెడ్‌రూములో ఓ పెద్ద షోకయిన డబుల్‌కాట్ మంచం, సిల్కు దుప్పటి, రెండు ఫేము కుర్చీలు, వంటింట్లో నాలుగు గ్లాసులు, గిన్నెలున్నాయి. మమ్మల్ని చూసి నవ్వబోయి, మా సీరియస్ మొహాలు చూసి 'ఏమిటి' అంది.

"వారం రోజులయింది నీవు వచ్చి. అడ్వాన్స్ కట్టమన్నా కట్టలేదు. నీ భర్తని

పరిచయం చేయి అన్నా చెయ్యలేదు. వాచ్‌మన్ రోజూ కంప్లైంట్ చేస్తున్నాడు. రోజూ ఎవరెవరో కొత్త మగాళ్లు వస్తున్నారని." కాస్త సీరియస్‌గానే అన్నాను.

"మా ఆయన ఊర్లో లేడు. వచ్చాక కడ్తాడు." అంది కాస్త నిర్లక్ష్యంగా.

"మీ ఆయన ఊర్లో లేనప్పుడు ఎవరెవరో మగాళ్లు రాత్రిళ్లు ఎందుకు వస్తారు?" అంది ఒకావిడ.

"ఏం మీ ఇంటికి బంధువులు ఎవరూ రారా?" అంది కాస్త పొగరుగా.

"బంధువులు వస్తారు. యిలా అర్థరాత్రి రోజుకో మగాళ్లు రారు. అసలు నీ సంగతి మాకే అర్థం కావడం లేదు. గుజరాతి అంటావు. మార్వాడి అంటావు. అసలు నీకు పెళ్లయిందా? ఏది నీ పెళ్లి ఫోటోలుంటే చూపించు." అంది మీనా అన్నావిడ.

"ఇక్కడ లేవు. మా అత్తారింట్లో వున్నాయి." తడుముకుంటూ అంది.

"ఒక్క ఫోటో అయినా లేదా? నీవు అబద్ధం ఆడుతున్నావు. నిజం చెప్పు. ఈ వేషం? ఎవరితోనన్నా పారిపోయి వచ్చావా? అసలు ఈ ఇల్లు కుదిర్చి నిన్నిక్కడ పెట్టింది ఎవరో చెప్పు. వాళ్లతో మాట్లాడుతాం." అని దబాయించాను. ఆ అమ్మాయి వరస చూస్తే ఏదో లెచి వచ్చిన బాపతేమో, ఎవడో తీసుకొచ్చి ఇక్కడ సెకండ్ సెటప్ పెట్టాడేమో అని ఒక అనుమానం వచ్చింది. అలా ఎవడో తీసుకొచ్చి పెడితే వాడే వచ్చి పోవాలి కాని ఇలా రోజుకో కొత్తవాళ్లు రావడం ఏమిటని మా ఆలోచన.

"మా ఆయన స్నేహితులు కుదిర్చారు ఇల్లు. ఆళ్లెవరో నాకు తెలీదు." అంది.

"ఇదిగో చూడు. యింకో రెండు రోజులలో డబ్బు కట్టకపోతే నీళ్లు, కరెంటు బంద్ చేస్తాం. మా రూలు ప్రకారం.. నీ మొగుడ్ని సెక్రటరీకి చూపించకపోతే యిక్కడ వుండనీయం. ఇంటి ఓనర్స్‌కి కంప్లైంట్ చేసి ఖాళీ చేయిస్తాం జాగ్రత్త. ఇలా ప్రతి వాళ్ళని అర్థరాత్రి బిల్డింగులోకి రానీయవద్దని వాచ్‌మెన్‌కి ఆర్డరిచ్చాం." అని చాలా గట్టిగానే చెప్పాను. "చూద్దాం. యింకా రెండురోజులాగి ఓనర్‌కి చెపుదాం." అని అందరితో చెప్పి పంపాను.

ఇలా బెదిరించినా ఆ సాయంత్రం ముస్తాబై తను బయటికి వెళ్లిపోయి తెల్లారి ఐదు గంటలకి తిరిగి వచ్చిందట. వెంట మరో అమ్మాయిని కూడా తీసుకొచ్చింది. రెండు రోజులు గడిచినా డబ్బు కట్టలేదు అసోసియేషన్‌కి. మరోసారి సూపర్‌వైజర్ వెళ్లి అడిగినా ఆయన లేడు అంటూ పాతపాటే. ఆ వార్నింగ్ ఇచ్చాక రెండు రోజులు

ఆ అమ్మాయిలిద్దరూ ముస్తాబై ఏ అర్థరాత్రో కొంపకి చేరేవారు. అలా రెండు రోజులయ్యాక నీళ్లు, కరెంట్ బంద్ చేశాం. అదే మామూలు వాళ్లయితే వచ్చి మాట్లాడి ఏదో కడ్తాం అలా కట్ చేయవద్దు అని చెప్పి మాట్లాడేవారు. ఆ అమ్మాయి ఏం అనలేదు. కింద నుంచి రెండు బకెట్లు నీళ్లు తెచ్చుకునేది. రాత్రంతా ఇంట్లో వుండేది కాదేమో! కరెంట్ కట్ చేసినా పెద్ద తేడా కనబడలేదనుకుంటాను. కనీసం ఎవరిని వచ్చి టైమివ్వమనైనా అనకపోవడంతో మా అనుమానం బలపడింది. ఆ అమ్మాయి ఫ్యామిలీ టైపు కాదు. ఎవడో తీసుకొచ్చి ఇక్కడ ఇల్లు కుదిర్చి పెట్టి వెళ్లాడు అన్నది అర్థమయింది. ఫ్యామిలీలుండేచోట యిలాంటివి ఎలా సాగనిస్తాం. మీటింగు పెట్టి ఓనర్‌కి ఫోను చేశాం. అతను తనకేం తెలియదు. ఎవరో ఎమ్మెల్యే తాలూకు వాడినంటూ ఫోనుచేసి ఇల్లు నా బంధువులకంటే అద్దెకిచ్చాను. అది కూడా ఓ బ్రోకర్ కుదిర్చాడు. నాకేం తెలీదు. ఎవరో ఏమిటో?" అన్నాడు. "ఇలాంటి వాళ్లని తెచ్చి సంసారులుండేచోట పెడతావా? అద్దెకిచ్చే ముందు చూడద్దా? ముందు ఖాళీ చేయించి." అని కేకలు వేశాం. "మీరే అసోసియేషన్ తరఫున ఏక్షన్ తీసుకుని ఖాళీచేయించండి. నాకేం అభ్యంతరం లేదు." అన్నాడు ఇంటి ఓనర్.

మేం ఆ అమ్మాయిని ఎలా పంపించాలా అని ఆలోచించే లోపలే ఆ రాత్రి ఇద్దరు గూండాల లాంటివాళ్లు ముస్లిముల్లా వున్న ఇద్దరితో కలసి అర్థరాత్రి యిద్దరమ్మాయిలు వచ్చారట. వాచ్‌మెన్ వదలకపోతే వాళ్లిద్దరూ బెదిరించి తంతాం, చంపుతాం అంటూ బెదిరించి వాడ్ని లెక్కచెయ్యకుండా తోసుకుని లోపలికి వెళ్లిపోయారట. వాచ్‌మెన్ కాస్త తెలివి ఉపయోగించి నెమ్మదిగా బయట గడియపెట్టి వెళ్లి సెక్రటరీని లేపి చెప్పాడు. "అలా మనుష్యులు లోపలుండగా గడియ పెడితే ఏం గొడవ వస్తుందో? రౌడీల్లా వున్నారంటున్నావు. రేపు అందరం కల్సి ఆలోచిద్దాం. పోలీసులని పిలవవచ్చు గాని మా చుట్టాలంటే మన దగ్గరి ఆధారం ఏముంది? వాళ్లెవరో, యీ అమ్మాయి బ్రోతల్ అని నిరూపించడానికి. ఇవాల్టికి వదిలెయ్" అన్నాడట సెక్రటరీ.

మర్నాడు సాయంత్రం ఆ అమ్మాయి బయటకి వెళ్లగా చూసి ఆ తాళం మీద తాళం వేయించేశాం. ఆ అమ్మాయిలిద్దరూ తెల్లారి ఐదుగంటలవేళ ఇల్లు చేరారట. తాళం మీద తాళం చూసి వాచ్‌మెన్‌తో దెబ్బలాటకి దిగి రాయి తెచ్చి తాళం బద్దలు కొట్టే ప్రయత్నం చేస్తుంటే వాచ్‌మెన్ అడ్డుకుని అసోసియేషన్ తాళం వేశారు. అది బద్దలు కొడితే చాలా గొడవవుతుంది. తెల్లారేవరకు ఆగి వాళ్లతో వెళ్లి మాట్లాడండి.

ఇపుడు ముట్టుకోడానికి వీలు లేదు అని బెదిరించాడుట. ఇద్దరు అమ్మాయిలు డాబా మెట్లు ఎక్కి కూర్చున్నారట. ఆరు గంటలకి నేను లేవగానే వాచ్‌మెన్ వచ్చి జరిగింది చెప్పాడు.

నేను ఇద్దరం ముగ్గురం ఆడవాళ్లం కలిసి వాళ్లని కిందికి రమ్మన్నాం. వస్తూనే “మా ఇంటి తాళం మీద తాళం ఎందుకు వేశారు?’ అంది ఎటాకింగ్‌గా.

“ఎందుకు వెయ్యం? ముందు ఒక సంగతి. మీరు ఇక్కడ మర్యాదస్థుల ఇళ్ళ మధ్య ఇల్లు తీసుకుని బ్రోతల్‌హౌస్‌గా మారిస్తే వూరుకోం. రెండోది మాకివ్వాల్సిన డబ్బు కట్టకపోతే రూల్సు ప్రకారం తాళం వేసే అధికారం మాకుంది.” ఆ అమ్మాయి డబాయింపుకి దిగేసరికి వళ్లు మండి చాలా గట్టిగానే అన్నాను.

“చూడు! మీరు ఆ తాళం బద్దలు కొట్టే పని చేస్తే వూరుకోం. పోలీసు కంప్లైంట్ యిచ్చి మీరు దందా చేస్తున్న సంగతి చెప్పి జైల్లో వేయిస్తాం. అట్టే మాట్లాడకుండా మా డబ్బు కట్టి మీ సామాన్లు తీసుకుని మీరు వెళ్లండి. ఇంటి ఓనరుతో కూడా మాట్లాడాం. మీరిలాంటివారని తెలియదని, మేం ఏం చేసినా తనకేం సంబంధం లేదని మిమ్మల్ని వెళ్లగొట్టమని చెప్పాడు.” ఆ అమ్మాయి ఆ దెబ్బతో కాస్త తగ్గింది.

రెండో అమ్మాయి బిక్క మొహం పెట్టి “ఆంటీ! ఒకసారి తాళం తీస్తే నా బట్టలు తీసుకుని వెళ్లిపోతాను. ఇది యీమె ఇల్లు. నేనూరికే వచ్చానంతే.” అంది.

“అదంతా మాకనవసరం. డబ్బు కడితేనే తాళం తీస్తాం. డబ్బు కట్టి వెంటనే ఖాళీ చెయ్యాలి. ఇక్కడొక్క క్షణం వుండనీయం.” ఖచ్చితంగా అన్నా. “మీ ఇష్టం వచ్చినట్లు అర్థరాత్రిళ్ళు మగాళ్లని తీసుకొచ్చి మా బిల్డింగు పరువు తీస్తే చూస్తూ వూరుకుంటామా?” చాలా గట్టిగా దబాయించాను. ఇదంతా హిందీలోనే మాటలు.

“వాళ్లు మా చాచాలు, కాకాలు...” రెండో అమ్మాయి ఏదో చెప్పబోయింది. “ఛ, ఊరుకో. వాళ్లేం నమ్మరులే నీ మాటలు.” మొదటి అమ్మాయి కసిరింది. రెండో అమ్మాయి ఏడుపు ఆరంభించింది. “నేను రానంటే కల్సి వుందాం రమ్మన్నావు. నా బట్టలు, వస్తువులు వుండిపోయాయి. ఎలా ఇప్పుడు?” అంటూ దుయ్యబట్టింది. మొదటి అమ్మాయి మొహం గంటుపెట్టుకుంది. “రేపొక రోజు టైమివ్వండి. ఎల్లుండి కడ్తాం డబ్బు.” అంది రాజీకొస్తూ.

“ఎల్లుండే తాళం తీస్తాం. తాళం తీసాక సామాను తీసుకుని వెంటనే వెళ్లాలి. డబ్బు తెచ్చాక మాట్లాడు.” పొద్దుటే పనివేళ వాళ్లతో యింక వాదించే టైము లేక

అందరం లోపలికెళ్లాం. ఇద్దరమ్మాయిలు ఆ రెండో అంతస్తు మెట్లమీద కూర్చుని మాట్లాడుకుంటూ కళ్లు తుడుచుకుంటూ కూర్చున్నారు.

ఓ గంటా రెండు గంటలు పోయాక కాఫీ అదీ తాగి కాస్త పని చేసుకుని బయటికి తొంగి చూసేసరికి వాళ్లక్కడే కూర్చున్నారు. ఒక్కక్షణం జాలేసింది. అప్పటికప్పుడు పాపం పొమ్మంటే ఎక్కడికి పోతారు? బట్టలవి యింట్లో వుండి పోయాయి. ఏం చేస్తారు. అనిపించి కాస్త బాధ వేసింది. మనసుండబట్టలేక సెకండ్ ఫ్లోర్‌వైపు వెళ్లాను. నే వెళితే కాస్త ఆశగా చూశారు. మొదటి అమ్మాయి ఏదో అనబోయింది. "చూడమ్మాయి. చూస్తే పట్టుమని ఇరవై ఏళ్లున్నట్లు లేవు. ఎందు కిలాంటి పనులు చేస్తున్నావు? ఇలా వళ్లమ్ముకునే పనికి దిగడం ఎంత నీచం?" అన్నాను.

ఆ అమ్మాయి చురచుర చూసింది. "మరి ఏం చెయ్యాలి? ఏం తిని బతకాలి?" అంది తీక్షణంగా.

"ఏం నీకెవరూ లేరా? అమ్మా, నాన్నా, చూసేవాళ్లు లేరా? పెళ్లి చెయ్యలేదా?" నాలోని రచయిత్రి సంగతి తెల్సుకోవాలని కుతూహలపడింది.

ఆ అమ్మాయి ముఖం ముడుచుకుంది. "వున్నారు. అంతా వున్నారు. వాళ్ళకి ఎక్కువై వదిలేశారు."

"అదేమిటి? ఆడపిల్లని అలా గాలికి వదిలేశారా?"

"ఎనిమిది మంది పిల్లం. అయ్య చచ్చాడు. అమ్మ ఎక్కడనుండి తెచ్చి పెడుతుంది. మా పక్కింటి అబ్దుల్‌భాయి బొంబాయిలో ఉద్యోగం యిప్పిస్తా అంటే నమ్మి పంపింది ఆడితో. ఆ సచ్చినోడు నన్ను ఎవరికో రెండు వేలకి అమ్మి పోయాడు."

"నీవు ముస్లిమ్‌వా, మాతో హిందూ అని అబద్ధం చెప్పావు. గుజరాతి అన్నావు."

తల దించుకుంది ఆ అమ్మాయి. "ముస్లిం అంటే ఎవరూ ఇళ్లు ఈయరు అందుకని." అంది.

"మరి బొంబాయి నుంచి యిక్కడికెలా వచ్చావు? " ఈ కథ వివరాలు తెల్సుకోవాలనిపించి పని కూడా పక్కకి పెట్టి మాటలకి దిగాను.

"ఎందుకిదంతా. తాళం తియ్యండి. రేపు డబస్తుబ్బ కడతా." నేను మెత్తబడటం చూసి జాలిగా అడిగింది.

"నేను సెక్రటరీతో మాట్లాడి తరువాత చెప్తాను. ముందు అంతా నిజం చెప్పు. బొంబాయి నుంచి ఎలా వచ్చావు?"

"నన్ను కొన్న ఆంటీ ఇద్దరు ముగ్గురు అమ్మాయిలను బెంగుళూరు పంపించి బట్టలిప్పించి నైట్ క్లబ్బులో డ్యాన్స్ చేయడానికి డాన్సు నేర్పించింది. కొన్నాళ్లకి డ్యాన్సులు చేస్తుంటే పోలీసులు ఓనాడు రైడ్ చేసి పట్టుకుని జైల్లో పెట్టారు. నాలుగు తన్ని డబ్బులు కట్టేవారు లేక వదిలేశారు వాళ్లు. అక్కడ ఇంకొకడు తగిలి "నాతో హైదరాబాదు రా, నా దగ్గిరుందువు" అన్నాడు. వాడెవడో డబ్బున్న వాడులాగా వున్నాడు. మార్వాడి అన్నాడు. ఓల్డ్‌సిటీలో ఓ ఆరు నెలలు ఓ రూము తీసి పెట్టాడు నన్నక్కడ. కావాల్సివచ్చినప్పుడు వచ్చిపోయేవాడు. మోజు తీరాక రావడం మానేశాడు. ఆడు చెప్పాడని ఇంకెవరో మగాళ్లు వచ్చిపోయేవారు. బతకాలి గదా, డబ్బుకావాలి గదా! నేనింకేం చెయ్యాలి?" జవాబియ్యి అన్నట్లు చూసింది.

"నీవేం చదువుకోలేదా?" అన్నాను.

నవ్వింది.

"చదువు! తిండికే లేనప్పుడు సదువెక్కడ? మా బాబా బతికుండగా స్కూలు కెళ్లేదాన్ని. ఐదో క్లాసు దాకా చదివా. అయ్య పోయాక అమ్మ చదువు మాన్పించి పనికి పెట్టింది.

"మరి యిక్కడికెలా వచ్చావు? మూడువందలు అద్దె, ఏడొందల మెయింటెనెన్స్ ఇవన్నీ కట్టేంత సంపాదనుందా? ఇక్కడ అద్దెకి దిగావు మరి! ఇలాంటి ఇళ్లమధ్య వూరుకుంటారనే వచ్చావా?"

"ఎవడో బ్రోకర్ కుదిర్చాడు. ఇలా సంసారుల మధ్య వుంటే, ఫ్యామిలీ టైపని నమ్మి మగాళ్లు ఇష్టపడతారని. ఇల్లు, మంచాలు అవి చూసి ఫ్యామిలీ టైపంటే మోజుంటుంది. నీ సంపాదనలో నెలకింత యియ్యాలి. నే కష్టమర్లని పంపిస్తూ వుంటానని మాట్లాడి పెట్టాడు. వాడే ఇంటి ఓనర్‌తో మాట్లాడి అడ్వాన్స్ కట్టాడు."

"మరి వాడినే అడిగి మెయిన్‌టెనెన్స్ కట్టకపోయావా? ఏం డబ్బులు సంపాదిస్తున్నావు, ఏడొందలు లేకుండా వున్నావా?" అన్నా.

"ఏం సంపాదన. వంద, రెండొందలు యిస్తారు వెధవలు." ఏడ్చుకుంటూ మాట్లాడింది కసిగా.

ఆ అమ్మాయి ఈ రెండు మూడేళ్లలోనే ఎంత రాటుదేలిందో అర్థమైంది. ఇరవై

ఏళ్ల అమ్మాయి పట్టుమని పదహారేళ్లకే ఇలాంటి జీవితంలోకి నెట్టబడి బతుకు తెరువుకి వళ్లమ్ముకునే స్థితికి పరిస్థితులు లాగినందుకు బాధ, జాలి కల్గింది. ఓ ఆడపిల్ల కడుపుకోసం తన వాళ్లున్నా తన బతుకు తనతోవ చూసుకోవాల్సి రావడం, దానికి కారణమైన బీదరికం... కన్న తల్లి కూడా పట్టించుకోకుండా వదిలెయ్యడం, డబ్బు కోసం పిల్లని నిర్దాక్షిణ్యంగా అమ్ముకోడం... ఇలాంటి కథలు ఎన్నెన్నో రోజుకి జరుగుతుంటాయి. ముఖ్యంగా ముస్లిమ్ బీదకుటుంబంలో మొగాళ్లు రెండు, మూడు పెళ్ళిళ్లు చేసుకుని డజన్లకొద్దీ పిల్లలని కనడం, డబ్బులకి అమ్మడం, అరబ్ దేశాలకి పెళ్లి పేరుతో ఎవడితోనో పంపడం, ఇలాటి వార్తలన్నీ పేపర్లలో చదువుతూనే వుంటాం. యిలాంటి అమ్మాయిలని ఎవరాదుకుంటారు? ప్రభుత్వం ఆదుకోవాలి. అలాటి హోములలో పెట్టిన పిల్లలు ఆ కట్టడికి వుండలేక, తిండి సరిగ్గా దొరక్క స్వేచ్ఛకోసం పారిపోయి ఇలాంటి జీవితాలే ఎన్నుకుంటారు. ఈ బతుకు ఇంతే... పోనీ ఈ ఒక్క రోజుకీ తాళం తీసి బట్టలవి తీసుకోనిస్తే జాలనిపించి వెళ్లి సెక్రటరీతో మాట్లాడాను. "మనం జాలిపడి తాళం తీస్తే డబ్బులివ్వదు. పదిరోజుల బట్టి చీకట్లో నీళ్లు లేకుండా వుంది గాని డబ్బిచ్చిందా? అయినా తెలిశాక కూడా ఇలాంటి వాళ్లని ఇంకా వుండనిస్తే అందరూ మనల్ని అంటారు యాక్షన్ తీసుకోలేదని. ఇంత స్ట్రిక్ట్‌గా వుండకపోతే డబ్బు కట్టదు." అన్నాడు. అదీ నిజమే. రూల్సు రెగ్యులేషన్స్ పాటించాలి గదా! అలా పదిగంటల వరకు మేం దయతల్చి తాళం తీస్తామేమోనన్నట్లు కూర్చున్నారు. తరువాత ఇంక లాభం లేదనుకుని వెళ్లిపోయారు.

* * * * * *

పది పదిహేను రోజుల తరువాత ఎవరో యిద్దరు కుర్రాళ్లని వెంటబెట్టుకు వచ్చింది. ఈలోగా వాళ్లు వెళ్లిన ఓ రెండు మూడు రోజులకు ఆ యింట్లో అమ్మాయిలు ఏమయ్యారంటూ రాత్రిళ్లు మగాళ్లు వస్తూనే వున్నారు. వాచ్‌మెన్ తిట్టి ఆ అమ్మాయి ఇల్లు ఖాళీ చేసింది అని చెప్పాక రాకలు తగ్గాయి. డబ్బుకట్టి తాళం తీయించుకుని సామాన్లు ప్యాక్ చేసుకుని తీసుకువెళ్లిపోయింది. వెళ్లేముందు "ఎక్కడికి వెళ్తున్నావు" అన్నా వుండబట్టలేక. నావంక నిర్లక్ష్యంగా చూసి "ఓల్డ్ సిటీకి. మీలాంటి మర్యాదస్తులుండే చోటికి కాదు లెండి." అంది వ్యంగ్యంగా. ఆ వ్యంగ్యంలో హేళన కంటే బాధ వుందని అనిపించింది.

**(ప్రియదత్త మాసపత్రిక, 16.10.2002)**